# దాశరథి విలాసము.

క్రొత్తపల్లి లచ్చయకవి ప్రణీతము.



శ్రీ చెలికాని సూర్యారావు

గారిచేఁ బ్రకటింపఁబడినది.



మొదటికూర్పు




కాకినాడ:

కాకినాడముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

1928.

వెల రు. ౧-౮-౦.

# కవిప్రశంసాదులు.

(క్రీ. శ. 1863?—1898.)

ఈ దాశరథివిలాసమును రచించినకవి కొత్తపల్లి లచ్చయ్య. పిఠాపురము సమీపముననున్న చెందుర్తిగ్రామవాస్తవ్యుఁడు. ఈతఁడాపస్తంబసూత్రుఁడు. కౌండిన్యసగోత్రుఁడు. తెలుఁగాణ్యవైదికబ్రాహ్మణుఁడు. తండ్రిపేరు రామన్న. తల్లి సుబ్బమ్మ ఎనమండ్రన్నదమ్ములలో నితఁడు నాల్గవవాఁడు. తనవంశవృత్తాంతమును గవి కృత్యాదిని వివరించియున్నాఁడు. ఇక్కవికుటుంబము చిరకాలమునుండి రావువారిసంస్థానమునే యాశ్రయించి యుండెను. ఈతఁడు శరీరారోగ్యము చాలనివాఁ డగుట నారోగ్యేచ్ఛచే మొదట దుష్కరప్రాససూర్యశతకమును రచించెను. తర్వాత తిరుమలయాత్ర పాదచారియై చేసి వచ్చి శ్రీవేంకటేశ్వరున కంకితముగా శ్రీమన్నారాయణుని దశావతారములలో నేడవదియగు శ్రీరామచంద్రుని దివ్యచరిత్రమును (దాశరథివిలాసముగా రచియించి) సమర్పించెను. భారతవర్షములో నాబాలగోపాలమునకు నిత్యస్మరణీయుఁడును బూజనీయుఁడు నైన శ్రీరామదేవుని దివ్యచరిత్రమును తనలలితకల్పనాకల్పకమునుండి ప్రౌఢపద్యప్రసూనరూపమున వెలువరించుటకుఁ గవి తనయిరువదియవయేఁటఁ బ్రారంభించి తల్లి తమ్ముల మొదలగువారు మరణించుచుండుటచే నడుమనడుమ విఘ్నములు సంభవించుచుండినను బూనిక వీడువక పదిసంవత్సరములకుఁ బూర్తిచేసెను. తరువాత, తానే యిప్పటికి రెండుప్రతులను వ్రాసెను. మొదటిచిత్తుప్రతి చాలభాగము తాళపత్రప్రతి. రెండుమూఁడుప్రతులు కాగితములు. కవి, తాళపత్రములమీఁదఁ గాకితములమీఁద నొక్కవిధముగానే వ్రాయఁగలిగియుండెను. అతఁడు వ్రాసినశుద్ధప్రతులలో నొక్కటి చెన్నపురి ఓరి

యంటల్ లైబ్రరీలోనున్నది. రెండవదానిం బట్టి యీముద్రితప్రతి సిద్ధముచేయఁబడియెను. కవి గ్రంథసమాప్తి చేసినపిమ్మటఁ దన ముప్పదియైదవయేఁటఁ గావచ్చును, హేమలంబిసంవత్సరాశ్వయుజ బ ౮ నాఁడు కాలధర్మము నొందెను. తనజీవితకాలములో ముద్రణమునకై యనేకయత్నములొనర్చెను, గాని, కాలమును బురస్కరించుకొని కొనసాగలేదు. తదనంతర మతనితమ్ములప్రార్థనమున శ్రీ రాజా మంత్రిప్రగడ భుజంగరావు బహద్దరుగారు తమమంజువాణి పత్రికలోఁ బ్రకటింప ననుగ్రహించిరి. కాని యంతలో నాపత్రికాప్రకటనము నిల్చిపోవుటచే నైదాశ్వాసములతో నీగ్రంథ మసముగ్రముగనే యుండవలసివచ్చినది. ఆపుస్తకములైన నెక్కడ దొరకుట లేదు. ఇన్నినాళ్ళ కిపుడు రసజ్ఞులును, భాషాపోషకులును, నాశ్రితపక్షపాతులు నగు శ్రీరావు వెంకటనరసింహరావుగారీగ్రంథమును జిత్తగించి చూపిన ప్రోత్సాహముచే గవివంశమునకుఁ బోషకులగు శ్రీకోలంకవీరవర సంస్థానప్రభువులు రాజమణులు సత్కార్యనిర్వహణమునకు ముందంజవేయువారు, దేవబ్రాహ్మణభక్తిపరతంత్రులు, నగు శ్రీరాజా రావు చెల్లయ్యమ్మారావుబహద్దరువారి యొక్కయు శ్రీ రాజారావు రామయ్యమ్మారావుబహద్దరువారియొక్కయుఁ గరుణాకటాక్షలేశమున సంపూర్ణముగఁ బ్రకటింపఁబడినది. ఈదాశరథివిలాసము పూర్తిచేసిన యనంతరమునఁ దనప్రభుభక్తి వెల్లడించుచుఁ గవి రచించిన చెల్లయ్యమ్మశతకమునాఁడే యికార్యము నెఱవేఱవలసినది, గాని, యప్పటికి దీనికిఁ బ్రకటనకాలము రాలేదు. అనారోగ్యతచేతఁ గవి వివాహమును నిరాకరించెను. ఈకవి విద్యాభ్యాసము తనపెద్దయన్నగారగుగంగయ్యగారి యొద్దఁ గావించెను. గంగయ్యగారు పురాణము చెప్పుటలోఁ బ్రసిద్ధుఁడు. ఆయనతోఁగూడ నుండి రామాయణాది పుస్తకములుచదివియే కవి యీతటిగ్రంథమును నిర్మించుప్రజ్ఞ

ను గడించెను. గంగయ్యగా రిప్పటికి రెండుసంవత్సరములక్రిందటఁ దనడెబ్బదియవయేట స్వర్గస్థులైరి. ఈలచ్చయ్యకవి యాశుకవిత్వము గూడఁ జెప్పువాఁడు. సమస్యాపూరణమున నిపుణుఁడు. పల్లెటూరి జనులను రంజింపఁజేయుటలో గట్టివాఁడు. ఎవ్వ రేకథ నేరీతిని జెప్పుమన్న నారీతిని బొబ్బిలిపాట, శారదకావ్యము, కోలాటపుఁబదములు మొదలగురీతులతో, అసుధారను గ్రామమధ్యమున రాత్రులలో వీధిలో నిలువఁబడి పాడి జనరంజనము చేయువాఁడు. ఈయనపాటలు విన్గోరి చుట్టుప్రక్కల గ్రామజనులు పిల్చిన నచ్చట వివిధరీతులఁ బాడి యానందపఱుచువాఁడు. కొందఱు శిష్యుల కాపాటలు నేర్పెను గాని యాశిష్యులును గురువుగారితోనే యున్నారు నవ్వుపుట్టించునట్లు మాటలాడువాఁడు. ఒక్కనాఁడు పొలములోఁ జెట్టెక్కి తేనె పట్టును దీసెను. ఈఁగలు చేతివ్రేళ్ళమీఁద గుట్టినవి. మందేటివఱకు వాఁచెను. చూచినజనులు"లచ్చయ్యగారు! చేయి వాఁచినదే"మని యడిగిరి. ఝటితిస్ఫురణచేఁ బ్రత్యుత్తరముచెప్పి లోకమును మెప్పించు నేర్పుగలుగుట—"నేనీనాఁ డుదయమున నడవిలోనికి వెళ్ళియుంటిని. "పులిగవి"లో నొక్కసిద్ధుఁడు దర్శన మిచ్చి నీరసించిన నాశరీరము బలుపుఁజెందుటకై యొకసిద్ధరసమును జెప్పినాఁడు. ఆయాకుఁబసరెంతవఱకుఁ బనిచేయునో యని నలఁపి యీచేతికిఁ బట్టించితిని. పట్టినంతమాత్రమున నిట్లు బలిసినది"యని హారినాశ్చర్యమగ్నులఁ గావించి కొంతవడికి వాస్తవమును జెప్పి నవ్వించెను. ఇక్కవి తనకవిత్వము, కల్పనలు, వర్ణనలు, మొదలగునవి జన్మభూమి యగుచెందుర్తిలోని ప్రజలు, అక్కడి యడవి, పర్వతములు, మృగములు, వృక్షలతాదులును జూచియే విరివిగా సంగ్రహించెనని గ్రంథమునందలి యనేకదృష్టాంతములను బట్టి కవిస్వభావ మెఱింగినవారికిఁ బొడకట్టకమానదు. ఒక్కనాఁడు బొమ్మలాటవారివలె రంగనాథరామాయణములోని

లక్ష్మణమూర్ఛఘట్టము రాత్రిపూఁట జదువుచున్నాఁడు. అందు సంజీవకరణి విశల్యకరణి యిట్లేవో కొన్ని పేరులు వచ్చినవి. ఒక్కఁడు వానిని విని కరిణి యేమి టని ప్రశ్నించెను. కరిణి యెఱుఁగవా "మద్దెలకరిణి,......" యని నవ్వుచుఁ జెప్పెను. చెప్పినంతనె తనకు స్వవిషయ మొక్కటి తలఁపునఁ బడినది. ఈయనతమ్ముఁడు అక్కప్పయను అక్కయ్య జ్వరములోఁ జెవికిరింద నొక్కకర్ణి యనుగడ్డ లేచి మృతుఁడయ్యెను. ఆవిషయము, కరిణియని చెప్పినంతలోఁ దోఁచి పుస్తకము మూసి తలవాంచెను. కారణము దెలిసికొని శ్రోతలు, ఎప్పుడో చనిపోయినవానికై యిప్పుడు మీవంటివారు విచారించెదరా? గతముగతమే యని యోదార్చిరి. అంతకుఁ గొంతకాలములోనే తనరామాయణములో (దాశరథివిలాసమున) లక్ష్మణమూర్ఛఘట్టము వచ్చినది. అపుడు 6 ఆశ్వాసము 921 పద్యమును-

గీ. ఒంటినున్నయపుడు సౌఖ్య మొందునపుడు
నాఁకునప్పుడు బంధులఁ గూడునపుడు
మఱపురాక సహోదరమరణశల్య
మెమ్ములను గీఱుచున్న నూఁతేండ్లకైన.

అని వారికిఁ బ్రత్యుత్తరముగా వ్రాసిపెట్టెను. ఈఅక్కప్పగారిప్రజ్ఞ యసాధారణమైనది, అగ్నిస్తంభన, జలస్తంభనము, గారడి, నరవిద్య, సాము, గరిడి, కాగితపుటట్టలు కత్తిరించి తెఱబొమ్మలాడించుట, పందెమువేసి యగాధజలములో ననేకవిధముల గంటలకొలఁది నీఁదుట, వంటచేయుట, కావడిమోయుట, కుట్టుట, బొంగరములు బరిణెలు పట్టుట, కమ్మరము, నేఁతపని, త్రాళ్లుపేనుట, మంచములు

నేయుట, బుట్టలల్లుట మొదలగు వివిధములైన చేతిపనులు వినోదమున కై యభ్యసించెను. కవిత్వము చెప్పువాఁడు, వివాహోపనయనాదులు చేయుచు స్మార్తకలాపము కొంత నేర్చెను. అట్టివాని మృతి యీకవికి విచారజనకము కాకపోవునా? ఇక్కవి బీదలను గాంచి యోర్వలేఁడు. తన కున్నదానిలోనే వారికి వారమునకు నెలకుఁ గొంత కొంత యిచ్చువాఁడు. దానికై వినియోగించుటకుఁ మిత్రులయొద్దఁ జేసిన చేబదుళ్ళు- ఈతని మరణానంతరము జనశ్రుతిని బట్టి యుత్తమర్ణులను దెలిసికొని గంగయ్యగారు మరల నిచ్చివేసిరి.

ఇట్టి మహనీయకృతిని పండితపామరలోకమునకై యొసంగి తత్ప్రసాదమున నుత్తమలోకమునందుఁ జిరస్థాయియై యున్నకవియొక్క చిత్తము శ్రీరాజ్ఞీద్వితీయమున కాతనిపైఁ గలవాత్సల్యమునఁ బ్రచురింప ననుగ్రహించినందునఁ బ్రశాంతమై యుండుఁగాక. ఇట్టిఘనకార్య మొనర్చిన తమయేలికలయు వారిపూర్వులయు గుణకీర్తనము గావించుచు, ప్రభుప్రశంస యను పద్యములను మొదటఁ జేర్చిన నలువురిలో సూర్యరావు సుందరరామయ్య యనునిరువురును గవికిఁ దమ్ములు. రామచంద్రమూర్తి పెద్దన్నగారగు గంగయ్యగారి పెద్దకుమారుఁడు, సోమసుందరము రెండవయన్నగారగు వెంకయ్యగారి పెద్ద కొడుకు.

శ్రీమతు లగునీప్రభ్వీద్వయము సాధుజనావనము సత్క్రియాచరణమును గావించుటయే పరమధర్మం బని సంపూర్ణముగ నెఱిఁగి యుండుటచే నింకను నిట్టి భాషాపోషకములును చిరకీర్తిదాయకములు నగుకార్యము లొనరించి నిజసంస్థానము కవిపండితసజ్జననివాసయో

గ్యమై లక్ష్మీసరస్వతులకు విహారస్థానమై యుండునట్లు చేయును గాక ! శ్రీవారియశస్సు దిగంతవిశ్రాంతముగా నుండు నట్లొనర్ప వారి యిష్ట దైవము లనుగ్రహింతురుగాక.

సహజపాండిత్య మగుటను, పండితసాంగత్యము పూర్తిగా లేని వాఁ డగుటను గొన్నికొన్ని తావులఁ బ్రమాదము లగపడును. దోషజ్ఞులు వానిని బెద్దచేయరు. కవిత్వమునందలి తక్కినసుగుణములఁ గాంచి యానందించి రేని గీర్తిశేషుఁడయినకవి కృతార్థుఁ డగును.

లక్ష్మీనరసాపురము,
4 జనవరి 1928.

చెలికాని సూర్యారావు.



శుభమస్తు.

# ప్రభుప్రశంస.

ఉ. శ్రీశుభదాయకంబును, విశిష్టమనోజ్ఞము, వాంఛితప్రదం
బాశరథీనివారణ, మనంతకథాబహుళం, బజాతసం
కాశము, ముక్తివేళ, ముకుందవికాసము, ముక్తపాశ మా
దాశరథీద్విలాసము ముదం బొనరించుత రావువారికిన్. 1

మ. వసుసంపత్తియుఁ, జక్రిపాదనకళాప్రావీణ్య, ముద్యత్ప్రభా
విసరోద్ఘాటితదోషయుక్తియును, బుధప్రేమాతిరేకమ్ము, లో
కనుతత్వమ్ము, స్వభావసిద్ధ మగుటం గాఁబోలుఁ బేర్గాంచినా
రసమానప్రథఁ బద్మనాయకులు గేహామేయనిత్యోదయుల్. 2

ఉ. అందుఁ బ్రజానురాగపరు లై, పరభంజను లై, విశేషశో
భం దనరారి మించిరి శుభప్రతిపాదకవృత్తి రావువా
రందు మహీపతీడ్యబిరుదాంచితు లై, సుయశోవిశాలు రై
కొందఱు నైజవంశమునకుం గడువన్నెను బెట్టి రాఢ్యు లై. 3

క. ఆమహీపతులకు నెల్లను, దా మూలపురుషుఁ డయి రిపువశీకరనిపుణుఁ డై
శ్యామలకోటనిశాంతుం, డై మనియెం దెలుఁగురాయఁ డమితప్రౌఢిన్. 4

గీ. తెలుఁగురాయని వర్ణింపఁ దివిరి వేల్పు, బాస గూడి కొంత తగఁ గొంత బాస చేర్చి
కొనియె నదియు తెలుఁగుబాస యనఁగ నొప్పెఁ, గాక మిశ్రమభాషయుఁ గలదె తప్పు?

శా. భావింపందగు తెల్గురాయవిలసద్వంశమ్ము దీపింపఁగా
దేవబ్రాహ్మణకార్యతత్పరతఁ గుంతీమాధవారాధనన్
శ్రీవర్ధిష్ణునిజప్రజావనమతిన్ నీలాద్రిరాయప్రభుం
డావిర్భావము నొంది మించె సకలాశాంతస్ఫురత్కీర్తి యై. 6

మ. భువనీలాద్రినృపాలశేఖరుఁడు వేడ్కన్ రాజ్ఞి బావమ్మయం
దనదేవేరిగఁ గోరి కాంచె సుతుల న్నానసత్యసౌందర్యభా
జనుల న్మాన్యుల సింహసంహననులం జంద్రాభనామీనకే
తనులన్ సూర్యకుమారనాయకకుభృత్పంచాస్యులౌ నిర్వురన్. 7

శా. ఆనీలాద్రినృపాలుపిమ్మటఁ గుమారాగ్రేసరుండున్ బహు
క్ష్మానాథస్పృహణీయవర్తనుఁడు శ్రీమత్సూర్యభూపాలుఁ డ

త్యానందమ్ము వహించి లోకములు కొండాడఁగ నేలె నృపో
జాను ల్నాటియె వీని కన్యు లన రాజద్రాజధర్మస్థితిన్. 8

గీ. ఇట్లు సూర్యకులమువార లెల్లఁ బీఠపురము నేలువార లయి యొప్పుదురు వారి
వారిచరితలు వేర్వేఱఁ బలుకవశమె, పరఁగ నేండ్లను బూండ్లను బట్టుఁగాక. 9

క. వినుతయశుం డగుసలసూర్యన్నృపాలునకుం గుదమ్ముఁ డలరు న్నోజ
న్యనిధియు మాన్యచరిత్రుఁడు, మనుమార్గుఁడు నయి కుమారమహీపతి యనఁగన్. 10

సీ. అర్థిసంఘములదైన్యము దీఱునందాఁక, నిద్రవోనికృపాసముద్రుఁ డితఁడె
వినయపవిత్రనమ్మన రామచంద్రుని, మఱపించుపితృభక్తినిరతుఁ డితఁడె
కఱకుశాత్రవున్నైనఁ బరుషాక్షర మొకండుఁ, బలుకనిసరళస్వభావుఁ డితఁడె
ప్రజ లెల్లఁ దనకన్నపట్ల భావించి, తన్నుఁజాలెడిసమదర్శి యితఁడె

గీ. యనఁగఁ గోలంకవీరవరాధిపతి సు. శేష రాజలక్ష్మణవిరాజితశుభయశుఁ
డకుమారమహీపతి [illegible] మించెఁ, గేవలన్నృపమాత్రుండె తర్కింప నతఁడు.

క. లక్ష్మీశరమూర్తి ననఘు లక్ష్మీనరసన్న్యాసు నముల చరిత విలస
ల్లక్ష్మణలక్షితను గుమా, రక్ష్మాపతి పెండ్లి యాడెఁ బ్రమద మెలర్పన్. 12

క. శ్రీరంగనాథపదసర, సీరుహాలగ్నపవిత్రచిత్తాంబుజ, ల
క్ష్మీరమణీకరుణావ్యాప్తధరాపరికర్త యానె ఘనస్తుతి వెలసెన్. 13

ఉ. అతులితభాగ్యశాలి యతఁ డా [illegible] నిత్యసూనృత
వ్రతులఁ గుమారరాజన్యు రాజకిశోరుల [illegible] తేజులం
బ్రతిహతశత్రుపక్షకుల [illegible] జితసద్గుణరాజులన్ మహా
ప్రతిభుల సూర్యధర్మమహిపాలకనిర్వుర గాంచెఁ బుత్రులన్. 14

ఉ. పెద్దది యాత్మగౌరవము, పెద్దవి చూపులు, సాహసంబు ఒల్
పెద్దది, సర్వభంగులను బెద్ద యుదారగుణంబు పోల్చఁగం
బెద్దది కీర్తి, [illegible] బెద్దది యక్కుమారుని కిట్టు లన్నిటం
బెద్దవహింప సూర్యనిభు వేల్పులె పెద్ద సృజించె ధారణిన్. 15

శా. ఆర్యామోదిఁ, గుశాగ్రధీలలితు, వ్యాయామసుస్ఫూర్తి గాంచెన్ మహా
ధైర్యస్థైర్యసువర్ణభూధరుని, సంధాభార్గవున్, రావుశ్రీ
సూర్యారాయనృపాలకానుజుని సంస్తుత్యాశ్వశిక్షాకళా
చార్యుం బేర్కొనఁ జెల్లుఁ బుణ్యనిధి రాజాధర్మరాయప్రభున్. 17

గీ. అనఘు వెల్లంకివంశపావన తిరుమల, విభుజగన్నాథరాయనిపిన్న పట్టి
రాజ్ఞి శ్రీచెల్లయాంబను గరుణఁ జెట్టె, వట్టె శ్రీసూర్యరాయనృపాలమౌళి. 18

క. ఆరాజును, నారాష్ట్రియుఁ, నారాజ్యముఁ బోల్ప నెట్టి దని పలుకఁగ నే
వీటేఁడి పూనెదుఁ గవి తన, గౌరవ ముడుగు నని నుడువుఁగా కొకభంగిన్. 19

సీ. ఎవనిప్రతాపవహ్నికి బాడబానల, మది విస్ఫులింగమునట్లు తోఁచు
నెవనియశోరమ కీరేడుజగములు, నర్తనశాలలై యనువుమీఱు
నేవానిదానధారాప్రవృద్ధికిఁ బోల్ప, జలనిధుల్ చెల్లకాల్వ లనఁ జెల్లు
నేవానిశత్రులకేడువారాసులకడ, నున్నకొండ యిక్కుటయి కాల్లు

గీ. నట్టిశుభతరరావుమహాన్వవాయ, జలనిధిసుధాకరుం డన జననమంది
వెలయు నాసూర్యరాయభూభృత్తిలకుఁడు, వఱుపునకు రాఁడు జన్మజన్మములకైన.

సీ. స్థాపించె నేయమ్మ తనపేరఁ బీఠికాపట్టణోర్విన్నన్నపాత్రశాలఁ
గట్టించె నేధన్య ఖ్యాతిమై సత్త్రపేర సహితక్షేత్రనగపురమ్ము
వెలయించె నేరాజ్ఞి యారత్ననగమునఁ, సత్యనారాయణస్వామిభక్తిఁ
గల్పించె నేదేవి ఘనతరస్థిరవృత్తి, సింహాచలశ్రీనృసింహమూర్తి

గీ. కట్టె శ్రీచెల్లయాంబిక ననఘచరిత, నారవిశశితారక మగు యశముఁ గోరి
ధర్మకార్యము లొనరించి తద్దనెగడు, వారిలో మున్నమునుగఁ జెప్పంగరాదె! 21

సీ. సుకృతకార్యపరత్వశుభచిహ్నము లెవని, వేంకటత్వమునను వెలుఁగఁ జేసె
సహజప్రభావిలాసవిశేష మెంతయు, నెవ్వనిసూర్యత్వ మేర్పరించె
శక్తిసంపన్నప్రశక్తి జగంబుల, నెవనికుమారత్వ మెఱుకపఱిచె
సలలితరాజలక్షణశుభాకృతి యెవని, మహీపతిత్వంబును విహితపఱిచె

ఆ. నట్టిమారసుందరాకారు సుకుమారు, ధీరు శాంతమూర్తి ధీవశాలుఁ
బట్టిగాఁగఁ బడసెఁ బ్రజసంతసింపఁగాఁ, దల్లి చెల్లయాంబ ధన్యగాదె! 22

చ. అతఁడిలఁ డాక్యసమ్మతుఁ డహంకృతిదూరుఁడు సత్కవీంద్రపో
షకుఁ డురుదానశీలుఁడు ప్రజాపరిరక్షకుఁ డాత్మబాంధవ
ప్రకరముదాసహుఁడు గుణబంధురుఁ డుత్తమరమ్యకీర్తిధీ
నికసితహృత్పయోరుహుఁడు వేంకటసూర్యకుమారుఁ డారయన్. 23

గీ. అతఁడు చెలికానిభావనారాయణాత్మజాత నకలంకచారిత్ర సాధ్వి ననుప
మానసద్గుణమణి గురుమాననీయ, రావయాంబ వరించెఁ గరంబుఁ బ్రీతి. 24

సీ. ఏరాజ్ఞి శాత్రవపార్థివతోత్తతు, లెల్ల నడఁచెఁ దల యెత్తకుండ
నేతల్లి యాశ్రితవ్రాతమ్ము రక్షించెఁ, గోర్కులు తుదముట్టఁ గురియఁ జేసి
యేసాధ్వి దిక్కులనెల్లను సితయశశ్చంద్రికాపుంజమ్ము నింప
నేరామ ధాత్రి సహింప సాహాయ్యపాలంబుఁ జల్లగఁ బ్రతుకఁగలిగె

గీ. నట్టిశ్రీచెల్లయాంబ మహాజ్ఞ మసలి, సన్నుతుల నొందె నని యెందు జను లనంగ
న తరువం దలలో నాల్గ యాగుచు వెలసె, రమ్యసద్గుణనికురుంబ రామయాంబ.

సీ. తాతతండ్రులనుండి తమకొలెక్ౘదీర్చు భృత్యులఁ గాచి పుణ్యంబునొందు ననియు
దేశమ్ముఁ గాలమ్ముఁ దెలిసి ప్రజానురంజనముగఁ బాలింపఁ జాలు ననియుఁ
బుట్టినయింటికి మెట్టినయింటికిఁ, బేరుఁ దెచ్చి యశంబుఁ బెంచు ననియు
మానితసంస్థానమర్యాద లారసి, కులమువారల పేరు నిలుపు ననియు

గీ. నరసి చెల్లాంబ స్నుషకు రాజ్యం బొసంగె, నాదిరాజన్యపద్ధతి ననుసరించి
యహహా! స్వార్థపరిత్యాగ మనఁగ నిట్లు, లుండవలయదె యని మెచ్చ నుర్విజనము.

సీ. నాఁటనాఁటను రమానాథుపైఁ బొదలుభక్తి యవిరళం బని తెలుపుకొనుచుఁ
వరసూర్యరాణ్మహీధరుపైఁ గల్గు కడింది ప్రేమముఁ బ్రకటించుకొనుచుఁ
బావనలక్ష్మీనివాసరంగములపై, భావ మెంతయుఁ దేట పఱచుకొనుచు
నిర్మలఘనయశోనిలయ నైవ నియెద, నంచు జగతి కెఱిఁగించుకొనుచు

గీ. ఎలిర! చెల్లయాంబను దిరుపతియును నెండ్రప్రల్లె క్షేత్రంబు దామరవాడయును సిత
చంద్రసౌధమ్ము మనస్సుసాక్షాంత మట్లు, చెందె; మాఱునె సాధ్వులశీల మెంగు

సీ. తనభవ్యవినయాదిఘనలక్షణంబులు, నారాయణాంశసంజనతఁ దెలుపఁ
దనగురుకుప్రశంస యనయంబు వాయని, సూర్యపత్నీత్వవిస్ఫూర్తి నెఱపఁ
దనయపూర్వసమాజధర్మగుణప్రౌఢి, ప్రత్యర్థిపటలసంవర్ధనముగఁ
దనయండ యయి నిల్చినస్పసీంహ నాదృతి, శ్రితులఁ బ్రహ్మావత్యసిద్ధిఁ దేల్పఁ

గీ. బ్రబలుఁ గవిమండలాశీఃప్రంపరాప్తి, పుణ్యరాజ్యాధికారప్రభూతపూత
నిర్మలవియన్నదీసద్వ్రజ్యవిదకీర్తి, రాజితాశాకదంబ శ్రీరామయాంబ. 28

సీ. సితచంద్రసౌధపఙ్క్తిప్రభావరణంబు, పద్మనాయకకులపాలితంబు
ప్రూరనిశాటసంకులధూమకేతువు, మాధవక్రీడాసమానసీమ
విబుధసన్నుతసత్రవేశ్మప్రపూర్ణంబు, ధన్యనుమిత్రావతంసభవన
మనిలకిశోరవిహారోపవనరాజి, వనగతభూజాతివైభవంబు

గీ. ధరతశత్రుఘ్నచణభద్రభటసవహాయు,తంబు కుశలవసుప్రసిద్ధమ్ము నగుచు
రామరాజ్య మనంగ నీరామరాజ్య, మలరె నవ మించె రావురామాంబదేవి. 29

సీ. రావుసద్వంశవారాశి యుద్భవంగఁగా, వెలసినచంద్రునికళ లనంగ
ధర్మంబు పాల్గుపాదముల నరులఁ గలిఁ, బ్రబలినధర్మదేవత లనంగఁ
బ్రాచీనశాస్త్రసుప్రకటవాసక్తిమై, జన్మించుదినసరస్వతు లనంగ
సాంద్రధీశౌద్రి యా శించిపడసిన, ధన్యపాపసతపఃఫలము లనఁగ

గీ. వన్వవాయమునన బ్రజ నగయుపట్లు, నధికవిద్యాప్రసక్తిఁ గా వధిక లగుచుఁ
రాజిలెదు చెల్లయాంబ యు రామయాంబ, సన్నుతికిఁ బాత్రములు కారె జగతిలోన.

క. విద్యాసరస్వతులు నృప, విద్యాపారగలు భార్గవీపూర్ణకృపా
మాద్యత్సంపద్విలసిత, లాద్యలు మతి యుత్తకోడ లన్నిటిలోనన్. 31

ఉ. ఆరయఁ బూర్వికాశ్రితుల నాశ్రితపుత్త్రుల వారిబిడ్డలన్
వారియనుంగుమానల నవక్రదయామతిఁ గాచుప్రభ్వి లీ
ధారణి రావుచెల్లయమఁ దత్స్నుష రామమ యంచు లోకముల్
సారెకు సన్నుతింపఁగఁ జెలంగి వదాన్యత మించి రెంతయున్. 32

ఉ. అయ్యలు నమ్మలై ప్రజల నారయుచుండిరి చెల్లయాంబ రా
మయ్యయు వారి నెల్లనిఁ నర్హము; పోషిత గాక యల్పమే?
యెయ్యెడ నాయహోబలుని నేమెదిరింతుము మూఁడుమార్లు చె
ల్లయ్యయు రామయాంబ యని చాడ్డిఁ జూతము వ్యాకృతిప్రథన్. 33

క. ఇంద్రుం డని చంద్రుండను, నేంద్రుం డని పొగడు కవిమహాయమ్మగ వాఁ
డింద్రుఁడొ చంద్రుఁడొ తెలియదు, నేంద్రుఁడొ యారిత్తమాట లేత్రికి మారున్. 35

ఆ. ఉన్న దున్నయట్లు లుగ్గడింపఁగ నేండ్లుఁ, బూండ్లుఁ బట్టు లేనిపోని వేల?
యట్టి కెగురలేని యూపికతో నుండి, స్వర్గమునకు నెగుర సాగునట్లు. 36

గీ. వర్తమానానురూపప్రవర్తనమున, మించి యశముచేఁ బ్రజలఁ బాలించు నల్ల
దివ్యరేచర్లగోత్రసందీపితు లగు, నత్తకోడం డ్రొకానొక యవసరమున. 37

సీ. శ్రవణయుగ్మాభిరంజనదివ్యకుండల, భ్రాజితం బగుసోమయాజికులము
బహుమానితానర్ఘభర్మశాటీవిరాజిత మగుపండితసింహావితతి
శుద్ధమాణిక్యసన్నద్ధకాంచనకంకణాదిభూషితకవీంద్రావలియును
హారికిరీటకేయూరవిభూషాభి,రామ మా సామంతరాజసమితి

గీ. నాగవల్లీదళకరండపూగమార్గ, చందనాగురుకర్పూరచారుమకుర
ముఖ్యనృపలాంఛనద్రవ్యములు గ్రహించి, సేవకాళియు నందంద్రుఁ జేరియుండ. 38

మ. మముఁ గౌండిన్యసగోత్రసంభవుల సమ్మాన్యార్హులన్ శిల్పము
త్తమకావ్యప్రకరప్రకల్పనకళాధౌరేయులన్ రాజస
త్తమనిర్వోదయకార్యవాంఛితుల సత్సాంగత్యశోభాంధ్యులం
బ్రమదాన్వీతులఁ బూర్వికాశ్రితులఁ బిల్పించి ప్రేమంబునన్. 39

చ. కుశలమె మీకు బిడ్డలకుఁ గూరిమిఁ దప్పక మీర లుందురే?
పశువులు పాఁడిసేఁపెడినె? వన్యమృగంబులబాధ వాసెనే?

కుశలమె యూరివారలకుఁ గూపతటాకములందు నీరముల్
భృశముగ నున్నవే? తొలుత నిచ్చినక్షేత్రము పండుచున్నదే? 40
గీ. పూర్వమునబోలె సంతతంబును బురాణగోష్ఠి నుందురే? కావ్యముల్ గూర్చుచుండ్రె?
ఘనతరాశ్రితకుటుంబగౌరవంబు, నడపుచుందురె మీర లందఱును వేడ్క? 41
క. అనిశంబును మీ క్షేమము, వినుచుందును వారు వారు వినిపింపఁగ మీ
రును వచ్చిపోవుచుండం, జనుఁగాక! యటంచు నాప్రసంగవశమునన్. 42
ఉ. అచ్చనగారు లాక్షణికులందునఁ బ్రౌఢిమెలర్పఁ జెప్పి మీ
లచ్చన రామభద్రునికిలాస మపూర్వముగాఁగఁ దోఁప; నా
మెచ్చుప్రబంధరాజ సుదిమేకొని నామదిఁ బాయకుండు నీ
వచ్చునుగాదె దానికి ధ్రువంబుగ నక్షరలక్ష లెమ్మెయిన్. 43
సీ. ఆంధ్రగీర్వాణము లభ్యసింపఁగలేను, సేవించి నేర్వ దేశికుఁడు లేఁడు
వ్యాకరణంబుల పరిచయంబు హుళక్కి, పండితస్నేహ మావంత లేదు
కవిజనపాళిసాంగత్యము పూజ్యంబు, ఛందోజ్ఞులప్రశంస స్వప్నవార్త
గ్రంథావలోకనగతియును నల్పంబు, సహపాఠులసహవాసంబు కల్ల
గీ. నయవిశారదుఁ డెన్న మనంబు విన్న, వయసునకుఁ బిన్న కల్పనాప్రతిభ మిన్న
యమరఁ బదరాజిఁ గూర్పఁ బోతన్న కొత్త, పల్లెలచ్చన్న యతఁడు కేవలుఁ డెతలఁప.
సీ. సభఁ బురాణముఁ జెప్పసాగినాఁ డవసూతుఁ డీతం డనుచొప్పఁ బొలిచి
రాజకీయరహస్యయోజనాపేశల యుగంధరమంత్రిఖ్యాతిఁ బడసి
మన్నించుప్రభువులమాట నౌఁదలనిడు, పట్టి కేవలభటత్వంబుఁ జూపి
నీతిబోధనమును నెఱపుచో నపరచాణక్యుఁడే యితఁ డనంగఁ దనరి
గీ. మానఘనుఁ డయి మత్సన్నిధానమునను, చిఱుతనాఁటను గోల వసించినట్టి
లచ్చనార్యుని మఱవంగ వచ్చునెట్లు, కవివరుఁ డతండు రామనగన్నసుకృతి. 45
ఉ. ఆతనికల్పనాప్రభవ మాతనిమంజులశబ్దగుంభనం
బాతనిశైలిమాధురియు నాతనిసన్నయమప్రకర్షకం
బాతనియర్థగౌరవము నాతనిసాహితి యెన్నఁ బోలునే?
తాతడు వానితాతడు సతంబు ధరిత్రివహించు తాతడున్. 46
గీ. అరయఁ జెందుర్తి జన్మించి యందె పెరిఁగి, యున్న మెఱుఁగగు నిజశక్తి నఖిలకళల
నెఱిఁగి జగములఁ బేరొందెఁ బెరటిచెట్టు, మందునకు రా దటన్నసామ్యంబు దోఁప.
సీ. రామాయణగ్రంథరచనకు మున్నుగ, భాస్కరశతకంబు భాస్కరుండు
వ్రాసిన చందాన వ్రాసె సంయుక్తాక్షరప్రాసములను నూర్వశతకంబు

దాశరథిప్రబంధమునకుఁ దొలుత నూఱ్లోకపానకుండు గా నోపు మఱియు
నీతుల కిక్క యై నెగడ మత్కృతి గాఁగఁ, గల్పించె శతక మొక్కండు వేడ్క

గీ. ధన్యుఁ డాతఁడు జన్మసార్థకము గాఁగ, భగవదర్పిత మొనరించె భవ్యకృతిని
వాదికవిపథగామియు సాధురీతుఁడు, గామియు భ్రమింపఁజేసెను గాదె జగతి. 48

క. మతిఁదలఁప దివ్యుఁడొకఁడే, గతిహేలాగతి జనించి కడచనె నన స
ద్గతిఁ జెందె లచ్చనకవి సుకృతిగ నాదుం వనుసట్టు లేమన వచ్చున్. 49

క. పరలోకగతుం డగునా, పరమునిగ్రంథంబు జగదుపకరణముగ సా
దరవృత్తిఁ బ్రకటించుట కరి వమనోరాగ్యంబు. గీ గతకాంణ మెట్లున్. 50

మ. ఇది యెల్లప్పుడు నామనంబునఁ గరం బిష్టంబ యై యుండుఁ బా
యదు వో మత్సన్నమయిష్టవృత్తికిని దో డై తద్ద ప్రేరేచెనుం
గద! ముద్రించుట మేలు సేత ధనమున్నం బెద్దయే మాకు స
న్మద మిక్కార్య మటంచు మాను నయి సన్మానంబుతోఁ బల్కునన్. 51

గీ. తడవుఁ గా నెందు సత్సంతానములను, గృతిపరీక్ష స్తము మఱియట్టికృతుల జగతిఁ
బ్రకటనము సేయు నాపుణ్యఫలవిశేష, మది యనంతము తలఁప మాయమ్మలార!

చ. మును పొకమంజువాణి యశముం గనఁగాఁ బ్రకటించఁ బూనె ల
క్ష్మీకృతి యైన దాశరథిసచ్చరితం బది సాగ దయ్యె ల
క్ష్మినిఁ దనయుత్తఁ జెందమి ప్రసిద్ధను, కేశలలక్ష్మి నత్తఁ జే
కొనె నిట మంజువాణి యిఁకఁ గోరిక తీరె కలెత్తు టబ్రమే! 53

చంపమాలిక.

అగయఁ బ్రసిద్ధ కొక్క దణులై నయపద్ధతి భూము లేలు భూ
వరులును రాష్ట్రులుం గలరు పల్వురు లోకములోన వారిలో
నరిది సువిద్యఁ బ్రోచెను మహత్తరు లంతుఁ గవిత్వసూనుకి
పరిచితి గల్గువారు తడవం దడవ న్మతి వేయికొక్కరుం
దుగొ మానశంక, యట్లుగుటఁ దోఁపకు సక్కపు లెంను డాఁగిరో
పిగదనవృత్తి మాని తమవిద్య యుము నాఁడి ఘోరకాననాం
తరమునఁ గాయు వెన్నెల గదా యని యూయుడలన్ భవాన్వశల్
సరసతి గానవించినఁ ప్రసన్నతఁ జూపి యశంబు రెట్టిగా
విరచితకావ్యులై చనుట వింతయె? తొల్లిట గ్రంథకర్త లె
ప్పరుసున రాజమాన్యు లయి భవ్యకృతు లొదియించి మించిరో
యెఱుఁగనిదేమి? తద్గుణు మహీపతు లెంచఁగ రావువారు శ్రీ

కరులును గ్రంథపోషకులు గాన వచింపఁగ వేయునేల? దా
శరథివిలాస మాదికవిసత్తమునట్లు రచించి దేవతా
పురి కరిగెం గవిప్రకరపూజ్యుఁడు లచ్చన పెక్కులయ్యె వ
త్సరములు తత్ప్రబంధము ముదంబున ముద్రణసేయ నెంచి యా
దరమున మా కనుజ్ఞ యిడఁ దద్దయు నాతనివార మాటచే
నరుదుగ లచ్చనాఖ్యుఁ డనయంబు సజీవుఁడె యుంచు నెంచి ని
ర్భరపరితోష మాత్మలఁ దిరంబయి నెక్కొన నున్నవార మీ
యరుద నగుభాగ్య మెవ్వరికి నుర్విలభించును? మీకు మీర యా
దురుగ దసాటి యంచు నతితుష్టుల మై నుతియించి వేఁడెదన్. 52

సీ. ధనలోపమునఁ బ్రకటనము సేయఁగ లేని, యాందోళనం బట్టె యడఁగిపోవ
నామూలమునఁ జూచి హర్షించుభాగ్యంబు, గలుగునే యని యాత్మఁ గలఁగకుండ
నే నాఁటివాఁడో యీకృతికర్త యని తెలి,యఁగఁ గోరి కష్టంబు నందకుండ
నెన్నఁ డిక్కైన లచ్చన్న వ్రాసినకృతిఁ, గందుమే యని పొంగకుండఁబోవ
గీ. మమ్ము బంధులఁ గాఁ బ్రియమిత్రులను, బాంధవావళి నానందవార్ధి ముంచి
యాశ్రితాదరణంబు నైజ్యముగ నించి, చూఱగొంటిరి, సద్యశమ్ము నఖిలంబు. 53
సీ. మీమాట ధర్మసమాహిత మై గుర్జ, వాట్టహాసమ్ముల నడచుఁగాత!
మీ వ్రాలు నిఖిలాశ్రిత వ్రాతవశములౌ, తరతరంబుల వాఁకఁ దనుప్రఁగాత!
మీయిల్లు తప్పక వేయిండ్లమొదలయి, బహుబాంధవాశ్రితిఁ బడయుఁగాత!
మీకీర్తిలతికలు మ్రాఁకి దిక్కుడ్యమ్ము,లావలఁ గొనసాగి యలముఁగాత!
గీ. కృతయుగమ్మును దలపించి నీతిధర్మ, సంగతిఁ బ్రజానురంజనపరత మించి
యాసుధాకరతారార్క మవని నేలు, చుందురుగాత! మీర లోహో యనంగ 54
వ. అని ప్రస్తుతిసల్పి.
మ. సుజలాంతర్గతముక్ సుసస్యము బ్రసూర్వరా మాన్నత్యముం
బ్రజఁ బోషింపఁగ సాధనంబు లని తెల్పన్నిత్యము శ్రీసింహాశై
లజసౌభాగ్యము నిచ్చుఁగాక! మనచెల్లెమ్మక్క గామాంబ సా
ర్వజనీనంబుగ నేలురాజ్యమున నప్పన్నప్రోదుత్సాహియై 55
శా. శ్రీమంతంబు ఫలప్రదంబు నగు శ్రీసింహాద్రిపై నిల్చు సు
శ్రీమంతుండు నభీష్టపక్షులను డా శ్రీనారసింహుండు వి
ద్యామాహాత్మ్యుల రావుచెల్లకుదు గాముఖ్యామ్మ నెల్లప్పుడుం
బ్రేమం గాంచుత మత్తకోడలి నితశ్రీమించ దీవించుమన్. 56

చ. బహుతరరాజ్యవిస్తృతి శుభప్రదదీర్ఘతరాయువున్మహా
మహిమయుఁ గీర్తి రావుకులమాన్యలు చెల్లయరామయాంబికల్
రహివహియింపఁగాఁ గరుణఁ బ్రత్యహముం దలపోయుఁ గావుతన్
మహిపతి పద్మనాయకుఁడు మానుగఁ దత్త్వమువృద్ధి సేయుచున్. 57

ఉ. తామరకంటికిన్మగువ తామరకంటి వెడంద తామరం
దా మునుబుట్టి తామరముదంపుఁగుమారునితల్లి యైనయ
త్తామరపేరితల్లి, విదితామరతామరసాక్షు లెల్లరున్
రా మనచెల్లమాంబకును రామమకుం బొడసూపుఁగావుతన్! 58

మ. సమత న్భావను నెండ కోర్చి బుధవిస్తారంబుఁ బోషింపఁగాఁ
దమిఁ జెందు త్రిని జియ్యకంబముకడం దా నిల్చియున్నట్టి య
య్యమపుత్రుం దగుబొజ్జదేవరయు నాయూ రేలురామాంబ న
య్యమయత్తం దగఁబ్రోచుఁగావుతను గార్యప్రాప్తి కాధారుఁడై. 59

క. రత్నమును రత్నగర్భను, రత్నాకరపుత్రిఁ బెన్నరంబున నిడునా
రత్నగిరిసత్యదైవత,రత్నము చెల్లాంబ రాజ్ఞి రామమఁ బ్రోచున్! 60

మ. కలలోనైనఁ దృణంబు ముద్దుగను నీఁగా నెంచి దాసాళి ద
వ్వేఁ మొక్కంగ నభీష్టముం డయి కడుం బొల్పారి సన్నద్ధుఁడై
యులమేల్మంగనుఁ గూడి తిర్పతిని గుట్ట్యాలింమ నవ్వాడికా
నులవెంకన్న కృపామతి న్సతముఁ బ్రోచుం జెల్లయమ్మన్ స్నుషన్. 61

మ. గరుడాద్రిన్ గృహగోధికావిలసదాకారంబుతో భక్తిత
త్పరతన్ వైష్ణవు లర్చన ల్సలుప మోదంబంది యెవ్వేళఁ దా
నురుభోగానుభవాప్తి నొప్పెసఁగు నయ్యుష్మాక శ్రీవేంకటే
శ్వరుఁ డత్యంతముఁ బ్రోచుఁ జెల్లయను రాజారావుగామ్యాసన్. 62

మ. అకలంకప్రతిభాభిరామోగ్యుఁ డయి ప్రత్యక్షుంబుగా నిల్చి పో
షకత న్మించిన రావుచెల్లయమ నిష్టప్రాప్తి రక్షించుచున్
సకలేశుం డనుపేరఁ బీఠపురిసంస్థానమ్ముగా నున్న శ్రీ
సకలేశుం డిడుసర్వసంపదలు రాజారావురామాంబకున్.

శా. శ్రీరంజిల్లెడు తోఁటపల్లెయుల గౌరీయుక్తుఁడై యొప్పి త
ద్ధారాపాతము దానవహుం డగుట నిత్యంబంద కాఁపై నిరా
కారుల్ కొండదొరల్ నతు ల్సలుపఁగాఁ గాపాడుమల్లేశ్వరుం
డారూఢస్థితి రావువారల కభీష్టార్థంబులం గూర్చుతన్!

వ. అని కృతజ్ఞతం దెలుపుకొనుచు నాశీర్వదించి.

గీ. శాస్త్రులార! పండితులార! సత్కవీంద్రు,లార!సజ్జనులార ! ధర్మాత్ములార !
యధిపులార! బంధువులార! యాప్తులార!, సకల సద్వర్ణులార! రసజ్ఞులార.

క. దేవతలను దాపసులను, దైవజ్ఞుల నమృతవాక్సుధావర్షుల స
ర్వావనిదేవుల యీమా, రాపుకులాధిపులఁ బ్రోవఁ బ్రార్థింపుఁడొగిన్.

వ. అని లోకము ననారతము నారాధించుచున్నారము.

క్రొత్తపల్లి సూర్యారావు.
క్రొత్తపల్లి సుందరరామయ్య.
క్రొత్తపల్లి రామచంద్రమూర్తి.
క్రొత్తపల్లి సోమసుందరము.



శుభమస్తు.

అవిఘ్నమస్తు.

శ్రీశారదాంబాయైనమోనమః.

# దాశరథివిలాసము.

## ప్రథమాశ్వాసము.


శ్రీమద్గైరికధాతువేష్టితము నై జీమూతసంవ్యాప్త మై
రామం బై తనరారువేంకటనగేంద్రంబు న్హరిద్రావరో
ద్దామం బై మృగనాభిలిప్త మగుపద్మాదేవివక్షోజ మం
చామోదించెడివేంకటేశ్వరుఁడు మమ్మాసక్తి రక్షించుతన్.

ఉ. మారుఁ గుమారుగాఁ గనినమా కనరయే సతి పల్కఁగొమ్మ యా
వారిజహస్త నాయెదకువచ్చినదానవు నీవ యంచు శ్రీ
జారుఁడు హారకౌస్తుభముఁ జక్కఁ నమర్చె నెపంబునం దదీ
యోరుకుచద్వయిం బుడుక నుబ్బెడు లచ్చి వసించు మాకడన్. 2

చ. శివుఁ డని యెల్లవారు నుతిసేయఁగ నుగ్రత నీకు ధర్మమా
రవిశశివహ్నిలోచన హరా యన శంకరి సర్వమంగళా
ప్రవిమలనామ్ని వై తగునె భైరవినాఁ జన నీకు నంచు న
న్నువిహితరాగుఁ డై యుమఁ గనుంగొను శంభుఁడు మమ్ముఁ బ్రోవుతన్. 3

చ. అనుపమబాహుశాఖల శిఖాభ్రిభవారసుమంబులం గన
ద్వనజవిరోధినిర్గత సుధారసపుష్పరసాతుమాలికా
ఘనఫలపుష్కలం బొలుచు కామవిరోధిశరీరకల్పకం
బున వలిసంగతేద్ధలత వోలెఁ బెనంగొను గౌరిఁ గొల్చెదన్. 4

ఉ. నందకధారిపుత్రుఁడు సనందనముఖ్యులకెల్లఁ దండ్రి గో
నందననాయకస్తుతుఁ డనందగి యొప్పెడు మేటి నిర్మలా
నందమనస్కుఁ డద్రి భవనందనవిక్రముఁడైన యాశతా
నందుఁ డొసంగుఁ గావుత ఘనంబుగ మాకుఁ జిరాయురున్నతుల్. 5

చ. వరచతురాస్య పుణ్యజనవర్ధన దీక్షితసత్యలోక మం
దిరమృదుహాంసకస్ఫురిత దివ్యపదాబ్జప్రవాళహస్త వి
స్తరవిబుధాభినందితల సత్ప్రతిభారతిభారతీసమా
ఖ్యరహిఁ జెలంగు శారద దయామయత న్మనుఁ జూచుఁ గావుతన్. 6

చ. అధిక మతి న్భజింతుఁ గలుషాభ్రిమహాబలు నమ్మహాబలుం
గ్రిథనధరారివిక్రమహార న్మహితాంబరు నాహితాంబరు
న్విధివిహితస్తుత్రిదివవేశ్మగణాధిపునాగణాధిపుం
బృథుభయదాంతరాయభుజగేద్ధవినాయకు నావినాయకుక్. 7

చ. పటుతరహర్షపాదప శుభస్థితిగాంచి ప్రపత్తిసత్ఫలో
త్కటరసమాని రాఘవకథాఘననిష్కుహావాసియై కడుం
జొటజొటఁదేనియల్గురియు సొంపున రాముని బల్కుచున్న య
ద్వటుమణి నాంజనేయ శుకవర్యము నాత్మఁదలంచి మ్రొక్కుదుక్.

సీ. చక్రింబు లెవనిచే సంతసంబుగ మను, నెవనిచేఁ జక్రింబు లేపుఁ జెందు
వసురాజు లెవనిచే నసమతేజము గాంతు, రెవనిచే వసురాజు లెసఁగుచుండ్రి
విబుధు లెవ్వాని సేవింతు రెవ్వాని సేవింతురు విబుధులు విమలబుద్ధి
గగనధునీహంస గతిఁబోల్చ నెవ్వాఁడు, హంసాఖ్య నెవఁడు బ్రశంసనొందు

గీ. నరుణుఁ డెవ్వాని సారథి యై మెలంగు, నెవ్వఁ డిలనరుణాభిఖ్య నెలమినొందు
నట్టిశ్రీలోకబాంధవుఁ డనుదినంబుఁ, గృప మొలక లెత్త నన్ను రక్షించుఁగాత. 9

చ. వితతగుణాధినాథుఁ బృథివీమహితాధునికాసనాతన
స్తుతహితగాధువేష్టిత విశుద్ధవనోమునియూథుసంతతే
ధితఖలతావిరోధు గురుదివ్యవినిర్మలబోధు సాధు న
న్నతకరుణాసనాథుఁ గురునాథు భజింతు నభీష్ట సిద్ధికిక్. 10

సీ. వరుసఁ బ్రహ్లాదాది పరమ భాగవతుల, వ్యాసవాల్మీకాది వరనియములఁ
గౌతమీగంగాది ఘనపుణ్య నదులను, భూమ్యాది పటు పంచభూతములను
గరుడాదిహరిపార్శ్వ చరులఁ గుమారాది, కైలాసపర్వతాగ్ర పరిచరుల
ద్వాదశాదిత్యుల వసువుల నెనమండ్రి, గ్రహముల నుత్తమ బ్రాహ్మణులను

గీ. నమరనాయకపావకా ద్యష్టదిక్పతులనరుంధతి మొదలైన పుణ్యసతులఁ
బోతనను నన్న యాదిక పూర్వకవుల, మఱియుఁ దక్కిన పుణ్యుల మదిభజింతు.

గీ. అజ్ఞులగు దుష్టకవుల నేలాహసింపఁ, బ్రాజ్ఞులగు సత్కవుల నేల ప్రస్తుతింప
దుష్టులని వారి దూషింప దుష్టుఁడయగుఁ, బ్రస్తుతికి సంతసింపరు ప్రబలకవులు. 12

క. కృతినుతుని వేంకటేశునిఁ, గృతినాథునిఁ గానొనర్చి కృపవుట్టనమ
స్కృతి గావించెద మఱి సత్కృతియింతటికన్నఁ గలదె యెన్నివిధములక్. 13

వ. అనిమన్మనోభీష్టవరాభీష్టదిష్టపరిప్రార్థనంబును సత్సంభావనంబును సంక్షేపరూపంబుగా నొనర్చి యస్మద్వంశానుకీర్తనంబు గావించెద.

## వంశావళి.

క. ధన్యుఁడు వినమితముని మూర్ధన్యుఁడు సంశ్రితకళావదాన్యుఁ డఖిలస
న్మాన్యుఁడు సౌజన్యుఁడు కౌండిన్యుఁడు వెలయుం దపఃపటిమ నధికుం డై. 1

గీ. అన్నియమిగోత్రరత్నాకరాబ్జుఁడగుచు, వేదవేదాంతవిద్యాప్రవీణుఁడగుచు
గోత్రనెంతయుఁ బొగడొందెఁ గొత్తపల్లి,నారసింహామనీషిమాన్యమతపోషి. 2

క. నరసింహాత్వము భక్త్యాదరణత్వముఁ గలిగి యెట్లు తా నెన యగు న
న్నరసింహుఁడు విబుధాదరణాగ్రహితుఁడై కొత్తపల్లి నరసింహునకున్. 3

క. అయ్యన నలుమొగములుగలజియ్యనదల్పుఁ దొలిచదువుచే ననఁ దగువాఁ
డొయ్యన మైలవరపుభోగయ్య నెనరుఁ గూఁతుఁ బెండ్లియై తగువేడ్కన్. 4

ఉ. శక్తి పరాశరుం గనినచాడ్పున వెంకమ యందుఁ గాంచె వి
ధ్యుక్తవిధానధుర్యుని విహారగబంధనమంత్రతంత్రసం
యుక్తసుచర్యునిన్ హిమనగోపమధైర్యుని భూరిసూరి సం
సక్తసభాసభావితయశస్థగితాశుని వేంకటేశునిన్. 5

ఉ. కన్నకుమారకోటి నతిగౌరవ మొప్పఁగ నాదరించుఁ దాఁ
గన్నకుమారులట్లు కడకన్నరిసేయఁగవచ్చు గంగ ముం
గన్నకుమారుమారు నవకంబున మీఱును గొత్తపల్లివెం
కన్నకుమాఱులే రని మహామహు లెన్నఁ బ్రసిద్ధి నొందుచున్. 6

సీ. ఒకముఖంబున నేర్చె నో నాల్గువేదంబు, లని బ్రహ్మఁ గా దను నాగమోక్తి
వేదాంతయుక్తులు విని నేర్చికొన్నవాఁ, డని శుకు మెచ్చఁ డధ్యాత్మవిద్య
ధర్మశాస్త్రంబు నర్థంబె ఱుంగఁడు వ్యాసుఁ,డని ప్రహసించు స్మృత్యధిగమమునఁ
దనవారి కుపదేశ మొనరించెనా యని, ప్రహ్లాదు నవ్వు శ్రీపతిసుభక్తిఁ
గీ. దనయెదుట నురువటుము దగ్గంబొనర్చెఁ, దక్షకుం డని కశ్యపుఁ దఱిమి పల్కు
సర్వముఖవిషమంత్రప్రశక్తియుక్తి,నతఁడు గేవలుఁడే వెంకనాఖ్యసూరి. 7

సీ. అతిథి యై మాయింటి కరుదేరఁ జాలదే, యీతండు పాపంబు లింకిపోవఁ
జెలఁగి మాయూర వసించినఁ జాలదే, యీతండు మిగులఁ బ్రఖ్యాతిగాఁగ
నీతండు మాకుఁ జ న్నిచ్చినఁ జాలదే, సకలశాస్త్రార్థము ల్సంగ్రహింప
వేడుక నొక్కమా టాడినఁ జాలదే, మాతోడ నితఁడు జన్మఫలముగ
గీ. ననుచు నూరిజను ల్దను వినుతిసేయ, వసుధఁ గీర్తి వహించె నద్వైతతోషి
యుపలభాషి యరోషి దయావిభూషి, ఘననిగమపరవేషి వేంకనమనీషి. 8

ఉ. అతఁడు మొక్కరాలవిమలాన్వయదుగ్ధపయోధిచంద్రుఁ డౌ
నీతఁ డనంగ సంస్తుతి వహించిన యర్కయ పెద్దకూఁతు వి
ఖ్యాతచరిత్రి ధర్మనిధ గాత్రి లసచ్ఛతపత్త్రనేత్రి సం
జాతరుణీపవిత్రి సతిపాత్రిను బ్రహ్మమగోత్రిఁ బెండ్లియై. 9

ఆ. అనఘశీల సాధ్వి యైన తత్సతియందుఁ, గాంచె రామగోత్రుఁ గలితగాత్రు
ననఘమిత్రుఁ జాత్రు నమితదోషలతాలవిత్రు నుభయకులపవిత్రుఁ బుత్త్రు. 10

క. ఆరాముఁడు పితృభక్తికి, నారాముఁడు జామవారి కారాముఁడు నా
త్మారాముఁడు గుణనికరపి, కారాముఁడు విప్రమాత్రుఁడా తలపోయన్. 11

సీ. అనఘవర్తన రామునట్టివాఁడౌఁ గదా, యచలసంధాప్రౌఢి నట్టివాఁడ
యాచారమున భీష్మునట్టివాఁడౌఁ గదా, యమితశాంతిస్ఫూర్తి నట్టివాఁడ
యాడితప్పమిఁ బలియట్టివాఁడౌఁ గదా, యౌదార్యశీలత నట్టివాఁడ
హరిభక్తిఁ బ్రహ్లాదు నట్టివాఁడౌఁ గదా, యఖిలసమానత నట్టివాఁడ

గీ. యనుచుఁ బొగడొంది ఖరదూషణాపహృతిని, మహి భరతలక్ష్మణాగ్రజన్మత్వమునను
వాసిమీఱినశివధర్మవర్ధనమున, రామనామంబుఁ దనకు సార్థక మొనర్చె. 12

సీ. ఒరులలేమికిఁ జింత నొందు నింతియ కాని, కలవారిసిరికి వెక్కసము లేదు
ఆత్మసంస్తుతి కలనైన సేయఁడు గదా, పరనింద వినుట కొప్పఁడు మనమున
లవమిచ్చెనేని మేరువుగాఁగ భావించు, నీయనివారిపై నీర్ష్య లేదు
అధికదుష్కర్ముని యందైన సుగుణంబు, నైకంబు గని వాని సంస్తుతించు

గీ. నాప్రతిగ్రహరాహిత్య మానిగర్వ, మాప్రమోదనిమగ్నత యాప్రశాంత
మానిభృతి రామనసుకృతి యందకాక, తిరిగి చూచిన మఱి కలదే పరులకు. 13

ఉ. తా నమరేంద్రసుస్థిరపదంబు వహింపఁగ రవుసూర్యా
జ్ఞానవశాధవశాళిమణి మానక కోరి యొసంగిన న్సమా
ధానము నాగమోదితవిధానముఁ గాంచనసస్యగర్భభూ
దానము రామనార్యుఁడు ముదంబున గాంచె నయాచితంబుగన్. 14

వ. ఏవంవిధమహానుగుణగరిష్ఠుం డగునమ్మహీసురశ్రేష్ఠుండు. 15

ఆ. పరమపావనుండు బ్రాహ్మణప్రవరుండు, నమలవిష్ణువర్ధనాన్వయుండు
ఘనవిహారి గతవికారి సుబ్రహ్మణ్యసూరివరుఁడు సూరి శుభము గోరి. 16

క. అంబికను సాటి యగుసు, బ్బాంబిక ధర్మపత్నిఁ బెండ్లియై నిజదాంప
త్యం బభివర్ణించెదు సుజనులెల్ల గని పొగడు రామనవనీషి కదన్. 17

సీ. కన్నతండ్రికిఁ గీడుగ మేలుఁగ నుండిన, దాక్షాయణీదేవి తనకు సాటి
యత్తమామల సపర్యఁ దాయొనర్చిన, జనకభూపతిసుత తనకు సాటి
ప్రజలఁ భరింపనోపక బ్రహ్మతోనైన, వినిపింపకున్న నుర్వీత నసాటి
తానిట్టిదనుచు నందఱినోళ్ళఁ బడకున్న, ననఘాత్మ శారద తనకు సాటి
గీ. కాని వెఱవారు తనసాటి గారివారు, గాపురంధ్రీజనవినుతి ఘనతఁ గాంచె
నమలతరకీర్తి దీన దయాప్రవృత్తి, దుర్మతి సపత్ని రామనధర్మపత్ని. 18
క. అలుకయను పేర యెఱుఁగదు, కలనామునఁ గొండియమువీనుఁ గఠిన వచనము
లక్కులనైన నెఱుంగదు తత్కులసతి సుబ్బాంబకీడె క్షోణిసురసతుల్. 19
సీ. ప్రొద్దునలేచి యిప్పుణ్యాత్మురాలి మొగంబుఁ జూచినఁజాలుఁ గలుష మడఁగ
నీసాధ్వికూఁతుల నెదురైనఁ జాలును, సర్వకార్యంబులు సఫలతఁగన
బతిమాలికొనియైనఁ బసుపింత యీ కాంత, కిడినచోఁ జాలుజక్కనలు దనియ
నీయమ్మనుభజియించి నఁజాలును, నగ్రిసౌభాగ్యసంపద వహింప
గీ. వేడ్కనీసతిగుణములు విన్నఁజాలు, వసుమతిఁ బతివ్రతలలోన వన్నె గొనఁగ
నని సమస్తజనంబుల వినుతిఁ గాంచె, సుగుణ మృదువచనకదంబ సుబ్బమాంబ 20
గీ. పతిహితంబు తనకుఁ బరమ వ్రతంబును, బతియనఁబు తనకు బహు ధనంబు
కాని వేఱ సౌమ్ముఁ గలిత వ్రతంబును, లేదుసుబ్బమకును లేశమయిన. 21
గీ. అట్టిదగు సుబ్బమపురంధ్రి యందు రామ, నావనీసురకులముఖ్యుఁ డష్టపుత్త్రి
బహుధనంబన్న యట్టులఁ బడసె వసుస, ద్గుణులఁ బుత్త్రుల నెనమండ్రి సిద్ధయశుల.
క. అందఱు సర్వజనప్రియు, లందఱు సుందరులు సాధులందఱు మఱివా
రందఱు సత్యవచను ల, య్యందఱు దృఢమతులు వారి కందరు వేల్పుల్. 23
క వీరికిఁ దోఁబుట్టువులై, నారీమాలికమణిన్మైన వరసమయుఁ బురం
ధ్రీరత్నము బ్రహ్మమయును, జానుమతీ సుమతులనఁ బ్రశస్తిఁ గనిరిలన్. 24
వ. అట్టివిశాలయశస్సంతానపరిష్కృతదిశావళకంబగు రామన సంతానదశకంబునకు నగ్రజుండై 25
క. ఘనవిద్యాయోగతమహి, తనయాంచితపాలనాముదంబు లిర ధ
ర్మనిరూఢి నెల్ల గుణముల, జనకుని గతి గంగన కృతి జగతినుతిఁ గనుగా. 26
సీ. అష్టాదశపురాణ తుష్టిసూతుఁడు సాటి, క్రోధశాంతికిఁ గుశికుండు సాటి
యతిథిపూజారతి నలముద్గలుఁడు సాటి, నిందుమతికిఁ గుచేలుండు సాటి
యద్వైతమతసిద్ధి కవనివ్యాసుఁడు సాటి, పటుజ్యోస్యమున నార్యభటుఁడు సాటి
మృదువచోరచనకు విదురుండు దన సాటి, గురుమనీషానూరి గురుఁడు సాటి

గీ. శ్రుతిహితాచారమునఁ బ్రవరుండు సాటి, శాస్త్రధర్మములకుఁ బరాశరుఁడు సాటి
గాని వెఱవారుదన సాటి గారవంగ, నలరు హితవేషి గంగనార్యాఖ్య మనీషి. 27

క. సోదరులు పుత్త్రులన్యా క్స్, శోదరులు సహోదరులు సహోదరులు సుత
ల్సాదరము మేగురంబనఁ, గాఁదర మేయిట్టిదనుచు గంగన సుకృతిన్. 28

వ. తత్సహోదరుండై. 29

సీ. తన పితృభక్తి సంధారూఢి భార్గవ, రాము నామోదవారాశిఁ బైవఁ
దన విలేఖన విచిత్రము చిత్రగుప్తున, కత్యంత విస్మయం బావహింపఁ
దన సూనృతోక్తి సంతానము బాతశా,త్రివుకురమోద వర్ధనముఁ గూర్పఁ
దన సౌకుమార్యభావనభావజన్మున, కతనుత్వ సంతోష మాచరింపఁ

గీ. బ్రబలె వైదిక లౌకిక ప్రతతి వినుతి, బాంధవాద్భుత నిష్పత్తు పాతవిహ్వృతి
వనఘు మతి ఘనవియతి సత్యగతినిరతి, నతిసుకృతి దుష్టనికృతి వెంకన్న సుకృతి. 30

వ. తత్సహజన్ముండై. 31

చ. సముచిత వాదిసర్వజన సమ్మతచారు వినోదిమద్దల
ప్రముఖ సువాద్యమోది హరిభక్తికి నాదిపరప్రమాది సం
శమితనిజాగ్రజానుజ విషాదిజ నేంగిత వేదివీత ఖే
దిమధుర వాది సుబ్బన సుధీనగ భేది కడు న్విరాజిలున్. 32

వ. ఆతని తమ్ముండై. 33

క. రామానుజన్మగను మి, త్రామోదక వృత్తిరగ్రజానుజ భక్తి
ప్రేమాధిక తన నంతక, గౌమతి లక్ష్మణుఁడ యనఁగ లచ్చన తనరున్. 34

వ. తదనుజుండై 35

సీ. అన్నల కొకయుడు గైన దాఁటఁడు తమ్ము, లను గన్నులను గప్పికొనెను నీతఁ
డేసీమలోనియే యేకార్యములనైన, దృష్టిమాత్రమున గ్రహించు నితఁడు
చింత చే మునిఁగి కృశించువారల నైన, మృదువచోగతినగియించు నితఁడు
భూతబేతాళప్రభూతపన్నగ దుష్ట, మృగవృశ్చికవిభీతి నెఱుఁగఁ డితఁడు

గీ. సకల జనులకుఁ బరమహర్ష నిధి యితఁడు, ముఖ్య వేదాంతచర్యకు మూల మితఁడ
నల్ప చిత్రకళాపరి కల్పుఁ డితఁడ, నంగ నర్కన వెలుఁగొందు నవనియందు. 36

వ. తత్సోదరుండై. 37

సీ. పుష్కరాక్షవిహీనముఁ జొరయకుండినఁ, దగు నలభర్త కొంతతుల వచ్చుఁ
బెఱయూరఁ గోపత బిట్టుగీడ్వడ కున్న, మాద్రితొల్చూలింత మాదిరి వచ్చు

వనవాసనియతివిఖ్య గానుండిన, సువసంతుఁ డొక నుంత సవతువచ్చు
నిజపాదపరివాశకుజ నింప కుండినఁ, గమలవైరిరవంత సమము వచ్చుఁ
గీ. గాని త్ర్యంబకు చేతను గరిమ జెడిన, పంచసాయకుఁ డెబ్బంగిఁ బ్రతిమవచ్చు
ధరణిశుభలక్షణాంగక స్మరణ నితని, కనఁగ శ్రీసూర్యరావు పుణ్యనిధి వెలయు.

క. కడుభక్తిరతుఁడు సుజనను, తుఁడు బహుభాషాగతుఁడు హితుఁడు మహితుఁడు శాం
తుఁడు సూనృతవ్రతుఁడు నియు, తుఁడు నాఁగను సూర్యరావు స్తుత చరితుఁడౌరుక్.

వ. తదనుజన్ముండై. 40

శా. కామక్రోధవికారహారిలలితాంగశ్రీసముంచత్ప్రభా
కామక్రోధవికారి కారి మృదువాక్యస్వైరిసత్సర్వభా
షాముద్రాంకుర గుంభనాపటిమ భాషామానినీ హారయా
శ్రీమత్సుందరసూరిసూరిపరిమత్సేవ్యుండు బొల్చుంగడున్. 41

వ. ఆతని తోడంబుట్టువై. 42

ఉ. ఆనయము న్భయంబు వినయంబు మితప్రియవాక్యయుక్తిని
జ్ఞానము సూక్ష్మబుద్ధి సదసత్పరిభావనవిష్ణుభక్తి సం
ధానముఁ జారు గానము విధానము నీక్రియ నెవ్వారికిం
గానము వేంకటేశ్వరుఁడ గణ్యుఁడు నాఁబొగడొందు నెంతయున్. 43

సీ. ఏతల్లి గన్నదో యీసుకుమారుల, నని చూచువారు ప్రత్యభినుతింప
నాయమ్మ సంతాన మందఱు నందఱె, యని సర్వజనములు వినుతి సేయఁ
గన్నవారలు నోఁచి కొన్ననోముఫలంబు, వళె మె వర్ణింప నెవ్వరికి ననఁగఁ
దండ్రి యట్టులఁ గాక తనయుల వృత్తి వే, ఱొందు సేయని బంధుబృంద మలర
గీ. వీరలెదిరిని మదికంద నీరసంగ, వీరుకలనైనఁ గల్లలు పినరనంగ
వీరు మనవలదే పదివేలకనఁగ, వలయుదురు జిగిమరులు రామనకోమరులు. 44

సీ. బీదల ననదల సాదుల రోగుల, గనుగొన్న యంతన కనికరింతు
రట్లు ప్రేమించి తారమ్మను వడియైన, నర్థ్యయ మొనర్చి యాదరింతు
రొకరుగానని వ్యయం బొకరు సేయరు చేసి, రేని యదేమని యెన్నఁడడుగ
రడుగకున్నను డాఁప కంతయు వినిపింతు, రట్లు చెప్పిన విని హర్షులగుదు
గీ. రహహ యీసోదరుల ప్రసాదాభిముఖ్య, మర్ధవాంఛావిరాహిత్య మైకమత్య
మమిత సజ్జనసాంగత్య మధిక సత్య, మరయ పాండుతనూజుల కైనఁ గలదె. 45

క. మాయూరికి రావలదే, మాయింట వసింపవలదె మముఁ గవవలదే
మాతోడఁ బలుకవలదే, యీయన్నలుఁ దమ్ములనని యెంతురు జనముల్. 46

వ. అట్టి మహామహనీయాభివర్ణనీయసుగుణసంతానంబును, సంశ్రిత దీనసంతానసంతానంబునగు రామన పుణ్యసంతానంబునం జతుర్థపుత్రుండనగు నేను. 47

గీ. పరమభక్తిని దుష్కరప్రాసకంద, సూర్యశతకంబు విరచించి సూర్యదేవ
తాశిరోమణి కర్పించి తద్దయావి, శేషమాధుర్యకసుధాప్రసిద్ధి మఱియు. 48

షష్ఠ్యంతములు.

క. వ్యాసాదిముని మనోజ్ఞా, వాసునకుం దాసలోకవాంఛితఘటనో
ల్లాసునకున్ దుష్టజన, త్రాసునకుం బృథుమనోహరవిలాసునకున్. 1

క. అక్షిగతరాక్షసోత్కర, శిక్షున కసద్వృక్షునకుఁ బ్రసిద్ధతితిక్షా
పేక్షునకు దక్షునకుఁ బ, ద్మాక్షునకు వేంకటాచలాధ్యక్షునకున్. 2

క. చిత్రచరిత్రునకు జగ, న్మిత్రోత్పలమిత్రసుహితనేత్రునకసద్వృ
గ్గాత్రునకుఁ బవిత్రునకరి, జైత్రునకు స్వభక్తకవికలసచ్ఛత్రునకున్. 3

క. శీలునకున్ జలధిసుతా, లోలునకుం దుష్టధీకలోలునకుఁ బ్రభా
జాలునకు న్నుతలోచన, ఫాలునకు న్సర్వలోకపరిపాలునకున్. 4

ఉ. హారికిరీటచారుమణిహారికి సన్నవహారికిల్బిషా
హారికి దుష్టసర్పఫణిహారికి నాశ్రితపూరుషప్రతీ
హారికి వేంకటాచలవిహారికి వారిధిసుతాసతీమనో
హారికి భక్తదోషపరిహారికి నాస్యసరోరుహారికిన్. 5

వ. పరిసమర్పణంబుగా నా రచింప దొరకొనిన దాశరథివిలాసంబను మహాప్రబంధంబునకుఁ గథాప్రారంభం బెట్టి దనిన. 6

ఆ. వెలయునఖనికరుణవిమలరామకథాప్ర, పంచ మెల్లఁ గానఁబడిన వేడ్కఁ
బ్రచురభంగిఁ జెప్పఁ బ్రాచేతసుండు శు, భక్రమంబుగా నుపక్రమించి. 7

## కథాప్రారంభము.

### అయోధ్యానగరవర్ణనము.

ఉ. సాకేతాహ్వయరాజధాని జనతాసంస్తుత్యమై నిష్కుటా
నేకానోకహసత్ఫలామృతరసాపేక్షాధికీభూతచే
తఃకాతూహలతాసమాగతపతద్రాజ్యారవప్రచ్ఛలా
స్తోకాభిష్టుతదేవతానికరమై శోభిల్లు భూభామమై.

గీ. గురువిబుధరాజనందనభరిత మగుట, శుభ్రితునగాధ్రిమాతంగశోభిత యగుట
విమలభాసురవాహినీభృత్తి యగుట, నరయఁగ ధరామరావతియగు నయోధ్య. 2

గీ. చంపకోత్పలమాలికాసహిత మగుచు, వాట మగు నాటవెలఁదుల తేటగీత
ములమహోత్సాహమత్తేభముల నయోధ్య, కృతియుఁ బోలె మనోహరాకృతిఁ దనర్చె.

మ. తలపం దత్పురరాజసౌధములు ప్రోద్యత్పర్వతోత్సేధము
ల్లలజాతాప్తపథావరోధములు గోసంబాధము ల్సాంతతా
కలితానర్ఘ్యమణీసనాథములు సగ్రప్రస్ఫుటాలేఖితా
ఖిలగంగావరరోధము ల్వృతబృహత్క్షేమోదకాగాధముల్. 4

ఉ. అప్పురసౌధమండలరు నబ్జముఖీముఖసౌంవపరిభం
దప్పక కాంచి లేనెల మదంబునఁ సాస్యము నొందఁగోరిసాం
పొప్పఁగ నంత షోడశకళోజ్జ్వలుఁడయ్యును దన్ముఖప్రభం
జొప్పడలేక సిగ్గునఁ గృశుండగుచుండుఁ గ్రమక్రమంబునన్. 5

క. సగరుల తాతలచేతఁ బో, సఁగి యొరుచేపడక భంగసంగతిలేమిం
దగు పరిఘఁ బోల్పవచ్చునె, యగస్త్యుచే పడి సభంగ మగు సాగరమున్. 6

మ. సరియానిప్పురి వియ్యమందెడ భవిష్యత్కాలమందుంచును
ర్వరతచ్ఛోభనవీక్షణోల్లసితయై రానన్మహాదేవిసం
భరియింపంగులపర్వతాళి దిగిభవ్రాతంబు రాఁబోలుఁగా
కరదంబు ల్ద్విరదంబు లేపురమునం దారీతిఁ గన్పట్టెనున్. 7

వ. మఱియును.

మ. వరదంతద్యుతివిద్యుతి ప్రచయము ల్బాంకారగర్జాధ్వని
స్ఫురితంబు ల్నిరతస్రవన్మదజలంబు ల్పర్వతోత్తుంగసు
దరనీలద్యుతిసద్గతిప్రకరవిస్తారంబునం బోల్చి సిం
ధురసంతానము లభ్రముల్దలఁచి సంతోషింపఁ గానప్పురిన్. 8

సీ. అవిదితవిగ్రహుం డై బయల్జరియించు, వానివాహ్యాళులజవం బ దెంత
జడధిలోఁ బ్రభవించి స్వర్గమందు చరించు, వారిహయహయసంద్రయుం బ దెంత
ఘనతఁ గాంచియుజని చనిహీనతవహించు, జలదావిలఁ బిత చర్య యెంత
చతుర్శ్రవోసహ్యాచారి యై మిఱుఁ న, నూరుతమ్ముని త్వరా నూన మెంత

గీ. యనుచు రణవిదితులకు వాహ్యంబులగుచు, జడతవుట్టక దళతళల్పంచరించు
చునగడుంజని హీనతఁ గనక కనఁగ, వినఁగ యోగ్యతఁ గొఱలున వీటిహయములు.

క. పరుఁ డయ్యె నేని నీలాంబరుఁ డైన న్విజితభూమిపరుఁ డారాడం
బరుఁడైనం గడిమిది గంబరుఁడైనం జెనకుదురు సుభటులాపీటన్. 11

క. చతురాస్యులు వాగీశులు, నతిశయపద్మాసనాదికాసక్తులు భూ
స్థితికాధారులు సత్యా,శ్రితులప్పురి విప్రులు విరించిసమానుల్. 12

చ. మహితలలాటలోచనులు మారజితాత్ములు సర్వమంగళా
వహులు శివాంకులు న్సవనవర్ధనులుం ఘనపుష్పధారులు
న్విహితమహోభ్రికేళులును భీములుఁ గాంచనశైలధన్వులై
రహివిహరింతు రప్పురవరంబున నెంతయు రాజశేఖరుల్. 31

మ. తలఁపం దొమ్మిది పెన్నిధుల్ గలిగి మిత్రక్షుద్రిత వ్యాన్ప లేఁ
డల యక్షేశుఁడు చూడ నజ్జడధి నానాంచన్నిధిప్రాప్తుఁడై
పొలుపుం జెందియు నప్పులంగలఁ గడుం బోయించు నవ్వీటి వై
శ్యులు హాసింతురు లెక్కలేనినిధులన్ శుంభద్గుణోజ్జృంభతన్.

క. భద్రులు నిరతాపాస్త, క్షుద్రులు భూదేవనికర శుభశుశ్రూషో
న్నిద్రులు నిరుపద్రులు ధై,ర్యాద్రులు వణుగుణసముద్రులప్పురిశూద్రుల్. 15

సీ. రంభమ త్రపబలోరు రామణీయత గాంచి, యోడినిస్సారత నొందవలదె
శశిరేఖము న్ముఖసౌషమార్యముఁ గాంచి, కృశత నానాఁటికి నివురవలదె
హేమాభిధానమ ద్రామాంగరుచిఁ గాంచి, నిశ్చేష్టయగుచు వహ్నిఁ జొరవలదె
హారిణీసమాఖ్యము దాలోకనములు గన్గొనిచిక్కి కసవేటి తిరుగవలదె

గీ. యమరు సౌదామనిమదీయమైన సోయగంబుఁగని డాఁగి చలనంబు గాంచవలదె
యనుచు విహరింతు రప్పురి నతిచలితసు, ధీజనములగు వారనారీజనములు. 16

సీ. నసఁ బోణి వినుమెత్తుకొనఁగ వాక్ప్రటంబు, దక్షిణసంపత్తియుం దట్టికి మూల
మలివేణి వలపులు సిలికెను నీకొమ్మ, తనుమధ్యసుమనస్త్వంబు కలిమి
రమణిగన్గొనఁగ నాకుముదంబు దనరారెఁ, గరమను రాగంబు గాఁగఁ గొనుము
పున్నాగములనేల పొందవు మృగువాణి, యొట్టికిఁ బొగడరం జిల్లుమండ

గీ. నాలిశుచగుచ్ఛములనేల యంటనీవు, వేలయుం బెదు చౌకగా నీవనంగ
ననుచు నర్మోక్తులాడుచు నవపుకాంత్రశఁ, బువ్వులమ్ము రమణులు నప్పురిఁ బొలుతురు

గీ. ఉరురతిక్రాంతపౌర పయోజముఖుల, చెమటలార్పంగఁ బోయివచ్చెడు శతమునఁ
గరువలిత దంగపరిమళకలితుఁడగుట, గంధవహుఁడయ్యె దొల్లి నిర్గంధుఁడయ్యు

వ. మఱియు ననంతకల్యాణంబై భోగవతీపురంబును, ద్విజరాజమనోహరంబై హరజటాజూటంబును, శారదారామంబై సత్యలోకంబును, శైత్యకరంబై చంద్రమండలం.

బును, రాజకుమారాగ్రేసరంబై కైలాసంబును, సుధర్మాన్వితంబై నాకలోకంబును, బద్మానుకూలంబై కమలాకరంబును, కమలాకరంబై విష్ణువక్షఃస్థలంబునుంబోలి, పుణ్యజనసుప్రవేశంబయ్యును బుణ్యజనసుప్రవేశంబు గాక, అనవరతదానధారార్ద్రింబయ్యును ననవరతదానధారార్ద్రింబై యొప్పు నన్నగరీవరంబు నందు. 19

శా. ఆదిత్యత్రిచరిత్రుఁడై జనుల కత్యానందసంధాత యై
యాదిత్యప్రభువైభవోజ్జ్వలుఁడు నై యాదిత్యవంశోత్తరుం
డైదిత్యాత్మజవారఘోరతరబాహావీర్యుఁడై భూమి దే
వాదిస్తుత్యవిలాసుఁడై దశరథక్ష్మాధీశుఁడే పారుమన్. 20

సీ. ఇనగోత్రవరుఁడీతఁ డని వచింపఁగ నేల, ప్రబల ప్రతాపనై భవము తెలుపుఁ
దగుసార్వభౌముఁ డీతఁడని యాడఁగ నేల, దానకంకణసుహాస్తంబ తెలుపుఁ
దనరుమహాబలుం డని చెప్పఁగా నేల, వారికృతనిరతస ఖ్యంబ తెలుపు
రాజశేఖరుఁడంచు రహిఁ నుతింపఁగ నేల, ద్విజరాజసుమనస స్థితియ తెలుపు
గీ. నితఁడు కేవలమహితుఁడని యెన్న నేఁ, డంబుమీఁలక గ్రహణంబ తెలుపు
ననఁగ నొప్పె సఁగెఁబలాయి తాఖిఁగారి, పఙ్క్తిరథుఁ డగుచున్న యప్పార్థివుఁడు.

గీ. నిక్కముగ దస్యుని చయంబు నుక్కడంచి, నిక్కముగ దస్యుని చయంబు నుక్కడంచు
వేడ్క విబుధులపూజగావించినతఁడు, వేడ్క విబుధులఁ బూజగావించునతఁడు.

క. శూద్రుఁడు లేఁ డొకఁడైనన్, శూద్రుఁడు లేఁ డొక్కఁడైనఁ జూడం జూడన్
క్షుద్రుఁడు లేఁ డొకఁడైనన్, భద్రంబుగ నాతఁ డేలు పట్టణ మందున్. 23

ఉ. ధారుణి లోకమెల్లఁ బ్రమదస్థితిఁ దన్నొనియాడ నీతి బా
ధారహితత్వమొందియును దప్పవుపో యణిగ్నృష్టు లెందు నా
ధారము లేమి శత్రువసుధావరుమానవతీక్షణంబునన్
ధారలుగట్టి మద్దశరథక్షితినాయకు రాజ్యసంపదన్. 24

క. ఎంతయును సంతసమున మతి, మంతులు గొనియాడ నంతమంతుని పృథసా
మంతశిరోంతలతాంతని, తాంతమహోజ్జ్వలలసత్ప్రాంతియఁ దగుమన్. 25

చ. రమణవివాహమయ్యెరుచిర ప్రభఁగోసలరాజకన్యన
గ్రమహిషిఁ గానరేంద్రుఁడు కరగ్రహణంబొనరించెఁ దాఁగ్రమ
క్రమమునఁ గేకయాత్మజనకణ్యచరిత్రసుమిత్రనుంబరా
క్రమవిధియై యరాతులనఁగ న్వినఁగంబడ కుండఁ గందగన్. 26

వ. ఇట్లు కౌసల్యాకైకాసుమిత్రలం బాణిగ్రహణంబొనరించి. 27

క. తద్దయు వేడుక మువ్వురు, ముద్దియలం గూడి భోగములు సల్పుచు నొం
డెద్దియును మఱచియుండం, బెద్దయుఁ గాలంబుచనె నిమిషమాత్రంబై. 28

గీ. ఈతి రహితంబు గాఁగనీ రీతిసంత, తక్షమాన్వితుఁడై నిరతక్షమాను
పాలనంబున శత్రు విఘాలనమున, నొప్పిని స్సంతతికిఁ గడు నొప్పి గదుర. 29

క. సంతానము బితృవరులకు, సంతానము గాన నాకు సంతానములే
దెంతయుఁ బితృదేవులకున్, సంతోషము సేయలేని జన్మం బేలా. 30

ఉ. దానము లెన్ని యేనియును ధర్మములుం దగునట్లు సల్పితిం
దానముదంబు లేదు విహితంబగు భోగము లెన్ని యేని సం
తానసుఖంబు వోలు నెఘనంబుగ నాకుఁ దదాప్తి కిఁ బ్ర సం
తానసమర్చనాంచితవిధానముచే నగునంచు నెంచుచున్. 31

క. వెస నూహించి సుమంత్రా, దిసుమంత్రులతో నరుంధతీప్రియుఁ డసదా
భ్యపితామ్నాయుఁడునగు న, వ్వసిష్ఠుఁ గురుఁ జేరి మ్రొక్కి వాంఛితమారన్. 32

క. హితుఁడవు నదిగాక పురో, హితుఁడవు నంచద్దయు సహితుఁడవు బాపా
హితుఁడవు నతిసుగుణగణము, హితుఁడవు నీకీడుగలరె యెందుమునీంద్రిల్. 33

క. మిత్రుఁడవగు నీకరుణకుఁ, బాత్రుఁడనై యుండి దుర్లభస్థితి నాకుం
బుత్రరహితతిమిరవిహృతి, చిత్రము సేయుంగదా వసిష్ఠమునీంద్రా. 34

వ. అనిన నఖిల గుణగరిష్ఠుండును మునిశ్రేష్ఠుండు నగు వసిష్ఠుం డిట్లనియె. 35

ఉ. ఏధితకీర్తి నీకుఁ దగునే యిటు దీనతఁ గుందను త్తప
స్సాధితశక్తిచే నిదె ప్రసాధితసద్గుణభూషుల న్మహో
బాధితశత్రుల న్సుతుల భవ్యులఁ గాంచి సుఖింతు వింకని
ర్వ్యాధితచిత్తవృత్తి నొనరింపుము భంగతురంగమేధమున్. 36

క. అనిపలుకఁ దనమనంబున, జనియించిన కోర్కెకదియు సమమైనమనం
బునఁ బొంగుచు నెలమిం ద, జ్జననాయకుఁ డశ్వమేధ సవనోన్ముఖుఁడై. 37

మ. సరయంబారఁగ మంత్రులార వినుఁడీ శాస్త్రప్రకారంబున
న్సరయూపుణ్యనదీ సమీపమునఁ బ్రజ్ఞావంతులై మీరు భా
స్వరయూపంబులు నిల్పి శాలలయు సంభారంబులం గూర్చి యా
శరయూధాధికవిఘ్న మేమఱకరక్షాతత్పరత్వంబునన్. 38

ఆ. మించియజ్ఞవాటు మంచితంబుగ నొన, రించి యశ్వవరము నెంచి సంభ్ర
మించి సద్విధి విడిపించి మానుల బిలిపించి యుండుఁ డని వచించి నృపుఁడు. 39

ఉ. వేచని కాంచెఁ గాంచన నివేశవినూత్నవిరత్నరత్నశో
భాచయరోచ మానమృదువస్త్రఘనస్థగితోద్ధకుట్టిమాం
తోచితసుస్థితి ద్విపభిదోద్యమదక్షసుతాప్తిహేతుధ
ర్మాచరణైకయత్నుల దురాత్మసపత్నుల ధర్మపత్నులన్. 40

గీ. కాంచి యిట్లు సుపుత్రులఁ గాంచుకొఱకు, నిష్టియొనరింపఁ దీక్ష వహించినాఁడఁ
గాన మీరును వేడ్కఁ దీక్షను వహింపుఁ, డనిన ముదమంది దీక్షిత లైరి వారుఁ 41

గీ. కాంతలును దానునిట్టు లేకాంతదీక్ష, సంతసంబునఁ దాల్చి వసంతమునకు
నెదురుచూచుచునుండఁ గట్టెదుర భూమి, కాంతునకు సూతుఁడనియె నేకాంతముగను.

సీ. మహినాథవిను మవగ్రహబాధమును రోమ, పాదుదేశంబునఁ బాదుకొనిన
నయ్యంగపతిప్రజ ల్డయ్యుంగఁ గనుఁగొని, హితమంత్రిజనపురోహితులతోడ
మనవిషయమునకే మనకిట్టిదురవస్థ, వాటిల్లెడిని నెప్పాటఁబాపి
కొనవచ్చుఁ జెప్పరే గొనకొని మీరిప్డు, డనవుడు వేగ నయ్యనఘమతులు

గీ. దమమనంబుల నీతిబాధానిరాస,కంబు సేయుంగ జాలుమార్గంబుఁ జాలఁ
బోల నూహించి యమ్మహీపాలవర్యుఁ, డెంతయును సంతసింపఁగా నిట్లు లనిరి. 43

క. కశ్యపపౌత్రుఁడు శివసా,దృశ్యుండు విభాండకాత్మదేహభవుం డై
వశ్యేంద్రియనిచయుం డై, ఋశ్యవిషాణుఁడునా మునీంద్రుఁడు వెలయున్. 44

క. ఘనపూర్ణమహాతేజుఁడు, వినుసన్మార్గప్రచారి విమలాత్ముండున్
ఘనుఁ డఖిలభూతహితుఁ డా,తని నిట రప్పింపుము విబుధస్తుత వేడ్కన్. 45

క. ఆతఁ డిట కేగుదెంచిన, నాతతవర్షములఁ గురియు ననవుడు వారిం
బ్రీతిం గనుఁగొని యాతని, వేతే దక్షు లబలలని వినినకతమునన్. 46

క. భూవరుఁడు బిలువనంపినఁ, గైవారము సేయుచు సముఖమునకుఁ గన్నా
కై వారస్త్రీవారము, రా వారలఁ జూచి యంగరాజి ట్లనియెన్. 47

చ. అనఘుఁడు ఋశ్యశృంగుఁడు మహాముని ఘోరతపంబు సేయుచు
న్వనమున నున్నవాఁ డతఁడు వారు లతాంగులు వీరు పూరుషు
ల్వన మిది పట్టణం బిది ధ్రువంబుగ నంచు నెఱుంగఁ డమ్మహా
త్ముని నిటఁ దోడితేవలయు మోద మెలర్పఁగ మీరు నావుడున్. 48

సీ. ముఖపంకజామోదమునకు మూఁగుచు నున్న, భ్రమరకంబులు భ్రమరకము లనఁగ
నడఁ గాంచి యంఘ్రుల వడిఁ బెనంగొనుహంస,కములు విస్ఫుటహంసకము లనంగ
శుకచంచుపుటనికృత్తకమహీపతితప,ల్లవములు చారుపల్లవము లనఁగ
నటనశ్రమోద్భూతపటుఘర్మబిందువి,సరములు ముత్తెంపుసరము లనఁగ

గీ. జిమ్మిపట్టెడు నెడఁ బైటఁ జిక్కు పూల,చెండ్లు సిబ్బెపుగబ్బిపాలిండ్లనంగ
నిట్లు సేయ నిశ్శృంగార మింపుసేయ, మునివృషభుఁ జేర సురభు లై ముదిత లపుడు. 49
గీ. దంతకుట్మలములఁ బృథుస్తనగుళుచ్ఛ,ములను కరపల్లవంబులఁ బొలుపుమీఱ
సితనఖకుసుమంబులను బాహులతలఁ జెలఁగఁ, గొమ్మ లనొప్పి నడిచి రక్కొమ్మ లపుడు
మ. పులినశ్రోణులఁ జక్రవాకకుచ లుత్ఫుల్లాబ్జపత్త్రాస్య లు
త్పలగంధు ల్వరకంబుకంఠులు లసత్పాఠీనదృగ్జాల లై
యొలయం గశ్యపపౌత్త్రుఁ డుత్తమతపం బేవేళఁ గావింప ను
జ్జ్వల మౌ నవ్వనరాశికిన్ నదులయోజం జేరి రబ్జాక్షిమినుల్. 51
శా. కీరంబు ల్పలరేఁగి కూయ మునిసాంకేతంబునుం గూర్చి వి
స్తారోదారకుచోల్లసత్కచమహాభారనతస్వాంగ లై
యారంబు ల్వడిఁ దూఱి డాఁగుచు మృగాహీనధ్వను ల్వించు శృం
గారం బొప్ప వరాభిసారిక లనంగా నేగి రచ్చెంతకున్. 52
క. శృంగారవతులు వేడుక, సంగీతరవంబు సెలఁగఁ జని కాంచిరి ని
ష్పంగున్ భూతియుతాంగున్, శృంగారానంగు ఋశ్యశృంగు నభంగున్. 53
క. కని తాపసు లతికోపన, లనియును గినిసిన శపింతు రనియు నెఱిఁగియు
న్మునికడకు నశంకిత లై, చని రబలలు దలఁప నధికసాహసలు గదా. 54
ఉ. ఈగతి నేగుదెంచిన మునీశ్వరుఁ డెంతయు సంతసించుచు
న్వాగమృతంబునం దనిపి వారికి నర్ఘ్యముఁ బాద్యము న్లస
ద్వేగముగా నొసంగి కడువింతతపస్వు లటంచు వారితో
నాగుణశాలి పల్కె వినయంబు నయంబు భయంబు మీఱఁగన్. 55
క. ఎక్కడివారలు మీ రీ చక్కటి కేతెంచుటం బ్రశస్తుఁడ నైతి
న్నిక్కము నామతి మీపై జిక్కె న్మీతోడఁ గూడి చేయుదు నెల్లన్. 56
చ. అనుచుఁ గుచంబు లంటుఁ బొగరారువిషాణము లంచుఁ గామినీ
జనత సుమధ్యము ల్వణుకు సన్నము లంచుఁ దదాస్యగంధ మిం
పునెఱయఁ గ్రోలు నెంతయు నపూర్వ మటంచును మించుఁ గ్రొమ్ముడు
ల్గాను నతివింత లంచుఁ జటిలుండు గడుం జతురుండపోలుచున్. 57
సీ. ఉన్నంత నతనితో నన్నెలంతలు ముని,నాథ మాపుణ్యావనంబునకును
జనుదెంతు గాక నీ వని మఱియును గొను, మని యాతనికి మనోహారము లైన
యాంబరంబులును భక్ష్యంబులు లేపన,మ్ములు నొసఁగినఁ గొని మునివరుండు
నిట్టివల్కలములు గిట్టెఫలంబులు, నిట్టిభూతియు నెన్నఁ డెఱుఁగ

ఆ. అనుచు విస్మయాత్ముఁ డైనయామునిబాలుఁ, జేర నరిగి వారనారు లపుడు
వలసివచ్చినట్టి వనదేవత లనంగ, బలసి భూషణప్రభలు వెలుంగ. 58

చ. కుచము లురంబునం గదియఁ గ్రుమ్మి కవుంగిటఁ జేర్చి మోవిపా
కచయమువోని వేణుల భృశంబుగఁ జుట్టుచుఁ బల్లవోల్లస
ద్రుచిరుచిరాధరంబుఁ గరతోయజముల్గఁ జాఁచిముట్టుచు
న్విచలితధైర్యుఁ జేసి రరవిందనిభానన లీక్రియంబునన్. 59

వ. అంతం దమయుఁడు బద్ధానురాగుం డగుట యుపలక్షించి యచ్చంచలాక్షులు మబ్బుం
జొచ్చుమించులంబోలె వంచనం దొలంగించి చనుటయు 60

ఉ. ఎప్పుడు వత్తురో యనుచు నెంతయు వారల సన్నమార్గముం
దప్పనిచూడ్కిఁ జూచు టిది తప్పనియెంచక యగ్నికార్యముం
దప్పని యమ్మహాత్ముఁడు మదంబునఁ దద్గుణకీర్తనంబులం
దప్ప నితఃపరంబు మదిఁ దార్పకయుండె ససంభ్రమంబునన్. 61

క. ఆత్మభవసదృశుఁ డమ్ముని, యాత్మభవవికారరహితుఁ డైయుండియుఁ దా
నాత్మభవారివిభాండకు, నాత్మభవుఁడు డస్సె విచలితాత్ముం డగుటన్. 62

క. మరునాఁడు చెలఁగుచును వేఁ,మరు నాడుచు మానికడకు మగువలు త్వరతో
నరుదెంచిరి యరుదెంచుట, యరుదెంచుట విమలఖరకరాన్వయముఖ్యా. 68

వ. ఇట్లు వచ్చుటయు.

క. నిధిగన్న పేదవోలెన్, బుధనుతుఁ డన్నియమివారిఁ బొడఁగాంచి యపూ
ర్వృథతేజుఁ డిట్టులనుఁ దద్గ్రథితమనోగ్రంథి యగుచు దైన్యము దోఁపన్. 65

చ. ననువిడనాడ న్యాయ మగునా మిము నమ్మినవాఁడ నంచుఁ బ
ల్కిన నగుఁగాక య మ్మనుచు లేనులు చిల్కను బంజరంబుఁ జే
ర్చినక్రియ నమ్మహామహుఁ బ్రసిద్ధగుణాస్పదరోమపాదకుం
భినిపతి పట్టణోత్తమసమీపఘనోపవనోపకంఠమున్. 66

క. వార్షముగఁ జేర్ప నత్యు,త్కర్షముగా నెల్లయెడలఁ గరశాయుత మై
వర్షంబు దేవతానుమ,వర్షముతో నెనసి కురిసె వసుమతి యలరన్. 67

ఆ. అంత రోమపాదుఁ డాప్తమంత్రిపురోహి,తాదిసుజనసహితుఁ డగుచు భక్తి
నెదురు సని విధి సువిహితపూజ లొనరించి, వేడుకలరఁ బురికిఁ దోడితెచ్చి. 68

ఆ. సంతసమున విప్రసంతర్పణ మొనర్చి, వరపురమున నుత్సవంబు చాటి
వారముఖ్యలకు నపారవిభూషణాం,బరములొసఁగి వినయభరితుఁ డగుచు. 69

క. మునిపతికిఁ బెండ్లిసేసెం,దనరఁగ సద్గుణనితాంతఁ దనసుతశాంతం
దనుగంధజితలతాంతం, జననివహాభినుతమహితశాంతస్వాంతన్. 70

వ. ఇట్లు పరిణయమహోత్సవంబు నిర్వర్తించి జామాతం దన యింట నునిచికొని యనావృష్ట్యాదిభయంబులు నిజరాష్ట్రంబునకుం గాకయుండ రోమపాదుండు సంతోషితుం డైయుండె నని చెప్పి సూతుండు వెండియు.

ఉ. స్పష్టగుణాకరుం డగువసిష్ఠుఁడు తో నరుదేర నెంతయుం
బ్రేష్ఠము గాఁగఁ బాండురవరిష్ఠయశోనిధి ఋశ్యశృంగు బం
హిష్ఠముగా నుతించి తగ నిక్కడకుం దోడితెచ్చి హెచ్చు సా
ధిష్ఠము గాఁగఁ దద్దయ విధిం దనయేష్టి యొనర్చి చెచ్చెరన్. 72

గీ. ఆత్మజాతుల నలువుర నతులబలుల నిర్జితారాతులం గని యూర్జితముగ
నలరెదవని సనత్సుజాతాగ్రజాతుఁ డనియె నని చెప్పుటయు దశస్యందనుండు.

గీ. సూతువాక్యామృతము దన శ్రుతిపుటములఁ, దనివిసనక నరేంద్రుఁ డెంతయునుఁ గ్రోల
హృదయకుహరంబు నిండి పై కెగయుచున్న, వంసుధాధార అనఁ బాష్పఝురులఁ దనరి.

సీ. హితమంత్రిజనపురోహితసహితంబుగాఁ, బటుతరోద్భటవీరభటులు గొలువ
మంగళరవము సెలంగ నుత్తుంగతు,రంగతరంగమతంగజాంగ
మకరనికరభీకరకరాసిదర్వీక,రసుఖేటకమరవిభ్రాజితంబు
లైనవాహినులు దన్ననుసరింప రసాధి,నాథుండు సంగీతనాదముల న

గీ. గణ్యపుణ్యాగ్రజన్మాగ్రగణ్యవిహిత,సాదరాశీర్నినాదము ల్మెదురముగ
రోమపాదధరాధీశ్వరునిపురంబుఁ, జేర నయ్యంగపతి సవిశేషభక్తి. 75

క. మన్నించి మీరువచ్చుట, మన్నిలయము పూజ్య మయ్యె మహనీయగుణా
ధన్యు న్నిన్నుఁ జూడఁగఁ గంటిఁ గ,డు న్నిర్మల మైె తనర్చెడు న్మది నాకున్. 76

క. ఆగమచోదితధర్మవ,రాగమమూలానుకూలయతిధైర్యనువ
ర్గాగమనోమోదము భవ,దాగమనంబునకు మూల మది యెయ్యదియో. 77

క. అనతియిం డా కార్యము, ఘనతరిపులోక దశరథాధీశ్వర స
న్మానముతో నొడఁగూర్తు, న్మానక యది యెంతయఘటమానం బైనన్. 78

క. నావుడు సత్యవ్రత విను, మీవంతటివాఁడ వగుట యే నెఱిఁగియు కా
దే వచ్చితి వినిపించెద, నావచ్చినకార్యసరణినరనుతచరితా. 79

ఉ. భీతృణగావసావకుఁడు వేదవిధిజ్ఞుఁడు సాధితేద్ధవి
ద్యావ్రతశుద్ధస్మృతి సహాంహృతిదూరుఁడు నిర్మలాత్ముఁడన్

ధాతృనిభుండుఁ గశ్యపవిధాతృసుతాత్మభవుండు నీరుజా
మాతృఁడు ఋశ్యశృంగుఁ డసమానుఁడు మానవవంశదీపకా. 80

క. ఆతనిఁ గొనిపోవుటకై, యేతెంచితి నమ్మహాత్ము నెలమిం దారా
న్వీతుని గా మత్పురమున, కాతతగుణ పనుపు మిది ప్రియం బగు నాకున్. 81

చ. అనవుఁడు సంతసించి తనయల్లునిఁ గన్గొని భక్తిఁ దద్విధం
బు నుడివి యాతఁ డియ్యకొన భూవరుఁ డెంతయు సన్నుతింప న
య్యనఘుని ఋశ్యశృంగుని నిరంతరవర్షసమృద్ధిభూమిపం
కనిరసనాథ మంపె ననఁగా నతఁ డంపె జగద్ధితంబుగన్. 82

క. శాంతాత్ము ఋశ్యశృంగుని, శాంతాసహితముగఁ దెచ్చి జననాయకుఁ డా
శాంతాపూరితహృదయుఁడు ని,శ్శాంతము సొత్తెంచె సకలజనములు వొగడన్. 83

గీ. శాంత నంతఃపురమునకు సంతసమున, ననుప నమ్మునిపత్ని కయ్యధిపపత్ను
లెదురు సని మ్రొక్కి యయ్యుచు కిష్టమెసఁగ, భక్తి సేయంగ నుండె నప్పరమసాధ్వి.

వ. దశరథుండును ఋశ్యశృంగసందర్శనసంభావణంబుల సంభావితుండై యుండె. 85

ఉ. చాల ముదంబు సేసెను విశాలరసాలకిసాలలోలపై
శాలము వల్లరీస్థమధుపాళిభరానమితోల్లసల్లతా
జాలము సౌఖ్యమూల మురుసౌరభసంయుతమందమందవా
తూలము ప్రాణసుకూలము సుత్యగ్గామమాధవకాల మంతటన్. 86

సీ. మాధవురాకకు మానితామోదయై, నవవనలక్ష్మి జీర్ణచ్ఛదములు
తగ వని నూత్నచ్ఛదము లోలి ధరియించి, హస్తము ల్సాఁచి రమ్మనుచుఁ బిల్చు
చున్నదో యన సుగంధోద్భాసి యై పండు, టాకు లూడిచి తలిరాకు లెలమిఁ
దనరఁ బికాళిబృందంబు లందందయా,నందంబు నొంది ధ్యానములు సేయ

గీ. నొనరె మతియును దత్సంగ ఘనసుఖమున, నొదవుపుల్కలచాలునా నొప్పుమీఱె
నమలనిజరుచివిజితనీహారకేద్ధ,తారకము లగునభినవకోరకములు. 87

గీ. శ్యామ యల్పతరుస్కంధసాక్రమణము, గాదనుచు వేడ్క ఘనతరుస్కంధ మెంచు
ననఁగ నల్పతరుస్కంధసాక్రమణము, గాదనుచు శ్యామమున తరుస్కంధ మూనె.

క. కమ్మని తెమ్మెరలుం జుం, జుమ్మనుతుమ్మెదలు స్ఫుటవిశుద్ధతరమనో
జ్ఞమ్ము లగుసుమమ్ములు గడు, నెమ్మిలు గులుకఁగ వసంతమిమ్మెయిఁ దనరన్.

వ. దశరథుఁడు ఋష్యశృంగున కిట్లనియె. 90

ఉ. ఆయతకీర్తిశాలి ముదమార వసంతము డాసియొప్పెఁ జు
ష్కాకుతనంబున న్సకల మాయితచయ్యో మునీంద్రు లెల్లక

ప్యాయుతసంఖ్యులై కడు రయంబున వచ్చిరి రాజకోటి సే
నాయుత మై క్రతూత్సవఘనంబుఁ గనం బురినిండెఁ గావునన్. 91

క. నాయజ్ఞము నెఱవేర్పను, నాయజ్ఞానము సహించి నలువొందుదయన్
న్యాయజ్ఞ మునీశ్వర ప్రభు, నాయజ్ఞామాత్యులెల్ల నవహితబుద్ధిన్. 92

క. నీపంపునేసి మెలఁగఁగ, నేపార వసిష్ఠమునియు నీరలుఁ దగుపు
త్రాపాదనహయమేధవ్యాపారముఁ గను మెలఁగవలయు నటంచున్. 93

క. మునిపతి వసిష్ఠు గుణాఢ్యా, మునిపతితేంద్రియవికారు మఖరుచిజితసో
మునిపతితాదితపఃకా, మునిపతి యిట్లనుచుఁ బలికె మోదమెలర్పన్. 94

ఉ. మేధ్యముగాఁగ నన్నుహయమేధ మొనర్పఁగఁ బంచి శాత్రవా
సాధ్యుల సంతతప్రణుతసాధ్యులఁ బుత్త్రుల నిద్ధసద్గుణా
రాధ్యులఁ గాంచునట్లుగ వరంబుఁ గరంబు నొసంగుమంచు సా
న్నిధ్యమునందు వేఁడుధరణీపతిఁ గాంచి వసిష్ఠుఁ డాదృతిన్. 95

క. కాకుత్స్థాన్వయదీపక, నీకింతవిచార మేల నేఁగలుఁగఁగ ను
శ్లోకులఁ బుత్త్రులఁ బడసెదు, ప్రాకటసరయూనదీవరతటంబునకున్. 96

క. విను నీవు నీదుభార్యల, జననాయక మంత్రిపౌరజానపదుల స
జ్జనుల మునుల విప్రులఁ దోడ్కొనిచను మే ఋశ్యశృంగుఁ గొని యేతెంతున్. 97

వ. అని పల్కుటయుం. 98

గీ. రవిశిలీముఖచక్రవిభ్రాజితంబు, నై సమున్యాదగుల్మసమావృతంబు
నై హరిస్ఫురితంబు నై యలరుచుండి, న సరయూవాహినిం జేరి నరవిభుండు. 99

వ. విబుధపరివృతుం డై మహేంద్రవిభవంబున విశిష్టగుణగరిష్ఠుం డగువసిష్ఠుండును, మంగళగుణానుషంగుం డగు ఋశ్యశృంగుండును, హర్షు లగుమహర్షులును, దపోమాను లగుమౌనులును, మహానుభావు లగుమహీదేవులును, సర్వజ్ఞు లగుదైవజ్ఞులును, సారు లగుపౌరులును, జ్ఞానవిదు లగుజానపదులును, నిర్వర్తితరాజ్యతంత్రు లగుసుమంత్రాదిమంత్రులును, శాంత లగుపుణ్యకాంతలును, వ్రతైకయత్న లగుధర్మపత్నులును, వినయనిధు లగువందిమాగధులును, శృంగారాధార లగువారనారులుం దోడరా ననురూపరూపయూపప్రపాసుందరంబును, స్పష్టాష్టవదేష్టికావిరచితవేదికాఖండమండితంబును, ప్రసిద్ధక్రతూత్సవాలోకనాగతచాతుర్వర్ణ్యతదుచితనికాయ్యనికాయకాయమానసమావృతంబును, కుంభామనోహరంబును, ధనధాన్యశాలితండులఘృతతైలగుడసూపశాకతృణకాష్ఠజలప్రభృతివస్తుప్రశస్తంబును, విమలసరయూకమలానుకూలకూలలతాసాలజాలస్నానసుగంధవహగంధవాహసుప్రవేశంబును, దక్షి

ణానీతఘనాపీనసైచికీమణీగణసంభరితంబులు నై విచిత్రంబు లగుధవిత్రంబులును, పవిత్రంబు లగుసువర్ణపాత్రంబులును, నవంబు లగుస్పృక్స్వనంబులును, మంజులోల్బణ రత్నకంబళపుంజంబులును, మఱియుం దక్షిణావివిధోపకరణంబులునుం గలిగి యొప్పు నభినవసవనభవనంబుఁ బ్రవేశించి ధర్మపత్నీసహితుం డై. 100

గీ. శుభముహూర్తంబునను వసిష్ఠుఁడును బుశ్యశృంగుఁడును మునివరులును సెలవొసంగ
నగ్నిముఖు లగ్నిముఖమునసలర నప్పు, డగ్నిముఖమొనరించెఁ గ్రత్వాదియందు.

వ. తదనంతరంబున. 102

శా. ధాయ్యాగర్ధితజాతవేదహితమధ్యప్రష్ఠితాపూతసా
న్నాయ్యప్రాహుతినిర్గమత్ప్రబలనానావర్ణధూమాభ్రసా
హాయ్యంబొప్పఁగ శక్రతుండుఁ గ్రతుభాగార్థంబు రా దక్షిణా
నాయ్యాధ్వర్యులయాజ్ఞికోత్తములు ఛందోజ్ఞు ల్ప్రవర్గ్యాదులన్. 103

గీ. సముచితంబుగ వేల్వ నశ్వముఖలసదు, పాకృతశమన మొప్పవసాప్రహోమ
విధుల నింద్రాదు లైనదివిజవరులకుఁ, దృప్తియొనరించె నజ్జగతీవిభుండు. 104

సీ. ఈక్రమంబునను సర్వక్రియాసంపూర్ణ, మై వివిధాన్నపానాదితర్పి
తాఖిలలోక మై యనవద్యదక్షిణాభ్రామ మై కృతవపాధూమ మై వ
రం బయి విఘ్నదూరం బయి ఖచరభావ్యం బయి ద్విజదసవ్యాంబు నై స
భాసదాహ్లాద మై బహుళసంస్తావపూతం బయి పాపకాదంబినీప్ర

గీ. భంజనం బయి వాద్యసంభరిత మై ధ, రామరాశీర్నినాదవీణానుకూల
నాదపుణ్యాంగనాగాననాదఘూర్ణ, మాన మై యశ్వమేధ మనూన మయిన. 105

చ. పుడమివిభుండుఁ బాపసవిభుండు విభాండకునాత్మజు న్నతిం
పుడు నతిహర్షుఁ డై కరుణఁ బుత్రకకామవరేష్టి సేయ న
ప్పుడె మితభాషి తన్ముని ప్రభూతహితాహుతు లొప్ప వేల్చెన
ప్పుడె మిజనంబు లెల్లఁ గడుఁ బొంగి కనుంగొనుచుండ సద్విధిన్. 106

మంగళమహాశ్రీవృత్తము.

ఆసమయమందుఁ గమలాసనుని గన్గొనఁగ వాసవపురస్సరము గా సం
త్రాసు లగుచుం ద్రిదివవాసు లొగి డాసి నతిచేసిన దయామయుఁడు నావా
ణీసతినిఁ గూడి దరహాసము ముఖంబున వికాసమునర న్సరసతోను
ల్లాసమొదవం గరుణచేసి పలుకు న్వెతలఁ బాసి ముదమందుచు వినంగన్. 107

క. ఈకడకు మీరువచ్చిన, యీకార్యముఁ దీర్ప దక్షుఁ డీశ్వతి వరయ
న్వైకుంఠపురాధీశుఁడు, వైకుంఠుఁడు గాక యొరులు వలఁతులె యనుచున్. 108

గీ. వారిఁ దోడ్కొని యప్పుడే వారిశయనుఁ, వారిజభవుండు పూర్వదేవారి యుండు
వారినిధి గాంచి యచట దేవారిహతుని, వారిహితుఁ గాంచి పొగడె నవారిగాఁగ 109

సీ. అచ్యుతసంకర్షణాదినామోత్కర్ష, పాలితామృతతర్ష పరమహర్ష
భక్తనేత్రోద్ధర్ష బహుసద్గుణాకర్ష, యమితప్రకర్ష సహస్రశీర్ష
సుజననిరామర్ష కుజనదురాధర్ష, దానవసామర్ష మానితార్ష
వరకృపామృతవర్ష వాహనవిహగర్ష, భవనాఘమర్ష సంభరితవర్ష

గీ. యాజిఘర్షరిపుశీర్ష కామకర్ష, సంతతానందయోగి సత్సన్నికర్ష
కరుణ మామొఱ వినిపొమ్ము పరమపురుష, యధికతరదుఃఖరాశిసమాపకర్ష. 110

క. లోకంబులు గలిగింపను, లోకంబులు మనుప సర్వలోకంబులు వే
వేకార్ణవంబు సేయఁగ, నీక చనుం గమలనాభ నిరుపమశోభా. 111

క. లోకాధారుండ వఖిల, లోకాతీతుండ వార్యలోకహితదయా
లోకుండవు నసమానా, లోకుండవు సోమలోకలోచననేత్రా. 112

క. అభవుఁడ వై యుండియు దుష్టభయంకరరాక్షసప్రశమనంబునకై
ప్రభవించెద వొక్కొకతఱి, శుభచరితుల యిండ్ల భక్తసులభుఁడ వగుటన్. 113

చ. అనఘ త్వదీయదర్శకులయత్నవిహీనత శప్తులై జయుం
డును విజయుండు లోకము గడుం భయమందఁగ దైత్యులై జనిం
చినను వరాహరూపమునఁ జెన్నువహించి హిరణ్యనేత్రునిం
దునిమి నృసింహవిస్ఫురణఁ ద్రుంచితి వగ్రజు హేమభోజనున్. 114

క. ఆదన జాతము లఖిలన, రాదులు ఘటకర్ణరావణాహ్వయములచే
మేదిని జనించి దిక్పాలాదుల భర్జించుచుండి రతిబలు లగుటన్. 115

సీ. నిమిషమున్ స్థితి లేదు నిర్జరవరులకు, నఖిలదిక్పతులు నిరాశులైరి
పాతాళమునకు నై పాఱిరి భుజగులు, గిన్నరుల్ గుహల డాఁగిరి భయమున
గ్రహములు నిర్వక్రగతిఁ దనర్చుట లేదు, సాధ్యుల కధికవిచార మయ్యె
బ్రాహ్మణోత్తములకు రాగహీనత ఘనతరుల కాకులపాటు పరిఢవిల్లె

గీ. వరమఖంబులు కడు దుర్గమంబు లయ్యె, మునుల గర్వసమృద్ధి నిర్మూల మయ్యె
ఖచరకాంతాక్రమణమహోత్కంఠుఁడైన, పఙ్క్తికంఠుఁడు సేయు నుపద్రవమున.

క. హేమనగశరాసనునగ, మేమనఁ గల దతఁడు లీల నెత్తించో నిం
కేమనఁగ నెంత నిలిచెద, మేమనఁగలమే సురారిమీఁదికిఁ జనివన్. 117

క. రావణు సమస్తలోకద్రావణుఁ బరిమార్చి చెచ్చెరం దదనుజావిం
గావర మారించి మముం, గావ రమాధీశ నీవ కలవనియుటకున్. 118

వ. చనుదెంచినవార మని పలికి వెండియు. 119

క. భవదారితనామ మనో,భవదాహక మిత్రహిత విభవదాయక ధీ
భవదాలోకము కుంతీ, భవదాశరలోక మగు నభవదాంతనుతా. 120

క. అని కమలాసనముఖ్యులు, వినుతింపఁగ సంతసించి విశ్వమయుఁడు చ
య్యనఁ బ్రత్యక్షం బయ్యె, న్వనజోదరుఁ డెపుడు భక్తవత్సలుఁడు గదా. 121

సీ. కాదంబినీసముద్గతము లై చంచల, త్వంబు నొందనిశక్తితండ మొక్కొ
శ్వేతషోడశకళాశృంగారయుగపత్ప్ర,దీప్యత్సహస్రేందుదీప్తు లొక్కొ
యవనీభరవహశేషాద్యశేషవిశేష ఫణిఫణామణిఘృణిప్రచయ మొక్కొ
యత్యయద్వాదశాదిత్యసంస్తుత్య ఘ,నాత్యంతరుచిరతీవ్రాంశు లొక్కొ

గీ. యనఁగ బాడ్కులు మిఱుమిట్లు గొనఁగఁ జల్లఁ, దనముమీఱఁగ నధికచిత్రంబు గాన
సహనదుస్సహముగ నొప్పు మహితదేహ, కాంతు లెల్లెడఁ బర్వ సాక్షాత్కరింప.

క. చతురాననుండు నిజఘన,చతురాననములను విష్ణు జనవరిష్ణుం
జతురాగమములఁ బొగడెను, జతురత యొప్పంగ సంతసము నిండారన్. 123

గీ. అపుడు తద్దివ్యమూర్తి తేజోవలోక,నంబు సేయఁగ నధికముదంబు గదుర
నశతక్రతుఁ డురుసహస్రాక్షుఁ డయ్యె, నమరవరు లెల్ల ననిమిషు లైరి మీఱి. 124

సీ. అశ్వమేధశతఫలావాప్తిగోత్రభే, దికి సర్వభక్షునకు శుచిత్వ
మురుదండధరునకుఁ గురుధర్మదేవత్వ, మలరాక్షసునకుఁ బుణ్యజనఘనత
జడపతికిఁ బ్రచేతసత్వంబు లోకప్ర,భంజనునకు. జగత్ప్రాణమహిమ
నరవాహనునకు ధనదమహాభిఖ్యయు, సర్వజ్ఞతసుధర్మశాస్త్రవునకుఁ

గీ. దనదు తేజోమయాత్మ దర్శనముకతనఁ, గలుఁగఁ జేయుచు నందఱఁ గలయఁ జూచి
మేఘగంభీరములును నమోఘములును, మధురములు నైన వాక్కుల మధుహరుండు.

ఉ. భానుకులాగ్రగణ్యుఁ డగు పఙ్క్తిరథాత్మసతీత్రయంబునం
దేను జతుర్విధాకృతుల నెంతయు వేడ్కఁ జనించి రావణు
న్మానమదాతిరేకములు మాన్చి యమాత్యసహోదరాప్తసం
తానము మున్నుగా యమపదంబున కంపెదఁ జింత యేటికిన్. 125

క. మీవలని యనుగ్రహమున, మీవలనికి వచ్చితి నిటు మీఁద నరుఁడనై
మీవలసినటుల మెలఁగెద, రావణు మాత్రములు మీకు రావణు బాధల్. 126

ఆ. అజుని వరము లడుగు నప్పుడు నరవాన,రాలిఁ జావకుండ నడుగఁ డతఁడు
గాన నేను మర్త్యయోని జనించెదఁ, బుడమిఁ బ్లవగులగుచుఁ బుట్టుఁడీరు. 127

వ. అని యానతి యొసఁగి. 128

క. రోహిత నిధిశయనుఁడు పటు, రోహిత కరమహితదీప్తిరుచిరుఁడు సుగపా
రోహిత కోటిద్యుమణుఁ డా,రోహిత ఖగనాథుఁడై తిరోహితుఁడైనన్. 129

క. వనజజుఁడు జాంబవంతుని, ఘనయములు హరిహరులు వాలిసుగ్రీవుల న
శ్వినులలమైందద్వివిదుల, ఘనభల్లుకకీశపతులఁ గలిగించిరొగిన్. 130

క. అనలాత్ము నంశమున నం,జనయను సాధ్వీమతల్లి సద్గర్భపయో
ధినిఁ దగఁ గపికులచంద్రుఁడు, హనుమంతుం డుదయమయ్యె హరిదయ మలరన్.

క. తమతమ యంశంబుల నా,త్మతముల వలీముఖులనదలుచుగ సురస
త్తములిలఁ గలిగించిరి చి,త్తము లానందింప దైత్యదర్పచ్యుతులన్. 132

వ. ఇట్లు గలిగించిన దేవాంశసంభూతు లగు నాప్లవంగపుంగవులు. 133

ఉ. కొందఱు నీలుని న్నలుని గొందఱు గొందఱు మిత్రసంభవుం
గొందఱు గంధమాదనుని గొందఱు మైందుని గొంద ఱంగదుం
గొందఱు గేసరిం గజుని గొందఱుఁ గొందఱు వాయుపుత్రునీ
యందఱు నింద్రనందను నహర్నిశముం గొలువం దనర్చుచున్. 134

ఆ. పర్వతంబులెత్తి బంతులాడుచు గండ, శిలల నగ్గుగాఁగ జేఁజఱచుచు
ధరణి గ్రక్కదలఁగ దాఁటుచు నుండిరి, ఋశ్యమూకముఖగిరీంద్రములను. 135

క. అంతక మున్నక్కడ సుర, లెంతయు సంతసిల దశరథేశ్వరుఁ డఖిలా
శాంతవ్యాపితధూమా,త్యంతమనోహరసుతేష్టి యమరించు నెడన్. 136

తే. యజ్ఞకుండాంబునిధి ఋగ్యజాంగమాధ,వానుశాసనమున విబుధాధిపుండు
మంత్రమంథనగంబుచే మథనవిధియొ,నర్ప నమృతంబు దెచ్చు ధన్వంతరి యన. 137

ఉ. ఆయత యజ్ఞకుండ మహితాంతరము న్వెస నిర్గమించి శో
భాయుత దివ్యమూర్తి రఘువంశసుదీపకుమారసంభవో
పాయసపాయసుండయి నృపాలకృతాహుతిసద్విధానవి
స్వాయదనుగ్రహంబున విభావసుఁ డాత్తనిజస్వరూపుఁడై. 138

క. ఆక్షణమునఁ దనకుం బ్ర,త్యక్షంబయ్యె ననదివ్యుఁడగు నొకపురుషుం
దక్షిణ ప్రభ నొప్పఁ బ్ర,దక్షిణ మొనరించె విభుఁడు దయితాయుతుఁడై. 139

వ. ఇట్లు. 140

చ. తనకుఁ బ్రదక్షిణించి యుచితంబగు భక్తి నమస్కరించి యు
న్న నరవరేణ్యుఁ గాంచి మహినాథ తనూజులు నీకు నల్వు ర
త్యనుపమమూర్తు లిద్ధబలు లర్కకులాగ్రణు లుద్భవింతు రీ
ఘనతరపాయసంబుఁ గులకాంతలకు న్నొసఁగంగ నిచ్చినన్. 141

క. అని చెప్పి మనోరథసి, ద్ధి నొసంగెడుభంగి నొప్పు దివ్యపురుషుఁ డొ
య్యన దత్పాయసపాత్రము, దినకరగోత్రున కొసంగి యదృశ్యుండై చనెన్. 142

క. పరమాత్మస్వార్థమగు మహీ, పరమాకర్షణపరుండు పఙ్క్తిరథుండు ద
త్పరమాన్నపాత్రఁ జేకొని, పరమాహ్లాదమున నపుడు పట్టణమునకున్. 143

సీ. చనుదెంచి యప్పాయసము రెండుభాగము, ల్గావించి యొక్కభాగంబుఁ బెద్ద
భార్యకు రెండవభాగంబు రెండవ, భార్య కొసంగి భూభర్త పిదపఁ
గౌసల్యపాలిసగంబులో నొకభా, గంబున సగము భాగంబు మఱఁ
దెచ్చి సుమిత్ర కందిచ్చె భాగములు నా, ల్గింటిలో రెండు గ్రాల్గొంటి చిన్న

ఆ. భార్య కయ్యెఁ గడమ భాగద్వయంబు భా, ర్యాద్వయమున కయ్యె నధిక మైన
ప్రేమ పతికిఁ జిన్న పెండ్లాము నందును, దల్లికిఁ గడగొట్టుతన యునందు. 144

మ. పరమాన్నానుభవంబున న్సతులకున్ భావింపఁగా వృద్ధిఁ గాం
చె రహిం గోర్కులు నాస్యపాండిమయులున్ శృంగారవక్షోజభూ
ధరము ల్జిట్టుము లావులింత లణుమధ్యంబు ల్కృశంబు ల్విశే
షరుచు ల్మిన్నగ మందమయ్యె నడలు న్సత్స్వాపశాపేక్షలున్. 145

క. కటిపదకవభాగలకుం, బటుతర మగుమన్న గర్భభారంబులతో
స్ఫుటభార కుచిరమహో, త్కటరత్నాభరణగణము గడుభరమయ్యెన్. 146

గీ. అధికమధుపానమత్తత నబ్జవాంఛ, భ్రమరకంబులు చక్రవాకముల మీఁద
వ్రాలెననఁ గాంతలకు లిప్తవరకుచాగ్ర, నీలిమ దనర్చె నత్తొలిచూలు వేళ. 147

సీ. ప్రియపుత్త్రదర్శన స్పృహ మించె నృపతికిఁ, గంబుకంఠులకు శ్రమంబు మించె
నాఱనికుతుకంబు మీఱె నరేంద్రున, కంబుజాస్యలకు నూఁగారు మీఱెఁ
బటుతరంబుగ మేను పాటుకరించె మహీవి, భున కంగనలకు లోఁ బాటుకరించెఁ
దెలివయ్యె మొలకలెత్తె నిలాపతికిఁ జంద్ర, ముఖులకుఁ దెలిడాలు మొలకలెత్తె

గీ. మానిసత్తమవిహితకుమారకామ, సత్తతంతుప్రభవపుంసవప్రవరస
మాత్తమాధుర్యపాయసాహారకలనఁ, బ్రాకటంబగు దౌహృదశ్రీకతమున. 148

ఆ. సకల జనులకుఁ బరమహర్షంబు నిండ, దేవతాస్తుతి గనముల దివము నిండఁ
గలితజీవితకాలం బరులకు నిండ, నెలఁతలకు నంతఁ బండ్రెండు నెలలు నిండ. 149

మ. మధుమాసాగతశుద్ధశుద్ధనవమీమధ్యాహ్నకాలంబునన్
బుధవారాదితితారఁ గర్కటకసత్పుణ్యోర్వరలగ్నంబున్న

న్విధుఁడై వేల్పులుగూడఁగా విధిముఖుల్ వేడ్కఁ బ్రశంసింపఁ ద
శరథార్థంబుగ నొక్కపుత్త్రుఁ గనియెం గౌసల్య సాఫల్యయై. 150

సీ. ఘనతరుల్ మునులు నోవికాసతఁ జెన్నొంద, భువనము ల్కల్మషంబుల దొలంగ
విపులధర్మము లభివృద్ధిఁ బొందఁగఁ గళా,పూర్తి సంతసము విబుధుల కొదవ
సన్మార్గసహితరాజప్రవర్తనముఁగా, ద్విజకులం బురుఫలాప్తిని రహింపఁ
గువలయామోదంబు గుమ్మరింపఁగఁ బుణ్య,జనజాతమునకు వర్ధనము గాఁగ
గీ. పర్వదినశార్వరీనాథగర్వనిర్వ, పణముఖుండు ధరిత్రీసుపర్వవరుఁడు
పర్వసుముఖుండు లోచనపర్వయశము, పర్వ నృపునగ్రసతికి సంప్రభవ మయ్యె. 151

గీ. విబుధమార్గంబుఁ గువలయవికసనంబు, పుణ్యసువశోరలోచనాపూర్ణసంత
సప్రవృద్ధియుఁ బటుతమశ్శాంతి యయ్యె, ననఘమతి రామచంద్రుని జననవేళ. 152

క. గ్రహబాధ లాతనియను,గ్రహమాత్రంబున నపాయుఁ గలవనెడిసుని
గ్రహజన్మలగ్న మహిత,గ్రహలగ్నము వింత గాదు రహినూహింపన్. 153

క. సంతాన మధిపుఁ డొందఁగ, సంతానము గురిసె విరులసంతానంబు
ల్వంతలు దొలఁగి రమరు లా,వంతలు లేకుండ సారవత్స్వాత్మకులై. 154

క. అగ్రసతీమణివలన ని,జాగ్రసుతోత్పత్తి విని నృపాగ్రణి గడుఁ బ్ర
త్యగ్రాగ్రహారములనది, యగ్రగ్రహణయుతుఁడై ద్విజావలి కొసఁగన్. 155

సీ. విమలభానిహ్నదబ్జవృత్తికి సూతికా,గృహవృత్తి మనమున కెక్కఁబోలు
నభవాభ్యభిష్టుతుం డైయొప్పు ప్రభువనఁ, బుట్టువు పై నిచ్చ వుట్టఁబోలు
దుగ్ధాబ్ధి నోలాడుదొరను గౌసల్యాకు,చోరుదుగ్ధాపేక్ష యొదవఁబోలు
శారదమహతీస్వనము మెచ్చుమేటి కం,గవలజోలల భ్రమ గలుఁగఁబోలు
గీ. శేషుపైఁ బండుకట్టి విశేషమతికి, దూలతల్పంబు లధికమై తోఁపఁబోలు
ననఁగ నిందీవరశ్యాముఁ డఘవిరాముఁ, డమితగుణధాముఁ డుద్దాముఁ డవతరించె.

క దశదిగ్విశదముగ విపద్దశ దిగ్విభులెల్లఁ బాయఁ దగుమీనమునం
దశమీగురువారమునన్, దశరథుసతి కైక గనియెఁ దనయున్భరతున్. 157

మ. శనివారోరగతారఁ గర్కటకలగ్నప్రాకటైకాదశిం
గవివారాభినుతు ల్సెలంగ జగదేకశ్లోకవిఖ్యాతులన్
మునివేశాత్ముల నిర్వురం గనియె శత్రుద్రోహచారిత్ర శాం
తవసంస్తోత్ర సుమిత్ర మిత్రజనబృందం బాత్మ హర్షింపఁగన్. 158

వ. ఇట్లు. 159

క. నలుగురురూపకశౌర్యులు, నలుగురుసుతు లుద్భవింప నలువుగ విరివా
నలు గురియ వేల్పుంబా, నలు గురుతరవాద్యముల నొనర్చిరి మింటన్. 160

క. పాపంబులు భక్తమన, స్తాపంబులుఁ బాపనోపు తద్బాలురస
ద్రూపంబులు పురుటిండ్లను, దీపంబులు గాఁ జెలంగె దీపితభంగిన్. 161

క. పురుషోత్తము లగుపుత్రులఁ, బురుషార్థచతుష్టయంబుఁ బోలెం గని కా
పురుషామిత్రజనమదం, బురుషాసహితముగ నృపుఁడు బ్రుంగుడువఱిచెన్. 162

వ. తదనంతరంబున. 163

సీ. పుణ్యాహవాచనపూర్వకజాతక, ర్మానంతరంబున మానవేంద్రుఁ
డతిభక్తిఁ గులగురుం డగువసిష్ఠునిఁ గాంచి, సతుఁ డయిసుతులకు నామకరణ
మొనరింపుఁ డనుడు నయ్యోగిముఖ్యుండుఁ గో, సలరాజకన్య కౌసల్యసుతునకుఁ
గైకపుత్రునకు మాగధరాజపుత్రికా, పుత్రులకును క్రమంబున నొనర్చె
గీ. రాముఁ డని రాముఁడనుచు భరతుఁడు గాన, భరతుఁ డనిలక్ష్మణుఁడు గానఁ బరఁగలక్ష్మ
ణుండటంచును శత్రుఘ్నుఁ డంద్రు గాన, మహిమశత్రుఘ్నుఁడనుచు నామంబులపుడు.

చ. క్రమమున వాద్యపక్షమిహికాకిరణోరుకళోపమానులై
సుమవిశిఖావరీణపటుసుందరులై వినుతాంబుజాసనా
ద్యమరులు నై నరేశ్వరుఁడు నంబలు సంతస మంద మిత్రగో
త్రము వెలుఁగంగ రాట్సుతులు తద్దయు నొప్పిరి నాఁడునాఁటికిన్. 165

గీ. తల్లిదండ్రుల సంతోషవల్లిప్రాఁకఁ, బ్రాఁక నేర్చిరి చిలుకపలుకు లెలమిఁ
బలుక నేర్చిరి ధర్మము ల్ప్రబలి నడువ, నడువ నేర్చిరి పెడపెడనడక లపుడు. 166

మ. కని మోదించిరి తల్లిదండ్రులు జగత్కల్యాణచారిత్రుల
న్వనజాతాయతనేత్రుల న్విమలశోభాగాత్రులం జారలో
చననీరేరుహమిత్రుల న్మధురభాషాచిత్రుల న్మిత్రకా
ననసచ్చైత్రులఁ గూఢజత్రులను నానాస్త్రోత్రులం బుత్రులన్. 167

వ. అని మనోల్లాసంబుగా నుపన్యసించి. 168

క. భండనరిపుఖండన ఖల, దండన గుణమండ నానితాంతప్రణుతా
ఖండల మణికుండల భూ, మండలధర విధుదినేశమండలనేత్రా. 169

శా. జంభారాత్యభియాతిఖండనపటిష్ఠప్రోల్లసత్ఖడ్గదో
స్తంభాభిష్టుతభూరిభూరిమణిదృబ్ధప్రస్ఫుటోద్దామ దా
మాంభోధ్యాత్మభవాసమాశ్రిత సువక్షా దీనరక్షాంచితా
రంభాదంభమహాభిలాష జగదారాధ్యాంఘ్రిపద్మద్వయా. 170

లయగ్రాహి.

పారఘనసారసువిసారసుమవారపటుహీరవరక్షీరధృతిసీఁ సితతారా
దారఘనపారదపటీరహితశారదనిశారమణశారదశరీరమృదుముక్తా
హారమధుపూరసురవారణసమీరణకుమారవరహారవరహాఁ విలసద్డిం
డీరబహుతాఁకతుషారకలిశారమణకైరవమహోరగపచారుతరకీర్తీ.

గద్యము. ఇది శ్రీసూర్యనారాయణపదాబ్జధ్యానపరాయణ భూమద్భాగ్య
వినయ రామనార్యతనయ పండితసేవాసముచ్ఛయ కొత్తపల్లి
లచ్చయప్రణీతం బైన దాశరథివిలాసం బనుమహాప్రబం
ధంబునందుఁ బ్రథమాశ్వాసము.



శుభమస్తు.

అవిఘ్నమస్తు.

శ్రీశారదాంబాయైనమోనమః.

# దాశరథివిలాసము.

## ద్వితీయాశ్వాసము.



శ్రీమహనీయవదన వర, రామాజనమదన సుందరరదన రిపుమహా
భీమకదన రుచిరసువర్ణామేయచ్ఛదన వేంకటాచలసదనా.

వ. అవధరింపు మనంతరకథావిధానంబు భగవంతుండగు వల్మీకోద్భవుం డిట్లని చెప్పం
దొడంగె. 2

క. తమ తలిదండ్రుల కానందమధిక మగుచుండ రాజతనయులు సుప్రో
త్తమకృతదీవనులైయు, త్తమవృత్తము పౌరులకు ముదం బొనరింపన్. 3

గీ. రామలక్ష్మణులు మనోభిరామలీల, భరతశత్రుఘ్ను లురుశుభభరితలీలఁ
గవలు గూడిరి జక్కవకవల తోఁడు, వేలుపులకూడఁ గూడు నవ్విధము గాఁగ. 4

శా. విద్యాభ్యాసి వసిష్ఠునొద్ద ననుజాన్వితంబుగా నెంతయు
న్విద్యాభ్యాస మొనర్చి రాముఁడు మహావేదోద్ధవేదాంగము
ల్విద్యానాథుని యట్ల నేర్చి మఱియు న్వీరుండు ప్రోద్యద్ధను
ర్విద్యాపారగుఁ డయ్యె భీతి సమితోర్వీనాయకు ల్గుందఁగన్. 5

చ. గజిబిజి లేక వీఁకఁ దురగంబుల నెక్కి రణంబొనర్చుట
ల్గజముల నెక్కి పోరుట లిలాస్థితి జన్యము సేయుట ల్పృతాం
గజలదయుక్తిఁ గాండపటుకాండపరంపరఁ జూపుట ల్వరాం
గజనిభమూర్తి రాముఁ డధికంబుగ నేర్చె సహోదరాత్తుఁ డై. 6

వ. అంత. 7

క. దారకుల వ్యందితబృందారకులం దుష్టజనవిదారకుల మహో
దారకరుణావిశేషులఁ, దారకరాజనిభముఖులఁ దారకనఖులన్. 8

మ. కని రాజన్యుఁడు పుత్రరత్నములకుం గళ్యాణము ల్సేయఁ జ
క్కని రాజన్యసుకన్యల న్వెదకుచోఁ గాధేయుఁ డామర్షశో

కనిరాకర్ణనుఁ డేగుదెంచుటయు వేగంబొప్ప నమర్త్యని రా
కనిజాధీశున కేర్పరించిరి భటుల్ గౌతూహలోపేతులై. 9

క. భటులిటు లెఱిఁగించిన నృద్భట సంతోషమున నెదురు పఱతెంచి శుభా
ర్భటుల తెసఁగఁ దోడితెచ్చెన్, భటునిక్రియ సహితవినయభయభక్తుండై. 10

వ. ఇవ్విధంబునం జితేంద్రియుండగు విశ్వామిత్రుం దోడితెచ్చి సుఖాసనంబున
నాసీనుం జేసి. 11

క. మునికౌశికుఁ డగుకౌశిక, మునికర్ఘ్యముఁ బాద్యమొసఁగి ముదమున రవిధా
ముని పాదశౌచవరజల, మునిజశిరంబున వహించి బుధులు నుతింపన్. 12

గీ. కాయము పవిత్రమయ్యెఁ ద్వదీయపూజ, నయున యిమ్మహత్త్వదాబ్జరజమున గృహము
నమితశోభనములకిర వయ్యె శిష్యకోటికిని మీరుఁ గుశలమే కుశికవంశ. 13

క. ప్రాణతనుత్రాణధను, ర్బాణకృపాణంబులును గృపాపర యస్మ
త్ప్రాణపదస్త్రీణపదా, క్షీణతలును నీయవియ కుశికవంశమణీ. 14

క. పొచ్చెంబుగ నాడుట గా, దచ్చెరువుగ నిపుడ మీర లందఱుఁ జూడం
జిచ్చుఁ జొరుమన్నఁ జొచ్చెద, వచ్చిన పని యానతీయవయ్య మహాత్మా. 15

వ. అని యిట్లు మస్తకన్యస్తహస్తుండై యున్న దశరథునకు విశ్వామిత్రుం డిట్లనియె.

క. సత్యాధారకులోత్తమ, సత్యసమాధారరాజసత్తమభాషా
సత్యాశ్రయుచిత్తమహా, సత్యాంచిత రూపవిను దశరథనహీపా. 17

చ. కుశలమతి న్వసుంధర రఘుక్షితిపాలుని యట్టులన్నిరం
కుశగతి రక్షసల్ప దనఘుండవు ధర్మమతిం ద్విషద్గజాం
కుశ యరుణాంశువంశనృపకుంజర కావున మాకు సర్వముం
గుశలము ముంచు సాధుసుఖుండు తపోమహితుండు వెండియున్. 18

క. ద్రోహులు గాధాన్వేష్య, స్నేహులు సందేహులతి నిషిద్ధాశ్రమిశ
ద్దేహులు ఖలమారీచను, బాహులు చండతరదీర్ఘబాహులు వెలుచన్. 19

చ. తివిరియుఖంబు సేయుటకు దీక్షవహించితి కేని వారు నీ
తివిడిచి యజ్ఞవస్తుకీలతిం ఒలుమాంసును రక్తవర్షము
ల్దివిని వసించి మించి పటుతీవ్రగతిం గురియించుచుండు ర
ద్దివిజవిరోధు లధ్వర ముదీర్ణతఁ బూర్ణము గాకయుండఁగన్. 20

ఉ. వారియహోప్తవంశజనవల్లభ వారిటు లెన్నిచేసిన
న్వారిశపించుటం దప మవశ్యము లోపము నొందుఁ గాన దే

వారివిభేదనక్రమము నాత్మఁ గడుందలపోసి సత్కృపా
వారిధి వైన నీకడకు వచ్చితి మెచ్చితి నీదుభక్తికిన్. 21

శా. ఆపాపాత్ముల సంహరింపఁగ మదీయం బైనజన్మంబు నేం
డేపూర్ణంబుగ నిర్వహించి విలసత్కీర్తిం బ్రతిష్ఠింపఁగా
నీపుత్త్రున్ రఘురాముఁ బంపు మితఁ డానీరేజపత్త్రేక్షణుం
డీపృథ్విన్నరుఁడై జనించె ఖలశిక్షేచ్ఛన్ ధరిత్రీశ్వరా. 22

ఉ. ఈతఁడు సర్వలోకగురుఁ డీతఁడు దానవలోకభీకరుం
డీతఁడు మాధవుండు మఱి యీతఁడు మాధవభావభావితుం
డీతఁడు సర్వభూతహితుఁ డీతఁడు భూతలధారి గావునం
భీతి యొకింతయేని మహిభృద్వర పొందకు పంపు మింపునన్. 23

వ. అని పల్కి శ్రీరాము నుద్దేశించి. 24

గీ. తానవారితలీల నిద్రానవారి, దానవారిఁ జంబుచంద్రాన వారి
ముఖకమలములు నిజశిలీముఖకరనారి, దచ్చెఁ గళ్యాణయుక్తుఁడై వచ్చె మఱల.

గీ. అనుచు నవ్వాక్యములు విను చుగ్రముఁ గర్ణ, రంధ్రములఁ బడి హృదయాంతరంబునిండఁ
బ్రజ్ఞ చెడెఁ దవలన్నంబు భగ్నమయ్యె, మేను స్రుక్కయ్యెఁ బ్రాణంబు బరిణమయ్యె.

క. ఉల్లము జల్లనఁగ మో, మెల్లను వెల్లఁదన మూన నింద్రసఖుఁడు భూ
వల్లభుఁ డల్లన నమ్ముని, తల్లజుఁ బలుకు న్మనంబు దల్లడ పడఁగన్. 27

క. తండ్రి విను రాముఁ డెక్కడ, క్రూరులు రాక్షసులు వారిఁ గైకొనక కడుం
దీండ్రించి నిలుచు టెక్కడ, వేండ్రము లీమాట లుడిగి విను నాపలుకుల్. 28

సీ. ముఖపద్మసౌరభోన్ముఖముఖరిశశిలీ,ముఖనిముఖుండు రాముండు గలహ
ముఖమునఁ బూర్వాగ్నిముఖశిలీముఖపరా,ఙ్ముఖుఁ డగు హరిదేవముఖసురప్ర
ముఖులు షణ్ముఖు గూడి మొఱలిడ రాముస్మ్ముఖుల గాచు దెస సుముఖుఁడవు గమ్ము
ముఖవిలోచనచతుర్ముఖపతిహరాప్ర, ముఖమునస్థగితదిఙ్ముఖమునీంద్ర

గీ. ముఖ్యదండ్రబునీర్గోముఖ మునుచుచు, గరము ఖరకరవంశశేఖరుఁడు దైర్య
ధనము ఖండితమగుడుఁ జిత్తము గలంగ, ముఖము దిగవైచె మానిసమ్ముఖమునందు.

చ. ఇటులు నధోముఖుం డయి దశేంద్రియవృత్తులు మాని మానియై
కిటుకిటులాడి కొంతవడికి న్మొగమెత్తి నరేంద్రచంద్రుఁ డ
జ్జటిలునితోడ నిట్లనియె జానుగ నే నట కేగుదెంచి ది
క్కటుకతకీర్తినై మఖముఁ గాచెద నేఁ జెద దైత్యవర్గమున్. 30

క. పేర్చి బలంబుల వేసము, దీర్చికొని మహాత్మ మిమ్ముఁ గూర్చి ఖలవనిం
గార్చిచ్చుపగిదిఁ బోఁ, గార్చి సవనము నెఱవేర్చి యరుదెంతు ననన్. 31

క. మునిసింహుఁడు నృపకుంజరుఁ, గనుఁగొని సటలునిగుడంగఁ గనలుగదుర ది
గ్గన నద్దియడిగ్గమటికి, చనవుద్యోగించి యద్దశరథునితోడన్. 32

మ. విన నర్హంబులు గానివాక్యముల నీ వేళం బ్రశంసించి నా
యినవంశంబునఁ బుట్టి సూనృతవచోహీనాంతరంగుండ వై
వినయంబు న్నయముల్ భయం బనయము న్విధ్వస్తముం జేసి తీ
యినవర్యు ల్నినుబోలె బొంకఁగల వారే పాతకాభీతులై. 33

క. జ్ఞానంబు విడిచి సూనృతహీనమ్మున నోర్చినాఁడ వింతియచాలుం
గానిమ్ము పోయివచ్చెదఁ, బోని మ్మనునంతలోన భూపతితోడన్. 34

చ. కడఁగి వసిష్ఠుఁ డిట్లనియెఁ గంజహితాన్వయ వరావనిపాదముల్
గడిగి విశేషభక్తి నొకగద్దియనుంచి మునీంద్రచంద్ర నీ
కడిగిన వెల్లనిత్తు నని యాయనఁ బల్కి కుమారుఁగోరనీ
కడఁగి నిజంబుఁ దప్పుట మహత్త్వమె మెత్తురె దీని సత్తముల్. 35

ఉ. దాఁప సమస్తవస్తువు లుదాత్తత నిచ్చెద నంచుఁ బల్కి యీం
దాపసనాథకృత్తి యుచితంబె కుమారుఁ గుమారధీయుతిం
దాపసనాథువెంట నుచితస్థితిఁ బంపు మితండు ధాత్రిలోఁ
దాపసమాన్యుఁ డీతనివిధం బెఱుఁగంగ నశక్య మేరికిన్. 26

క. ఈమనితజ్ఞానికి సుతు, నీ మని మనమంత్రి మేని యితఁ డల్గినచో
నీమనికిఁ జెల్లనిచ్చునె, యీమునికిం జోడు గలరె పృథ్వీనాథా. 37

వ. అని చెప్పిన విని. 38

క. గురునిభుఁ డగుగురువాజ్ఞన్, గురుతర మని తల ధరించి గురునాజ్ఞమునన్
గురుఁ డాడుచున్న తన నలు, గురుపుత్త్రులఁ గాంచి కృపయిగురువెట్టంగన్.

క. బాలకుల నహితగజజం, బాలకుల వినీలనీలపరిహాతరోలం
బాలకులను గైసేయఁగ, బాలకమలముఖుల నపుడు బనుమట రూఁ దగన్. 40

ఉ. తజ్జగదీశునాజ్ఞ ముదిత ల్ముదితాత్మకలై రయంబునం
గొజ్జఁగతేటనీట నృపకుంజరపుత్త్రులకుం గ్రమంబున
న్మజ్జనమాచరించి వదనంబులఁ గస్తురిరేఖ లుంచుమం
గజ్జలముంచి రాట్సుతుల కన్నులఁ గన్నులపండువై చనన్. 41

సీ. అబ్జాస్యయొకతె శుభ్రాంశుకంబు లొసంగఁ, బుష్పంబు లొకతీవఁబోణి యొసఁగ
నొకశైలకుచ బంగరుకటకంబు లొసంగ, గంధం బొకస్మరాశుగనిభ యొసఁగ
ఘనవేణియొకతె ముక్తావళు లొసఁగ భ్రూకటిచారు రత్నకంకణము లొసఁగ
నొకఘనరసవతి యూర్మిక లొసఁగ రంభోరువొకతె చంద్రహారముల నొ
గీ. సంగ నబ్జాలురకు సొంపెసంగుచుండ, నిట్లు గైసేసి తల్లుల కెలమి మ్రొక్క
రాజహంసల గతులనా రాజసుతులు, రాజహంసల గతుల విరాజు లగుచు. 42
సీ. తమమందహాసజ్యోత్స్నాపూర మచటిచంద్రోపలంబుల నీర మూరఁ జేయఁ
దమకచమేచకతమము భిత్తికల యుత్తమహీరములను నీలములఁ జేయఁ
దమపదపల్లవోద్గమశోణ మచటఁగూర్చినకెంపులజిగితోఁ జెలిమి సేయఁ
దమవిలోకనసుధాధావళ్య మచటి గృహములకుఁ దగువితానములు సేయఁ
గీ. దమతనూస్వర్ణరుచులవిస్తార మచటి, సకలజనులకుఁ బరమహర్షంబు సేయ
వచ్చి మ్రొక్కిరి మృదుతనూవల్లులకును, దల్లులకు సద్గుణవతీమతల్లులకును. 43
క. మ్రొక్కిన దీవన లెసఁగఁగ, నక్కొడుకుల నెత్తి ముద్దులాడుచు నెంతే
మక్కువఁ జుబుకము లంటుచు, గ్రక్కున నారాజవర్య కడ కనుచుటయున్.
చ. నలు వగురీతి వచ్చి మునినాథులకు న్నరలోకభర్తకు
న్నలువురు మ్రొక్కి నిల్చిన ఘనంబుగ దీవన లిచ్చి రంతన
న్నలువురిలోన నగ్రజు ఘనాఘనరాముని రాముఁగాంచి య
న్నలువకుఁదుల్యుఁడు న్నియమినాథుఁడు నైనవసిష్ఠుఁ డిట్లనున్. 45
చ. రవినిభ బాలమేల మన రాముసలక్ష్మణుఁజేసి తాపస
ప్రవరుని వెంటఁబంపుము శుభంబగు నీకును నీదుసాత్మసం
భవులకు నందుఁ బల్కుటయుఁ బార్థివుఁడు న్ముదమంది బాణతూ
ణవిహితపాణిపాంసుల నొనర్చి తనర్చిన పుత్త్రమోహమున్. 46
క. ఒక్కింతసేపునకు దిగఁ, ద్రొక్కి యతీశ్వరునిఁ గాంచి తోడ్కొని చనుమీ
చక్కనిబాలుర నని ధృతి, నెక్కొనఁ గా మఱియు నమ్మునీశ్వరు తోడన్. 47
క. కంటి బహుకాలమున కీఁగంటి న్నిమువంటివారికార్యార్థము మీ
కంటెఁ గృపాపరు లెవ్వరు, కంటికి ఱెప్పవలె సుతులఁ గాపాడవలెన్. 48
వ. అని చెప్పి యాక్షణంబున నాక్షోణీపతి యక్షీణక్షణంబునఁ గృతలక్షణులును, సకలకళావిచక్షణులును, గిల్పిపారణ్యాకుశుక్షణులును, శిష్టసంరక్షణులును, దుష్టజనశిక్షణులును, ధర్మాన్వీక్షణులును, వినుతలీలాపేక్షణులును, బద్మపత్త్రేక్షణులును,

సమాచరితగురుప్రదక్షిణులును, లక్ష్మణులునగు రామలక్ష్మణుల సమర్పించుటయు
నవ్విశ్వామిత్రుండు. 49

ఉ. ఆడెదు రామలక్ష్మణుల నాదరపూర్వము గాఁగఁ జూచి కొం
డాడెదు రాజుఁ జూచి యిటులాడెను భీతిని నేను వీరిఁ గా
పాడెదువాఁడనే ధరణినంతయు దుర్దశనొందకుండఁ గా
పాడెదువారు వీరు దునుమాడరె దుష్టుల నన్నికృష్టులన్. 50

వ. అని యూఱడిల్లం బలికి. 51

మ. వెనకయ్యా న్నరజన్ముఁ గూడి మహిమ న్వెంచేయుశంభున్వలె
న్వెనుకయ్యన్నయుఁ దమ్ముఁడుం గొలువఁగా వెంచేసె నమ్మౌని పా
వనభూతిర్లలితాంగముం ఘనజటాబంధం బుర న్నాకభూ
వనభూజాతసుమంబులోలిఁ గురియన్ భావంబునం బొంగుచున్. 52

క. కామక్రోధరహితు లరి, భీములు ధర్మావనులుఁ గృపీటజనేత్రు
లోన్మునిఁ గెరలుముఖంబుల,తో మునిపతి వెంట దశరథునిసుతు లరుగన్. 53

క. చల్లనిగాడ్పు గదుపెద, చల్ల నికటభూరుహముల సత్పూనంబు
ల్లల్లని సేసలగుచుఁ బై, జల్లని రాలంగ సంతసమునఁ బొదలుచున్. 54

మ. గణజాతీతలసద్గుణాగ్రణులు రంగత్కాంచి కాకింకిణీ
క్వణనాసేచనశోరువిగ్రహులు లోకాలోకధైర్య ల్సుధీ
జనదూరాయలు రామలక్ష్మణులు భాస్వద్వీక్షణు ల్సార్ధయో
జనదూరంబు పయోజబాంధవునియోజ న్మించునమ్మౌనితోన్. 55

క. మది నానందించుచు నె,మ్మది నీగతి నేగి ఫేనమహిమ న్నగుచు
న్నదివోలెఁ బొలుచు సరయూ,నది గాంచిరి రామలక్ష్మణకుమారు లటన్. 56 .

సీ. పిఱుఁదులకెనయగు పృథుపులినంబులు, వాలసామ్యమగు శైవాలములును
స్తనసదృశంబులౌ చక్రవాకములు నే, త్రములకీడగు శఫలములగములు
బాహులవంటి శోభనబిసంబులు భ్రమ,రకసదృక్షములైన భ్రమరకములు
నాననశోభాసమానాంబుజంబులు, చెక్కులరీతి భాసిల్లుకుస్తు

గీ. లమరుపొక్కిళ్ళఁ బోలిన యట్టిసుళ్ళు, వళులకెనయగు వీచికావళులు గలిగి
వారిలీలాసమాసక్తవారిజాన, నారుచిరవోలె మిగులఁ దనర్చు దాని. 57

మ. సరయూశైవలినీలలామఁ గని విశ్వామిత్రుఁ డా రాముతో
దరహిం బల్కెఁ గుమార యిత్తటినిఁ జూడం బంకజామోదరై

వరమహాకంకణహంసకోర్మికనుశోభాయుక్తయై కామినీ
స్ఫురణం బెంపు వహించె: జూచితివె యంచుం దత్సమీపంబునన్. 58

క. వనజాతతటమనోహర, వనజాత సుమప్రభూతవరగంధము లోఁ
గొని శీతవాతపోతముఁ, గొనియాడఁగ నిట్టు లలమికొనిన నలరుచున్. 59

ఆ. విశ్రమించి రామవిభురామవిభుఁ గాంచి, వత్స యీజలముల వార్చి రమ్ము
సకలభయనివారణకర మహావిద్యోప, దేశ మొసఁగువాఁడఁ దెలియ ననిన. 60

మ. తనపాదోద్భవ మైనగంగమహిమం బైత్రైలోక్యలోకాళిఁ బా
వనముం జేయుచు నుండఁ దాను సరయూవాఃపూరపూతాత్ముఁ డై
మునిసంఘంబులు దన్ను వార్చి ఘను లై మోదించుచుండంగ న
మ్మునియాజ్ఞ న్వెస వార్చి రాముఁ డనుజన్ముంగూడి భక్తి న్నతిన్. 61

క. కరములు జోడించి జగద్గురుఁడుఁ గళాయుతుఁడుఁ గౌశికుని గురుఁ డనుచుం
గరము వినుతించె విద్యాపరిగ్రహముఁ గోరి నియమిభాగ్యం బసదే. 62

క. ఈపగిది నిభృతుఁ డైనమహీపకుమారకుని సంయమీశ్వరుఁ డభయ
ప్రాపక బలాతిబలవిద్యాపరిణతుఁ జేసి మఱియు నమ్మని పలుకున్. 63

చ. సనకసనందనప్రముఖసన్మును లీమహనీయవిద్యలం
దనర బఠింతు రధ్వములఁ దానవబాధలు మానసీవ్యథ
ల్దనుకవు క్షుత్పిపాసలును దారొక్కన వెంతయు సంతసం బగు
న్విను నృప యీయువిద్యలను వేడ్క భజించిన యంతలోనన్. 64

క. కొనియాడుచు విద్యలు చేకొని యాడుచు ననుజుఁ గూడికొని హర్షించెం
దిననాథుఁ డస్తగిరి వొందిన నాధరణీశసుతులు దృణతల్పములన్. 65

క. ఆరాత్రి నిద్రఁ జెందిరి, యారాత్సరయూతరంగజానిలములను
న్వారిరహోయతనేత్రులు, వారినవు న వేడ్క మౌనివర్యసహితు లై. 66

వ. ఇట్లు నిద్రించి విశ్వామిత్రప్రబోధితు లై కాలోచితకృత్యంబులు నిర్వర్తించి. 67

క. వేగంగ మనోముదమున, వేగంగ మనోన్ముఖులయి విద్విషహ మని
న్వేఁగంగ మౌనియుతు లై, యేఁగంగ బవిత్ర యగుచు నేగంగఁ దగున్. 68

గీ. అట్టిజాహ్నవిఁ గని ద్యుమణ్యన్వయాయమణులు రమణీరమణులు లక్ష్మణులు రామ
లక్ష్మణులు సంతసమున నేలాలతానుకూలకూలంబు నంత ప్రొక్కుచును జేరి. 69

చ. లలితతరంగరంగమునలాస్యము సల్పుచు నున్న రాజహం
సలు జలపానలోలుపలసద్విపయూథపపఙ్క్తి మేఘమం

దలము లటంచు భీతి గగనంబునకు న్నెగఁ బాఱి వారులై
యలరెడు శారదాభ్రములయట్టులు చాతకభీతిఁ జేయుచున్. 70

చ. కమలవనీవిహారముసఁ గాముకరేణుసమానయుద్ధమై
యమరెఁ గమంగొనంగ మధుపాళి సువర్ణత గాంచియుంక నె
ట్టిమలినులైనఁ జేరిన ఘటింపదె యోగ్యత యందుఁ గౌశికుం
డు మఱియు నన్న దీవనమనోజ్ఞమహత్వముఁ దెల్పుచుండఁగన్. 71

క. అంగములు వొంగ రంగ,ద్భృంగము మజ్జజ్జఘఘంగము జలమా
తంగరథాంగము సరయూ,సంగముఁ దటసౌనుప్రసంగము నెనుకన్. 72

వ. కనుంగొని రంతం దత్సమీపప్రదేశంబున. 73

సీ. తాలహింతాలరసాలసాలతమాల,కృతమాలవృకసాలవితతిఘనము
శుకకంఠనీలకంఠోత్కంఠకలకంఠ,కలకంఠరుతమనోజ్ఞప్రదంబు
సారవిసారవిస్తారసారసపార,పాథారకాసారకాన్వితంబు
రంగత్కురంగాభిమంగభృంగాంగనా,భంగసంగీతశోభాయుతంబు
గీ. గండభేరుండసదవేదండకాండ,గండశోద్దండపుండరీకప్రచండ
జీవజాలావనము మునిజీవనంబుఁ, బావనం బగు నొక్క తపోవనంబు. 74

క. కని రాముఁ డెవరియాశ్రమ, మని మునిపతి నడుగ నాతఁ డాదరమున ని
ట్లనియె ఘనాఘనగర్జా,స్వని దశదిశావదశాధవళిమ మెఱయుకన్. 75

క. విను కామాశ్రమ మిది రా,జనృపాలక తొల్లి మూర్తిమంతుండై పా
వననిష్ఠ గందర్పుఁడు, ఘనతప మొనరించె నిందు గరళగళుండున్, 76

చ. పరమతపం బొనర్పఁ గని భగ్నవకయ్యముతోడిపాత్తుఁ గూ
ర్త రహితుఁటంచు దేవవితతు ల్వినుతు ల్ఘటియింప నేగి చె
చ్చెర వానిచిత్తముం గలఁగఁ జేసిన నాతఁ డెఱింగి యారు భీ
కరనయనాగ్ని దగ్ధముఁ గా నొనరించె నిమేషమాత్రలోన్. 77

ఉ. కాముఁ డెఱుంగునే యుచితకాలగతు ల్దనునిట్లు భీముఁ డై
భీముఁడు చూడ దగ్ధుఁ డయి పృథ్వ్యచలింపఁగ వ్రాలె వ్రాలిన
వ్రాము తదంగసంగమున రాజిలు నివ్విమయంబు నంగసం
జ్ఞామహిమంబు వొందె నని గాధిసుతుం డెఱిఁగించి వెండియున్. 78

క. వి న్నిది నృపాల యుభయపు,రిమ్మధ్యము ఘనకలుమపరితుయ మిచ్చో
టు వ్వన మీవిన శేసుగ,బు న్నతి రేయి యుండుఁ గథపి ప్రొద్దు వోడినన్. 79

క. సంధ్యాకాలికవిధు లన, సంధ్యాగతిం దీర్చి జ్ఞానవారితనిజచి
త్తాంధ్యు లగువారు కౌశిక, వింధ్యాచలధైర్యుఁ గాంచి వినమితు లగుదుర్. 86

ఉత్సాహ. వారి నాదరించి మౌనివల్లభుండు జాహ్నవీ
వారి వే తరించి పోవ వాంఛచేసి పూజ ల
వ్వారిగాఘటించి మ్రొక్కి వచ్చుమౌనివర్యుల
న్వారియాశ్రమముల నుంచి భావ మంచితంబుగన్. 87

క. తరణి యుదయించుచుండఁగ, దరణికులాభరణు లన్నదమ్ములు గొలువం
దరణిన్ భవభయసాగర, తరణిన్ జాహ్నవిఁ దరింపఁ దా నుద్యతుఁ డై. 88

గీ. యానపాత్రమహామునుధ్యాని మౌని, యానపాత్ర మధిష్ఠించి యరుగుచుండ
నతి గరము వొంగ వారిజగర్భానఘుఁ దాల్చు, కతన భువనప్రసిద్ధి గాంచితిఁ గటంచు.

గీ. పావనావనుధేశనందనులు రామ, లక్ష్మణులు లక్ష్మణలు పుణ్యులవారిఁ గడచు
నెడల నెడలనిరవముల నెలమినాల, కించికించిజ్జదూరు సత్క్షీణపుణ్య. 90

సీ. కౌశికుఁ జూచి మౌనిజనకౌశిక యిమ్మధురారవంబు లి
ట్లాశు గతిన్వినంబడియె నాశుగవృత్తి వశంబునంద యా
వేశతచిత్తవృత్తి వతివేడ్క నదభ్రమహాభ్రఘోషనీ
కాశఘనోక్తులం దెలియఁగా నెలవి మ్మివి యెందుఁ బుట్టెనో. 91

వ. అనుటయు. 92

క. సరయూగంగాసంగమ, తరంగసంఘర్షణాద్భుతప్రభవమహో
త్తరనినదము లివి మ్రొక్కెడు, కరము వినీతు లయి ఫాలఘటితాంజలు లై. 93

వ. అని యానతిచ్చుటయు. 94

క. జలరాజసోయగముఁ గ, ల్యలసే ల్గన్నులును గలకవలవాంపుడ
వ్వలను గనుంగొని మ్రొక్కుచు, వలసినయవి యెల్ల మౌనివలనఁ దెలియుచున్.

క. కలమాదిసస్యములు విచి, కలమాలూరాదిలతలు క్ష్మాజాతంబు
ల్గలమానితతీరంబునఁ, గలమారాకుతులు డిగిరి కౌశికయుతు లై. 96

క. వలిగాడు పెదిరికొన న, వ్వలియెుద్ధానన్నిట్లునావ వదలి యరుగుచు
వ్వలిముఖులులాయశరభా, వలిఘోరవఘోరతరరవలి గలదానిన్. 97

గీ. భీకరం బగు దాని శమీకతింత్రి, ణీకశమ్యాకపటుతిక్తకాకకాక
పీలుశాశోకవితతశేఫాలికామ, ధూకబంధూకవటముఖానోకహములు 98

క. కలిగిత మోదూషిత మై, ఖలుంది త్తమువోలె దురవగాహం బై కా
కులపెనుమూఁకలచే సం, కుల మగు దాని నొక పెద్దకోనం గనిరొగ్. 99

చ. కనుఁగొని యియ్యగమ్య మగుకానన మెవ్వరిదో మునీంద్రచం
ద్ర నుడువు మంచు వేఁడిన నతండు మహాదరణంబుమీఱ రా
మ నగవిభేది వృత్రుఁ బరిమార్చిన బ్రాహ్మణహత్య చుట్టుము
ట్టినఁ దగఁ దద్విశాళము ఘటింపఁ దలంపమునీంద్రబృందముల్. 100

ఉ. మానులఁ గూడి పావనకమండలశీతలవారిసేచనా
నూనవిధానము ల్సలుప నుత్కటవహా మలదుమ్కరూశము
ల్మానవనాథపుత్రి విను మానగభేదితనుచ్యుతంబు లై
మానుగ నియ్యెడం బడె నమర్త్యులు మానులు సంతసింపఁగన్. 101

క. ఇద్ధరణిపయింబడిన, న్వృద్ధశ్రవుఁ డంతటం బ్రహృష్టాత్ముం డై
శుద్ధతనుఁ డయ్యెఁ బిదపఁ బ్ర,సిద్ధముగా మలకరూశచిహ్నిత మగుటన్. 102

క. మలదకరూశము లనుచు వి,మలదయ నామములు వెట్టె మానితదేశం
బులు ధనధాన్యసమృద్ధం,బులు రెం డొనరించె సురలు మునులుం బొగడన్. 103

ఉ. ఇందునిభాస్య రామ విను మీగతి సొం పెసలారుచున్న సం
క్రందననిర్మితంబులు పురంబులు చేరి దయావిహీన యై
సుందునిభార్య క్రౌర్యమునిశోషిణితాటక చాలనార్తు లై
యుందలిమానవు ల్పొగడ నందఱ మ్రింగెఁ గ్రమక్రమంబునన్. 104

క. మందుని సిరివలె మనుజుల, మందునకు న్లేకయుండ మదఘునఁ దినెనే
మందు నరేశ్వర వరలే,మం దనుమాడంగ బలసమగ్రుఁడు లేమిన్. 105

క. తనకంటెన్ దలి తనయుఁడు, తనతనయుఁడు క్రూరుఁ డగుచుఁ దత్పౌరుల మ్రిం
గ నలరి యమ్మారీచుని, జననియు వధ్యములఁ జంపు జనని యుతములన్. 106

క. అప్పటి నుండియు రాఘవ, యప్పట్టణయుగము శూన్య మయియుండుట చే
నిప్పగిది మార్గములు కడు, నొప్పక దుర్గమము లగుచు నుండు ననయమున్. 107

మ. ఇటు తాతాటక యగ్ధరాజనమున స్వేచ్ఛావిహారంబునం
దిటు మెప్ప న్నివసించు దాని కెదు రై దేవేశుఁడుం బోవలేఁ
డటు గాన న్వెసదానిఁ జంపి యశ మత్యంతంబుఁ జేకొంటు క
చ్చొటకుం బోవఁగ నీకుఁ దక్కవశమే క్షోణీశ రయోశ్వారికిన్. 108

వ. అని మఱియుం దజ్జన్మబలపరాక్రమప్రకారంబు లుపన్యసించుచుండం ఘాతితసవన
ఘాతిక యగుతాటక యున్నవనంబున కభిముఖు లై చనిచని 109

చ. మునివరు లాజ్ఞ దుష్టమృగము ల్పొగడొందఁగ సన్మునీశ్వరు
ల్వని ముదమొంద రాముఁ డరవిందదళాక్షుఁడు దక్షుఁడై కరం

బున విలు సుందరం బెసఁగఁబూని భుజాబలసూచకంబుగా
నినకులసూతిమార్వి మొరయించె దిగంతర దంతురంబుగన్. 110
గీ. అమ్మహాధ్వని నిజహృదయమ్ము గలఁపఁ, బోతరమున సుకేతునికూఁతు రంత
నఖిలజనములు బెగడంగ నార్చికొనుచుఁ, బండ్లు గొఱుకుచుఁ ద్రుళ్ళిపైఁ బాఱుదేర.
క. కని రతివిశాలకుక్షి, న్మనుజామిషభక్షిణిని సమగ్రవిపక్షిన్
ఘనసవనకరేణుని బ్రహ్మణగుణహార్యక్షి లోహితాక్షిన్ యక్షిన్. 112
వ. కనుంగొని రాసమయంబునం బవిత్రచరిత్రుం డగువిశ్వామిత్రుండు దశరథాగ్రపుత్త్రున
కిట్లనియె. 113
క. మానిని యను ననుమానము, మాని నిశామిహంత్రి దీని మడియింపుము రా
మా నిను యశంబు వొందెదు, మానియమితవృత్తి నీకు మానితము గదా. 114
సీ. అనుచు మహాప్రేమ నారామునకు మౌని, యానతి యిచ్చుచో నన్నిశాటి
కఠురజఃకలితన స్ఫురణనమ్మెవ్వర, మించి రజోవృష్టి ముంచి ముంచి
దూషితం బగుతమోరూషిత వనితెల్పు,మాడ్కిని మాయాతమంబు నన్ని
హేమ్మపత్యము పొట్టవచ్చిన లేమ కనుంగొనుఁ దనుభంగి నోరు తెఱచి.
గీ. చిత్రము శిలామయం బనిచెప్పునట్లు, పరుషపాషాణవిసరము ల్వాఱపి పఱపి
వారిజాప్తేద్ధతేజుల వారి మ్రింగఁ, డాయఁ జనుదెంచెఁ గాలఁబు డాయుకతన.
వ. పెండియు నన్నక్తంచరి. 116
ఉ. మానక పైపయి న్వివిధమాయలు నన్నుచు దుష్టచేష్ట న
మ్మానవనాథనందనుల మానవమాత్రులఁగాఁ దలఁచి దు
ర్మానమదాతిరేకమున మానసు మంటకునంత కుబ్బ న
మ్మానవమాంసభోజి యనుమానము మాని పరాక్రమించినన్. 117
క. కని రాముఁడు తన్మాయా,వినివర్తితశరము వఱపి వితతకృపం దీ
నిని జంపుటు యెట్టులు మా,నినిజంపుటు దోష మండ్రు నిగమఃచారుల్. 118
వ. అని దయాస్వరూపిగావునం బాపి నక్ర్కమరూపిణి విరూపిణిం జేయనిరూపించు
సమయంబున సమీపించి విశ్వామిత్రుండు. 119
ఉత్సాహ. రామ సద్గుణాభిరామ రామ యంచుఁ గ్రవ్యభు
గ్రామ నిష్ఠ చంపకుండరాదు విన్ము తొల్లి సు
త్రామవందితుండు చక్రధరుఁడు భృగునిభామ ను
ద్దామ దుష్టకామఁ జంపి దాన దోష మొందెనే. 120
వ. కావున. 121

సీ. తాటకను వధించి తపసుల మెప్పించి, గహన మిచ్చనము నిష్కంటకంబు
గావించి పుణ్యంబు గట్టికొ మ్మదియును, గాక మదాజ్ఞ నిక్కమున రాశి
జంపిన నీకుఁ దోషం బగుఁ గాని దోషంబు గా దిదె ప్రమోదంబు డాయుఁ
జను దెంచె నేని రజనిచరులకు బలఁ, బధికంబు గావునఁ బథిసు లలర
గీ. దృఢభవద్బాహుబలమాదితేయు లెల్ల, వినుతి సేయంగ రక్కసు ల్వేగ నొంద
దీనిఁ బోనీకు మనుడు నమ్మౌని యాజ్ఞ, నంబుజాక్షుండు సంశయంబు మాని.
ఉ. నైపుణిఁ బ్రస్తరంబులును బాదపము ల్నిగుడించి మించి యే
వైపునఁ దాన యొక్కెడలఁ బ్రత్యగ నార్చెను యుక్తి శుక్తినా
క్షేపితపక్షిరాజ మనఁ జెన్నగుచున్న నృపత్కమేయుమున్
సైపక తత్సహస్రగజసత్త్వము వ మ్మయి తాట సోలుమన్. 123
క. ఆరామ యురంబున ని, ట్లో రామశరంబు పటుతరార్భటిఁ దాఁకన్
ఘోరం బగు తద్రూపము, నీరంధ్రై తొరఁగెఁ దపసినికరం బలరన్. 124
క హాటకవర్ణుఁడు రిపుకర, హాటకకలహంసధైర్యహాటకగిరివి
ష్కూటకుఁ డనుజుఁడు మేలనఁ, దాటక మునియాజ్ఞ నసువు దాఁటుకఁ గూల్పన్.
క. మునిపతి కౌతూహలమున, మునిఁగి భుజాద్రఃణవిత్రముని సద్గుణధా
ముని రాముని నాతనితమ్ముని శాస్త్రవశాస్త్రక్రముని నగ్గించెన్. 126
వ తత్సమయంబున. 127
శా. రాముం బుణ్యగుణాభిరాము భువనత్రాణైక కాము న్మహో
ద్దాము న్విగ్రహకాముఁ జూచుటకు సుత్రాముండు బృందారక
స్తోమంబు ల్దనుఁ గొల్వఁ గల్పసుమవృష్టు ల్మన్న గావచ్చెఁ జే
తోమోదంబునఁ గౌశికుండు భయభక్తు ల్మీఱ నగ్గింపఁగన్. 128
వ. వచ్చి వృద్ధశ్రవుం డమ్మువ్వుర నభివందించి ధామనిధ్యన్వవాయుపయోనిధిసుధాధా
ముం డగు రాముం గనుంగొని విశ్వామిత్రున కిట్లనియె. 129
శా. అత్రాసంబునఁ దాటక న్వివిధమాయానాటకం దుష్టలో
కత్రాణైకపరాయణత్వమున లోకాలోకధైర్యాఢ్యుఁ డీ
పుత్రాగ్రేసరుఁ డాదివిష్ణుఁడు కృపన్ భూభారముం దీర్ప గా
మిత్రాఖ్యాన్వయవార్ధిచంద్రుఁ డయి జన్మించె న్మహీంద్రోత్తమా. 130
ఆ. మఱియు నితఁడు దుష్టమార్గుల ఖండించి, శిష్టజనులఁ బ్రోది సేయుకొఱకు
మహితకరుణతోడ మానవాకారుఁ డై, యవని నవతరించె ననుచుఁ బలికి 131

క. శస్త్రాస్త్రసమితి నృపసం, జాస్త్రునకీ విమ్ము క్షత్రియకుమారునకు
స్వస్త్రాభరణంబులు గదా, శస్త్రాస్త్రము లట్లు సంతసముగా వనుచున్ 132
క. శీకరతరకాశిక నా, నాకాశిక మగువనంబున న్మౌని వినుతుం
డాకాశికు వీడ్కొని చనె, నాకౌకసు లెల్లఁ గొలువ నాకాశికుఁడున్. 133
మ. అకలంకం బగు నస్మదన్వయసముద్రాబ్జుండు రాముండు కౌ
శికు వెంటన్ జనకాజ్ఞ నేగి యట దోషిం గ్రూరఁ ద్రైలోక్య కం
టకి యాతాటకఁ దున్మెనంచుఁ దెలియ న్పాతాళలోకంబువా
రికిఁ దెల్పం జనుభంగి నత్యపరవార్ధిం గ్రుంకె మిత్రుం డొగిన్. 134
క. సమయకదంబకదంబక, మమరం బుష్పించి యతిశయం బగు నాకా
శ మనెడుతటాకమున నొ, క్కమొగిం బువు రాల్చె నన్నగతి సంజయ్యెన్ 135
క తత్సమయోచితకృత్యము, లుత్సాహపురస్సరముగ నొనరించి కడు
న్వాత్సల్యంబున వత్సల, నుత్సంగముఁ జేర్చి ప్రీతి నుపలాలించెన్. 136
వ. ఉపలాలించి. 137
క. పుణ్యజనరహితవింధ్యా,రణ్యంబున రాజపుత్రరత్నంబులతోఁ
బుణ్యస్థలమున సుగుణాగ్రగణ్యుఁడు నిద్రించె నగ్రగణ్యులు వొగడన్. 138
ఉ. గ్రామణి సేవితుండు చతురత్వఘనుండు నిపాతితేంద్రియ
గ్రాముఁడు గాధినందనుఁడు కాశ్యపసారథి వేడ్కఁ బూర్వది
గ్రామ నలంకరించుటకుఁ గా జనుదేరకమున్న భీమసం
గ్రాముల రామలక్ష్మణుల గాఢదయామతి మేలుకొల్పెన్. 139
క. లలి మేల్కొని యానృపపుత్రులు కృతకృత్యు లయి శర్మదుం డగుమునియం
ఘ్రుల వ్రాలిన నెత్తి ముదమున, నలఘుఁడు దీవించి శిరము లాఘ్రాణించెన్. 140
వ. ఇట్లు గాఢాలింగనపూర్వకంబుగా నాదరించి చారుమేఘశ్యాముం డగు రాముం గనుంగొని కామరూపంబు లగురోపంబు లొసంగెదం గొను మని పరిహాపితనిర్వక్రపారిభుజాదండచక్రం బగుదండచక్రంబును వినాశితనిశాచరచక్రంబును పాలితధర్మచక్రంబు నగుధర్మచక్రంబును విపక్షహృదయశూలం బగుశూలంబును నిరాదృతకాలపాశం బగుకాలపాశంబును విబుధమాయావంతం బగుమాయావంతంబును దృఢశక్తి యగుశక్తియు దుష్టసంవర్తం బగుసంవర్తంబును బ్రహ్మాస్త్రబ్రహ్మశిరోస్త్రనారాయణాస్త్రంబులును నళినినిభంబు లగుపద్మనాభ మహానాభ సునాభసర్వనాభంబులును మఱియుం బేరుగల నానాముఖంబులగు శిలీముఖంబులును సంప్రయోగోపసంహారక్రమపూర్వకంబుగా నొసంగుటయు శుచీభూతుం డై పరిగ్రహించి య

ప్రాణంబుల నుద్దేశించి మిమ్ముం దలంచినప్పుడ రాఁగలవాఁడని నిర్దేశించి యనుజసమే
తుం డై కౌశికు నాలోకించి పునఃప్రణామంబు లాచరించి యవ్వలం జనుచుండి సిద్ధి
కృతప్రకాండకాండం బగు నొక్కతరుషండంబుఁ గనుంగొని యివ్వనంబునన్ ఘ
నం బగుతపం బొనరించిన మహాత్ము లెవ్వరనుటయు నిది త్రివిక్రమదేవు పూర్వాశ్రమం
బనియెఱింగించి విశ్వామిత్రుండు వెండియు నిట్లనియె. 141

చ. బలియను చక్రవర్తి గురుభార్గవశాసనవర్తి లోకము
ల్బలిమిఁ దనంతఁ జేర్చి సురపాలకు నోర్చి కడంక నిర్జరా
వలి వెసఁ దోలి వారల నివాసము లోలిఁ బరిగ్రహించి దై
త్యులఁ దగ నేలి జన్నము లనూనము గా నొనరింపుచుండఁగన్. 142

క. నాకౌకసులు వనౌకసు, లై కడుదుర్దశల నొంద నదితి వితతశో
కాకులితమానసాంబుజ, యై కశ్యపుఁ జేరి నిభృత యై యిట్లనియెన్. 143

క. నాపుత్త్రులు దితిపుత్త్రులు, రూపింపఁగ నీకు నొక్కరూప యయిన స
ద్వ్యాపారుల నేలుట దుర్వ్యాపారుల వాజ్ఞ సేత న్యాయము కాదే. 144

వ. అని తన తనయులకుం దన సవతితనయులవలన నైన యుపద్రవం బెఱింగించి సురలకు
శుభాపాదకం బగుదాని నానతీవే యంచు నుడుగక వెడలు నశ్రుకణంబుల నతని
పాదంబు లభిషేకించుచున్నం గనుంగొని తపోవిశేషంబున సర్వంబు నధిగతం బగుట
నొక్కింత విచారించి కశ్యపుం డిట్లనియె 145

మ. తరుణీ యేటికి దుర్వివేకగతి సంతాపించె దుర్వర్దయా
పరు సర్వేశ్వరు నాశ్రితార్తిహరణప్రావీణ్య లక్ష్మీమనో
హరు భూతాత్మకుఁ బూజ సేయ నఖిలార్థావాప్తిచేకూఱు శ్రీ
హరి సేవించినవారికిం గలవె దైన్యక్లేశసంతాపముల్. 146

చ. అని ప్రియమారఁ బల్కి మఱి ప్రియాసహితంబుగ నివ్వనంబున
న్వినుతతపం బొనర్పఁ గని విశ్వమయుండు జనార్దనుండు స
జ్జనసులభుండు వారి దగు శాంత తపోవిభవంబు మెచ్చి మీ
తనయుఁడ నై బలిం జెఱచెద న్స్వర్గలోకము వజ్రి కిచ్చెదన్. 147

క. అని యంతఁ దిరోహితుఁ డై, చని యమ్మునిదంపతులు ధృతిం బగుసంతో
షనిమగ్నులుగా విష్ణుఁడు, జనియించెం గశ్యపాగ్రసతికి నదితికిన్. 148

క. వామనమూర్తిం గశ్యప, వామనయన కనిన విరులవానలు గురిసెన్
రామమహీశ్వర వినుమా, వామనునకు నీకు భేదభావము గలదే. 149

క. ఉపమాతీతుఁడు హరి కశ్యపవనజానువ నాత్మసంభవుఁ డై తా
నుపనీతుఁ డయ్యెఁ దగ నెత్తెఁగి పరిపక పొందె వేదగీర్భ్చు మతనిన్. 150

ఉ. ఆతఁడు తల్లిదండ్రులకు నన్నలకుం బ్రియ మాచరింప నై
త్యాతత నైజ గంధము లయుం బొనరింపఁ దలంపు గల్గి ని
ర్ధూతదశేంద్రియుం డగునిరోధననందను జేరి యామ్మహో
దాత కడంగి శాస్త్రవిహిత మ్మగునర్చన లెల్ల జేయుచున్. 151

మ. కులగోత్రంబులు చెప్పి మొక్కుటయు నక్కుబ్జుండు దీవించి యు
క్కులగోత్రాచలధైర్య దైత్యుఁ గని గక్షోనాథ వి న్నెల్లది
కులగోత్రామగులం బ్రదాత వసుమ సొండాతఁ గా మూఁడే కు
గ్గులగోత్ర న్నిను వేఁడవచ్చితి మరుగ్గోత్రాటనీపావకా. 152

క. ఇమ్మాగనీవోపిన నా, కిమ్ము పదత్రయధరిత్రి నిది యిచ్చుటచే
సమ్మతివడి నీసర్వస్వ మ్మిచ్చినయంతసంతసమునఁ బొదలుదున్. 153

క. అను నెడ భార్గవుఁ డీవల, దనినుడిగిన నడుగకయె పిరివాయున నొసఁగుదై
త్యాగిఁ గొనియాడుచు దానమ్మను గొనియెం బాలుఁ డుదకపూర్వము గాఁగన్.

వ. ఇట్లు విశ్వంభరాదానాదాన మానవనానావ్యచేతం బ్రాప్తం బగుటయు సమ్మ
నిజనంబులు మహామహుం డనియును, సర్వవ్యాపకుం డనియును, నాద్యంతరహితుం
డనియును నోగడువచనంబులు నెగడింప దలంచినచందంబునం బ్రహ్మాండకరం
డంబు వగుల మిగులం బెరిఁగి యొక్కపాదంబున వసుంధరయు వేఱొక్కపదంబున
వియత్పదంబును సమాక్రమించి త్రివిక్రముఁ డై యధికబలు బలి స్పర్ధించి కరుణార
సంబున రసాతలంబునకుం బుచ్చి పిష్టపాగ్రగణ్యాం బగుత్రివిష్టపంబు విష్ణు కొసఁగి
కృతకృత్యుం డయ్యెం బ్రసిద్ధం బగునీసిద్ధాశ్రియంబున ననేకులు సిద్ధిం బొందిరి గని
చెప్పిన మహానందభరితుం డై భరతాగ్రజుండు 155

క. కంటిమి పుణ్యాశ్రమములు, వింటిమి సత్కథలు మిగుల వేడుక మునుఁగం
గంటిమి తీర్థంబులఁ గడు, మంటిమి నీకరుణ సుగుణమహితాభరణా 156

క. అని చాతుర్యంబునఁ బల్కినరాముపలుకు లాలకించి ముని ముద
మ్మునఁ బొంగి రామ నీ వెఱుఁగనియర్థము గలదె ముజ్జగంబులయందున్. 157

వ. అని మఱియు నిట్లనియె. 158

సీ. విశ్రాముడుగ నీపవిత్రాశ్రమమ్మున, నవని మొనర్ప నుత్సవముతోడ
ధారఁ గొన మునులకు దొరకును గడుభీతి, గలిగించి కలఁగించి కలయఁ బన్ని

నీచులు తన్ముఖంబు మహనీయతఁ బూర్ణము గాక యుండునా
లోచనచేసి రెండును ఖలు ల్పరధర్మవినాశ మెంచరే 169

శా. మారీచాదులు మానుషాను లతిదుర్మార్గస్వభావంబుల
న్మారీతు ల్దలపోయ కీతఁ డనుమానంబు న్విసర్జించి యి
ట్లారూఢింగడు నాచరించు సవనవ్యాపారముం జూడఁగా
నైరింపం బని లేదటంచుఁ గురియ న్సాగించి రస్త్రాశ్మముల్. 170

గీ. విబుధహిత మగుధర్మంబు విపుల మగుచుఁ, బుణ్యజనులకు సమ్మతంబుగ నెసంగు
విబుధహిత మగుధర్మంబు విపుల మయ్యెఁ, బుణ్యజనుల కసమ్మతంబుగ నెసంగు.

ఉ. ఆగతి యజ్ఞవిఘ్నకృతికాగత మైనసుబాహుముఖ్యర
క్షోగణవీక్షణం బధికకోప మొనర్పఁగ సానుజుండు ధై
ర్యాగము రామభద్రుఁడు శుభాయతలోచనపుండరీకము
ల్రాగముఁ జెంద వారలశిరంబు లిలం బడ నేయ నెంచుచున్. 172

క. సత్యకరంబున ననుపమ,దివ్యం బగుధను వమర్చి దృఢశక్తి న్వా
యవ్యాస్త్రము సంధించి గ్రహావ్యాహతరీతిఁ దాటకాత్మజు నేయున్. 173

క. ఆశరమారుత మురవడి, నాశను మారీచు నెత్తి యూతుణను పయో
రాశిఁ బడవైచె మఱియుం, గాశరథి గడంగి భీషణం బగు దానిన్. 174

క. దమునో స్త్రము తను నాదం,బమునం భంగింప నాత్మఁదలఁచి మహో
దమునఁ జెలంగు సుబాహు మ,దము నణఁపఁ దలంచి యద్భుతమున విసరుచున్.

ఉ. సాహసవృత్తి నీతి నిశాచరు లక్ష్యముగా నొనర్చి నా
సాహసికోగ్రచంపకుఁడు సారబలుండు వహ్నిమహోజ్జ్వల
ద్బాహుజవంబ్యవయ్యఁడు సుబాహుఁడు వైచి రోప మగ్రతం
బాహుజవంబురూపఱ సుబాహుని గూల్చె నిమేషమాత్రలోన్. 176

గీ. ఆశుగతి నంత విహితాశుగాశుగమునఁ, దక్కునిశాచరుల నెల్లఁ దక్కునీక
యక్కజంబుగ నొక్కటు నక్కడంచె, దక్కఁ గను మునిపతులు ముదమ్ముకొంద;

ఉత్సాహము. అంతగాయ మొందకుండ యజ్ఞపూర్తియైనచో
నంత రామమూర్తిఁ గాంచి యమ్మునీంద్రుఁ డనియెన
త్యంతరాగరసము మీఱ నఖిలసంయములను నీ
వంతరాత్మ వనఁగ నెగడు దవనియందు బుధులచేన్. 178

గీ. మఱియు నమ్మౌని రామలక్ష్మణులఁ గౌఁగిలించి నావెంట జంట నేతెంచి తాట
కాముల వధించి జన్నంబు నరసిప్రోచి, ధరణిఁ గృతకృత్యులైతిరి తమ్ములార. 179

క. చెనక వశము గాని మహీ,జనకరిపుల రక్కసులను సాధించిరి మీ
జనకు నిదేశంబున నిఁక, జనకునిదేశంబునకును జనఁగావలయున్. 180

క. తద్విషయము భావన మే,తద్విషయము వినుఁడు జనకధరణీవిభుఁ డం
చద్విధి సవనార్థము బెం,పద్వ్యపభయయుగంబు యుగము బంధించి కడున్. 181

క. పూత మగుచున్న హలమున, భూతలముం దున్నుచున్న భూతిసమునకున్
భూతధృతికి సీతాసం,భూతం బగుమందసంబు పొడఁగనవచ్చెన్. 182

వ. ఇట్లు పెక్కుసంబుగ నొక్కబొక్కసంబు దోఁచుటయును. 183

గీ. రత్నగర్భ ప్రయత్నపూర్వకము గాఁజి, రత్నరత్నము లిట సుస్థిరంబు గాఁగఁ
బడిలపఱచెనో కాక నాపాలిలక్ష్మి, నను గృతార్థునిఁ జేయ దీనను గలుగునో.

క. అని తత్సమీపమునకుం, జని మనమున నమితసంతసము పొంగారన్
మునిజనులమతమున జనక,ముని యించుక వెఱచి గాని మూతఁ దెఱచుడున్.

చ. చలువునిశ్ప్రయాణమును సంతతరాహుపరోధము న్వాలా
హాలగళుఁ డగ్నిలోచనుఁడు నాజగరావృతుఁ డైవభీము పెం
దలను నివాసముం గని సుధానిధి సైఁపక యిట్లు లొంటి ని
ర్మలుఁ డయి డాఁగెనో యనినమాడ్కి ముఖంబు వెలుంగుచుండఁగన్. 186

సీ. మెఱుపుఁ దీవలలోని మెఱుఁగు నేఱిచి తెచ్చి, నవక మై తగుకుందనంబుఁ దెచ్చి
పువ్వసంపదలోనిపొలుపు నంతయుఁ దెచ్చి, వెన్నెలలోనీటు వెదకి తెచ్చి
కాయంబు గా నబ్జగర్భుండు సవరింప, వలయు లేకున్న నీతళతళయును
కరమిమృదుత్వవైభవమును సౌరభం, బీప్రసన్నత ధర నెందుఁ గలుగ

గీ. దనుచు నుతియింప ననువగు తనువుతోడ, నక్కజంబుగ నుదయించె నొక్కబాల
జనకభూపాలుఁ డానందజలధిఁ దేల, నీలవాల మనోజ్ఞలీలాలవాల. 187

వ. ఇవ్విధంబున నుదయించి. 188

క. సన్నని యవలగ్నంబును, సన్నని సుస్వరముఁ గడుఁ బ్రసన్ననిటలముం
జిన్నతనంబునఁ గలిగియుఁ, గన్నులు పెద్ద యయియుండుట కరమరుదు గదా. 189

గీ. ప్రమదలమదం బడఁపఁగోరి పద్మభవుఁడు, పరమశృంగారముల నేర్చి భామ గూర్చి
వసుధ లజ్జావతులు తల ల్వంతు రనితలంచి పెట్టియఁ బెట్టి డాపించబోలు 190

చ. అని కొనియాడఁ బాత్ర మగునట్టికుమారిక నార్యమంత్రిస
జ్జనగురుసమ్మతంబునను సమ్మద మిమ్మడియై తనర్పఁ ద
జ్జనకుఁడు ప్రీతి నెత్తికొని చయ్యన నాత్మపురంబు సేరి పౌ
రనికర మెల్లఁ జూచి యవురా యని సంతస మందుచుండఁగన్. 191

క. అంతిపురమునకుఁ జని తన, యింతికిఁ దాఁ బుట్టు శిశువు నెత్తికొని కడున్
సంతోషించెదు నామెకు, వింతగ బాలెంత రాలివిధములు దోఁచెన్. 192

ఆ. పురమువారు నంతిపురమువారును హర్ష, జలధిఁ దేలుచుండ జనకుధర్మ
పత్ని పుత్త్రిఁగాఁగ భావించి పెంపఁగఁ, బెరిఁగెఁ దండ్రి వేడ్క పెరుగుచుండ.

క. పేదకు వసుపాత్రమును మ, హోదాతకుఁ బాత్ర మడవి కలవైత్రము సం
పాదిత మగుచందంబున, నాదంపతులకుఁ గుమారి యట్టులు కల్గెన్. 194

క. సీత యన హలపథమునకు, ఖ్యాతిగ నామంబు గలదు కావున మును ప
జ్ఞాత యగుట సీత నఁగన ప్రతీతాహ్వయమున్ భవాని తనరెయొకర్త్యన్ 195

చ. జనకునిచేతఁ బెంపడి జానకినాఁగఁ బ్రసిద్ధ యై మహీ
జననముఁ గాంచి మించి మహిజాత యనం బొగడొంది కామినీ
జనమణి యైనసీత యిలజన్మని యై తనరారెఁ గుందనం
బునకును సౌరభంబు జత బొందినయట్లు క్రమక్రమంబునన్. 196

వ. సంప్రాప్తయౌవన యగుతనయం గనుంగొని తనయంతరంగంబున జనకుం డగు
జనకుండు. 197

సీ. పృథుకుసుమామోదినీ తాతన్వి నే, ఘనతరసుకుఁగూర్చి గుణవతిఁ గాంతు
నాభాగ్యదేవత నీభవ్యపద్మహ, స్తనీక నే పుణ్యపాత్రమున కొసఁగుదు
నీసర్వమంగళ యాసతీతిలక నే, సర్వజ్ఞునకు పెండ్లిపలుపఁ గందు
మృదువాణి నీమనోహరహంసయాన నే, లోకేశునకు నింక లోనుపఱతు

గీ. హంసకమహోర్మికాకంకణాభిరామ, రమణి నీఘనవేణి నేరసనిధికి నొ
సంగువాఁడనొ యనుచు నజ్జనవిభుండు, ప్రమదమున నుండి తా నొకప్రతిన జేసె.

క. తమమందిరమునఁ జిరకా, లమునుండియుఁ బూజ్య మగుచు లలినొప్పెడు ను
త్తమసత్త్వం బగుగంగో, త్తమాంగు చాపంబు నధికతరరూపంబున్. 199

ఉ. ఎవ్వరు బాహుసత్త్వమున నెక్కిడనోపుదు రట్టివారి కీ
జవ్వనిఁ బెండ్లిసేతు నని సర్వజనంబు లెఱుంగఁ బల్కఁగా
నిర్వహుమర్త్యధీశ్వరు లనేకులు తన్మహనీయచాపమున్
దవ్వులఁ గాంచి భీతిలి మదంబఱిపాఱుదు రేమిచెప్పుదున్. 200

వ. అనిపలికి రాముం గనుంగొని. 201

ఉ. ఆవసుధేశుఁ డప్పుడు మహాధ్వరకర్మఠుఁ డై మునీంద్రుల
న్నావిరి బిల్వఁగాఁ బనిచినాఁ డటుఁ గావున సత్వరంబునం

బోవుద మమ్మఖోత్తమవిభూతిఁ గనుంగొనఁ గార్ముకాగ్ర్యముం జే
కేవదలిర్ప నెక్కిడి కడిందియుగంబ్రిమిఁ జూపు మేపునన్. 203

గీ. కార్ముకాగ్ర్యము నుజ్జ్వల త్కార్ముకంబుఁ, బృథివి నేతృత్రయములు నెక్కువెట్ట లేరు
దిట్టతనమున నీ వెక్కువెట్ట నేర్తు, వాయునకు నీకు భేద మింతైన లేమి. 204

క. హరువి ల్లెక్కిడి జగదీ,శ్వరులెల్లను సంతసించుసరణి న్సీతా
తరుణిం బరిణయమై మీ,పురి కరిగెదుగాక యనిఁ బొంగుచు నతఁడున్. 205

క. శిష్యులము యుష్మదంఘ్రిభు,జిష్యులము భవద్దయావిశేషము కతనన్
దూష్యచరిత్రుల నాకపి,శిష్యులను వధించితిమి ప్రసిద్ధము గాఁగన్. 206

మ. భవదీయం బగు నాజ్ఞ సేయుట మహాభద్రంబు తన్మార్గనీ
ధవుఁ దక్షిణశమక్షమానిరతుఁ డద్యత్వప్రక్రియ న్పేయు నా
శివధర్మంబును హృత్సరోగ్రపలాశస్తోమభీమంబు నా
శివధర్మంబును జూడ నయ్యెడకు వేంచేయంగ నిమ్మం బనన్. 207

క. మునిరా జయ్యుద్దలు వెసఁ,గొని రా జనకావనీపకుని ధర్మయుఁ గ
న్గొని రాజును నప్పు డెది,గ్గొని రాజీలీల విన్నకొడుకు కలరింపన్. 208

సీ. కుశనాభుఁ డను రాజుసుచరిత్రంబును, గాత్రికేయుని జన్మకారణంబు
గంగామహత్త్వంబు గంగావతరణంబు, గంగ జాహ్నవి యైన గతియును
క్షీరాబ్ధిమథనంబు క్ష్వేళాభిహరణంబు, నమృతసంభవము దేవాసురాజి
సప్తమారుతముల సంభవక్రమమును, వరవిశాలాపురీవర్ణనంబు

గీ. గాధినందనుఁ డత్యంత గౌరవమున, దెలియఁ జెప్పెడినుడువులఁ దృప్తు లగుచుఁ
గతిపయదినంబులకు రాజసుతులు సేరి, రుచితపవనము మిథిలాపురోపవనము. 209

క. కలకలముగఁ జిలికెడు, చిలుకల విచికిల కుసుమవాటికల జింకల మూ
కల నలవుఁ దేనియవాకల నటుఁగఁసకలశారికలఁ గలయంగన్. 210

వ. కనుంగొని ఘనంబగు విస్మయంబు మనంబునం బెనంగొన. 211

చ. ఘనతరహర్షసంగతపికాగము మోములఁ దోఁప సింహాసఁ
హాసనులు రామలక్ష్మణు లహర్పతితేజులు వాసయుక్తు లై
చని వని నాగరంగవటసాలరసాలవిశాలసాలచం
దనపటుసుందరంబుఁ బ్రకటం బగునొక్కతపోవనాగ్ర్యమున్. 212

వ. సందర్శించి 213

శా. తన్నేత్రోత్సవము నం జరించు నెడఁ జిత్రస్ఫూర్తి నమోల్లస
త్పన్నీరేజరజోఽనం బొకమహాపాషాణము న్సోఁకి వి

క. పలికినపలుకులు మేనం, బులకలెగయఁ జేయఁ దనదుకర్ణముల నమృతంబుం
జిలికినక్రియవినికూటము, దలిదంబ్రాలకొదవనని శతానందుఁడనుఁగా. 252

క. స్వస్థతలేమింగతివా, వస్థ రహిం దొరంగియున్న వనితఁ బ్రతుకని
ట్లాస్థఁ గొని తెచ్చితివికల, హాస్థైర్యులరాజసుతుల నకృత్రిమముగన్. 253

వ. అనిమతితయుఁ విశ్వామిత్రుం బ్రశంసించి రాముంగనుంగొని. 254

క. కటికితనంబున మునియా, కృత్రికం బొకయింతలేక కసలిశపిరూపం
గటకటపాషాణతనై, కృత్రి నవయుమనున్న యింతి కలువమడంపన్. 255

సీ. విశ్వామిత్రుని వెంట సామజుఁడవై వచ్చేసియున్నట్టిపూ
ర్ణశ్రీరాంతుఁడశోవిశాలసదదభ్ర ప్రాభవోపేతుని
విశ్వాత్మున్సనకాదిభావితపదు విశ్వంభరాధారునౌ
త్రైవిశ్వర్యాన్వితుభక్తియుక్తినతిసేయవ్వారు సామాన్యమే. 256

గీ. రామ గామాభిరామ ధరాధురామ రామలానందముని పికారామ ఖలా
రామప్రావృడ్జలదనిభరామశౌక, రామజ్యేష్ఠనత సుందరా! మహాత్మ. 257

మ. అని రామున్నుతియించి కౌశికుని యుమ్యాఖండలుఁ జూపి గా
మునితో నీమునితో యజాతభవసామ్యుండంచుఁ దజ్జన్మగ
ద్భువవైచిత్ర్యతపఃప్రభావసుమహత్వంబుల్ శతానందుఁడిం
పునఁ గీర్తింపఁగ నాలకించి కడు సమ్మోదంబు సంబొందుచున్. 258

చ. అనుజసమేతుఁడద్దశరథాత్మజుఁ డమ్మునిసాధువాక్యము
న్వినితగుభక్తిఁ గౌశికము నిప్రవరున్ జనకావనీశ్వరున్
ఘనఁదగు గౌతమాత్మజు నగణ్యతపోధనులం బ్రతియుంబున
న్వినతియొనర్చెఁ బ్రాతరనవింద దళాక్షుఁడనేక భంగులన్. 259

క. బోధాత్ముఁడు గాధేయుని, గాధల్విని మానలధిక ఘాతుకమత్తా
రాధివ్యాధిహరుఁడు దిన, నాథుఁడస్తాద్రిఁ జేరనడిచె ననుణుఁడై. 260

చ. అవిచగమాద్రిఁ జూచె వెలుఁగా చెఖగాళిరవంబు మీచె జ
కృతకవనిద్రఁ గూరెఁ దిశ ప్రకరంబొగినూరుఁ జీరెడు
కృతవజకోరముల్ జతలు గోరె లపద్మములాబ్జినీమహో
త్సవములు సారెసారెకును జాఱె దచుంబున బేరభోగునన్. 261

వ. ఇదనంతరంబున. 262

క. సలలితనిష్కుటకులఁ గుట్ముల ఖగములగముల నొదలుమునుకొని గ్రామ
మ్ములమికుటముగఁ గుకుటముల రవములు వెపఁగదిశలు మోదంబందెన్. 263

వ. అంత. 264

క. అస్మద్వంశభవుఁడు ప్రరఘుప్రగుణిల్దునిమి సీతఁ గైకొనుటకడు
న్విస్మయము చూతునను మది తస్మయుఁడయి దెంచె నవనఁగఁ దరణి యుదోఁ చెన్. 265

వ. ఇట్లు నిర్వర్తిత సర్వజగత్కార్యుండును ఒరిగక్షితాయ్యుండు నగు సూర్యుండుదయించుటయు. 266

క. కృతకృత్యులైనయారాట్సుతులనులక్ష్మీసుతిజిత సుందరులదృష్ఠ
వ్రతుఁడగు కౌశికునిసమంచితముగ జనకుండుపూజ చేసి సభక్తిన్. 267

గీ. అహితగణభీము సకలగుణాభిరాము లనిశతాంచితధాము శ్రీరాముఁ జూపి
కౌశికమునీంద్రుఁడు జనకక్షితీశు,తోడ నిట్లనిపల్కె సంతోషి యగుచు. 268

క. వసుధేశ్వరవిభవ రా,వసధంబునఁ గలపురారి వరచాపముని
వ్వసుధామాన్య మనకుఁ బూ,ర్వసుధాశవభయదునకు నవశ్యము గాఁగన్. 269

క. చూపు మదచ్చాపముఘు,ణాపము వెస నెక్కుఁ బెట్టి రోపము గూర్పం
దాపుమునీశ్వరులిశునిప్ర,తాపముఁ గొనియాడ సత్యుదగ్రస్ఫూర్తిన్. 270

వ. అనిన సద్ధర్మవర్తియగు జనకచక్రవర్తి యిట్లనియె. 271

క. మారమదహరుఁ డహారుఁడును, మారమణుఁడునైన త్రిపుర మర్దనుఁడును ద
మ్మారమదవ్యయపతిగఁ గు,మార మహేశత్రికిన్ప్రయుంచితమతిన్. 272

గీ. దేవరాతునకొసఁగెఁ దద్దివ్యధనువు, శాసనము వారు గోలెను దన్వయమున
నమితపూతశమికులఁ బూజ్యముగను సుడుఁ, బూజసేయుదు నేను నెప్పుడును దాని. 273

ఉ. తద్ధను వెక్కుఁ బెట్టి ముదమ్మున నాసుతనిత్తునంచు నే
తద్ధరణీతలాధిపవితాన మెఱుఁగఁగఁ జాటుఁ బంపఁగా
నిద్ధబలుల్ మహీధవుల నేకుల నేకచమూసమేతులై
యుద్ధతి నేగుదెంచిరి మహోజ్జ్వలదోర్గరిమాభిమానులై. 274

వ. ఇట్లువచ్చి. 275

క. కదలిచ్చదూరువుఁ గోమలిఁ గదలిగ్పఁగ నేగుదెంచి ఘనకార్ముకముం
గదలింపలేక భీతిం, గదలిచనిరి రాజవరులు గతమత్సరులై. 276

క. పరులెవరునోపరు పరా,త్పరు చాపము నెక్కువెట్ట బాలుండితఁడె
ప్పరుసున నెక్కిడుఁ జూపఁ,బలరుదొప్పఁగ సన్నుతించుచుఁడట్లు మునీంద్రా. 277

వ. అనిపలికి విజ్ఞానజనకుండగు జనకుండు మఱియును. 278

ఉ. బాలకులంచు వీరిసులభంబుగఁ జూచుట పాడిగాదు లో
లాలకజాలక ప్రవిమలానన లంచితదీర్ఘబాహులో

భాలలితుల్యమస్సురవిభక్తశరీరులుధీరులున్మహా
శాలివిశాలవక్షులినచంద్ర సదృశులుదక్షులెంతయున్. 279

చ. అదియును గాక తాటక సమావృతకూటక సంహరించుట
స్సదపడితక్కుమారకుసుబాహునిగూల్చి తదగ్రజన్ము
ర్మదమడఁగించి గౌతము నిమానినిశాపము ప్రశమించుట
న్మదిఁదలపోయవీరలసమానభుజాబలులట్లు గావునన్. 280

క. ఈయతిశీలసమేతుల, కాయతిసత్వనయమాశరాసనముఁ గనం
జేయుటయుచితమయినిగా, ధీయునితోఁ బల్కె యమ్మహీపతి యంతన్. 281

క. భవనాశనభూషణుఁడున్, భవనాశను డైన విభవు బాణాసనము
న్భవనాశనవినుతసభా, భవనమునకుఁ దేర్పఁబనిచె భటుల నవనీపులన్. 282

చ. పనిచిన నేగితద్భటులు భాతిగఁ జేర్చిరి తత్సమీపము
న్వనజభవాద్యశేషసురవందితరూపము దైత్యలోకదు
ర్జనపరితాపము న్వినుతసైన్యమదప్రతిమోగ్రదీపము
జనకనృపాలకార్చరిత సౌరభధూపము నీశుచాపమున్. 283

క. తెచ్చినధనుర్లలామము, వచ్చెరువడిసభికులెల్ల నాలోకింపన్
హెచ్చినముదమునమునితా, దెచ్చినృపసుతులఁ గాంచి ధృతినిట్లనియెన్. 284

గీ. రామలక్ష్మణులార సంగ్రామభీము, లారవణముఖదోర్బలాలావహారు
లారయనసీతృణప్రాయమైన విల్లు, నెక్కువెట్టుఁడు సన్నుతి కెక్కునట్లు. 285

వ. అనిపలికి రామచంద్రు నుద్దేశించి విశ్వామిత్రుండు వెండియు. 286

ఉ. ఈధను వెక్కువెట్టుమనవహీధవులెవ్వరునిన్నుఁ బోలెస
త్త్వాధికులార్తికార్యబహుళాత్త్రహరుండవు నీవు నావుడన్
గాధితనూజుఁ డెంతయు వికాసమునొందఁ దనందగం దప
స్సాధనులంతనంతన తిశల్పవిశల్పకశాంలాసుఁడై. 287

క. దండఁగలనియమిపతులకు, దండములర్పించి యుద్ధృతిం బొప్ప భుజా
దండంబు సాచియెక్కు, దండము వేదండమిచ్చు దండము వోలెన్. 288

వ. వామకరంబునఁదిగిచి. 289

క. మధ్యమతిరాముఁడమిత, సాధ్యుఁడుదగ నెక్కువెట్టి సవరింపధను
ర్మధ్యము సతితీగెఁ దత్సాన్నిధ్యుఁ బొగవారలెల్ల నివ్వెఱపడఁగన్. 290

క. హరుచాపమట్లువిఱిగిన, హరుచాపము విఱిగినట్లు హరిదంతరముల్
గిరిశోని యొక్క వదాధ్వని, గిరిగుహాలం ప్రతిరవమ్ములగ్రోల్కుట్టయున్. 291

ఉ. ఆధ్వని సీత కెంతయుఁ బ్రియం బయితోఁచె సభాసదాళికి
సాధ్వసమయ్యె సప్తకులశైలసరిజ్జలరాశ్యుపేతమై
పృథ్వీచలించె భూజములు పెల్లగిలెం గ్రహతారకంబులు
ద్వ్యత్యయములయ్యె సజ్జనుఁ డద్భుతమందె సమిత్రబంధుఁడై. 294

క. తదనంతరంబ రామునిఁ, దదనుజునింజూపి జనకధరణీపతి ముద
మ్మొదవఁగఁ గౌశికు నత్యం,తదమోదయుతుఁ గాంచి కడుహితంబుగ ననియెన్. 295

క. పుణ్యజనపోషణులు ఖల,పుణ్యజనద్వేషణులు సుభూషణులు గడుం
బుణ్యాత్ములు బుణ్యాత్ముల,గణ్యాత్ములు బాహుపరాక్రగణ్యులు మతియున్. 296

క. ద్విజరాజాననులు లస,ద్విజరాజానసులు ద్రవిణవిజితమహోద్య
ద్విజరాజులు కుందలస,ద్విజరాజులు వీరి సన్నుతింపఁగ వశమే. 297

సీ. అనుపమశక్తిసమన్వితు లగు నీరు,మారులు దలఁపఁ గుమారసములు
భాసురసత్కళాపరిపూర్ణులీమహా,రాజు లాలోకింప రాజనిభులు
చక్రసంరక్షణసమార్గులీజగ,ద్బంధులు ఘనజగద్బాంధుతుల్యు
లధికమహాబలప్రథితులీసదా,గతులు గన్గొన సదాగతిసదృశులు

గీ. పాదకటకాభిరాములై పరఁగునీధ,రాధిపులు సన్నుతింప ధరాధిపులని
జమ్ముగనటంచు రామలక్ష్మణుల గుణవి,చక్షణులలక్ష్మణుల నతిసల్పి మతియు.

ఉ. పెద్దలుమీరు మీకరుణ పెంపున రాముని కీయఁగంటి నా
ముద్దులమూటవంటి సుత మున్నిటువంటి మహాబలాఢ్యులం
బెద్దలచేత వింటిమె సుభృన్నిభధీరులఁ గంటి కన్నులం,
దద్దయు వేడ్కమంటి నిఁకఁ దంగెటిజుంటి విధంబకోరుదున్. 299

వ. అని యంత నిలువక. 300

శా. అత్యంతోత్కలికామిళద్ధృదయఫుల్లాంభోజుఁడై యమ్మహీ
పత్యధ్యక్షుఁడు రామచంద్రునకు శుభ్రఖ్యాతికి న్సన్నుతా
సత్యాధఃకృతమందరాత్మునకు నస్మత్పుత్రిక న్సీత సం
స్తుత్యప్రక్రియతో వివాహమొనరింతు న్సత్యవాక్యుండనై. 301

శా. ఉత్సాహం బభివృద్ధినొందఁగఁ గుమారోద్వాహముం జేయ వి
ద్వత్సామంత పురోహితాప్త సచివవ్రాతాత్మజోపేతుఁడై
సత్సంగత్యరతుండు పఙ్క్తిరథుఁ డాసాకేతనాథుండు సం
పత్సౌఖ్యం డిటువచ్చునట్లు సుగుణామాత్యావలిం బుచ్చెదన్. 302

వ. అనిపలికి విశ్వామిత్రు ననుమతంబు వడసి. 303

ఉ. రాముఁడు లక్ష్మణుండు యతిరాజగు గాధితనూజు నాజ్ఞఁ బూ
ర్వామరపంక్తియుం జెదిమి యన్నియమిప్రభునధ్వరంబు ను
ద్ధామతనొందఁ గాచి ప్రమదంబున దాతని గోతఁ జేయఁగా
భూమితలాభ్రశోభనసమగ్రమునం జనుదెంచి రొప్పుగన్. 304

వ. ఇట్లు చేరేఁచి యలమి యాయింట సాగ్ర్యకాలను నూ బూజితంబగు కాలకాలు
చాపరాజంబుఁ గాలసర్ప్పపరుంబు, సేవమియింగ మేమంతిఁ బ్రాపుటయును.

ఉ. తుర్వరబాహు లిక్ష్ముతి మక్షుయపాగ్రణులన్ మహాయశ
స్తత్వయుఁడైన లక్ష్మణుఁడుఁ దాపసనాథ వరేణ్య లేనాం
చత్పరమానురాగమున సన్నుతిసేయఁగ రామభద్రుఁడు
ద్యత్పురవైరి కార్ముకము నశ్రముఁడై తగ నెక్కువెట్టఁగన్. 306

క. సవరించి వంచుటయు వా, సవనుగ్రగ మయినరొల్లు సవమునఁ జీ గన్
సవినయమ త్రనయసుహా, సవరింపఁగ నింక రామచంద్రునకలగున్. 307

వ. కావున. 308

శా. తద్వైవాహికముం గనుంగొనఁగ నుద్యద్వైభవం బొప్పఁగా
పద్యన్మంత్రిసుహృద్భటార్యసచివాన్వితుండ వై రమ్ము స
త్పద్వైషాంతరపూరితామలయశోధావళ్యసంగ్రామశా
మ్యద్వైరిబ్రజగంధ పఙ్క్తిరథ నిత్యస్నాయమానప్రధా. 309

క. అని మద్వచనంబులుగా, జనవిభుఁడగు పఙ్క్తిరథుని సముఖమునఁ దగ
న్వినిపించి తోడితెండని, తనమంత్రుల ననిచి సమ్మదంబున నంతన్. 310

చ. అనఘులఁ బంకజాప్తకుల వాన్వయముఖ్యసుజన్మరామల
క్ష్మణమునినాథుల న్సుగుణజాలసనాథుల నొక్కమందిరం
బున నివసింపఁజేసి కడుమోద మొనర్చుచుఁ బంధురాజులన్
జనకుఁడు పిల్వఁబంచెను భృశంబుగ జాంఘికసాంఘికంబులన్. 311

క. ముద మొప్ప వెండి విప్రస, ముదయమునం బిల్వ సుభటముఖ్యుల ననిచెం
దదనంతరంబ పౌరులు, దదనుమతిం బడసి వింత దళుకొత్తఁగన్. 312

సీ. కస్తురినీటిచేఁ గలయంపిచల్లించి, ముత్తియంబులఁ గ్రొత్తముగ్గు పెట్టి
విస్తారముగను రంభాస్తంభములు నిల్పి, విపణిమార్గంబులు విశదపఱచి
గుమగుమవలచు సంకుమదంబు వెదచల్లి, తఱుచు గోడలకుఁ జందనముఁ బూసి
గోపురమ్ముల శాతకుంభకుంభము లుంచి, రమణఁ బచ్చలతోరణములు గట్టి

గీ. చంద్రరాజార్క్ష్మాధూపముల్ సంఘటించి, ప్రతిగృహాంబు రత్నదీపములమర్చి
యధికతరకంబళావళుల నంతిపురముఁ, బురముఁ గ్రానేసి రంతు నబ్బురముగాఁగ.

క. సీతాకల్యాణము సంజాతప్రేమమునఁ జూడ సర్వామరులుం
బ్రీతిఁ బురలక్ష్మి పిలిచెను, రీతి న్విరచించి రప్పురిం గేతనముల్. 314

క. తనయావివాహవేళం, దనయల్లుని పాదపద్మధావనకై మే
దిని యిసుకతసపు బల్లేగ, మనఁగాఁ గల్యాణవేది నమరించిరొగిన్. 315

వ. ఇట్లు సకలసంపద్భరితంబగు నిజపురంబుఁ గనుంగొని జనకుండు హర్షోత్కర్షుండై వివాహోపకరణమంగళద్రవ్యంబులు సంఘటించి మహోత్సుకుండును సఫలమనోరథుండునగు నద్దశస్యందనరాజకుమారుసామయుండె నంతం దనచే నామంత్రితు లగుమంత్రులు. 316

శా. తూర్ణప్రక్రియ నేగుదెంచి కని రత్యుత్కాశ్యమత్తద్విపో
దీర్ణారామభటచ్ఛటానుపరిఘానిష్పద్విటంకాంబురా
కీర్ణార్ణఃపరిపూర్ణపుణ్యసరసీక్రీడావలాంచత్ప్రపా
నిర్ణీతధ్వజసౌధగోపురరథానీకంబు సాకేతమున్. 317

గీ. ఇట్లు గనుఁగొని తత్పురాహీనవైభవంబునకు సంతసింపుచు వచ్చి యచట
సమయమునకట కుండు దశరథక్ష్మాతలేశ్వరుండు కొలువుండు కడకేగి నింకువేడ్క.

సీ. ఇట్టిపల్కు దుర్వీశ్వర మీపెద్దపట్టి లక్ష్మణుచెంటఁ బెట్టి గాధి
పట్టితో నంప నప్పట్టున నెట్టనఁ, బెట్టుతాటకను రెక్కపట్టుఁ జేరి
దిట్టయై దానిఁ గన్పట్టి గట్టిగఁ జంపి, పట్టి యుట్టట్టునఁ గొట్టిపట్టు
పొట్టప్రయ్యఁగఁ జేసి కట్టెఁడిమారీచు, గట్టుమానిచి వార్ధిఁ బెట్టనటుచుఁ

గీ. బెట్టి యంతసుబాహుండె దొట్టి సోఁకు, పట్టులను జిట్టిపట్టి నరికట్టి కాలు
పట్టణపుఁద్రోవ వెసఁబట్టునట్టు మట్టి, మట్టి మునిజన్నమును దుదిముట్ట జేసి. 319

గీ. హేళికులవాళి వినుపదగాళి జేసి, హాళినౌకనాతిఁ గవవిజితాళిఁ జేసి
కేళిమిథిలకువచ్చి బుధాళివినుత, పాళి దంభోళిసమమిందువాళిధనువు. 320

క. వెసనెక్కువెట్టి దివిచిన, బసచెడి తత్కార్ముకంబుఁ బటికింప నిలిం
పసభాసదుల దరిపడం, బ్రసభంబున లక్ష్మికమున భగ్నంబయ్యెన్. 321

గీ. రాజులెరికి నెక్కుడ రానికార్ముకంబు విఱిచిన రాముని కడిఁదివచ్చి
వాసుమాలిక సీత ఘనంబుఁగా వివాహమొనరింపఁ జాల నుత్సాహమొదవె. 322

శా. తద్వైవాహికముం గనుంగొనఁగ నుద్యద్వైభవం బొప్పఁగా
విద్వన్మంత్రిపురోహితాశ్రితజనాన్వితుండవై రమ్మ స

ప్తద్వీపాంతరపూరితామలయశోధావళ్యసంగ్రామశా
మ్యద్ధైర్యారివ్రజగంధపఙ్క్తిరథ నిత్యస్తూయమానప్రథా. 323

క. అని జనకుండాడిన విధ,మని దశరథుతోడ వార లనుటయుఁ దెలియ
న్విని యన్నరపతి యంతింతని చెప్పఁగరాని సమ్మదంబున మునిఁగెన్. 324

వ. మఱియును. 325

చ. అమృతముఁ ద్రావునప్పుడు బలారియు నయ్యమృతంబుఁ దెచ్చుచో
నమృతమరీచిదీప్తి విహగాధిపుండు న్మదిసంతసించిన
ట్లమృతమయంబులైన సచివావళివాక్యము లాలకించి తా
నమితముదంబు నొందె మహితాత్ముఁడు పఙ్క్తిరథుండు సత్ప్రభన్. 326

క. మతిహీను లైనతనయుల, మతమునకకరంబు నలరు మహిఁదండ్రిను స
మ్మతి సుతులభినుతులైనన్, మతి జనకుఁడు సమ్మదాబ్ధిమగ్నుఁడు గాఁడే. 327

వ. తదనంతరంబున. 328

క. కాంతలకు న్మణియుండన, కాంతలకున్ గ్రథితచంద్రకాంతోజ్జ్వలకు
ద్ధాంతలకుందచ్ఛభవ్య, త్త్వాంతంబెఱిఁగించి గాఢతరహర్షమునన్. 329

ఉ. తచ్ఛుభవార్తనెంతయు ముదంబునఁ జాటఁగఁ బంచిపట్నము
స్వచ్ఛగుళుచ్ఛపూర్ణకలశప్రకరధ్వజసాలభంజికో
ద్యచ్ఛవిమత్పటామల ఘటాలి యలంకరణంబు సేయ నూ
త్నచ్ఛదభూషణాదుల ఘనంబుగఁ దాను నలంకృతాంగుఁడై. 330

సీ. శిష్టచరితులు వసిష్ఠాదిమునివరు,ల్మహిఁ సుమంతాదిమంత్రివరులు
ప్రకటవైణిక వైణవికనికరంబులు, వందిమాగధభటబృందములును
బుణ్యకాంతాజనమ్ములు విబుధోత్తము, లాప్తు లాశ్రితులు మహాత్ములును
బృథుసైంధవములు గంభీరవేదిములతు,ణాంచిత్రప్రోన్మత్తహాస్తికములుఁ
గీ. గొడుగులునుఁ దోడరాఁ బెద్దగొడుగు పెండ్లి,కొడుకు గాఁగలఁడనుచు నెక్కుడుకుతూహ
లమున వారాంగనానటనములు సెలఁగ, రుచిరతుంగోల్లసద్రథారూఢుఁడగుచు. 331

క. ఘనఘనపటహపటహపటు, పనవోద్ధ్వకజర్ఝరాంక్యబంధురభేరీ
ధ్వనుల వియత్పథ మవియన్, ఘనురథ్యావ్యయుఁడు మందగమనము పేర్మిన్. 332

ఉ. బాహుజవంశ్యు లెల్లెడలఁ బ్రస్తుతి సేయ నృపాగ్రగణ్యుఁడు
త్సాహత వేగి కాంచె విలసత్పరిణాహవివాహవస్తుసం
దోహవిశేషనిష్కుటమనోహరపుష్పరసప్రవాహని
ర్వ్యూహసువర్ణరత్నభరితోజ్జ్వలగేహవిదేహనంతటన్. 333

క. కని తత్పురంబుఁ జేరం, జనునెడ వారించి జనకజననాథుఁ డెదు
ర్కొని తూర్యధ్వను లులియఁగఁ, గొనియాడుచుఁ బురికిఁ దోడికొనిపోయి వెసన్. 334

మ. ఉపకంఠంబున మాగధు ల్పొగడఁగా నుత్కంఠ దీపింప న
న్నృపతిశ్రీగవు నిట్లు తెచ్చి మహితోన్నిద్రోపచారంబుల
త్యుపకారంబులు నాచరించి మణిహర్మ్యోజ్జ్వలాభిఖ్యమై నూకవా
సుభాగ్యంబుగ నుంచి యుల్లసితచిత్తోత్ఫుల్లనీరేజుఁ డై. 335

తే. బంధురశ్రీల వినుజగద్బాంధవంశ, బంధురం బగునీదుసంబంధ మస్మ
దన్వయాబ్ధికిఁ జంద్రోదయంబు కరణిఁ, బెంపుఁ గావించె జనులు నుతింపు మండ. 336

ఆ. అని నుతింపజనకుఁ డాదరించె నుపప, ర్యావిశేషములకు నాత్మ నలరి
యాప్తమంత్రిబాంధవాత్మజోపేతుఁ డి, ట్లనియెఁ జెలియఁ దశరథాధిపుండు. 337

క. యత్నంబులఁ బడయఁదగని, యత్నంబులు మాని తిరుగునట్టి తపస్వీ
రత్నంబులు మీచెలిమికి, యత్నము సేయుదురు పొగడ నలవియె మిమ్మున్. 338

తే. అట్టిమీరలు వేడ్క మాయట్టివారి, బాంధవముఁ గొనియాడు టబ్రంబు గాదె
నాకుమారకుపూర్వజన్మసుకృతంబుఁ, బొగడవశమె వాణిస్వయంభువులకైన. 339

వ. అని యిట్లొకరినొకరు చతురవచనంబుల నగ్గించుచున్న సమయంబున. 340

క. రాముని లక్ష్మణుఁ గొనివి, శ్వామిత్రుం డేగుదెంచి వాసవహితుఁ డ
బ్భూమివిభుఁడు దశరథుఁ డెం, తో మోదముతోడ మ్రొక్క దీవన లెసఁగెన్. 341

క. నాకావాసులు పొగడఁగ, నాకార్యము నిర్వహించి నాకార్యజనా
నీకస్తుతులు ఘటించి పి, నాకశరాసను శరాసనము విఱిచి తగన్. 342

క. భూతనయన్ భూతనయా న్విత,స్వైరియుఁ బఁగోరు శీతాంశుముఖు
న్నీతనయు రాము ననుజా న్వితుం, సుముము మహావినీతుం బ్రీతున్. 343

క. అని మునిపలికినపలుకులు, తనచెవులకు నెలమినమృతధారలు వోలెం
దనుపుటయు మ్రొక్కి నిలిచిన, తనయుల దీవించి పులకితశరీరుఁ డై. 344

ఉ. భూమివిభుండు మోహమునఁ బుత్త్రులఁ గౌఁగిటఁ జేర్చి వారినె
మ్మోములు మోమునిల్పి శిరముల్ గడుమూర్కొని చెక్కుటద్దము
ల్లేపుఱయొనంగ ముద్దుఁగొని పెద్దయుఁబొద్దు సుతోపగూహనా
ద్దామసుఖాతిరిక్తుఁ డయి దాపసవర్యునితోడ నిట్లనున్. 345

క. మునుగుణహీనులు గుణవం, తునిసంగతి గలిగి సద్గుణులగుదురుగదా
మునుగుణహీనులు వినునా, తనయులు గుణవంతులైరి తగునీకరుణన్. 346

వ. అని మఱియు ననేకవిధంబుల నభినందించి నాదవసందర్శనంబునం దనివినొందనిపురం
దరవిభవుండగు దశరథునికడకు జనకనియంత్రితుండగు నొక్కమంత్రిపుంగవుండు

మఱునాఁ డరుదెంచి మిమ్ము నిజసభాభవనంబునకుఁ దోడ్కొనిరా నన్నుఁ బనిచె నని
చెప్పుటయు నాతఁ డంత. 347

సీ. పురుషోత్తమునిచతుర్భుజములు నా సుతు, లక్ష్మి సేవింప విద్వన్నుతుండు
ఘనుఁడు వసిష్ఠుండు గనఁగొని తనకును, త్తమములాంగికమంగళములఁ దెలుపఁ
బుణ్యకాంతాజనంబులు సేస లాలుకంగ, బ్రాహ్మణోత్తముల దీవనలు సెలఁగ
స్తుతిపాఠకులు మాగధులు నందడింపఁగ, నాప్తమంత్రులు భటులను సరింపఁ
గీ. తూర్యములు మ్రోయ నార్యులు స్తుతులు సేయ, గాయకులు పాడ నహితుల గర్వమూడ
సురభిసౌరభవిసరమారుతము విసర, మందగమనంబు గాల నమందలీల. 348

కనకజకుంభంబులఁ గల, ఘనమౌక్తికవితతి వెలిఁగఁ గాన్పించెను నా
స్తనములఁ బ్రబల స్తనవగో, స్తనులు మెఱయంగ వారసతులు నటింపన్. 349

వ. రాజవిభవంబున రాజమందిరద్వారంబుఁ జేరం జనునప్పుడు. 350

మ. మును మున్నై చనుదెంచె నొక్కసతి రామున్ రాజమార్తాండమణిం
గనుసద్వాంఛఁ గుమారు నెత్తికొని వేడ్కన్ మించి రామోల్లస
త్తనులీలం గలధౌతభూధరమహాత్సౌధాగ్రభాగప్రభ
ద్ధనితాంతోజ్జ్వలరత్నదీప్తిఁ దనరత్కాంతి న్విడంబింపుచున్. 351

ఆ. కాంతయొకతె చంద్రకాంతశిలావృద్ధ్య, వేదిఁ దలఁపు చాఁటు వెట్టి మాచెఁ
దాపమొదవు మరునితూపులకలనిభ, యుంబు నొవ్వలేనియది యుంబోలె. 3 2

క. భూవరుఁ గాంచెనుత్వరగన, లేవిరుఁ దాల్పకయుఁ గాంచి నిడివనుదెంచెం
భావజనిభుఁ గాంచినచో, నీ వెసడలునంచు నొక్కనెలఁత మెలఁకువన్. 353

ఉ. కాటుకలావ్యలకయోర్తు రాముఁ గనువేడ్కం గింకిణీధ్వానయై
వాటం బైనకవాటయుగ్మము భుజద్వంద్వంబునం బూనియే
పీటన్లేఁదు భవాదృశుండనుచు నర్వీస్వర్గలోకాఖిలం
బాటం జిత్రపుఁబత్రయుగ్మమమర స్పందించెనో నాఁ దగన్. 354

క. బాలయొకతె నీలోత్పల, మాలిక యూదంగ సంభ్రమంబునఁ గాంచె
న్నీలతను నతని నతనిని కోలఁ, నిటమీఁద లెక్కఁగొనననుభంగిన్. 355

వ. తత్సమయంబున. 356

గీ. పార్శ్వములనుండి చూచెదు పౌరబాలి, కావరేక్షణములు నాసికలు దనర్చెఁ
బ్రకటనీలోత్పలాబ్జచంపకసుమములఁ గలయఁ గ్రుచ్చినవనమాలికల విధమున. 357

వ. అట్టిమహోత్సాహజనకసమయంబునం బురంబునం గలపురంధ్రీజనంబులుదమలోన. 358

క. మనసీత కితఁడు దగుసీ, తనికి న్మనసీత మిగులఁ దగుఁ దుల్యవయో
ఘనలావణ్యాదుల నని, కొనియాడిరి గుంపుగూడికొని బహుభంగిన్. 359

చ. అనితనపుత్త్రి రాముఁ గొనియాడెడు పౌరజనాళివాక్యము
ల్విని చతురబ్ధిబద్ధపృథివీతలరాజ్యము దన్ను నొందిన
ట్లనుపమసమ్మదంబున మహాత్ముఁడు పఙ్క్తిరథుండు వొంగి త
జ్జనకసభాప్రదేశము బ్రశస్తవిశేషమణిప్రకాశమున్. 360

వ. కనుంగొని యదంభశాతకుంభకుంభిత భద్రకుంభరంభాస్తంభోజ్జృంభితంబును నవనవ నవరత్నవిరచితోచితవేదికాకవాటసోపానతోరణభద్రాసనకుడ్యచిత్రకంబళ విచిత్రమణి పుత్త్రికా దీపదీపితంబును బటీరనీరతుషారవారపృక్తంబును గృత్రిమరూపాతిరిక్తంబును బరిణయాలోకనాగత చాతుర్వర్ణ్యవ్యక్తతనుచిత్రప్రదేశవిశాలంబును సమస్తవస్తుప్రశస్తంబును సకలజననయనాభిరామంబునగు జనకమునిచక్రవర్తి సభామంటపంబు దరియం జొచ్చు నవసరమ్మున. 361

ఆ. ఎదురులేనికడిమి నెసఁగుపఙ్క్తిరథక్షితీంద్రు జనకుఁ డప్పు డెదురుకొనియెఁ
దావులెల్లఁ గ్రోలి తగుకీతివలిగాలి, యెలమిమీఱ యున్న యెదురుకొనఁగ. 362

వ. ఇట్లెదుర్కొని. 363

ఉ. వేడుకగౌరవించి పృథివీవిభుఁ బఙ్క్తిరథు న్మహారథుం
దోడుకవచ్చి రాముని వధూజనకాముని గీర్తికాముని
జూడఁగ వేఁగుసేయు పరిశుద్ధమనోరమకాయు గేయుసా
మ్రాడధికోపలక్షణు సురప్రతిపక్షవిదావిచక్షణున్. 364

క. నముచితరోపశమనసముసము, చితరూపప్రదీప్తు సౌమిత్రిఁ బరా
క్రమనిధుల భరతశత్రు, ఘ్నమహోత్తయులను బొగడుచుఁ గడువాఙ్మునన్. 365

క. అద్రిబలీనుల నతిథై, ర్యాద్రుల రాఘవుల శాత్రవాద్రిపవులఁ గం
భద్రత్నభద్రసముచిత, భద్రాసనముల వసింపఁ బంచి ముదమునన్. 366

క. భూవరుఁ డనంతరంబున, ధీవరుఁ డనఁదగు నరుంధతీవరు వార్ధ
వీవరతుల్యు వసిష్ఠుని, దేవర్షిప్రణతుఁ బరమధృతిసంయుక్తున్. 367

గీ. తాపసవిరహితు నుచితచితాపసనమున, సన్నుతింపుచు నతనినివిష్ణుఁ జేసి
నతజనవిధేయు గాధేయు నతులభక్తి, విహితమగుచోటఁ దగనుపవిష్టుఁ జేసి. 368

వ. మఱియుం దగినవారి నుచితాసనాసీనులం జేసి దానుం దగినయెడ సుఖోపవిష్టుండై సర్వజనమనఃప్రమోదంబుగా సుప్రసంగంబు సేయుచుండి జనకుండు దశరథున కిట్లనియె. 369

క. జాతానందంబున భూజాతప్రాముననుఁ దదనుజాత స్వాముఖా
జ్ఞాత న్మత్తనుజాతన జాతోపమనేత్ర మదనసాయకగాత్రన్. 370

గీ. లలితపరిమళనూర్మిళ లక్ష్మణునకు, నొసఁగెదనటంచు మిగుల సొంపెసఁగఁ బలికి
మఱియు నిట్లను దశరథక్ష్మాతలేంద్రుఁ, డగ్గలంబైన సంతోషమతిశయింప. 371

క. అనఘాపఘ్నులకు న్మని జనశత్రుఘ్నులకు భరతశత్రుఘ్నులకున్
ఘనముగ నొసఁగెద హితులవు, వనఁగ మదనుజుని తనయల నలఘుతనయాలన్. 372

వ. అని యిట్లు రామలక్ష్మణభరతశత్రుఘ్నులకు శ్రుతకీర్తులగు భూమిసుతోర్మిళామాం
డవీశ్రుతకీర్తుల నొసంగి వివాహంబులు సేయువాఁడుగా నిశ్చయించి పలికినవమ్మహీ
విభుండు మహానందంబునొందెం దక్కిన సభాసీనులును సమ్మదంబునం దేలి యాడుచుం
జనకుం బ్రశంసించి రయ్యవసరంబున. 373

క. పరమమునీశ్వరచేత, స్సరోజవాసి యగు రామచంద్రుని కతనం
గరమొప్పెం దత్సభహిమ కరోదయావసరదుగ్ధకంధి విధమునన్. 374

వ. అంత. 375

క. తనకులజులకు వివాహము, లని రాగము మీఱ సమ్మదాంబునిధి మునిం
గినచందంబున నరుణుం, డనుపమరాగమునఁ బశ్చిమాంబుధి గ్రాలెన్. 376

మ. తనసాంగత్యము వాసి పద్మహితుఁ డంతర్ధాన మొందన్ సభో
వనజాతాయతహస్త పిల్వ ప్రియ విప్రాతధ్వను ల్మించె వా
తనికేపోకకుఁ గ్రోధతామ్రగతి సంధ్యారాగముం దద్వియో
గనిదాఘాంబుకణప్రకారమున నక్షత్రంబులు వ్యాపిలెన్. 377

క. ఇనునికరస్పర్శము మానిన విరహము నొందు పద్మినీక్రమమున న
య్యినునికరస్పర్శము మానిన విరహము నొందు పద్మినీక్రమము మరెన్. 378

చ. అహితుఁ డహీనతేజుఁ డగునప్పుడు డాఁగి తదంచితప్రభా
రహితుఁడుగా నెఱింగి పరరాష్ట్రము నాక్రమణం బొనర్చిన
ట్లు హిమకరుండు తేజుఁ డగునప్పుడు డాఁగి తదంచితప్రభా
రహితుఁడుగా నెఱింగి తిమిరంబులు ముంచె ధరాకటాహమున్. 379

వ. ఇవ్విధంబున సూర్యాస్తమయం బగుటయు నద్దశరథుండు. 380

ఉ. పాపవిదూరుఁ డమ్మఖిలభర్త నుతింప నుతు ల్భజింప ఘుం
టాపథ మొప్పఁ జేయుచు ఘనప్రభ రాజగృహంబు జేరె ను
ద్దీపితరత్నదీపకరదీపసహస్రము లుల్లసిల్ల ధా
త్రీపతి తూర్యగానఘధరీకృతసర్వదిగంతరాళుఁ డై. 381

క. ఆర్యులు వసిష్ఠకౌశికు, లార్యాపతిసములు సముచితాత్తశయులు ని
ర్ధార్యు లమాత్యశ్రేష్ఠులుఁ, గార్యజ్ఞులు బొగడఁగ నుపకార్యం జొచ్చెన్. 382

వ. ఇవ్విధంబున భృత్యామాత్యపుత్త్రమిత్రసమేతుండై విడిదికిం జని యుచితవినోదంబులం దగిలి రోచులం జంద్రమరీచులం జులకనసేయు ధౌతకలధౌతశయనసౌధాగ్రభాగంబున గగనధునీవీచుల న్వీచులలితపవనం బొలయ వీణానాదంబు లులియ సుఖనిద్రం జెందియున్నంత. 383

సీ. పద్మిని మదనతాపంబునను గృశించెఁ, బద్మిని సంతోషభరిత యయ్యె
క్షీరతుషారసంసిక్తయై మహి యొప్పె, సరగఁ దుషారసంచయ మడంగెఁ
గువలయంబునకు నెక్కొనియె వికాసంబు, గువలయుస్మయము సంకుచిత మయ్యెఁ
దతతారకాప్రభాతతి మందమై తోఁచె, నోలిఁ బ్రభాతవాయువులు వీచెఁ
గీ. దామ్రచూడధ్వను ల్మ్రోసెఁ దద్దయూర్పు, తామ్రమైయొప్పె నంత భక్తజనవృజిన
కర్తనుం డుదయించె వికర్తనుండు, భసతమోవిభావసుఁడు విభావసుండు 384

గీ మిహిరునుదయంబునకుమున్న మేలుకాంచి, కృత్యములు సల్పి దశరథనృపవరుండు
సగఁ బుత్త్రిచతుష్టయసహితుఁడగుచుఁ, గౌశికవసిష్ఠులకుమ్రొక్కి కడుముదమున.

క. కార్తాంతికదత్తేద్ధము, హూర్తంబునఁ దనయులకు మహోగ్రవయులకుం
ధూర్తాంతకులకు గురితవి, హార్తాంతికులకును బరిణయము లొనరింపన్. 386

వ. కృతోత్సాహుండై యుండునంత జనకుండు సుతల నలంకృతలం జేయం బుణ్యసతుల నియోగించుటయు నవనిజం గదిసి. 387

క. అమ్మానిను లిట్లని రో, యమ్మా నినుఁ బెండ్లియాడునతఁడు ఘనుఁడు రా
వమ్మా విద్యుల్లతికా, సమ్మానితదేహ సుగుణసహితస్నేహా. 388

క. అని పలుకుటయు న్లజ్జా, వనతానన యైనసీత వనజాతనిభా
క్షి నజాతసామ్యఁ గొని మజ్జనశాలకు నేగి యుచితసంభ్రమలీలన్. 389

ఉ. ముద్దులగుమ్మ లందియలమ్రోఁత లెసంగఁగ డాసి క్రద్దనం
దద్దయు వేడ్క రత్నఖచితం బగునొక్క పసిండిగద్దియ
న్నద్దిను నుంచి యూఘనమనోహరలోచన పద్మహస్తతో
నుద్దియటుంచు నతేఁ దమయుల్లము లెంతయుఁ బల్లవింపఁగన్. 390

గీ. కమ్మనూనియఁ దలయంటి యొమ్మెగులుకఁ, గడిగి యుద్వర్తనమువర్ణకమునఁ జేసి
మజ్జనంబు ఘటించిరి మనము లలరఁ, బుష్కరాననలు మనోజ్ఞపుష్కరములఁ. 391

వ. ఇవ్విధంబునం బెండ్లిపాటలు పాడుచు మంగళస్నానంబు సమాచరించి. 392

క. ధారాధరములు ఘనము ల,పారద్యాయములు నయ్యెఁ బ్రతినిధి యగు నే
యారామకురుల కనుచును, నీరారిచె నొక్కసతి వినీలత యొప్పన్. 393

క. అభ్రాకలగ్న మనుచు విమ,లాభ్రాలక యైనసీత యానందమున
న్విభ్రాజితముగఁ గట్టెను, శుభ్రాంశుక ముఖి యొకర్తు శుభ్రాంశుకముల్. 394

సీ. నిర్మలస్ఫటికవినిర్మితఫలకభా,స్వన్మధ్య సముదితచ్ఛాయ యనఁగ
నమృతకళాపూరితాంతరితుం డగు, శశిలోన మించులాంఛన మనంగఁ
దుహినవారోదయోత్ఫుల్లమనోహర,పద్మాంతరస్థబంభర మనంగఁ
బ్రకటసమ్మార్జితముకురబింబాంతర,నిహితసుందరహరినీల మనఁగ

గీ. నలకములు వాయఁగాఁ ద్రోచి యలికభాగ,ఫలకమునఁ గమ్మతావులు జిలుక సమ్మ
దంబునను సర్వజనులచిత్తంబు లలరఁ, దిలక మొనరించె నొకసతీతిలక మలుక.

గీ. ప్రకటసౌవర్ణసాలభంజికలలోన, మెలఁగుజనకతనూజాత తెలియరాద
టంచు నొకసతి యానవా లుంచెననఁగఁ, జెక్కుటద్దంబునం దొక్కచుక్కఁ బెట్టె.

ఉ. పాటలగన్నితో స్త్రియును పాటలగంధియు నైనసీతకు
న్సాటివధూటి లేదనుచు సాటిరచించెద నంచు మించుఁ బ
న్నీటఁ గుశేశయంబులన నీటుగుకన్నులు తోమి వాటమౌ
కాటుకఁ బెట్టె నొక్కసతి కాటుకపిట్టల గేలిసేయఁగన్. 397

క. పారపరిమళితఘనఘన,సారమిళితగంధ గంధసారంబున వి
స్తారానందంబున నొక,సారసలోచన యొనర్చెఁ జర్చ మహీజకున్. 398

సీ. పువ్వుఁబోణికి మల్లెపువ్వులు దంతము, ల్జవ్వని నాసిక నవ్వుపువ్వు
తాపసంపెంగపువ్వు తనువు దిరిసెంపుఁబువ్వు, మానినీమధ్యంబు మట్టిపువ్వు
పల్లవాధరనవ్వు తెల్లనిపువ్వులు, పాలుపాయపొక్కిలి పొన్నపువ్వు
మోము తామరపువ్వు మోవి నుంకెనపువ్వు, కన్నులు నల్లనికల్వపువ్వు

గీ. లేల నీపువ్వు లిఁక నని హేలనొక్క, కాంతకరవీరమందారకర్ణికార
మాలతీచాంపకజాజీసుమావళుల నొ,సంగె సీతకుఁ గడుసొంపెసంగుచుండ. 399

వ. ఇవ్విధంబున నూర్మిళా మాండవీ శ్రుతకీర్తులకు ననుపమశృంగారంబు లొనరించి
యున్నంత నక్కడ. 400

ఉ. అంగన లంగజన్ముఁ డని యంగవిలాసము సన్నుతింపఁ బు
ణ్యాంగనలొప్పఁ బాడుచుఁ బ్రియంబున రాము నభంగమంగళా
భ్యంగన మాచరించి హృదయంగమవాణ్యు లలంకరించి రు
ప్పొంగుచు భూరికాంచనవిభూషణము ల్పరితోషణంబునన్. 401

గీ. తనరుకస్తురిబొట్టులాంఛనము గాఁగ, మందహాసంబు చంద్రికామహిమ దనర
సరసవాక్యము లమృతరసంబు గాఁగఁ, జంద్రుఁడనఁ దగి శ్రీరామచంద్రుఁ డొప్పె. 402

క. లలిఁ గంతు జయంత వసంత లలితు లన నొప్పు లక్ష్మణ భరత శత్రు
ఘ్నుల శత్రుఘ్నులఁ గామినుఁ, లలంకరించిరి విభూషణాంబరపటలిన్. 403

వ. తదనంతరంబున. 404

క. నయముల న్నవినయాలం బరిణయయోగ్యులఁ బద్మపత్రనయనల నసమా
నయశోధన్యుల నాత్మజ, నయులఁ గని జనకుఁ డతిఘనం బగువేడ్కన్. 405

చ. చెలఁగి మహార్థనిశ్చయముఁ జేసి విదేహమహీధవుం డమా
త్యులఁ బిలిపించి యద్దశరథున్సుతబంధుసమేతుఁ బంకజా
ప్తలలితవంశ్యుఁ దోడ్కొని ముదమ్మున రం డన వార లమ్మహో
జ్జ్వలుకడ కేగి యిట్లని రవారణ వాక్చతురత్వ మేర్పడన్. 406

మ. అవనీనాథభవత్తనూజులకుఁ గల్యాణంబుల న్సేయ నీ
దివసం బుత్తమమంచుఁ దెల్పఁ డని వైదేహుండు మమ్మంపినాఁ
డవనీదేవసమావృతుండ వయి ర మ్మాలస్య మింకేల భూ
ధవులెల్లం గొనియాడఁ బుత్త్రహితభృత్యశ్రేణితో నొప్పఁగన్. 407

గీ. అనిన ముదమంది యొసఁగె నయ్యంబరమణి,వంశమణి వారలకు ననవద్యమణులు
నమితతాంబూలజాంబూనదాంబరాది, మహితబహుమానములు బహుమానముగను.

వ. ఇట్లొసంగి. 409

చ. దశరథుఁ డంత బ్రాహ్మణవితానసమర్చనమాచరించి స
త్వశరథు లైన మానులు ముదంబునఁ దోనరు దేర శత్రుసు
ద్వశరథసామజాశ్వభటవర్గసమేతముగా నరేశ్వరు
ల్వశులయి కొల్వఁ బౌరజనవారము సంతసమంది చూడఁగన్.

క. రాజముఖుల సేసలు నీ రాజనములుఁ గొనుచు నుచితరాజపథమునన్
రాజవిభవమున నఖిలధ, రాజనులు నుతింప బంధురాజసహితుఁడై. 411

వ. చనునవసరమ్మున. 412

చ. తెలియవు కామినీజనుల చిటుగుపాటలు వేణునాదము
ల్దెలియవు చల్లుసేసలును దేవత లొల్కొడుఁ బుష్పవర్షము
ల్దెలియవు పంకజాప్తకరదీధితులు న్మణిభూషణాంశులుం
గలసి మెలంగుటం ధరణికాంతుఁడు పెండ్లికిఁ దర్లుచుండఁగన్. 413

క. అమరధునీవిమలాంభః, కమలవనీవిహరణంబు గాంచి మలయభూ
భ్రమరుత్కిశోరమధ్వ, శ్రమజనితనిదాఘబిందుసంచయ ముడుపన్. 414

వ. దశస్యందనుండు పురందరు చందంబునం బురంబువా రబ్బురంబంద నందనులం బురవప్రముఖులం బురస్కరించికొని యమంద మహానందకందకందళితహృదయారవిందుండై మందసుందరగమనంబున వందిమాగధులు సందడింపఁ జిందంబుల రొదలు గ్రందుకొనం దరణికిరణంబులకుం దెఱపి యీని గొడుగులం దనివినొందు మఁడేఁదన కెలంకుల నందఱుమంత్రులుం దగురీతి నడువం దఱుచుగ సుందరమకరందబిందువులు జిందు మందారకుసుమసందోహంబులు బృందారకబృందంబు లందంద గురియింప ధరణీబృందారకు లాశీర్వదింపం గొందఱు సుందరులు గ్రంతలుగొని ముందఱ నడువ నందమ్ములగు నందియ లడుగుందమ్ములం దొడిగి చందనం బలంది యిందిందిరంబులం దెగడి సంక్రందననీలంబులం గ్రిందుపఱచు కురులుం దోవలందిరస్కరించు కన్గవలపొందికలుం, గందుకంబులం ద్రిప్పు కుచద్వంద్వంబులుం, గుందనంబుడంబు డిందుపఱపందగు తనుచ్ఛాయలుం, దలిరాకు మోవులుం, దెలిచెక్కులును, దరస్మితంబులుం, గుందరదనంబులుం గలిగి యువజనంబుల డెందంబులు గొందలంబందఁజేయుచుం దన మోసలం దండలాసకాది వివిధవిధానంబులం దాండవంబు సల్పుచు నందకేని పదుప్రందెఱవలరుగం జందనోదకంబునం దడిసి గందవడి నందంబగు రాజమందిరంబుందరి యంజొచ్చు నవసరమ్మున నహల్యానందనుండగు శతానందనిభుండు శతానందుండు తోడరా జనకుం డెదుర్కొని తోడ్కొని చని. 415

క. సముచితముగ నర్ఘ్యముఁ బాద్యము నొసఁగి యనంతరము ముదంబున మణిపీ
ఠములిడి జనకుఁడు పూజించె మహారథు దశరథుం బ్రసిద్ధుల మునులన్. 416

వ. ఇట్లు పూజించి సమస్తజన మునిజనకదంబానందజనకంబు లగువచనంబుల దశరథున కిట్లనియె. 417

చ. బుధజనమాన్య పఙ్క్తిరథ భూనుతకీర్తికి రామమూర్తికి
న్మథితవిరోధిలక్ష్మణకుమారునకున్ భరతాభిధానమా
గధతనయాకుమారులకుఁ గావలయుం ద్వరలో వివాహము
ల్పృథివి శుభస్యశీఘ్ర మను పెద్దలవాక్యము లాలకింపమే. 418

వ. అనుటయు మహానందమగ్నుండగు దశరథుండు. 419

క. తదవసరంబున సుతులకు, సదమలులకు నలువురకుఁ బ్రశస్తంబగున
భ్యుదయార్థ మధిపుఁ డొసఁగె, న్మొదల న్విప్రులకుఁ బాఁడి మొదవులఁ బొదలన్.

క. విధివంతంబుగ జనకుఁడు, మిథిలానాయకుఁడు విప్రమిత్రసహితుఁడై
మధుపర్కంబులొసంగెను, మధుపసమానాలకులకు మనువంశ్యులకున్. 421

వ. తదనంతరంబున. 422

క. కలధౌతధౌతసుందర, కలశోదక మాత్మపత్ని గైకొని యొసఁగన్
న్వాలకులిశజలజరేఖా, కలితన్నృపకుమార పదయుగములు గడుగుచున్. 423

క. అన్యములగు దానమ్ములు, కన్యాదానసదృశములు గావనియొసఁగెం
గన్యాదానంబులు జన,మాన్యులను న్వేస దశరథమహిపతులకున్. 424

వ. అంత. 425

చ. చెలఁగి యరుంధతీపతి వసిష్ఠుఁడు రాముకరంబుఁ బూని ని
ర్మలనవరత్నగుంభనవిరాజిత దివ్యవివాహవేదికో
జ్జ్వలకనకాసనంబున నివష్ణునిఁ జేసి సువాసినీజన
మ్ముల నియమించె నింపెనయ భూతనయం దగఁ దోడి తేరఁగన్.

క. సీరపథజాతయుఁ బ్రతి,సీరమఱుఁగు వెట్టి స్ఫుటకుశేశయముఖులా
శీరుకులు సెలఁగ సునా,సీరనిభుఁడు రామచంద్రు చెంతనునిచిరన్. 427

క. ఒకరినొకరు చూచెడు వేడుకలు కడునొల్మలకెత్తుడు వధూవరదృ
క్ప్రకరిమఁగవిరినఁదగెయవ,నిక యమునావిమలవాహినీభంగమనన్. 428

వ. అంత. 429

ఆ. తెఱవ లుచితరీతిఁ దెరఁదలువమరల్ప, జనక భాగ్యరాశి జనకతనయ
తఱుఁగులేని వార్ధితరగల నుదయించు, సిరివిధమునఁ దేజుసిరి వహించె. 430

గీ. లలితమాలా మనోహార గళయగు చుఁద,మాలసాలంబు సరసకేలాలత యన
నీలమేఘంబు చెంత శంపాలతయన, బాల తనరారె రామనృపాలుమ్రోల. 431

ఉ. సీతకటాక్షవీక్షణము శ్రీరఘురాము ముఖప్రభాతకం
జాతవిచిత్రచిత్రకిత సారసరంగ మనంబుఁ గా సము
ద్యోతితమయ్యె రాఘవ మహోజ్జ్వలదృష్టికరంబు మీఁ బెభూ
జాతసుఁ గజ్జలంబునఁ బొసంగనొనర్చిన చెక్కుచుక్కగన్. 432

వ. తదనంతరంబున. 433

మ. కులకాంతాతిలకావలీవలయిత క్షోణీకుమారీ పవి
త్రలసచ్ఛీర్ష మున న్మునీంద్రజనమందారుండు రాముండు తాఁ
దలఁబ్రాల్దోయిటఁబట్టి వేడుక భుజద్వంద్వంబుపై కెత్తియుం
చె లతాగ్రంబునఁ బుష్పగుచ్ఛమనరం జిలం గులాచారతన్. 434

ఉ. మోమువికాసమంద భుజమూలరుచుల్ వెలుఁగొందఁ గంకణ
స్తోమఝుణంఝుణంకృతులు సొంపెసఁగం జిఱునవ్వు నవ్వుచుం
దామరసాక్షు లెంతయు ముదంబునఁ దోయిలి హెచ్చరింపఁగా
రాముశిరంబు మీఁదఁ దలఁబ్రా లునిచెం దగ భూమిజాతయున్.

ఆ. మఱియు వేడ్కచేత మహిజాత తా శ్వేత, మౌక్తికములు రాముమస్తకమున
నునుపఁబూన హస్తయుగము గదుర్చె నై, యాచువారికెల్ల శక్తియనఁగ. 436

వ. తన్మహోత్సవ సమయంబున. 432

క. జనములు క్రిక్కిఱియ దమ, వనరాశి నెఱింగి యుచితజాలపథములం
జని రాముని పరిణయమున, జనకాజితలీల మెలఁగె శ్వసనాంకురముల్. 438

క. గళదురుగండశిలాన, గ్గళభేరీధ్వనుల రిపులు గలవరమందం
గళమున బంగారపు మం, గళసూత్రము రాఘవుండు గట్టె మహిజకున్. 439

ఉ. భూజనకల్పభూజుఁ, డజపుత్త్రతనూజుఁడు రాముఁడంచితాం
భోజదళాక్షుఁ డిద్ధవిధి భూమిజఁగూడి మహాముదంబునన్
లాజల నాజ్యధారల దశంబునఁ దృప్తినిఁగా నొనర్చె న
వ్యాజకురుప్రసాదుని నుతాగమనాదుని జాతవేదునిన్. 440

ఆ. సర్వసాక్షి కర్మసాక్షివంశజుఁ డగ్ని, సాక్షికముగ సీత సారసాక్షి
నఖిలలోకసమ్మతాక్షీణలావణ్యఁ, బ్రీతితోడ నిట్లు పెండ్లియాడి. 441

శా. శోభాగాత్రి నరుంధతీసతికి నత్యుద్రోరుచారిత్రకుం
బ్రాభాతామలపద్మనేత్రకు సతీవ్రాతాంచితస్తోత్రకు
న్సౌభాగ్యం బభివృద్ధినొంద రఘువంశస్వామి రాముండు సీ
తాభామాసహితంబుగా నెరఁగె నుత్కంఠం బ్రజల్మెచ్చఁగన్.

క. జనుల కరుంధతి మఱఁదలఁ, జినమాత్రన కల్గు సర్వసిద్ధులుఁ దన్మా
నినిఁ బ్రత్యక్షముఁ బూజిం, చిన సత్సౌభాగ్యసిద్ధి చేకుఱుటరుదే. 443

వ. మఱియుం బంచమహాశబ్దంబులు బ్రాహ్మణాశీర్వాదనాదంబులు ననూనపుణ్యాంగనాగాననాదంబులు నింగిముట్టం జెలంగుచుండ వసిష్ఠుండు లక్ష్మణ భరత శత్రుఘ్నులకు నూర్మిళామాండవీశ్రుతకీర్తులఁ బాణిగ్రహణంబులు క్రమంబున నడిపిన నిట్లన్నదమ్ములు నలువురు నేకకాలంబునం గృతోద్వాహులయి వధూసహితంబుగా జాతవేదునకు నమస్కరించి వసిష్ఠ విశ్వామిత్ర శతానందప్రముఖ నిఖిల మునిప్రకరంబునకును దశరథజనకభూమీధవులకుం బ్రణమిల్లి స్వస్తివచనంబులు పరిగ్రహించి యున్నంత. 444

క. దానోత్తమమగు భోజన,దానంబున జనులఁ దనిపెఁ దజ్జనకుండుం
దానంబుల నురుభక్తి వి,ధానంబుల ద్విజులఁ దనిపెఁ దజ్జనకుఁడున్. 445

వ. అంత. 446

గీ. గంధసింధురయవనకంభాణసుభట,రత్నధేనుసువర్ణవస్త్రప్రశస్త
దాసదాసీవిశేషశయ్యాసనంబు, లరణము లొసంగె వేర్వేఱ నల్లురకును. 447

క. విశ్వానందప్రదస,ప్తాశ్వకులుల యుచితపరిణయంబులు గనియుం
ర్వీశ్వయ దీవింపుచు న,వ్విశ్వామిత్రుం డభీష్టవృత్తిం జనుడున్. 448

ఉ. కూఁతులఁ జేరఁబిల్చి జనకుండు మహాదరణంబు మీఱ వి
ఖ్యాతపతివ్రతాత్వవిధితాంచితశీలము లెల్ల వారికిం
బ్రీతి నుపన్యసించి యలరించి విశేషవిభూషణాంబర
వ్రాతసువర్ణరత్ననికరంబు లొసంగె మనోముదంబుగన్. 449

క. హరికును సిరికిని మానవ, శరీరములు దాల్చినట్టి చందమున వధూ
వరు లీసీతారాములు, గర మొప్పిరటంచు జనుల కలకల మెసఁగెన్. 450

క. అధికతరానందుఁడు దశ రథ,ధరణీవిభుఁడు దత్పురంబున మహిత
ప్రథఁ గొన్ని దినంబులు జన,కధరాధిప మాన్యుఁడై తగన్వసియించెన్. 451

వ. ఇట్లుండి యొక్కశుభదినంబున జనకుననుమతంబు వడసి యపరిమితపరిచారికావృ
తలగు వధూరత్నంబులును మహానందయుతులగు సుతులును సమస్తబంధుమిత్రా
మాత్యులును సముచితవాహనంబు లధిష్ఠించి యనుగమింప రథారూఢుండై పుణ్యకా
మినీజనమ్ములు సేసలు చల్ల నమ్మిథిలాపురంబు వెలువడి తన్ననుపవచ్చు జనకచక్ర
వర్తి నధికధర్మమూర్తి సపరివారంబుగా నెట్టకేలకు మరల్చి యుచితయానంబున
సాకేతాభిముఖుండై 452

క. దారితశాత్రవనిచయుఁడు, దాయఁడు పఙ్క్తిరథుఁ డేగు దారిభయదముల్
క్రూరతరమారుతంబులు, దారుణముగ వీచె నత్యుదగ్రస్ఫురణన్. 453

గీ. ఇట్టి దశ్శకునంబుల నెట్టిగట్టు, పుట్టునో యని కులగురువునకుఁ దెల్పి
తద్విధంబెల్ల నాత్మబోధమునఁ దెలిసి, యూరకుఁ డాతని కిట్లనునంతలోన. 454

సీ. క్షత్త్రియకారణ్యాగ్నిహోత్రమహోజ్జ్వల,త్కీలకుఠారంబు కేలఁ గ్రాలఁ
గాంచనాచలకటకవిశాలవక్షస్థలంబునఁ దెలిజన్నిదంబు మెఱయ
నఖిలమానవనివహాభయంకరము లైన,దృష్టుల నంగారవృష్టి లొలుక
నధికప్రతిభ దెల్పు నరుణకాంతి వహించు, ముఖమునఁ గనుబొమ ల్ముడివడంగ

గీ. దశరథుం డిచ్చు పూజావిధానములఁ బరిగ్రహింపక యాగ్రహోదగ్రుఁ డగుచు
నిగ్రహానుగ్రహసమగ్రు నీరజాక్షు, రాముఁ జేరంగఁ జని భృగురాముఁ డలుక. 455
క. విత్రాసస్థితివిగత,క్షత్రము గావించి తొల్లి కశ్యపునకు ని
ద్ధాత్రిసమస్తము నొసఁగిన, ధాత్రీసురముఖ్య జామదగ్న్యు నెఱుఁగవే. 456
క. హరుజీర్ణచాప మెక్కిడి, పురుషోత్తముఁడ ననికొంచుఁ బొంగెదు పురఘ
స్మరుచాప మచలమేనర,వఁ డని నినుఁ బొగడిరెల్లవార లెఱుఁగమిన్. 457
క. నాచేతం బూజితమై, నాచేతం బొల్చు పద్మనాభు ధనువొగి
న్నీచేత నధిజ్యమగుడు, నీచేఁతలు చిత్రములని నెఱినమ్మనగున్. 458
క. ధృతి నాధను వెక్కిడిన, స్మృతి నిను భావింతు సత్త్వమహితునిఁ గాఁ గా
కతిమష్కర మేనియు నిం,దితరాజసతామసములు నీకుం గలవే. 459
చ. అని తను జామదగ్న్యుఁ డనయంబులు వల్కఁ గార్ముకమ్ముతో
వ నతని సత్త్వముంగొని ఘనంబుగ నెక్కిడి రామచంద్రుఁ డా
తని వరపుణ్యలోకసుపథంబులు గూల్చి మదంబడంచి తం
డ్రిని నిజబంధుకోటి నలరించె ననంత భుజాబలాఢ్యుఁడై 460
గీ. రాము వలగొని భార్గవరాముఁ డల మ,హేంద్ర పర్వతమునకునై యిచ్చ జనియె
రామునటుఁ బుచ్చి దశరథరాముఁ డలమ,హేంద్ర విభవంబుతోఁ దండ్రికెలమి మ్రొక్కె.
క. రాజకులవరాళి రాము ప,రాజయమును నిజజయంబు రహినెసఁగింపన్
రాజాననుఁ డగు సత్రత,నూజు న్సౌందర్యజితమనోజుం బొగడెన్ 462
వ. ఇట్లు పొగడి. 463
క. తనరవసిష్ఠుం డెఱిఁగిం,చినవిధమునఁ దొలఁత భయముఁ జెంది జనముఁ గై
కొనఁ గల్గెనుచుఁ దన మన,మున గురుల యమేయబోధమునకుం బొంగెన్. 464
వ. మఱియును రామభద్రు ధైర్యౌదార్యశౌర్యౌదార్యగాంభీర్యస్థైర్యాదిగుణంబు
లగ్గించుచుఁ దమరాకకు నలంకృతంబగు సాకేతంబుఁ గౌతుకంబునం గనుంగొని.
క. పురజనము లెదురుకొన రథ,కరితురగరథ్యాపణమగు ఘంటాపథముం
దరిసి చనునవసరమ్మునఁ, బురుషులుఁ దెఱవలును రాముఁ బొడఁగని తమలోన్. 466
సీ. జనకునియాజ్ఞ విశ్వామిత్రుతోఁ జేగి, తొలుదొల్లఁ దాటకఁ దున్మటయును
నీచమారీచు మున్నీట ముంచుటయును, బిదప సుబాహునిఁ జదుపుటయును
గౌశికుజన్నంబుఁ గాపాడుటయు నొక, గ్రావంబు నంగనఁ గా నొనర్చు
టక్కృపీటజూటు కార్ముకము ద్రుంచుటయును, భ్రాతృయుక్తముగా వివాహమగుట

గీ. తండ్రిమదిలోని భయమెల్లఁ దలఁగఁ బఱచు, రాము మార్గాని యతనిగర్వం బడంచి
చెలఁగి సాకేతమునకు విచ్చేయుటయును, జెప్పికొని చాల సంతసించిరి మఱియును.

చ. పురవరవర్ణినుల్ వివిధభూషణభూషితలై సువర్ణనూ
పురరవము ల్సెలంగఁ గడుఁ బొంగెడు రాగరసంబు పేర్మి గో
పురవరసౌధభాగములఁ బొందుగ నిల్చి నరేంద్రు రాము గో
పురవరు పౌరకామినులపోలికఁ జూచిరి సేస లొల్కుచున్. 467

వ. తత్సమయంబున. 468

సీ. అగణితసౌధయాత్రా నిగమాంబురాశికి, రాణించు తనరాక రాక గాఁగ
సమధికభయదరాక్షసచమూపశులకుఁ, దనదర్శనము సుదర్శనము గాఁగ
వీతవిద్వేషులౌ విబుధనాయకులకుఁ, దనచరిత్రములు చిత్రములు గాఁగ
నహితరాజన్యసైన్యములకుఁ దనప్రతాపంబు మిక్కుటపుఁదాపంబు గాఁగ

గీ. సత్యధర్మక్షమాదయాశౌచరత్న, సమితికిఁ దనగుణములు గుణములు గాఁగఁ
దమ్ములనుగూడి రామచంద్రప్రభుండు, వేడ్క విహరించె నప్పురవీథులందు. 469

వ. ఇట్లఖిలజననయనోత్సవంబుగా విహరించి. 470

క. తమ్ములు తరుణీయుతులు లుచి, తమ్ముఁగఁ దనుఁ గొలువఁ దాను దైతాయుతుఁడై
తమ్ముఁగను వేడ్క నధికము, దమ్మందుచు నున్న పట్టిశల్లుల కెరఁగన్. 471

వ. అంతఃపురమ్మునకుం జను నవసరమ్మున నవసరమ్ము లురమ్ములఁ గరమ్ము మెఱయుఁ
గరమ్ముల గంకణనికరమ్ములు మెరయఁ గుచమ్ము లొరయఁ జతనమ్ముగ రతనమ్ముల
చెక్కిన పసిండిపళ్ళెరమ్ముల ననురూపమ్ము లగుహిమవాలుకాదీపమ్ముల దీప్తులు
తమతలప్రదీప్తులకుం దగ నవిక్రిందుపఱచుట తగవనిన చందమ్మునం గొమ్మలు
బాహుబిసమ్ములు సాఁచి యొసంగు నీరాజనమ్ముల రాజిల్లుచు నెడ నెడ వినో
దమ్ము లగువీణానాదమ్ములకు ముదమ్ము నొందుచు జనయిత్రులపంపున నెమొగ్గాని
పుణ్యకామినీజనమ్ము లొసంగు రక్షాకరణమ్ములకు సమ్మతించుచు నుభయపార్శ్వ
మ్ములనుండి యిభరాజగమనలు శుభాచారలాజమ్ములు చల్లుచు నాసేచనక మ్మగు
నిజమూర్తివిలాసమ్ము నాలోకనమ్ముఁ గావింప మనోహరరత్నకుంభనవిచిత్ర
భిత్తికానికాయంబులవలనను లసమానాసమానకాయమానంబులవలనను నిరుప
మానమానినీబృందంబులవలనను రమణీయతరపదార్థంబులవలనను గరం బొప్పు
మాతృగృహంబుఁ దరియం జని. 472

ఉ. తమ్ములఁగూడి రాఘవుఁడు తల్లులపాదతలమ్ము లాత్మయా
ధమ్ములు సోఁక మ్రొక్కిన ముదమ్మున వీరు లిచ్చి క్రచ్చి ప్రే

మమ్మునఁ గౌఁగిలించికొని మక్కువ లెక్కువ లై తనర్ప నా
యమ్మలు ముద్దులాడిరి ప్రియమ్మున నిద్దఫుఁజెక్కుటద్దముల్. 473

క. చన్నుల దుగ్ధంబులు వాల్గన్నుల నానందబాష్పకణములుఁ గలిగెం
గన్నులపండు వగుచు సుతుల న్నలువురఁ జూచుతల్లులకుఁ జిత్రముగన్. 474

వ. తదనంతరంబున. 475

సీ. అంబుజంబులమీఁది యళులవిధమ్మున, మోమున నలకలు ముసుఁగువడఁగ
నడుము లున్న వని తెల్పెడుభంగిఁ గాంచికా, కింకిణీక్వణనము క్రీలుకొనఁగ
నీలమేఘమ్ముల మేలమ్ములాడువి, ధమ్మునఁ జికురబంధమ్ము లమరఁ
బదతలమ్ముల కెంపు లొదవ సుధాధౌత, సౌపానములు లక్షణచ్ఛాయ లొందఁ

గీ. జిఱునగవు లాననములకుఁ జెన్నొసగ్న, వినయములు రూపములు వాల్చు ననువుగాఁగ
నల్లనల్లన జనుదెంచి యా త్తలకును, మోదమునఁ గ్రొత్తకోడండ్రు మ్రొక్కుటయును.

క. శ్రీవనితాపతురాక్స్తు, లీవనిత లటంచుఁ బ్రీతి నెత్తికొని కడుం
దీవింపుచు నెంతయు సంభావించిరి మానసములు ప్రమదం బందన్. 477

క. శ్రీకరమూర్తులఁ బుత్త్రిల, నాకోడండ్రఁ గని యుబ్బి యాడిరి విమలా
స్తోకచరిత్రలు కౌసల్యాకైకామగధతనయ లానందమునన్. 478

క. వనితాయుతుల న్సుతులం, గని జననీజనకు లమితకౌతుకమతు లై
రనిచెప్పి తనమనంబున, ననుపమ హగుహర్ష మంతకంతకుఁ బెరుఁగన్. 479

చ. పరమకృపారసానిలయ భావితమానిసుచిత్తసారసా
నిరుపమసాహసావినుతనీరజగర్భకృపీటు రేత్రసా
గురుతరదేహసారపరిమండితదుష్టనికృష్టరాక్షసా
భరిత మహాప్రసాద హితభక్తజనావన సక్తమానసా. 480

క. శరణాగతజనశరణా, శరనారదకీర్తి సనితసంకాశరణా
స్ఫురణో క్రిమదాశరథా, చరణా వేంకటమహారసాధరశరణా. 481

మాలినీ. ప్రణవదఖిలసూరీ భక్తలోకోపకారీ
ప్రణవఘనవిహారీ భాసురానందకారీ
రణవిజితసురారీ బ్రధ్నచంద్రానుకారీ
తృణకలుషవిదారీ సర్వదా నిర్వికారీ. 482

గద్య. ఇది శ్రీసూర్యనారాయణ పదాబ్జధ్యానపరాయణ భూమశైర్య
వినయ రామసార్యకేయ పండితసేవాసముచ్ఛ్రాయ క్రొత్తపల్లి
లచ్ఛయ ప్రణీతం బైన దాశరథివిలాసం బను మహాప్రబం
ధంబునందు ద్వితీయాశ్వాసము.

శుభమస్తు.

అవిఘ్నమస్తు

శ్రీశారదాంబాయైనమోనమః

# దాశరథివిలాసము.



## తృతీయాశ్వాసము.



శ్రీమద్వేంకటశామ్యోద్ధామ ధరాధామ సుగుణధామ రవిసుధా
ధామ నయనవందితసుత్రామా రిపుభీమ సుందర విజితకామా. 1

వ. అవధరింపు మనంతరకథావిధానంబుఁ బ్రచేతసుం డగుప్రాచేతసుం డిట్లని చెప్పం దొడంగె నట్లు సుప్రాప్తమనోరథుం డగుదశరథుం డొకనాఁడు నిండుఁగొలువుండి యమాత్యులం గలయం గనుంగొని. 2

ఉ. సంతతి లేదు లే దనువిచారము దూరముఁ గాఁగ బుత్త్రులన్
సంతసమందఁ గాంచితి ససాగ్రబలాఢ్యులు వారు వారికిన్
స్వాంతతకీర్తిశాలురఁ గసంగఁగ సన్నుతపుణ్యశాలినీ
సంతతు లైనకన్నియలఁ బక్కఁగఁ బెండిలిచేసితిఁగదన్. 3

క. నాకులము గడువెలింగె, న్నాకులసతీర్థ్రి యమ్యో నాకుల మొప్పె
న్నాకులకాంతల మతులున్, నాకులములుగా దనర్చె నాకులకరుణన్. 4

వ. అని పలికి వెండియు. 5

క. బుద్ధివికల మగుదృష్టియు, వృద్ధం బగుబలము చెడునివేకం బుడుగు
న్వృద్ధతగదిరివజనునకు, సిద్ధం బతఁ డెంతయుం బ్రసిద్ధుం డైనన్. 6

ఉ. అర్థిజనావనంబు వివిధాహితసైన్యముకాంతిశక్తితా
నిర్వారణంబు నంచితమనీషయుగోమవిశేమకోమని
స్త్రీగణనంబు రాజులకు సన్మతధర్మము లౌటఁ జూడఁగా
నర్హులు గారు రాజ్యమున కంధులు వృద్ధులు బుద్ధిహీనులున్. 7

వ. అని యిట్లు తనకృశాంగత్వంబును, వృద్ధత్వంబును, రాజ్యపాలనాసమర్థత్వంబును దేటపడం బలికి మఱియును. 8

ఉ. నించెదఁ గీర్తి దిక్కుల ననిందితధాముని రాముని బ్రీతి
స్థాపించెదఁ బూజ్యరాజ్యమున శిష్టజనానుమతుండనై యను

ష్ఠించెద సద్వ్రతంబులు విశేషధృతి న్సుకరంబుగా నధి
ష్ఠించెద సంతసం బెసఁగ దివ్యసువర్ణసువర్ణహార్మ్యముల్. 9

వ. అనిన విని యద్దశరథునకుం దదీయసుమతిప్రపుంగవు లఖిలజనానుమతంబు వడసి యి
ట్లనిరి. 10

క. ధాతవు విద్యలకు న్మాం, ధాతవు విక్రమసమృద్ధి దాతవు శుభసం
ధాతవు జనముల కివ్వసు, ధాతల మేలిమిని తొంటిధరణిపులక్రియన్. 11

వ. ఒక్కనాఁడు నీయందు గోరంతకొఱంతఁ గంటిమే యని పలికి మఱియును. 12

ఉ. నీవు మహానుభావుఁడవు నీతివివేకవిశారదుండవుం
గావున నిట్టిసత్సుతులఁ గాంచి సుఖింపఁగఁ గంటి వీరలం
దేవసమాను లగ్రజుఁ డుదీర్ణభుజాబలుఁ డార్యలోకసం
భావితుఁ డీవుమారకునిఁ బట్టముఁ గట్టఁ దలంపు టొప్పగున్. 13

ఆ. పట్టభద్రు రామభద్రునిఁ గనుంగొని, యల్లసిల్లుచుండ దద్దినమున
సఖిలజనులు నేము నలరుదు మీవు ను, జ్జ్వలుఁడవగుదు వట్లు చలువు మనఘ. 14

వ. అని తనమనంబున కనుకూలంబుగాఁ బల్కుటయు నమ్మహీవిభుండు. 15

గీ. చెలఁగి శ్రీరామపట్టాభిషేకమునకు, వలయుసంభారములు దెండు కలను మెఱసి
యేతదుత్సవ మెఱిఁగింపుఁ డెల్లవారలకు నొనర్పుఁడు పురము నలంకృతముగ. 16

వ. అని చెప్పి యంతఃపురంబునకుం జనుటయు నమాత్యులు. 17

శా. రంభాస్తంభము లెల్లచో నధికచిత్రన్మూర్తిఁ గల్పించి నా
త్నాంభోజోత్పలమాలిక ల్వైచి వేశ్యాలాస్యము ల్మెఱుఁ బ్రో
జ్జృంభత్కాంచనభద్రకుంభతతి సత్క్షీణస్థితి న్నిల్ప గా
జంభారాతిపురావధీరణలసత్సౌందర్యయుక్తంబుగన్. 18

వ. మఱియుం బరమశోభనంబుఁ గావించి గప్పురవరంబు వినూతననికేతనకేతనం బై, పురాతనీతపుణ్యవతీతోయాన్వితం బయి విమల కమల కమలాకర కమనీయ కమలాకరం బై యనూనోద్యాన వనఘనోపవన పవన మనోభిరామం బై దేవమానవతీ సమాసమానినీమానితం బయి మధురమాగధగానంబులవలనను, మహోత్సవాలోకనాగత జనపరస్పరాహ్వానధ్వానంబులవలనను, భేరీమృదంగాదిమంగళస్వానంబులవలనను, జృంభితమదకరిబృంహితధ్వానంబులవలనను, బూర్ణిమానుధాపూర్ణార్ణవానూనాదయ సమయఘూర్ణమానార్ణవం బన నిర్ణయింపం దగి యింపు దళుకొత్తుచుండె నంత నొక్కశుభదినంబున. 19

గీ. గురునియానతి రఘువంశ్యగురుఁడు రామచంద్రుఁ డతివేడ్క జానకీసహితుఁ డగుచు
నలఘుతరనక్షత్రపూతాంబువులను గడుఁ బ్రీతి యుంబునను మంగళస్నాన మాచరించె.

క. తా నపుడు వొలిచె మానినీ,ధానుఁడు కృతపుణ్యతరవిధానుఁడు శుభసం
ధానుఁడు ధౌతాంబరపరిధానుఁడు సౌమిత్రిసన్నిధానుఁడు మిగులన్. 21

వ. అయ్యవసరంబున మంథర యను నాది తనదొరసాని యగు కైకకడకుం జని ససంభ్ర
మంబుగా నిట్లనియె. 22

క. మతిఁ గార్యగతి నెఱుంగక, యతివా పతి నాకుఁ గూర్చు ననుచు మిగులన
మ్మితి వతిమతిహీనవు నను,సతి సవతిసుతుండ యేలు మహిమోజ్జ్వలుఁ డై. 23

వ. అని పల్కి వెండియు. 24

మ. పతి కౌసల్యకుఁ గూర్చి తత్సుతునకుం బట్టంబు గట్టంగ ను
ద్యతుఁ డై యుండుట తెల్లమయ్యెను సపత్న్యుత్కర్షభవం బుర్వరా
పతిగాఁ జూచెను వంత పెద్ద భరతుం బట్టానకుం బాపి దు
స్థితినొందించిన గుందుపుత్త్రుఁ గనన్ శ్రీవార్త్రి కంటెం జెలీ. 26

చ. వరములు తొల్లి నీకుఁ జనవల్లభుఁ డిచ్చెను రెండు వానిలోఁ
భరతునిఁ బూజ్యరాజ్యపదబంధురుఁ జేయుట యొండు గానరో
ర్వరఁ బదునాలుగేం డ్లజినవల్కలము ల్ధరియించి జానకీ
శ్వరుఁడు చరించుటొం డివి ధుర్యంబుగ నొండు దొఱంగి వేఁడుమీ.

చ. అన విని కైక చిత్త మురియాడఁగ నిట్లను మంథరాధనా
వనమున కగ్రపుత్త్రకు ననశ్యముఁ బూన్పక మాన నేర్చునే
మనుజవరుండు నీ వనుకరిమంబున వేఁడుట నాకధర్మమై
నను బతిఁ జేసి యిబ్బిధమున న్మొగమోడక మూఁదలించెదన్. 27

వ. అని పల్కి దైవప్రేరిత యగుటం జేసి ధర్మంబుఁ దలంపక. 28

సీ. ధవుఁ జేరి మేదినీధవ భవత్ప్రభా,ర్యాసుతు శ్రీరాము నడవిలోఁ జ
తుర్దశాబ్దంబులు దుర్గతి నొందఁగఁ, బంపి నాపుత్త్రకు భరతు నిఖిల
రాజ్యంబునకు నిష్ఠ రమణుని గావింపు, మీవు రెండు వరంబు లిచ్చినాఁడ
వెఱుఁగుము తొల్లి నీ విటుఁ జల్కి తగుకీర్తి, వడసి కృతప్రతిజ్ఞుఁడవు గమ్ము

ఆ. భానుకులులు రాజ్యహీనంబునకు నైనఁ, దరము గాని యాపదలకు నైనఁ
బ్రాణభయద మైన ప్రథనంబునకు నైన, వెఱవ రనృతమునకు వెఱచినట్లు. 29

వ. అని యడుగుటయు నప్పలుకులు ములుకులకరియ నలుకువవెట్టుటయు నలిశిపతి
యమ్మహీవిభుండు. 30

ఆ. నాఁడు దొల్లి మీ జనకుఁ డిచ్చినవి రెండు వరము లందు భూమిభరము భరతుఁ
బూన్చు టొకటి నీవు పూని చతుర్దశాబ్దంబు లడవిఁ దిరిగివచ్చు టొకటి. 43

క. సమయం బగుడు వరద్వితయము వేఁడిన నిలిచెఁడు నృపతి యై యాక్రియ వనా
నముఁ బూనియున్న వాఁ డని, చమత్కృతి యొసంగఁ జెప్ప దయ్యెన మఱియున్. 44

క. శ్రీ దొరఁగి యొకట వనములఁ గోఁ దిరుగుట నీకుఁ దొలిగలుగుట న్నిను బు
త్రా దివిజులు వొగడఁగఁ బిత్రాదేశము సేయుచలయు నపకాయుఁడ వై. 45

చ. అనవుతుఁ గైకఁ బూని పరమాదరణంబున రామచంద్రుఁ డి
ట్లను జనయిత్రి నాకు జనకాజ్ఞ యొనర్చుట మేలు నామన
మ్మున వసుధాభరంబునకు ముఖ్యునిఁ జేయుట యంతకంటె మే
లనుచుముఁ గాన నాంతరవిహారము మూఁడవమేలు మాఁడఁగన్. 46

వ. అని జనకు దెసం గనుంగొని. 47

చ. ఇతఁడు ప్రతిజ్ఞ దప్పిన మహీపాలు రెల్ల వహింక దే సరి
త్పతి జల మింక దే గతపిధాస్థితిఁ బ్రాగ్దిశఁ బ్రొద్దు గ్రుంక దే
మతి ననుమాన మించుక యుఁ మాని చతుర్దశవర్షము ల్వన
క్షితి విహరించి మించి కృతకృత్యుఁడ నయ్యెదఁ బోయివచ్చెదన్. 48

వ. అని యంత నిలువక. 49

ఉ. జనకుని సత్యవాక్యము ప్రసన్నత మయ్యెడు నంచు రత్నభూ
షణవసనస్రగాదిక విసర్జితుఁ డై యజినోత్తరీయము
ల్బనుపడఁ జేసి యంగమున భస్మముఁ బూసి జటావిభాసి యై
ఘనవనవాసి వేషము వికారము రోసిన మానసంబుతోన్. 50

ఆ. తొల్లి కైకఁ బిల్చి తల్లి యే బ్రహ్మచర్యవ్రతంబు మెయి నరణ్యభూమి
సమయసమము లోప్పఁ జరియించి వచ్చెద, ననుచుఁ బలికి వెసఁ దదాజ్ఞ వడసి. 51

క. అంతికమున నవంత న్వివశాంతఃకరణుఁ డగు జనకు సంతికమునకు
న్సంతసమునఁ జని యమ్మహీకాంతుని వీడుకొని మ్రొక్కి కదలెను వెడలన్. 52

క. రాముని మునివేషముఁ గని, సౌమిత్రి విశేషరుట్కషాయితముఖుఁ డై
భూమీశు దెసకు నడర, రాముఁడు వారించి యనుజు నని ట్లనియెన్. 53

చ. ఎటు తెగితయ్య లక్ష్మణ యహీనుఁడ వయ్యు పిశాతుఁ లాడఁగా
నిటుఁ దగునే కదా యనుచు నెంతయు శాంతునిఁ జేసి తమ్ముఁడా
యటవిఁ బితృప్రపదిష్టసమయాబ్దములం ద్రుటికాలమట్లు నె
క్కటి విహరించివచ్చెద నకంపిత నావుడుఁ గంపితాత్ముఁ డై. 54

క. అన్నా నాయనుగమనం,బు న్నీవొందఁబడక,రాకు పొమ్మన్న విషం
బున్నమలి విడుతుఁ బ్రాణము, లన్న నతఁడు హృదయమాదరార్ద్రం బగుడున్. 55

గీ. రామచంద్రుండు సౌమిత్రిరాక కెట్టి,కేల కొడఁబడి యాతనికేలు గేలఁ
గీలుకొల్పి భయంబు నీకేల నిప్పు,డాసి చరియింప నేర్తు నే భరితవినయ. 56

వ. అని యూఱడిల్లం బలికిన నతండు సంతసిల్లె నయ్యవసరంబునఁ దద్వృత్తాంతం బంతయు
వినఁటంజేసి. 57

చ. వడు మసియాడ వేఁలి ఘనం బయి వీపునఁ దూలియాడ మో
ముడుపతి మేలమాడ నధరోష్ఠము బింబముఁ బంతమాడ మె
చ్చొసఁగతిఁ గన్ను గారుచివిశేషము చెక్కులఁ గెందులాడఁ బే
రడకువ వచ్చెఁ జిత్త మురియాడఁగనీక మహీజ చెచ్చెరన్. 58

వ. ఇట్లు వచ్చిన ప్రేయసిం గటాక్షించి. 59

క. పితృవానతి సెల్లింపఁగ, నతివా విను పదియునాల్గబ్దంబులు స
మ్మతి వనవాసముఁ దగ సల్పి తిరిగి యేతెంచెద విలపింపకు మబలా. 60

చ. అనుటయు సీత నీకుఁ బితృవానతి సేఁతయు నాకు భర్తృసే
వదలిన సేవయుం బరమధర్మము లిట్లన రాదు నీవు నా
యనుగమనం బొడంబడనియప్పుడ మృత్యువు నొందినదైన నీ
యనుగమనంబుఁ దప్ప విప్రులాదిక భూతగణంబు సాక్షిగన్. 61

క. నాయనుగతి కొడఁబడుము వి,నయము గోపంబుఁ దక్కి తెలియుమి తను
ఛాయను బోలిన జాయను, బాయను ధర్మంబె నీకుఁ బరమవివేకా. 62

క. అని వెచ్చనూర్చి మంచుగ,డిన నెంతయుఁ దేజమేది డిందుపడినప
ద్మనిభం బగు మోమును వాడిన,మోవియుఁ గన్గి తల్లడించుచు నుండెన్. 63

క. మగనికడ మెలఁగుమగువకు, నగపడ విల నెంతలేసియాపద లైనన్.
మగనిం బాసినమగువకుఁ, దగుసౌఖ్యము లెన్నియును వృథాగతి నుండున్. 64

వ. ఇవ్విధంబున. 65

ఉ. కన్నుల శోకవేగమునఁ గాలువగట్టెడుబాష్పధారలం
జన్నులకుంకుమం దడపుజానకిఁ గన్గొని మానవేంద్రుఁ డో
యన్నులమిన్న నిన్ను విడనాడఁగ నాడుట కాదు కాన నా
పన్నత నొందఁజాల వనిపల్కితి నింతులు వంత నొర్తురే. 66

క. అని కలికి సీతరాకకు, ననుకూలత దోఁపఁ బలికె యరిగి సుమిత్రా
తనయజనకతనయాయుతుఁ, డనఘుఁడు శ్రీరాఘవుఁడు నిజాంబవలనికిన్. 67

ఉ. క్షత్త్రియమిత్త్రగోత్త్రుఁడు ప్రశస్తచరిత్త్రుఁడు రామమూర్తి సౌ
మిత్త్రియు ధాత్త్రిపుత్త్రియును మేకొని రాఁ జని కాంచె నత్యర
న్యాత్త్రికఁ బ్రాణవాయుకృతశుద్ధయశోమగధావనీశస
త్పుత్త్రికఁ జేతనాత్తమణిపుత్త్రికఁ గోసలరాజపుత్త్రికన్. 68

వ. కనుంగొని నమస్కరించి. 69

చ. కరములు మోడ్చి తల్లి విను కైకకుఁ దొల్లి కరంబు నెయ్యుఁడై
వరములు రెండొసంగె జనవల్లభుఁ డాయమ యిప్డు వేఁడె రా
జ్యరమ దొరంగి యే నడవిచక్కటి వర్తిల భూతధాత్త్రికిన్
దొర యనఁగాఁ బ్రభూతభరతుం భరతు న్నియమించునట్లుగన్. 70

క. వేఁడిన నమ్మాటలు చెవి, చూఁడినయట్లయిన నృపుఁడు సుడివడియెడు నా
ఁడేఁ డాడినమాటకు నీ, రేడేఁడులు వనిఁ దిరిగి తిరిగి యేతెంతున్. 71

క. అమ్మా నెమ్మది నించుక, యుమ్మలికము మాని ధైర్య మూఁదు మనుఁడు వా
లమ్ము లగుచు నవ్వాక్ప్రచ, యమ్ములు నాటుటయు వివశ యై యిట్లనియెన్. 72

ఉ. యోగ్యము గాఁగ నీవు మహిమోజ్జ్వలలీలఁ గృతాభిషేకసౌ
భాగ్యము నొందఁగాంచుటకు భాగ్యము గల్గెనటంచు నున్నచో
యోగ్యమకూలవర్తనకు నోర్చి విశేషసుఖంబు లెల్లవై
రాగ్యము పేర్మి వీడి నగరం బిటు వెల్వడఁజూడఁ గల్గెనే. 73

క. సమ్మతిఁ బాపమ్ముడిపి క్రమ్ముల లాలించి సత్సరణి మెలఁగిన దో
షమ్మెఱుఁగఁ డనుచు నెమ్మది, నమ్మంగా రాదు రాజనామమువారిన్. 74

వ. అని పలికి కరంబులు విదుర్చుచు నిట్టూర్పు నిగిడించి కైక నుద్దేశించి. 75

కమలవిలసితవృత్తము.

అధిపతి తనవకుఁ డని తగునే ని, న్నధికభయద మగునడవికి నంపం
బ్రథితయశముఁ జెఱుపఁ దలఁచెనే దు, ర్విధివిలసిత మెటు వృథ యగుఁ బుత్త్రీ. 76

సీ. ధర్మనాశముఁ గ్రూరకర్మం బటంచుఁ గొంకక నెట్లు వరములు కైక వేఁడె
నాలిమాటలకు లోనై నీవు కానకఁ, బోనంగ నెట్లోర్చె భూవిభుండు
అడవికి నిను బంపు టన్యాయ మనియొత్తి, చెప్పంగ లేఁడె వసిష్ఠమౌని
సకలసౌఖ్యముల కాస్పద మైనలక్ష్మి విసర్జింప నీకేల సాహసంబు

గీ. అనుచు వెచ్చనూర్చు హా యని పలవించు, దైవమా యటంచుఁ దల్లడించుఁ
గరముఁ గోపగించుఁ గౌసల్య పుత్త్రవి,యోగశోకమునకు నోర్వలేక. 77

వ. మఱియుం బ్రేమాతిరేకంబునం గుమారుం గనుంగొని. 78

క. రమ్మా చేరం జూడఁగ, నిమ్మా నెమ్మోము కైక కిదిదోసమగున్.
జుమ్మా నమ్మఁగ నయ్యెడఁ, బొమ్మనియెనె నిన్ను భూవిభుండు కుమారా. 79

ఉ. హారము లొత్తి కందు భవదంగము లిప్పుడు నిద్ర లేక నా
హారము మాని కాననవిహార మొనర్చిన నెట్టులోర్చు నా
హా రమణీమణీగణమహారమణీయవిలాస దైత్యసం
హారముఁ గోరి పోయెద వహార్పతితేజుఁడ వేమిసేయుదున్. 80

వ. అని ప్రలాపించుచు. 81

క. మ్రొక్కిన లక్ష్మణుఁ గనుఁగొని, యక్కునఁ గదియించి తమ్ముఁ డాయడవులయం
దొక్కరుఁడు మెలఁగలేఁ డని, నిక్కము మీయన్నతోఁడ నీవు నరిగెదే. 82

క. లక్ష్మీవంతుఁడు రాముఁడు, లక్ష్మిం జెనఁ బాసి కానలకు నేగడుచో
సూక్ష్మమతి నీవు నేగుట, లక్ష్మణ యిది భ్రాతృవత్సలత్వము గాదే. 83

చ. అనునెడ సీత మ్రొక్కి వినయంబు నయంబు భయంబు మీఱ నే
నును బతితోడ నేగెద ననుజ్ఞ యొసంగు మటంచు వేఁడ నీ
జనకుఁడు గూఁతు రామునకు సమ్మతిఁ బెండిలిఁ జేసినాఁడ నే
నని ముదమందు మీరు మునులై యిటుఁబోవు టెఱుంగఁడే కదా. 84

ఉ. వహ్నిశిఖాసదృక్ప్రథుగభస్తిచయాన్వితుఁడై నిదాఘమ
ధ్యాహ్నములం బ్రతాపము సహార్పతి చూపఁగఁ జక్రవర్తినీ
చిహ్నము లింత లేక ద్రుమఁ జేర్పడి కంటకచక్రవర్తినీ
చిహ్నిత మైనమేనునఁ గృశించెద నీపతి నిన్నుఁ జూడఁగన్. 85

వ. అని మఱియు ననేకవిధంబులం దల్లడించు కౌసల్యం గనుంగొని యుచితవచనంబుల
మనస్తాపోపశమనంబు గావించి. 86

క. తల్లడ మేల విధికృతికిఁ, దల్లులు చిత్రములు ముదంబులు ననుచుం
దల్లి నిటు వీడుకొని పిన్నతల్లిం గులకామినీమతల్లిం గనియెన్. 87

వ. ఇవ్విధంబునం బ్రియానుజప్రియాసహితుఁడై చని కాంచి నమస్కరించి రాజాజ్ఞ
యొఱింగించి కరకమలంబులు ముకుళించి వెండియు. 88

ఉ. మ్రొక్కినరామచంద్రుఁ గని మోదము దక్కి సుమిత్రపుత్త్రి నీ
విక్కడఁ బాసి కారడవి కేగిన మాగినమూర్ఛఁ దల్లి నీ
దిక్కున నైనశోకమునఁ దీనత నొంది కృశింపనున్నె యే
దిక్కును లేక దానవరదగ్ధవిధేందుసమంచితాననా. 89

వ. అని మఱియును. 90

సీ. కువలయంబున కాన్తిఁ గూర్చుచు నిను విశోకునిఁగ భావింప రాముఁడవుఁ దగునె
యాడుమాటలఁ గంప మంది మహీభృద్వ్రజము కిలఁ గడుచుల్కఁదనము దగునె
ప్రజలలో నగ్రసంభవు ముఖ్యునిఁగ నెఱుంగకయున్న దాతవుఁ గలదె కీర్తి
దానవారుల మించు దానవశాత్మకత్వము వహించుట సార్వభౌమునకును
గీ. దగునె యీదుర్విచారంబుఁ దలఁగఁ డేని, యీసుమంత్రు సుమంత్రుఁడ వనఁగఁ దగునె
యీవు గుణరహితునియట్లు నీసుమాలి, యీకరణి నిల్లువెడలుట నీకుఁ దగునె. 91
వ. అనిపలికి యనంతరంబున లక్ష్మణుం గనుంగొని గాఢాలింగనపూర్వకంబుగా నాశీర్వ
దించుచు. 92
క. జనకసుత నన్నుఁగా మీ, జనకునిఁగా రామభద్రు సాకేతముగా
వనమునుఁ దలంపు మెగుము, మనమున నొకసంశయంబు మానుము పుత్రా! 93
శా. క్షుద్రాభీలమృగారవావృతము రక్షోభీకృతం బాకుభు
క్ఛిద్రాకీర్ణముఁ జీర్ణపర్ణబలిభుక్ఛేదం బరణ్యంబున
న్నిద్రాహారవిసర్జితుండ వగుము నీ వెల్లపొద్దు న్మహో
న్నిద్రారాధనతత్పరుండ వగుమీ నీయన్న హర్షింపఁగన్. 94
వ. అని బోధించి కోడలిం గుసుమకోమలిం గనుంగొని. 95
క. దానవసంకులములు గజ, దానవసుధుపంకిలములు దగ్గహనము లు
ద్యానవనంబుల నులికెదు, దాన వెటుల సంచరించుదానవు సాధ్వీ. 96
క. విను మొకతతి వసుహీనతఁ, గనఁబడినను గువలయంబుఁ, గారించువిక
ర్తనుఁ డై తాపము నొందిం, చినదైవము గాఁగ నిను భజింపఁగ వలయున్. 97
వ. అని యుపదేశించి కాననగమనోద్యుక్తు లగుసీతారామలక్ష్మణులం గనుంగొని. 98
క. ఇం పగు రాజ్యసుఖంబులు, సంపదలును విడిచి యడవిఁ జని యం దివురు
ల్గుంపులుఁ గాయలు పాయలుఁ, దెంపితినుం డనుచు నొసఁగిరి స్నేలవకటా. 99
వ. ఇట్లు సెలవొసంగి వెచ్చనూర్చుజనయిత్రి సుమిత్రపీడొక్కని చిత్రచరిత్ర యగుధాత్రీ
పుత్రియు సౌమిత్రియుం దోడగా నమిత్రగోత్రలతాలవిత్రుండును, మిత్రగోత్రపవి
త్రుండును, గోత్రామరసుత్రామాద్యమరసంస్తోత్రపాత్రుండును నగు దశరథు నగ్ర
పుత్రుండు సుమంత్రసారథికం బగురథం బధిష్ఠించి సత్రాసంబుగ నరణ్యయాత్ర
గావింప నుద్యోగించె నవసరమ్మునఁ బురమ్మునఁ గల సమస్తజనమ్ములు సెట్టిన
దొక్కపెట్టు నతనిం జుట్టుముట్టి పెట్టినసొమ్ములుం గట్టినపుట్టమ్ములు నెఱుంగక
బిట్టుమూర్ఛిల్లుచు, హాహా యింతపుట్టునే యనువారును, కైక రట్టడి కిట్టాడెఁ గట్టునే
యనువారును, రాజున కించుకయేని నక్కటికంబు వలదే యనువారును, నింతవింత

గలదే యనువారును, రాముం డింతసాహసుం డగునే యనువారును, వారింపక గురుం డుపేక్షింపఁ దగునే యనువారును, మోమోడెడువాఁడు గాఁడు లక్ష్మణుఁ డిట్లు పోవచ్చునే యనువారును, భరతుం డెఱుంగఁ డెఱింగిన నింత రానిచ్చునే యనువారును, దెలవంగూడి తెర వెఱుంగని యడవుల నిడుములంబడుట యెంతయు మోసఁ బనువారును, మహానుభావుం డితనికి వనవాసం బనాయాసం బనువారును, జానకీసాధుచరితం బింతయొప్పునే యనువారును, దైవకృతంబు దప్పునే యనువారును, వీరలం గనుంగొన్నం బగవారికైన వగలు మిగులకున్నె యనువారును, సుమంత్రుం డీమర్మంత్రంబు వారింపమి చన్నె యనువారును, దెలియ దీతనియభిప్రాయం బనువారును, యశంబు శాశ్వతంబు ప్రాణంబు తృణప్రాయం బనువారును, ధరణిం బడి పొరలువారును, ధరణీశ్వరుం గెరలువారును నై యేము నీతోడివార మిదె నిన్నుంగూడ నేతెంతుము గా కిప్పురంబున నుండ నేర్తుమే యని యందఱు నేక నిశ్చయంబున దాశరథి వెంబడించి రయ్యవసరంబున. 100

చ. దశదిశలన్ యశంబు విశదం బయి పర్వ వనంబునం జతు
ర్దశసమము ల్వసింపఁ బ్రియదారసహోదరసంయుతుఁడు గా
దశరథసూనుఁ డెంతయు ముదంబు ఘటిల్లఁగఁ బౌరులెల్ల దు
ర్దశదురటిల్ల నిట్లు పురరాజము జల్లన నిర్గమించుడున్. 101

వ. దశరథుం డధర్మనిర్భీకం బైకం గనుంగొని. 102

ఉ. పాపము గట్టికొంటివి నృపాలశిఖామణి రాము నిక్కడం
బాపఁగ నూహచేసితివి భార్యవె మృత్యువ వీవు నాకు నీ
పాపఁడు గాఁడె యాతఁడు కృపాపరతంత్రుఁడు భక్తియుక్తుఁడుం
బాపవిదూరుఁ డింక నగపాటు శరంబు భరంబు మానినీ. 103

క. నముచిరిపుతుల్యు రాము వనమునకు ననిచితివి యీదినము మొదలుగ మో
సముఁ జేసిన నీదునివాసము చెంతకు రాను నే నసముచితచరితా. 104

మ. అని తద్గేహము నగ్నిలగ్న మగు గేహంబు న్విసర్జించుభీ
రునిచందంబునఁ బాసి పో కుత మహారోషంబునం జేసి కా
ననివాసంబుగఁ జేసి నన్నధికచింతాసాగరాంతర్నిమ
గ్నునిగాఁ జేసితె నీసితేద్ధయశముం గుప్పించితే దిక్కులన్. 105

వ. అని మఱియు ననేకంబు లగువిధంబులం బలవించు. 106

చ. దశరథుఁ డప్డు రాముని రథస్థునిఁ గన్గొని పుత్ర కామినీ
సఖుఁ డితఁ డంచు నన్ను నలువఁ దగునైనను బ్రాణధారణా

వశతఁ గృశించుతండ్రిఁ బితృవత్సల కానఁగ రాఁగదయ్య యా
ర్ద్రశమదమాదిసద్గుణగరిష్ఠత నీసరి గారు మానులున్. 107

క. భీకర మమితవిస్పష్టప్రాకారము గరీంద్రహస్తశీకర మురుద
ర్వీకరము గాననము పత్త్రాకరము మృగాకరము భరము చరియింపన్. 108

వ. మఱియును. 109

లయగ్రాహి.

ఘూకము సముచ్ఛ్రితమధూకము భయంకరశమీకము మహోద్రుపదనేకము జలన్ని
ర్మోకము సమావృతవనౌకము ప్రభూతమతకోకము ద్వీపివ్రజసమీకము గరీంద్రో
ద్రేకము మహాద్విపదనీకము భుజంగయుతగోకముఁ ప్రచంక్రమణకోకము విరహ్యా
లోకము రుకాననము నోకముగఁ జేసి యిటు శోకముల ముంచి జనలోకము గృశింపన్.

సీ. కటకటా కంటకోత్కటకుటోత్కరములు, పొదలు మవ్వంపుఁబూఁబొదలె నీకు
నుష్ణకరోష్ణకరోచ్ఛాదితాశ్మము, లబ్బఱవైన పఱుపులే పట్టె నీకు
ననువొంద మంగళహారతు లొసఁగెడు, గోతులే కోఁతులు కుఱ్ఱ నీకు
దుష్టచేష్టాప్రతిక్రూరాశరుల కోఁడి,గములు సిద్ధపుటాడిగములె నీకుఁ

గీ. బాయఁడు తొలంగుఁడని బరాబరులు సేయు, బంట్లె కనుదుండగపు టెల్గుబంట్లు నీకు
డంబుమీఱిన మణిఖచితంబు లైన, గృహములే నిఁడితపుగొండగుహలు నీకు. 111

క. వినుతగుణ నీకుఁ దశ వే, శ్మనివాసముఁ గూర్చెఁ గడు నసాధ్యము గలదే
విను శర్కర మెసఁగిననో,టనె చేదు భుజింపఁజేయు టక్కటవిధికిన్. 112

సీ. ఘనశివాలాపము ల్విని సంతసిలు నీవు, ఘనశివాలాపము ల్వినియె దింక
మావుల నెక్కి క్రుమ్మరు నీవు పండ్లకై, మావుల నెక్కి క్రుమ్మరిదు వింక
గోపురంబులనీడఁ గూడియుండెడి నీవు, గోపురంబులనీడఁ గూడె దింక
స్వర్ణోటజంబులఁ జరియింపఁ దగునీవు, పర్ణోటజముల పాల్పడియె దింక

గీ. వారుల మెక్కించుకయు లేక రాకుమారు, లెలమి సేవింపఁ బెంపు వహించు నీవు
వారు లొగిరాల భయదప్రచారు వార, లలమికొనఁ గంపము వహింతు వనభు వింక

ఉ. నీముఖచంద్రమండలవినిర్గతసుస్మితకౌముదీరుచి
స్తోమము నీమృదూక్తిపరిశుద్ధతయున్ భవదంగకస్ఫుర
చ్ఛ్యామలరుం ద్వితీయజలజాతవిలోచనసౌష్ఠవంబు శ్రీ
రామ కనుంగొన్న మునిరాజియు మోహము నొందకుండునే. 114

క. వాత్సల్యమహిత నిను సాం, వత్సరికులు దొల్లి చక్రవర్తి వగుదువా
వత్సముని వై చతుర్దశ,వత్సరములు నడవిఁ దిరుగవలసెనె నీకున్. 115

క. అన్న సుమిత్రాసుత మీ, యున్న ధరిత్రీసుతాసహాయత వనమం
దున్న యపు డేమఱక కొలు, వన్నీ వరిగెదవు ధైర్యవంతుఁడ వగుటన్. 116

వ. అనిపలికి కోడలిం జేర్కొని. 117

క. రాలచ్చి విడచి యేడుకు, జాలవజీవనాడు గ్రాల జాలమునిప్పు
డ్రాలను విహరింపను జవ, రాలా నీ వేమి పేదరాలవె చెప్పుమా. 118

వ. అని మఱియుం బరిభ్రమితాంతరంగుం డగుచుమ్మహీకాంతుండు. 119

ఉ. వేగము గాఁగ నేగురఘువీరుని తేరగపాటు లేమిఁ జిం
తాగిళితాంతరంగగతిఁ దద్రథకేతనదీప్తిఁ గాంచుఁ ద
ద్రిచ్చి గనరామి వేదనను జెంది తదుద్ధతధూళిఁ గన్గొను
న్నాగముమీఁదఁ దద్రథపరాగము గానక వంతఁ జేడ్పడున్. 120

గీ. మఱియుఁ బెక్కుగుగతుల నమ్మనుజనాథుఁ, డగ్రభార్యావరసతీసహాయుఁ డగుచుఁ
జిత్తమున నుత్తలము గదుఁ గ్రొత్తసేయ, నల్ల ముదుకఁ బ్రలాపించుచుండునంత

మ. ఉమకుం డేత్రికిఁ జౌరులార వనవాసోద్యోగమంచుం గడు
న్నుడుప న్మానక వెంబడింపఁగ సుమంత్రుం డెంతయు న్వంతఁ బెం
పడరం జయ్యనఁ దేరు దోల రఘువంశ్యస్వామి శ్రీరాముఁ డ
ప్పు డరణ్యంబున కేగె సానుజుఁడు భూపుత్రీసమేతంబుగన్. 122

చ. చనుచొడ సౌరభంబు వెదచల్లఁగఁ జల్లనిగాలి తమ్మికు
ర్కొనఁ గొనలేనివాగ్ఘమునను న్నిలయుం బగుదాని మీనపా
కనిబిడపుండరీకజలకాకబలాకసమీకచంచరీ
కనినదకోకకోకనదకమ్రతగం బగుదాని నెంతయున్. 123

ఉ. పావనచారుజీవనశుభం బగుదాని సమస్తజంతుసం
జీవన మైనదాని మునిసేవిత మైనతటంబుదాని రా
జీవనటన్మధువ్రతవిశేషరుతాకవితోల్లసద్ద్యుతీ
చీవృత మైనదాని సరసీమణి నత్తమసాతరంగిణిన్. 124

వ. కనుంగొని తత్తీరలతాకుంజపుంజంబు లవనిజకుం జూపుచు రాముండు వెండియు.

సీ. అరలోకనము సేయు కువలయానందంబు, లీవఃతమసానదీవనములు
చూడు ప్రవాళసంశోభితంబులు దగు, నీవనతమసానదీవనములు
గనుఁగొను మెంతయుఁ గమలావనోజ్జము, లీవనతమసానదీవనములు
సుదతి వీక్షింపుము సుస్వాదుఫలదంబు, లీవనతమసానదీవనములు

గీ. కుసుమమృదుగాత్రి విపులసారసహితములు, తెలియ మీవనతమసానదీవనమ్ము
లనుచుఁ గాంతకుఁ దెల్పుచు నచట విశ్రమించెఁ బౌరసుమంత్రసౌమిత్రు లలర.

వ. అంత.

ఆ. కాంతతోడ భయద కాంతారమున నిజాన్వయుఁడు తిరుగఁ జూడ వచ్చు నెట్టు
లని యదృశ్యుఁ డయ్యె నన గ్రుంకెఁ బద్మినీకాంతుఁ డగ్నిమాలి కాంతిమాలి.

క. అట్టియెడఁ దమమనంబుల, ముట్టిన శోకాంధకారమునకు మెఱుంగు
ల్వెట్టి తమ మదిగఁ జీఁకటి, చెట్టులక్రియఁ దోఁచెఁ దరువిశేషము లెల్లన్. 129

వ. ఇట్లు నిశాసమయం బగుటయుం గృత్యంబులు దీర్చి తత్తరంగిణీపయఃపా[illegible]ంబుం
బరమానందంబు నొందుచు లక్ష్మణసంకల్పితం బగుపర్ణపర్యంకంబున [illegible]
ప్రియాసహితుండై సుఖనిద్రితుం డయ్యె సుమంత్రుండును దక్షిణ పార్శ్వ[illegible]
దృణపాషాణపర్ణ నిజబాహుదండంబులు శయనోపధానంబులుగా [illegible]
న్నంత నంతరాత్రంబున నరేంద్రుండు మేల్కని సీతాలక్ష్మణసుమంత్ర[illegible]
ధించి వారలతో రహస్యవచనంబుల నిట్లనియె. 130

చ. మనము సమస్తపౌరజనమాన్యుల మై యడవి న్వసించిన
న్మనమున నొందు గాఁగ ననుమానము నొందెదు రైక గాన ని
వ్వనమున వీరి డించి పెనువంచన నేగుద మొండుచోటు కీ
జనులు నయోధ్య కేగుదురు సత్వరులై మనచో ట్వెఱుంగమిన్. 131

వ. అని తనమనోనిశ్చయంబు వారల కెఱింగించి యప్పుడు. 132

క. రిథాదూరులు పౌరులు, గాఢతరసుషుప్తి నున్నకాలమున రథా
రూఢుఁ డయి రాఘవుండు ని, గూఢస్థితి నేగ నంతఁ గొంతటిలోఁగన్. 133

చ. తొగరగు ఱేఁడు దమ్ములకుఁ దోడు నివంబులఁ దోలువాఁడు [illegible]
దొగలకు సూడు జక్కవలదోయికి నెంతయు వింత నెయ్యపుం
బగ లొనరించువాఁడు గడుఁ బచ్చని తేజులవాఁడు వేడుకం
బగ లొనరించువాఁడు గనుపట్టెను తూరుపుమెట్టుపట్టునన్. 134

చ. పురజను లంత మేలుకని భూతనయాపతి లక్ష్మణాగ్రజుం
డరిదమతో సుమంత్రయుతుఁడై తమ వంచనఁ బాసిపోవుటం
బురపురఁ బొక్కి పంక్తిరథపుత్రుఁ డయోధ్యకుఁ బోయెనంచు నేఁ
బురమున కేగుదెంచిరి ప్రభూతఘనార్తరవంబు లిచ్చుచున్. 135

క. విపరీతస్థితి మెలఁగక, నపగతరోషుఁ డయి ప్రజల నందఱఁ [illegible]
గృపఁ బ్రోచి క్రియఁ గాచిన, నృపతిం బాయంగ నేర్తు రెట్లు జనంబుల్. 136

ఆ. ఇట్లు వచ్చి మిహిరహీనాంబరమువోలె, రామరహిత మగుపురంబు సొచ్చి
యేమిసేయు దింక నెవ్వరు మనకుది, క్కనుచు వగచుచుండి రంత నచట. 137

మ. నిజమాయాపిహితాంతరంగు లగుచు న్నిద్రాసమాసక్తిఁ బౌ
రజనంబు ల్శయనించియున్న తఱి శ్రీరాముండు గోత్రాసుతా
నుజసంయుక్తముగా రథస్థుఁడయి మాన్యుం డాసుమంత్రుండు వా
యుజవస్ఫూర్తి హయంబులం దఱుమ నయ్యుగ్రాటవిం బోవుచున్ 138

ఉ. అంతట నంశుమంతుఁ డుదయంబున సంతమసం బదృశ్యమై
సంతస మావహింప నృపచంద్రుఁడు రాముఁడు చారుసౌరభా
త్యంతలతాంతకాంతగహనాంతరసంచరితాళిపాళికా
క్రాంతసరస్సరోజనికరంబులు చూచుచు నేగి ముందఱన్. 139

మ అవలోకంబులకుం బ్రియం బెసఁగు గోస్తాభీరపల్లీస్ఫుర
త్స్నవల్లీగిరిపక్కణంబులు నరణ్యంబు ల్గనుంగొంచు సీ
త విలోకింపుము నీవటంచు విలసత్కంజాతసంజాతమో
దవతి న్వేదవతిం గనుంగొనియె నుత్కంఠం బకుంఠంబుగన్. 140

క. కని తత్స్రవంతి సత్తీ,రనిరూఢలతాలతాంతరమణీయతకు
న్మనమునఁ బొంగుచు నటఁ గడ, చని సరయువు దాఁటి రామచంద్రుం డవలన్.

వ. అభంగరంగత్తరంగాధారం బగుగంగాతీరంబున విఖండితమృష్టమృగాసృక్కణం
బగు నొక్కపక్కణంబు గనుంగొని తత్సమీపంబునకుం జని. 142

క. బహునియమాయాసవహు, న్మహుర్మహుగ్గతముద్రశుముక్తానివహుం
గుహుఁ గని రచ్చోక్షక్రమ,గుహు సద్గుణగణగుహు రఘుప్రవరు లాగిన్. 143

వ. ఇట్లు కనుంగొని రయ్యవసరంబున. 144

చ. రభసముతో నిషాదపతి రాము నెదుర్కొని సద్వినీతిభ
క్తిభరితమానసుం డగుచుఁ దివ్యనిమాటల నాదరించి త్వ
చ్ఛుభతరదర్శనంబున విశుద్ధమనస్కుఁడ నైతి నంచు వీ
తభయుఁ డెసంగ నర్ఘ్యసహితం బగుపాద్య మొసంగి వేడుకన్. 145

క. నీపదశౌచజలమునకు, నాపదలం బాపుహరజటాంతరపదసం
దీపితవర్తన యైనను,రాపగకును వేఱు గలదె యని తజ్జలమున్. 146

వ. శిరంబునం జల్లికొని వెండియు. 147

చ. గుహుఁడు నమస్కరించి నృపకుంజర కుంజరకుంజరవ్య మీ
గహనమునం బ్రియానుజులఁ గైకొని యిట్లు చరింపఁగా మహా

మహుఁడవు నీకుఁ జన్నె గుణమండన నావును వానికి రఘూ
ద్వహుఁడు నిజప్రవృత్తి విదితంబుగఁ దెల్పి సంతసించు మఱిన్. 148

తే. రామచంద్రున కాతఁడా రాత్రి మధుర, వివిధ వనరసఫలముల విందొనర్చె
వరధనుర్ధరుఁ డనుజ సోదరుఁడు గొలువ, నధికకృప సీతతో నట నధివసించి 149

క. గుహుఁడును సుమంత్రుఁడును దను, బహువిధములఁ గొలువఁ బర్ణపర్యంకమున
వ్రహి నిదుర జెంది రాముఁడు, మిహిరోదయమునకు మున్న మేల్కాని సరగన్. 150

వ. సముచితసమయకృత్యంబులు నిర్వర్తించి నిజసేవాపరతంత్రు సుమంత్రుం గనుంగొని.

క. సముచితము గాదు రథయానము మాకిట మీఁదఁ గావున మరల సాకే
తమునకుఁ గొని చనుమీ యరదము నీ వనుటయు నతఁడు దప్తహృదయుఁడై.

చ. అటవిని మిమ్ము డించి పురి కారడి శూన్యరథంబుతోడ నే
నెటువలెఁ బోవువాఁడ సుతు లేఁ గని పఙ్క్తిరథుండు సాదరో
త్కటహృదయంబుతో నడుగఁగఁ దత్పతి కేమని తెల్పువాఁడ నీ
కిటుగ లెనాడె ధర్మమగునే విడనాడకు మింద యోంటెదన్. 153

చ. అనవుడు రాఘవుండు భవదగ్రసుతుండు సతీసహోదరు
ల్దనుఁ గొలువంగ నెంతయు ముదంబున నిప్పురిఁ బోలెఁ గాననం
బున నొకయింత వింతయును బొందని డెందముతోడ నున్నవాఁ
డని వినిపించి మజ్జనకు నార్తి హరింపఁగ నీవు పోవవా. 154

గీ. అనిన నేమియు ననుటకు ననువులేమి, నా సుమంత్రుఁడు శ్రీరాము నపుడు వీడు
కొని యయోధ్యకు నేగె నెక్కొనినచింత, రథముతోడ విఫలమనోరథముతోడ.

వ. తదనంతరంబున. 156

మ. విలసద్వేషులు వీతదోషులు జగద్విద్వేషవిద్వేషు ల
చ్చలసంతోషవిశేషభూషితమనీషాశ్లేషు లానందభా
షులు నిర్దోషులు ముఖ్యసత్త్వగుణసంతోషు ల్జిగీషు ల్విహా
షులు సతోషులు రామలక్ష్మణులు సంస్తుత్యాభిలాషు ల్దగన్. 157

వ. చని చని 158

మ. ఘనసౌగంధికగంధవాహచలితక్ష్మాభృల్లతావాలము
న్వినుతాభంగతరంగశీకరసమావిర్భూతశైత్యోల్లస
న్మునిసంకల్పితపర్ణవేశ్మసవిధామోదైణశార్దూలముం
గని రస్తోకవిశాలము న్మహితగంగాహ్రాదినీకూలమున్. 159

క. కని జనకసుతాయుతు లై, చని మధుకరమధురనినదసంభృతవికచా
బ్జనటన్మరాళసితగరు,దనుపమధౌతపరిధాన యై తగు దానిన్. 160

క. ఖ్యాత మగు దాని గంగా,ఖ్యాతం బగు దానిఁ గుముదఘనకమలాసం
ఖ్యాత మగు దాని జనసం,ఖ్యాతతతశీతలజలప్రియం బగు దానిన్. 161

సీ. తలఁచినయంతమాత్రన జన్మజన్ములు, కానందసంధాయి యైన దాని
బ్రహ్మహత్యాదిపాపంబులనైన భస్మంబు గావించెడు మహిమ దాని
హరుజటాస్థలినుండి యవతరించిన దాని, రమణీయబహుళతీరముల దాని
సగరవంశజులఁ బుణ్యగతి కన్పినదానిఁ, బరమపవిత్ర నాఁ బరఁగు దాని

గీ. పర్వతోన్ముఖ యనుట నిజంబు గాఁగ, నళికులసమావృతము లగునంబుజంబు
లలలలను సుగుణదీ మించు నలికములుఁ, దొప్పు కులికెడు జాహ్నవి నొనరఁ గాంచి.

వ. తత్పవిధ విధవిశేషంబులకు సంతోషంబు నొందుచున్న యవసరంబున రాముం
గనుంగొని లక్ష్మణుండు. 163

క. గంగాసరసి ని ం గని, భంగజశరసముదభంగ యై సుడివడఁ జ
ల్లం గడఁగెరి శిశిరత లై, భృంగీకాంతలు పరాగరేణువు లనిన్. 164

క. నిజభావంబునఁ బొంగి మనుజనాయకుఁ డపుడు లక్ష్మణున కిట్లనియెం
ద్రిజగత్పావని యీ యి, కుజనుల కీచెంత నిలువఁ గోఱ గాదు సుమీ. 165

వ. అని మఱియు ననేకవిధంబుల నన్నదిమహిమ వర్ణింపుచుం జనకసుతాలక్ష్మణ
సహితుం డై రఘునాయకుండు గుహుండు నావనుంచుగా నోడ యెక్కి సితగరుద్గ
రుత్స్ఫంభనంబు గాంచి బంధురకమలకైరవసుగంధం బాస్వాదించి తుంగతరంగఘట్టన
నించుక పొడవి శీతలశీకరంబుల యూతఁగొని మందమందగమనంబున నెమరొక్క
ను మనుతిక్క శోభస్వర్శనంబున నమ్మరంబు నొందుచుం దవనూతనతనూవిలసనంబు
నిజాంతిరస్ఫురద్రాజీవకోకనదేక్షణంబుల నిరీక్షించుచుం దనివిసనక తను వెల్ల నయ
నంబులు గావించికొన్నవసువునం గండుగండకంబుపిండులమండిత యగు భాగీరథి
ను తరించి పంటుటాకులను కోకలు వటిచి కేకికేకారవవ్యాజంబునం బిల్చుచున్న
యగ్వాలియొడ్డునం దరణిడిగి కొమ్మలను కొమ్మలు ముమ్మరమ్మునం గ్రుమ్మరించు
సుమమ్ములను నాచారలాజమ్ములకు సమ్మతించుచు గుహునిం బహుమానపూర్వకం
బుగా వీడుకొని ఛాయామూలంబులునఁ బుచ్ఛళలాటుకంబులునుం బత్రపత్రంబు
లును ముఖకోరకంబులునుం గలిగి జంగమకింశుకంబు లనం గగనంబునం బాఱు లై
పాఱుశుకనికరంబుల నాలోకించుచు విశీర్ణజీర్ణపర్ణంబుల నించుకించుక గనుపించు
పాషాణంబులకున్న ఫలకలు వెట్టుకొని నిదురించు కొండచిలువలకును విభేదంబు

పరిశోధించుచు గుసుమితానేకాశోకానోకహషండంబు దవదవసమావృతస్థలంబుగా శంకించుచు మొట్టమొదళులం బుట్టలు దిట్టలుగ దొట్టివం బట్టుపుట్టంబులు చుట్టు గట్టికొన్నట్టు గన్పట్టు పొదలచెట్టులతిట్టలకడ నిలువక దుస్తరంబు లగుకంటకప్రస్తరంబులవలనను జాయసౌరభలతాంతలతావితానంబులవలనను భయంకర పుండరీక భల్లూక సమీకంబులవలనను సారకృష్ణసారకిశోరవారభసలకిసలవిసరంబులవలనను మనోభిరామభీమంబగుగహనకదధ్వగమనపరిశ్రాంత యగునిజకాంత నుద్దేశించి లక్ష్మణుం గనుంగొని. 165

చ. అడవి భయంకరోరగసమావృత మెంతయు సంకటంబు న
య్యెడ విహరింపఁజాలవు సుమీ వలదంచుఁ గడు న్వచించు నా
నుడి విన కిందు వచ్చి యాతన శ్రమపాల్పడి కంది కుంద వే
న్నడి విధి యేఁచ నేరికయినం దలమే దలఁగం దలంపఁగన్. 261

క. నడికెదుఁ జిత్తముతో నెన్నఁ డెఱుంగని యట్టి యడవినడుమం ద్వరతో
నడుచుం జాలదు జానకి, నడు మల్పము గచభరం బనల్పం బగుటన్. 168

క. ఫుల్లాబ్జనేత్రపదముల, నల్లికొనిన తీవ లూల్పె నతివమృదుతనూ
వల్లికి నోడి కడుం బ్రభ, మిల్లి పదద్వయము పట్టి మిడికెను కరణిన్. 169

వ. అని పల్కి మఱియు నమ్మహారణ్యమార్గంబునం జనునవసరంబున. 170

సీ. క్రోడవిదారితక్షోణితలముఁ గనుంగొన్న నిషాదులు దున్నిరనుచు
శల్యకప్రఖనితస్థలములు గనఁగొన్న, మునులు దుంపలు త్రవ్వికొనిరనుచు
ద్విరదనిపాతితోర్వీజము ల్గనఁగొన్న, నురుఫలభారత నొరగెననుచుఁ
బొదలనిద్రించుబెబ్బులులశరీరంబు, లరసిన బర్హిబర్హంబులనుచుఁ

గీ. కలభములఁ గన్నఁ బెనగండశిలలటంచు, గుహలు గనఁగొనఁ దపసులగృహములనుచు
తెలియఁగ కుండ వచించుఁ దా నెఱిఁగనేని, సీత భయమందు ననియెడు చింతకతన.

వ. తదనంతరంబున నయ్యన్నదమ్ములు. 172

క. ఘనకలుషపిశాచసువ్రజ్యనము సువర్ణవమనం బ్రశస్తమగు సువ
ర్ణనతీర్థముఁ గని యచ్చట, ననఘులు నివసన మొనర్చి రారేయిఁ దగన్. 173

వ. మఱునాఁ డరుణోదయంబునం గృతకాల్యకరణీయులై సీతాసమేతంబుగా నయ్యుసహోదరులు ధనుర్బాణంబులు సహాయంబులుగా నాఁడు మూఁడుయోజనంబు లరిగి. 174

క. పటువిటపస్థలభయదా, కటుమఖపురసాలతాలవటమఖరుసం
కటమగు నటవిం జని యవ్వ, కటము నల ప్రయాగవటముఁ గని దాశరథుల్. 176

ఉ. భూజనవంద్యుఁ దాపసవిభుం జతురాననసన్నిభుం భర
ద్వాజుని సంశ్రితాంగణవివర్ధితకల్పమహీజు నిందిత
వ్యాజుని ధిక్కృతేంద్రియమహారిసమాజుని భాస్కరోల్లస
త్తేజునిఁ గాంచి చేరఁ జనుదెంచి నతించి నమస్కరించినన్. 176

శా. వారి న్సాదరబుద్ధిమీఱఁగ భరద్వాజుండు మన్నించి త
ద్ఘోరారణ్యపటుప్రవర్తనకు హేతుత్వంబు నిత్యాత్మబో
ధారమ్యుండు దనంతటం గని సమాధానార్ఘ్యపాద్యాదిస
త్కారంబు ల్పచరించి మూలఫలశాకంబుల్ సమర్పించుచున్. 177

క. అవియున్నియును సవినయమున, లవిరళసంతోషు లగుచు నందికొని మనో
జ్ఞవచోరచనలఁ గను న, య్యవనీసురవర్యుఁ బొగడి యమ్మనుపుత్రుల్. 178

క. తలఁగడలు గాఁగఁ దమకర, తలములు గప్పించి యొండుతలపు లుడిగి పెం
దలముగు దలకృతశయ్యాతలముల నిదురించి రాక్కతలముని పొగడన్. 179

వ. అంత. 180

క. మిహికానికాయము ముడుపుచు, మిహిరోదయ ముదయశిఖరి మెఱయు మునిస్వా
మిహితాదేశంబున నమ్మహితాత్మకు లరిగి యరిగి మార్గములోనన్. 181

చ. కని రలచిత్రకూటము నగాధరఘోరభయపార్శ్వరోధరా
ఘనినిబిడవల్లరీపటునటన్మధులిణ్మృదుగానభాసమా
ననవలతావితాన లలనాకృతిచారుతరోపగూహనో
జ్జ్వలితనిరంతరప్రమదసద్విటసవ్రజచిత్రకూటమున్. 182

గీ. కాంచి యట పర్ణశాల నిర్మించి చిత్రకూటకూటవహోత్కటకుటనికటగు
హాగృహాపహారకిన్నరీహారితరసుగానని స్వానసమ్యగాకర్ణు లగుచు. 183

చ. ఫలసినకందమూలరసవల్కలపుష్పరసత్రివాళము
ల్పాలుపుగ సంగ్రహించి మహిపుత్రి కొసంగుచు దుష్టదంష్ట్రిలం
బులులను దుర్వృకంబులను బొబ్బమెకంబులఁ బింగదృష్టులం
బులుఁగులఁ దోలుచు న్ముదముఁ బొందుచు నందు వసించియున్నెడన్. 184

క. రఘుతనయుఁ డొక్కదినమునాఁడు, మహితనయాననముఁ గాంచి మాక్షికవపుపు
న్వపియించి నిజనిశాతనఖాతిఁ గొంచొంతరముఁ జీరెఁ గామకవృత్తిన్. 185

గీ. జీవితేశ్వరి నిటు చిరజీవి సేయు, దండగంబుల రావవిభుఁడు చూచి
కనలి మంత్రించి యొకయిషీకంబు వైవ, నది భయంకరతరశరమగుచు నిగిడె. 186

శా. మంటల్ మండుచు విస్ఫులింగములు వోఁడ్మం దత్కాలంబంబు వె
న్వెంటం గొంటు శరణ్యశూన్య మగుచు న్విభ్రాంతహృద్గ్రంథి యై
మింటం బర్వులువాఱుచుం గహనవల్మీకంబులం దాగుచు
న్మంటిం జేరుచు నొచ్చె నిట్లు శ్రవగ్రమ్మం గాకి యేకాకి యై. 187

క. దిక్కులు పదియును ద్రిమ్మరి, దిక్కెవ్వరు లేక రామదేవునిపదము
ల్దిక్కనుచుఁ దలఁచి యాతని,దిక్కె మొగం బగుచు నేకదృష్టి మరలుచున్. 188

క. ప్రేమను నిట్టు లలంచిన, వాయసముం గాంచి దీనవరదుఁడు రాముం
డాయెడఁ ద్వన్నయనము మ,త్సాయకమున కొసఁగు మిది ప్రశాంత మగునన్.

గీ. నెమ్మనమ్మున వాక్యమ్ము నమ్మికొన ఘ,నమ్ముగానమ్మునకు నయన మ్మొసంగి
యత్యరిష్టంబు నొందుచు వరిగెనయ్య,రిష్ట మప్పు డరిష్టంబు రిష్టముగను 190

వ. తదనంతరంబున. 191

క. చక్షుశ్శ్రవదారణహ,ర్యక్షహాయవిపక్షయక్షరక్షోగణము
ర్వ్యక్షశరవృక్షబుక్షత,రక్షుక్షుభిత మగునయ్యరణ్యక్షోణిన్. 192

వ. సీతారామలక్ష్మణులు నివసించి రంత నక్కడ. 193

ఉ. దైన్యరసాశ్రయాననుఁ డధైర్యుఁడు నైనసుమంత్రుఁ డంతయున్
శూన్యరథంబుఁ గొంచుఁ బురిఁజొచ్చిన వచ్చినవాఁడు లోకస
న్మాన్యుఁడు రామచంద్రుఁ డని నాగరికుల్ గనుఁ జుట్టుముట్టి రా
జన్యునిలేమిఁ గాంచి సవిషాదము నొందుచుఁ దన్నుదూఱుచున్.

క. నగపున రామునివార్తల,డిగినఁ బ్రత్యుత్తరము లుడిగి తేయ వడిం
డిగి చెక్కులు గన్నీటఁగ,డిగి పొరలెనురాజుఁ గని కడిందియలంతన్. 195

చ. దశరథమేదినీరమణ తావకపుత్త్రులు రామలక్ష్మణు
ల్విశదమనస్కులై విపినవీథి ధరాతనుజాసహాయులై
కుశలత నున్నవారు నృపకుంజర వారు వనంబునం జతు
ర్దశసమయాబ్దముల్ ద్రుటివిధంబునఁ బుత్తురు వత్తు రొప్పుగన్. 196

వ. వారిం దలంచి విషాదంబు నొందం బనిలేదు. సుఖంబున నున్నవారని పల్కి వెండియు.

క. అవనీశ వినుము పదినా,ల్గవది యైనయేటికడపల న్నిజముగ ని
న్నవలోకించెద ననుచున్, భవదీయతనూజు లనినపల్కులు వింటే. 198

చ. అనవుడు గుండె జల్లుమన నన్నరనాయకుఁ డగ్రపుత్రుఁ బే
ర్కొని తరణీసహోదరుఁ గూడి వనంబు మనంబునన్ ఘనం

వనితలపోని తండ్రి మృతుఁ డయ్యెను నాదెసనైన శోకవే
దననని చింతసేయవుగదా తగదా దయ దానవాంతకా. 199

క. విను తనయ మునివినుతనయా, నినుఁ గనుభాగ్యంబ కాని నిరతము నదగ
న్నినుఁ గనుభాగ్యము నోచను, మునుఁ గను పాలైతి దుఃఖమున మునుఁగంగన్.

చ. నను విడనాడ నీకుఁ దగునా తగు నాదగునా త్రిదీప్ర నే
యనఘుఁడనైన విన్ము తనయా తనయా తనయాత్మజన్మచే
త నణఁచుదండ్రి నేయుప సదాపసదాపసదాసకోటుల
న్వనిగనబోదు వీవు. సుమనస్సుమనస్సుమనర్తనాళివై. 201

వ. అని మఱియు ననేకవిధంబులం బలవించి వెండియు రామలక్ష్మణులం దలంచి.

చ. నిమసము తాళఁజాలఁగలనే కలనేనియుఁ గానరాదు దై
న్యమున వనిం జరింపనవునా నవునానను లోచుఁ గన్నదో
యిమద మొనర్పకున్న మెయి నేమెయి నేధరియింతుఁ బ్రాణమో
కమలదళాక్షులార మిముఁ గన్గొనకుండయరాదు మీమదిన్. 203

క. పాపాత్ముఁడు నిష్కరుణుఁడు, గాపురుషుఁడు ననుచు నగు మొగంబులు నాకుం
జూపర చూపఱ, నాపదలకు నోర్చి యడవి కరుగం జనునే. 204

వ. తదనంతరంబునం గోడలిం దలంచి. 205

క. తరణికరతప్తమగువన,ధరణి స్నదువంగలేక తాపము మిగులం
తరుణీ తరునీడలఁ గా,తరునింతియుఁబోలె మెలఁగెదవె విధిచెయిదిన్. 206

వ. అని పలవించి వెండియు. 207

ఉ. డాయనురా రిదేమి చెప్పడా యనుఁ గానమె కాలు మీకుఁ దో
డా యను నొంగ్లు మీకుఁ బురుడా యను నావెతఁ దీర్చువాఁడు లేఁ
డా యను రామ నీకయిన నక్కటికం బొకయింత లేదు నా
డా యనుఁ దమ్ముఁ డాయను మహాటవి కేగితె పుత్రుఁడా యనున్. 208

వ. అని మఱియుఁ బెక్కుభంగులఁ, దనయులఁ గోడలిఁ దలంచి దశరథుఁ డతిశో
కనిమగ్నుఁ డైనఁ గనుఁగొని, యనియెం గౌసల్య శోకసామగ్న మునన్. 209

ఉ. నీకు విచారమేల ధరణీవర మేలతలంచినాఁడవ
క్కైకవశంబు నొచ్చ నముఁ గన్గొన నీవిపు డిందువచ్చుట
న్నీకు విచార మీకరణి నీరుగఁ జేసెఁ గులంబు నెల్ల నా
హా! కరుణంబు దక్క భవదగ్రసుతుం బెడబాయు టగ్గమే. 210

చ. అని యిది మీకుమారకుల మాగయఁ జే నపరాధి నంచుఁ దె
ల్పిన వదనంబు లెత్తి విలపించుచు హా సుత పల్కుమంచుఁ బు
త్రునిమృతదేహ మంటికొని తోఁచెడుశోకభరంబు పెర్మిఁ జ
చ్చిరి క్రియ మూర్ఛనొందిరి కృశించి సధైర్యమున న్మహావ్రతుల్. 236

ఉ. ఎచ్చటికైన మోసికొని యేగఁగఁ బట్టినమారుఁ డొక్కఁడుం
జచ్చిన నట్లు వార్ధకదశ న్నయనంబులు లేనివారికిన్
హెచ్చదె శోక మాక్రియ మహింబడి కొండొకమూర్ఛ దేఱిన
న్మెచ్చక క్రోధశోకములు మిక్కుటమై తము హెచ్చరింపఁగన్. 237

వ. నన్నుం గనుంగొని 2:8

క. అపరాధరహితు మత్సుతుఁ, గృప యింతయు లేక నట్లు గీటడఁచితి వి
ట్యపరాధంబునకు న్నిన్, న్నపగతజీవునిఁగఁ జేయు టర్హమ యైనన్. 239

ఉ. కానమిఁ దప్పుచేసితివి కాన మితం బగుశాపవహ్నికి
న్మానవనాథ యర్హుఁడవు మానవనాథుల నేచుపాపము
ల్మానినొనర్పఁ గాని యహహా! నినుఁ జూడఁగ రాదు పుత్త్రశో
కానలతప్తులే విను కానలఁ దాపసు లైనసాధువుల్. 240

క. అని కవలి పుత్త్రశోక,మ్మున మృత్యువుఁ జెందు మనుచుఁ బొల్పఱఁగ శపిం
చి నితాంతపుత్త్రవిరహ,మ్మునఁ జచ్చిరి వృద్ధమునియు మునిమానినియున్ 241

వ. ఇట్లు శపించుటయు 242

చ. అవికులవార్ధిచంద్రు లగునాత్మజు లుద్భవ మొందు టింతెచా
లు విధి దయాత్ముఁ డంచు మదిలో ముదమందుచు నుంటిఁ గాని పు
త్రవిరహ మార్తిఁగూర్చునని తత్సమయంబునఁ దోఁపదయ్యె నిం
తవిషమమంచుఁ దోఁచినఁ బదంపడి ప్రాణము లద్ధ వీడనే. 241

వ. అని తనకుఁ బూర్వంబునం గలమునిశాపంబు తెఱం గెఱింగించి. 244

క. రామాభిరామ భార్గవ,రామమహామదవిరామ రవివంశమహో
ద్దామ సుగుణధామా శ్రీ,రామా రామా యటంచుఁ బ్రాణము వీడెన్. 245

క. వసుధేశున కసుతతి ని,ట్లసుతతి వెడలుటయుఁ దన్నిరాలాపతఁ గాం
చి సుదంతి కోసలాత్మజ,యును సుమిత్రయు నిద్ర గాఁగ నూహించి కడన్. 246

గీ. రాముఁ బుత్త్రిలఁ గోడలిఁ దలఁచి తలఁచి, నిండువేదనఁ గుత్తుక లెండ నెడ్డె
యుల్లములు దల్లడించుచు నుండ నపుడు, వెడవెడ సుషుప్తినొందిరి వేడ్కదక్క 247

వ. అంత.

మ. కరవారంబులఁ బద్మినీరమణి కుత్కంఠంబు దీపింపఁ జె
స్వైరవారం గడుఁ గౌఁగిలించికొని పృథ్వీధ్వాంతవిచ్ఛేదమై
పురివారిం దగ మేలుకొల్పికొనుచుం బూషోదయం బైననా
గరవారంధక వైరిమాగధసుతా కౌసల్య లొక్కుమ్మడిన్. 249

వ ఇట్లు మహారోదనంబు గావించుచు. 250

ఉ. అంగవికార మారయుచు నంగన లంతఃపురాంతరంగులై
పొంగెడు పుత్రశోకమున భూమివిభుండు శరీరవాయువి
స్సంగతి నిట్లు దేవపరిషన్నివసత్వముఁ గాంచె దిక్కు మా
కుం గలదే యటంచు నృపకుంజరుపైఁ బడి యార్తనాదలై. 251

చ. ఇటు వినుమొక్కవింత విపులేశ్వరపుత్రవియోగశోకము
త్కటమగుడున్ శరీరమునఁ దాల్పను ప్రాణము లీవు మేము ను
త్కటమగు పుత్రశోకమునఁ గూరిమి భర్తృవియోగ మొందియుం
బటుగతి నున్నవారలము పాపము రూపములొందెనో యనన్. 252

క. వసుధాసుధాశనులు గొల్వ సుధర్మసభానివాసి వరవిబుధపతీ
వసుధారణశక్తిం గడు, నసహ్యుఁడ వైతి విట్లు లాశ్చర్యముగన్. 253

వ అని మఱియుం బెక్కుభంగుల విలపించి యందుఁ గౌసల్య. 254

సీ. జననాథ నినుఁ బరుసంబులు పలికిన, ఫల మిప్పు డనుభవింపంగ గలిగెఁ
గతివనిగ్రాతపఘ్రూతంబునఁ దపించు, జనునకుఁ గొఱవిచూఁడిన విధమునఁ
బుత్రవియోగితఁ బొందయుచుండఁగ, భర్తృవియోగసంప్రాప్త మయ్యె
వనవాసమున కేగుతనయునిఁ గాంచిన, మందభాగ్య నటంచు మదిజనించుఁ

ఆ. గోపమో మదీయ పాపవిశేషమో, యెట్టినోముఫలమొ యే నెఱుంగ
నాగుణంబుఁ దిన్న నాఁటనుండియు నెఱింగియును బలుక వేమి కృపవలిగ్న. 255

వ. అని మఱియుం బరిచారికాసహస్రంబులుం దానునుం బలవించు నెలుంగులు నింగి
ముట్టె నయ్యవసరంబున. 256

ఆ. పుత్రుఁగుఱిచి భూమిభుండు లోకాంతరగవాసి యగుట విని సువాసినీత్వ
హాని కోర్వలేక నడలుచుఁ జనుదెంచె, భరితదురితజాతి భరతమాత. 257

ఉ. నెవ్వగ నిట్టుఁ వచ్చి ధరణీపతిఁ గాంచి మనంబు నొవ్వఁగా
నెవ్వరు దన్ను దూఱిన సహించి విలాసము సేయఁ జొచ్చె నా
జవ్వని హా దినేంద్రకులసాగరచంద్రమ హేంద్రతుల్య నీ
కివ్విధి నవ్విధాత లిఖియించెనె పాపపుఁజావుజావగన్. 258

ఉ. కోరినకోర్కు లెల్ల నొనఁగూర్చెద విప్పుడు మాటలాడఁగాఁ
గోరిన నారకున్కి నృపకుంజర ధర్మవు గాదు కైకపా
పోరుచరిత్రి గానఁ గృప యొల్లమునం జనియుంప దాత్రలో
వారితోడనైన గరువంబునఁ బల్కక యుండఁ జెల్లునే. 259

వ. అని యిట్లనేకవిధవిలాపంబుల నా రాజశవంబుఁ గౌఁగిలించుకొని దుఃఖించు
చున్న యవసరంబున. 260

క. విప్రప్రతిమానుఁడు విప్రప్రభుఁ డప్రతిహతప్రభావుఁడు ప్రతిభా
త్మప్రముదవనానలుఁడు యాత్రిప్రదప్రముఁ డరుంధతీప్రియుఁ డంతన్ 261

ఉ. కాలవిధిజ్ఞత న్హృదయకంప మొకింతయు లేమిఁ బెక్కుగం
దాలఁ బరిభ్రమించు నృపదారలఁ గాంచి కుసుంము వల్కెని
ట్లేల విలాపము ల్సలుప నిన్నరనాథున కీక్రియంబునం
గాలవశంబు నొంద మును గల్గినకర్మఫలంబు దప్పునే. 262

గీ. జన్మము లనేకము లొనర్చి సత్సుతులను, గన్నవాఁ డెటుకాలము మన్నవాఁడు
నహితరాజన్యసైన్యదావాగ్నిహోత్రుఁ, డవని యీతనిమృతికి నింతవిలపింప 263

క. పగవరుఁ డేలవగ చెదరు వంచిన వృథు లైనవారు వత్తురె యనుచుం
దగుసంభాషణముల న,చ్చగుపల నూరార్చి బోధమహితుఁడు పటిమన్. 264

గీ. తనయులిద్దఱ లేమి నిర్ధాత్రిపురుని, దహనకర్మము నడుపుట ధర్మ మగుట
ధృతశత్రుఘ్నులను బిలువంగ నిపుడ, బంపవలయును శీఘ్రపరివరభటుల. 265

వ. అని పలికి సమస్తజనానుమతంబు వడసి దశరథుకళేబరంబుఁ దైలపక్వంబున నుగు
ప్తంబునం గావించి. 266

సీ. పటుజవసత్త్వసంపన్నుల భటులఁ గన్గొని వసిష్ఠుం డిట్టులనియె మీరు
కృతమతి కేకయక్షితిపతిపురి నున్న, భరతశత్రుఘ్నులఁ బరితయశులఁ
గాంచి మీ మొక్కపవా కార్యంబు గల్గె తో,డ్తో నిచటికి రండటంచు మీకులగురుండు
మము బంపె నని వానిమాట యూనతి నొంది, వారును మీరును వడిగ నిటకుఁ

గీ. గదలి రం డనిపలుక నాక్షణమ వారు, సిద్ధులై క్రుక్కి పీడ్కొని చేరఁ జనిరి
సప్తరాత్రంబులకు సుదత్తప్రధాని, రమణమగు దానిఁ గేకయరాజధాని. 267

క. ఈశరణి నేగి లోపలి,శోకము వెలిఁ దోఁపనీక సుయశోధను న
క్కేకయభూపతిఁ గని పటి, కైకాసుతుసోదర యుతుఁ గని నతులగుచున్. 268

క. చెడుకలలు గాంచి చింతిం,చెడు భరతుఁడు వారిముఖకుశేశయములఁ దోఁ
చెడు దైన్యముఁ గనుఁగొని నొ,చ్చెడుచిత్తముతోడ మిగులఁ జిడిముడిపడుచున్. 269

ఉ. కేకయరాజనందన కకృత్రిమభంగి నమస్కరించి యా
కైకయరాజుసేయు మెఱఁగించి యొకించుకతాల్మి లేమి న
శ్శంకరమూర్తి శంకరము గాఁ గత మేమి పురంబు నామదిన్
శోకము సేయఁజొచ్చెఁ గలదొప్ప సమస్త మెఱుంగఁ జెప్పుమా. 282

క. మనమున భయసంభ్రమములు, బెనఁగొన నిట్లడుగుచున్న ప్రియనందను మో
మునఁ జూడ్కి నిలిపి కేకయ, తనూజ యిట్లనియెఁ గాఢధైర్యస్ఫూర్తిన్. 283

ఉ. మీజనకుండు దొల్లి నను మెచ్చి వరద్వితయం బొసంగఁ బు
త్త్రీ జటులాని యగ్రనితాకుతుఁ డబ్దచతుర్దశంబు న
వ్యాజము స్థితి వనవిహార మొనర్పఁగ నీవు సర్వధా
త్రీజనమాన్యత న్వసుమతీపరిపాలన మాచరింపఁగన్. 284

క. అగ్రసతీసుతు విభవో, దగ్రునిఁ గావింప నాత్మఁ దలఁచు దురాశా
ప్రగ్రహనిబద్ధబుద్ధిన్, బాగ్రశి నడిగితిని రాజ్యము గుసుమయమునన్. 285

క. ఏ నరిగించిన వరయుగ, మీ నసుధగుఁ డయి మానవేంద్రుఁడు మానం
బూనిన దనజ్ఞ నెఱపఁ, బూనినఁ జని రాముఁ డడవిపాలములఁ దిరుగన్. 286

చ. తలఁపిరి యప్పుత్త్రుఁ డగ్రవనితాభవుఁ డాత్మసతీసహోదరు
ల్వెనుకొన బ్రహ్మచర్యమునివృత్తము లూని చతుర్దశాబ్దము
ల్వని నివసింపఁబోయిన భవజ్జనకుం డిటుఁ దద్వియోగసం
జనితపృథుక్యథావ్యథితసన్మనుఁడై మృతినొందెఁ గావునన్. 287

క. విక్రమసమృద్ధి ధరణీ, చక్రవన మాచరింప జనకుని పిత్ర్యో
కక్రియ లుపక్రమింప శ, తక్రతునిభతేజ నీవుఁ దగుదువు లనినన్. 288

వ. భరతుండు మహింబడి మూర్ఛిల్లి కొండొకవడికిం దెలిసి. 289

క. రాముని సద్గుణయుతుసు, త్రాముని లోకత్రయాభిరాముని నాత్మా
రాముని వనములఁ దిరుగఁగ, నేమనిపొమ్మంటి బుద్ధిహీనతఁ దల్లీ. 290

క. క్షితిపతిఁ జంపితివి వన, క్షితి కంపితి సుతుని రాతిచివి గాక యని౦
దిత కేకయాన్వవాయో, దిత యిటు సతి కింతదుష్కృతిస్వము గలదే. 291

శా. చేతోజాతసమాను రాము వనవాసిం జేయు దుశ్చింత త్వ
చ్చేతోజాత మెయి రామసీతులిత దాసీజ్ఞాతమో కాక వా
క్షేతాప్రేరితమో మదీయసుయశోనిర్వాపణాభూతమో
మాతా మత్పితృమృత్యుహేతు విధి సామాన్యంబు గా దారయన్. 292

సీ. నను రాజ్యకాంక్షిఁగాఁ దనమనంబున నవ్వ, నిష్ఠుఁడు గనునూహ నేయుఁడొక్కొ
యతిశయ నీగర్భమున దావిర్భవించుట, కకట నాపూర్వజన్మకృత మొక్కొ
ముద్దులుగుల్కు రాముని ముఖాంభోజంబుఁ, గనఁగాన నాకింకఁ గలుగదొక్కొ
మాత నీకపటంబు మనమున నిడికొని, కౌసల్య నను గని కనలునొక్కొ
ఆ. యొక్కయడుగు నడువ నోపదు జానకి, యెట్టు లడవి సంచరించునొక్కొ
జనులు భరతుఁ డమితసౌజన్యనిధి యని, పొగడుమాటలింక నెడవొక్కొ 293

వ. అని పలికి కినుకవోడవి. 294

ఆ. నిన్నుఁ జూడరాదు నీతోడ భాషింప, రాదు నిన్నుఁ జంపరాదు నాకు
నిచట నుండరా దహీనపాపమతీ యంటుఁ చు వెడలి భరతుఁ డనుజుఁ గూడి. 29

వ. అత్యంతచింతాక్రాంతాంతఃకరణుండై దీనమనస్క లగు కౌసల్యాసుమిత్రాదేవుల కడ
కుం జని నమస్కరించి కన్నీరుమున్నీరుగా నేడ్చుచున్నం గనుంగొని. 296

క. చిత్తంబుల నుత్తలములు, క్రొత్తలుగుడు నత్తఱిఁ బలు గొడుకుల దుఃఖా
యత్తుల నెత్తి పదంపడి మొత్తంబుఁ నేడ్చి సొక్కె మొగి నభమద్రువన్. 297

వ. మఱియు ననేకవిధంబులఁ బలవించునెడఁ గౌసల్య. 298

చ. భరతుఁడె రాముఁ డుగ్రవనవాసము సేయఁగఁ బోయె నవ్వలో
భరతుఁడు రాజముఖ్యుఁడు భవజ్జనకుం డమరత్వ మొందె దు
ర్భరతరపుత్రశోకమునఁ బట్టణ మౌనె యరాజకంబు సం
భరితమనఃప్రమోది నిరపాయితఁ దాల్పుము పూజ్యరాజ్యమున్. 299

వ. అనుటయును సహింపక. 300

చ. చరితస్పృహజ్ఞుఁడై పురుషసత్తముఁ డబ్భరతుండు వెచ్చనూ
ర్చి కినుకఁదక్కి నిమ్మతిగఁ జెప్పెద నామది రాజ్యవాంఛలే
మికి ఘనపంచభూతములు మిత్రశశాంకులు సాక్షు లీవెలుం
గకిటుల నొవ్వఁబల్కె దనుకంపఁ దలంపవు కోసలాత్మజా 301

క. అన నిలఁడు రామభక్తుఁ, డనూనపుణ్యాత్ముఁ డిమ్మహాత్ముఁడు భరతుం
డనిన యది తథ్య మనుచుఁ గగనవాణి వచించెఁ దగ సకలజనులు వినన్. 302

వ. ఇట్లు వచించుటయు నెల్లజనంబులు నచ్చెరువొంది భరతుం బ్రశంసించి రంత. 303

క. భరతుని గాఢానురత్రత్వరతం గౌసల్య మెడలు వట్టుకొని విశే
షరవంబున నేడ్చెం దత్పరిచారిక లధికశోకభరమున నేడ్వన్. 304

వ. తదనంతరంబున భరతుం డనుజసహితుండై తైలద్రోణి నిమ్మగా సంగ్రహించియున్న

పితృశవంబుఁ గనుంగొని యుల్లంబు జల్లన నొల్లంబోయి తల్లడంబు వెల్లివిరియ నల్లన
మృతుం డగు నబ్జాప్తకల్లభతల్లజుం జేర్కొని. 405

క. ప్రేమాస్పద విను మామా, తామసపురిఁ బోడఁ జని పదంపడి రామా
తో మాటలాడ వేడ్కకు, రావ ద్రోహులము గాము గజవశంసా 3 6

క. పురి పాడరినయది భవ,త్పరిపాలన లేమిఁ జేసి పరిప థికరః
పరిపాటన పండితత,స్కర పార్థివవశము ఖ్యా ప జైరధాఖ్యా. 307

క. ననుఁ జూడవు కైకాసుతుఁ డనుతల,పునఁ జేసి ఘోర నుగుమూర్ఛ మునిం
గిన ప్రియపుత్రకు శత్రు,ఘ్నుని గాఢాదరత నెత్తికొన వది తగునే. 308

వ. అని మఱియుం దదీయగుణంబు లగ్గించి పలవించి సచివు లూఱడించినఁ దెలిసినొం
దక పితృమరణశోకనలసంతప్తచిత్తుం డగుభరతుం గనుంగొని సకలగుణోత్తరుం
డగుగురుం డిట్లనియె. 309

చ. శతసురనాథుల న్నిపులఁ జక్కఁడవై స్వర్గధామమార్గసం
పదనఁ బ్రశస్తుఁ డాదరిశబాంధవుఁడుం గడుసర్ధు పుణ్యకీ
ర్తితుఁడు మహీతలమ్మును సమస్తముఁ బాల్చినభోగ యోగతం
గతనపువేదనం బకుటు కార్యమె యిన్నరనాథమౌళికై 310

సీ. ఒకయిల్లు వాసి యొం డొకయింటి కేగిన, వాసి జీర్ణములగు వసనములను
రోసి నూత్నచ్ఛదోద్భాసి ధ్యైనట్టులు, గాదె దేహాంతరగమన మాత్మ
నకు జరామరణాదివికృతు లాతనికి లే, వగలఁ దక్షుఁడు నవామయుఁడును
శాశ్వతుం డన నిరంజనుఁ డన సిలసిల్లు, నింతయెఱుఁగక నితరజనులు
గీ. పంచభూతాత్మకంబు దుర్బలము రక్త,మాంసమేదోవిద్ధమ్ము మలిన మశ్వ
రంబు నగు మేనిచేటునకుం బొగలుట, తలఁచిచూడ వివేకమతంబు గాదు. 311

క. బంధుర మగుజ్ఞానము సం,బంధము లేనిమనములఁ బ్రబంధకమగు స
ద్బంధుమరణశోకాంధభ,వాంధువునఁ గూలుదురు ధ్రువంబుగ జనముల్. 312

క. ప్రకృష్టయా నశాశ్వతుఁడుఁ బ్రో,త్కృష్టము లగుపర్వతములుఁ దెగుఁ గాలగతిం
దృష్టాంతము గాదే యా,దృష్టాంతిస్నష్టి మను సుధీమధురోక్తుల్. 313

వ. అని పలికి నిశాంతిక సంబుల నించుక తెలిసినొందిన యతనిం గనుంగొని. 314

ఆ. వశము గాని దైవవశమున కీగతి, వగవనేల యిఁక భవజ్జనకున
కగ్నికార్య మాహితాగ్నికిఁ బోలె విధ్యుక్తముగ నొనర్ప నుచితఁ దక్క. 315

చ. అనవుడుఁ జింతదక్కి వసుధామరముఖ్యులు నవ్వసిష్ఠుఁ డుం
డనసచివవ్రజంబుఁ జనతమ్ముఁడుఁ బౌరులుఁ గూడఁ జందనేఁ

ధనఘృతముఖ్యసౌరభపదార్థచయంబులు గూర్చి తండ్రికిం
దనరఁగ నగ్ని యిచ్చె విదితంబుగ నబ్భరతుండు సద్విధిన్. 316

వ. ఇట్లు పితృమేధంబు యథావిధిక్రియాకలాపంబుగా నిర్వర్తించి. 317

క. భూదానంబులు హేమక, న్యాదానంబులును గోసహస్రంబుల ను
ర్వీదేవతలకుఁ గడునే, ర్పౌ దశదివసంబునందు ఘనుఁ డొసఁగెన్. 318

వ. మఱియు నద్దశరథున కమరలోకనివాసప్రాప్తికరంబులుం దమకు నశుచిత్వనిరాస
కంబులు నగు క్రియాకలాపంబు లెన్నియేని నడపి సమస్తజనంబులన్ భోజనదానంబు
లం దృప్తులం గావించి సుహృద్బాంధవామాత్యబ్రాహ్మణపౌరజనపదనికరపరి
వృతుం డగు భరతుం గనుంగొని యరుంధతీప్రాణవల్లభుం డిట్లనియె. 319

ఆ. సమయజ్ఞుఁడు రామచంద్రుఁ డిచ్చట లేమిఁ, బూజ్యరాజ్యభారముఁ బూను మిఁకఁ
గులక్రమంబు వేడ్కఁ గూరుచు నే రాజు లేకున్న భరత నూర్వితో క్కినిత. 320

వ. అనుటయు సవిషాదమనస్కుండై. 321

క. నీ వఖిలమెఱిఁగియు న, న్నీవిధమున ననుటయెల్ల నే నెఱుఁగుదు మ
ద్భావము సమస్తజనసం, భావితముగ నిప్డు డెలుక వసుటకుఁ గాదే. 322

మ. ఫలమూలాశనుఁడై కుశాసనుఁడునై పర్ణోటజావాసియై
బలవద్దైవవశానసుం డయి మహాపాషాణపర్యంకవ
ల్కలచేలాన్వితుఁడై మదగ్రజుఁడు కల్కానం దపంబూన ను
జ్జ్వలభోగాస్పదపట్టణంబునను నిల్వన్నాకు సద్ధర్మమే. 323

చ. పలుకులు వేయు నేల మహిపాలన మే నొనరింపఁజాలఁ బె
న్మలుకులమీఁదఁ బోలెఁ బదము ల్దగ నిల్వవు నేల నాయసం
బులుకుచుఁ దత్తరించెడు గ్వజ్ఞోత్తమ యిప్పుడ పోయి మేనఁ గ్రాం
బులకలు గ్రమ్మఁ జేర రఘుపుంగవుఁ జూడక యుండఁ జేర్తునే. 324

క. అవనీగతుణాకై ర్పాఘువునిం బ్రార్థింతు నతఁడు గా దను నేని
ప్రవితంశాచార్య వహో, గ్రవనీవిహరణము నాకుఁ గర్తవ్యమగున్. 325

వ. అని తననిశ్చయంబుఁ దగ నందఱకు నెఱిఁగించి వారలె
ల్లరుఁ దనుఁ జుట్టిరా నపుడ లక్ష్మణపూర్వజుఁ దర్వశిష్ఠుఁడుం
జననులు మువ్వురు న్సచివసత్తములు న్హితులున్ మహారథే
భనిఖిలసద్భటోద్భటజనప్రబలాశ్వములు న్వెనుంబడన్. 326

వ. సహోదరయుతుండై యయోధ్యాపురంబు వెలువడి వేగిరంపుఁ బయనంబులం జని చని. 327

ఉ. సాధునికాయసేవ్యుఁ డమసాధుని గాయము వొంగఁ గాంచి త
ద్రోధవిభాస్వదాతపనిరోధవిశాలరసాలభూరుహో
త్సేధము వేడ్కఁ గూర్చ నృపశేఖరుఁ డా భరతుండు మూఁకసీ
వ్యాధినిరాసకంబులు దదంబువులం గొనియాడి మ్రొక్కుచున్. 328

క. అన్నది సద్యశ్శిక్షితమునియన్నది నటుఁ గడచి భరతుఁ డతిగయమునఁ దా
నన్నదిశకు గుహుతోఁ దా, నన్నది మదినూది నడచె ననుజసహితుఁడై. 329

వ. ఇవ్విధంబునం జని యొకయెడ వినోదంబులగు నదీనదంబులు తుంగంబులగు గిరిశృంగం
బులు విశాలంబులగు సాలంబులు నాలోకించుచు సరయూగంగాసంగంబు నుత్త
రించి గంగాతీరంబునకుం జని యందు. 330

ఉత్సాహవృత్తము.
సాధునీతిఁ గనియె రాజపుత్త్రముండసత్రతా, సాధునీనివ ఘనఘనఘుష్టాళితాత్మసాముని
వ్రాసమిష్టు. దీనరక్షసాధునిద్ధసన్మనీ,సాసుగంధమున్ గుహాల్నిపాయనిర్విపాయునిన్.

వ. ఇట్లు గాంచుటయు నగ్గుహుండు సాదరపూర్వకంబుగా భరతున కిట్లనియె. 332

క. ఇలు వెలువరించి రాముని, కలిమిం గొని యంత నిలువక కలుషమతివై
బలిమి మెయి నతనిఁ దలపడఁ, దలఁచి యరిగెదిట్లు సుత్రితంపుఁ దలఁపున్. 333

చ. అన నతఁ డోసిసాద వినుమట్టులు గాదు మదగ్రజన్ము న
జ్జనకసుతాసమేతు నృపసత్తము రాముని లక్ష్మణున్ జగ
జ్జనుతకీర్తినై ద్విపదసాధ్య కయోధ్యకుఁ దోడితే ముదం
బున నిటుపోక నీకగునె పోకడమాలినపల్కు లేలఁగన్. 334

చ. అనుటయు సంతసించి యతఁ డాతనికి న్విహితాగ్ఘ్యపాద్యము
ల్వనుపడఁగా నొసంగఁ దగుభంగిగ గంగఁ దరంగిణీమణిం
బౌనరంగ నుత్తరించి గుహుఁ బో విడరించి విరించికృత్య మె
వ్వరికి నలంఘనీయమని వాక్యము నంచుఁ దలంచుచు న్వెసన్. 335

వ. భరద్వాజాశ్రమంబునకుం జని. 336

క. అమ్మునిపతికి నమస్కార, మ్మొనరించుటయు సాదరమ్మున నిటు రా
రమ్మని భరతుని కరముఁ గరమ్మున గీలించి ముని కరమ్మున రక్తిన్. 337

క. మనమున వందక్కు మనీ, జనకుఁడు స్మృతిపొందె విధివశమ్మున నిటు రా
మునిఁ గానఁ బోవు టెంతయు, ననకూలం బయినకార్య మని సెలవొసఁగన్. 338

క. సలనొప్ప రాముఁ డరిగిన వలను భరద్వాజమౌనివలనఁ దెలిసి య
వ్వలఁ జనియె భరతుఁ డెంతయు, వలనదగుల్వడిఁ బులుఁగువలె నతిభయుఁడై 339

క. అనుజప్రియాసహితుఁడై, మనుజప్రవరుఁడు దివంబుమగ్నాత్ముండై
జనకునకుఁ దిలోదకవిధు, లొనరిచి కృతకృత్యుఁ డగుచు నటుజను సేరెన్. 364

ఆ. ఇట్లు వచ్చి రాముఁ డెరిఁగి యూమనంబుఁ, దనుజవరులఁ బట్టికొన మహాశు
గ శుగపాతి వారిలె వాశుగపాతిఁ గూలు, నగముసట్లు పుణ్యనగమునందు. 365

వ. ఇవ్విధంబునం బిత్రుమరణశోకవ్యాకులితమానసుండైన రామచంద్రుఁ భరతుం డూరార్చుచున్న యవసరంబున గురుండు కౌసల్యా కైకా సుమిత్రలం దోడ్కొనివచ్చి సముచితంబుగాఁ దత్స్నానంబు నడపుటయు రాముండు సీతాలక్ష్మణసమేతుండై కన్నీరుగుఁ దదంఘ్రిపుకోభాగంబులఁ బడుటయు నక్కాంత లక్కొడుకులం గోడలం దీవించుచు నక్కులం గదియించి వెక్కి వెక్కి యెక్కుగుక్క దిక్కులుపిక్కటిల్ల నేడ్చిరి యంతియును. 366

ఉ. ఎల్లజనంబులు న్విశగ నీల్గినపత్కాఘుం దలంచుచుం
దల్లకితోరుసద్గుణవితానను నప్పుడు పేరుకొంచు నా
తల్లులుమువ్వురు న్సుతులు దారుణశోకభరంబు నొంది పెం
దల్లడ మంది యేడ్చినవిధం బది యెచ్చటనైనఁ గల్గునే. 367

క. సుత్రియకాంతలు కోసల,పుత్రియుఁ గైకయును మగధపుత్రియు నగతోఁ
బుత్రిలధైర్యగు ధాత్రీ,పుత్రీదైన్యంబు గాంచి పొగిలిరి మిగులన్. 368

వ. అప్పుడు. 369

ఉ. నాకుఁ పౌత్రి కేగినజనప్రభు మామఁ దలంచి చింతతో
నాకులపాలికాతిలక యైనధరాసుత యేడ్చె నేడ్వఁగా
నాకులపాటుఁ జెందెఁ గుసుమాక్షులఁ బువ్వగసాకు లొల్కుచు
న్నాకులు తద్విలాపమనమానము గాదె వదింద దెంపుఁగన్. 370

వ. తదనంతరంబున వసిష్ఠభరతప్రయత్నంబునం గొంతవడికిం గౌసల్యానందనుండు దెలివి నొందుటయుం దక్కినవారు నుపశమిల్లి రంతఁ బౌరజానపదబ్రాహ్మణగురుబంధుభృత్యామాత్యప్రియానుజప్రియాసముపేతుండై పవిత్రసమస్థలసుఖాసీనుండైర ముండుచితవచనంబుల నానందంబు గావించుచు నుండి కొండొకసేపునకు భరతు నాననంబునం బ్రసాదసహితం బగు మాడ్కి నిగిడించి పిత్రునిర్దిష్టదిష్టం బుగ వనంబునం గడపి పురంబున కే మగుడివచ్చునంతకుం గరుణ గలిగి ప్రజాపరిపాలనం బొనర్ప నయోధ్య కరుగు మన్నా యని సప్రేమసాదరబహుళంబుగా నాడుటయు నతండు విషాదంబు నొంది యున్నం గనుంగొని 371

ఉ. భూతలనాథనాథ రఘుపుంగవ కోవిదము దక్షు నన్ను నీ
శీతలదృష్టిఁ జూచుచు వచించెద రాజ్యభరంబు సర్వము
న్నాతఁడఁ బెట్టఁజూచెదవు నాతలఁ బట్టులు గాదు నీవు ధా
త్రీతల మేలఁ గావలదె జగమెల్ల నుతింపుచుండఁగన్. 372

క. ఇనువభ్యుదయంబునఁ జక్రినికాయము రాజు కరుణఁగని సకలయమున్
జనవర పాలుపొందుం జన్యూన రాజ్యము సేయుపొందె నరుడె ప్రశస్తా. 373

గీ. కేకయాత్మజ వడపిన కృత్రిమంబు, నించుకయు నెంచకుము భవద్ధృదయమందు
నత్యనుగ్రహమూర్తి వీ వఖిలభూభృగన్మహీయింప రమ్మి వరమ్మి నిమ్ము. 374

క. నిర్ణిద్రా నానిశ్రమములు, వర్ణాశ్రమధర్మములును వసుమతిజనగు
ర్వర్ణసువర్ణము లగుఁగు, స్వర్ణితుఁ డగు రాజు లేని వసుమతిలోనన్. 375

ఉ. కావున నాదుప్రార్థనముఁ గైకొని నీవు జగజ్జనంబులం
గావు నరాళిసత్కరుణఁ గాచినధర్మపుకో సమానముల్
గావు నరేంద్రధర్మములు కారుణికత్వమునీవు సేవనా
గా వనభూమి నీకుఁ దిరుగం దగునే మది గుంద నీకిఁ దుర్గన్. 376

శా. క్షోణీభారము నిర్వహింప నహితక్షోభంబుఁ గావింప న
క్షీణానందము భూజనాళి కొసఁగ శ్రీరామ రమ్మవ్వన
క్షోణిన్నిల్చెద రాను పొమ్మనుచు నాకున్నీవు దెల్పంగ మ
త్ప్రాణంబు ల్విడుతుం దలంచితి సుమీ ప్రాయోపవేశంబునన్. 377

క. చాల స్వగపురి వనమున, నేల నివాసంబు నేల నేల వరి మ్మేఁ
జాల భూపాలక నీ పాలన వసియింతు వగన్నపాలకవరా. 378

వ. అనుటయు రాముండు మనస్వికసుదర్శనానంతుండై 379

ఉ. తమ్ముఁడ వేఁటినాఁడవు గదా తెలసె న్భవదీయధైర్య మే
నిమ్మెయి రాజ్యపాలనకు నియ్యకొనందగుఁ దండ్రిపంపు భా
వమ్మున నిల్పి కానల నవశ్యము గ్రిమ్మతి వత్తు నీవు హా
ర్దమ్మున నాచరింపుము ప్రజాపరిపాలన మప్రమాదివై 380

క. మనతోఁటివార జనకుని, పనుపున వర్తింపకునికి పాడియె గుణమం
డన నీ వెఱుఁగవె ధర్మము, ననుఁ గావింపకుము రాజనందన యింకన్. 381

క. పితృభక్తి నేమఱక దైవతపూజాపరుఁడ వగుచు వసుమతిసులరన్
ధృతిమంతుఁడవై వత్సర, చతుర్దశము ప్రోవుమీ ప్రజలఁ బ్రజలకిఁ దుర్గన్. 382

శుభమస్తు.

అవిఘ్నమస్తు.

శ్రీశారదాంబాయైనమోనమః

# దాశరథివిలాసము.

## చతుర్థాశ్వాసము.



కాంతాకరముఖరా
శ్రీకాంతరమహీరుహఘనప్రకీర్ణప్రతిభా
నాకావాసాసహాయ
హాకిరిహాగ్యతత వేంకటాద్ర్యధ్యాసా. 1

వ. దేవా తదనంతరంబ ధాంధానం బవధరింపు మట్లు భరతుండు ధర్మనిరతుండై నందిగ్రా
మంబున నివసించెనని చెప్పి యప్పట్టుపట్టువుఁదపసి వెండియు నిట్లనియె. 2

ఉ. తమ్మునిఁ గాంచి రాముఁడు సుధారసతుల్యను పైనవాక్యకా
యమ్ముల నిట్లు పల్కు మన మవ్వనంబున నేగ కీపశా
లమ్మగు పర్ణవేశ్మమున లక్ష్మణ నిల్చితిమేనిఁ దాపసా
పమ్మగు టాత్మనెంచి మనపజ్జకు నచ్చుతుండ క్రమ్మఱన్. 3

క. నమ్మెఁ బోవుద మన్నా, న్వమ్మును విఘ్నంబు విపినవాసంబున కే
నచ్చుపదం దెల్పితి నిఁక, నిచ్చో నుండఁ జన దకలి కేగిన యొప్పన్. 4

వ. అని పలికి సీతాలక్ష్మణసమేతుండై చిత్రకూటంబు వదలి చని ముందట. 5

సీ. ఘనలతాతన్వులు కౌఁగిలించికొన మి, న్నందియొప్పెడు నటపావలియును
పాషాణకంటకబహుళంబులై ఘోర,తర భయంకరములైన వర్త్మములును
జీర్ణపర్ణములలోఁ జిటచిటధ్వనులతోఁ, గుమ్ముఁబర్వులు వాఱుగోధికలును
దరుకోటరాంతరస్థఫణిఫణామణి,ప్రాతఘృణ్యల్కకాజాతములును

గీ. సామజవ్యాఘ్రభల్లుకశరభములును, గలిగి భీకర మగు దానిఁ గని నమరశ
రణ్య మగు నొక్కదుర్గమారణ్య మంత, సస్యజనమూర్తి రామరాజన్యమూర్తి. 6

వ. ఇట్లు కనుంగొని. 7

శా. వన్యేభోగ్రలులాయసింహశరభవ్యాఘ్రాచ్ఛభల్లాదికా
ర్థ్యవ్యాభీలమృగావలీభయదకృద్ధ్వాన్యాధికాకంపితా
వన్యాత్యుద్భవసాధ్వసాపనయనవ్యాసంగుఁడై యాత్మశిం
జిన్యారావ మొనర్చె రాముఁడు పలాశిస్తోమభీమంబుగన్. 8

వ. నిజధనుష్టంకారఘోరంబున వనమృగంబులెవ్వియుం దమ్ముఁ జేరక పాఱునట్లుగా
వించుచు వివిధఫలమధుర మధురసంబుల నవనిజకుం దృప్తి చేయుచు నయ్యాయిలతా
కుంజపుంజంబులం జూపుచుం జనునవసరమ్మున లక్ష్మణుం డన్నం గనుంగొని. 9

ఉ. సారము లోననూఁదికొని చంచలభావ మొకింతలేక వి
స్తారశిఫాచ్ఛటల్ జటలచందము నొందఁగ వల్కలంబులం
జీరలు గాఁగ శాఖలు విశీర్ణతనొందఁగ రామచంద్రదు
ర్వారతపోభరం బిటు లరణ్యము నిష్క్రియఁ దాల్చెఁ జూచితే. 10

వ. అనుటయు మహానందంబు నొందుచుం జనిచని. 11

సీ. ఆఖుశాబకలేలిహానసామాజికా,వర్తితపటుతరగర్తములును
వాతాయమానకృవాతఘోరవ్యాఘ్ర,కులసమాకీర్ణనికుంజములును
మృగరిపుప్రకరగంధగజేంద్రసంఘాత,దంతురితగిరిగుహాంతరములు
భీతికృదోతువారాతతశుకశారి,కాటదంచితతరుకోటరములు
గీ. శ్యేనజాలకపోతసంశ్రితమహావి,శాలమహనీయబాలరసాలములును
గలిగి విదళితఘనపథకనియజన,తాశ్రమం బగునొక తాపసాశ్రమంబు. 12

వ. కనుంగొని యప్పుణ్యాశ్రమంబుఁ బ్రవేశించి యందు. 13

క. అనసూయాహృదయేశ్వరు, ననసూయాహృదయకమలు నత్రిమునీంద్రుం
గని తత్పదంబులకు వం,దన మొనరించుటయు నద్భుతప్రమదమునన్. 14

క. దీవించి రాముఁగని ముని,భావం బలరార నర్ఘ్యపాద్యంబుల సం
భావించి యనంతరమున, భావభవనిభు సుమిత్రపట్టిని మిగులన్. 15

వ. సముచితసత్కారంబుల మనఃప్రియంబు గావించి రామలక్ష్మణులం బవిత్రకుశాస్త
రణంబుల నాసీనులం జేసి కుశలంబడిగి తానును సముచితాసీనుండై మధురసంభాష
ణమ్ములం దేల్చుచున్న యవసరంబున. 16

మ. అనసూయాచరణారవిందముల కత్యంతానురాగంబుగాఁ
దనసీమంతికతోల్లసద్ఘుసృణముం దాకించి చేదోయి నొ
య్యనజోడించి నమస్కరించుటయు నయ్యత్రేయి ధాత్రీసుతా
వనజాతాయతనేత్ర నెత్తికొనియె న్వాత్సల్యసంపూర్ణయై. 17

వ. ఇట్లాశీర్వచనపూర్వకంబుగా నెత్తికొని నిజవిశాలపర్ణశాలామధ్యంబున సుఖాసీన
సజ్జానకి నుద్దేశించి. 18

చ. సుఖములరోసి కాననవసుంధరఁ బితృవాజ్ఞ నేగుదెం
చి ఖరకరాతపంబునఁ గృశించెదు భర్తపిఱుందనవ్వన
న్ముఖముదలిర్ప నుండెదవు ముక్తభయస్థితి వైపతివ్రతా
త్వఖనివి నీవు నీకుసరివత్తురె యుత్తమమత్తకాశినుల్. 19

వ. అని మఱియు ననేకవిధంబులం బొగడి. 20

గీ. అభిరామకమసుభగతాభివృద్ధి, యగు నిదిధరించువారల కని వచించి
కంబుకంఠికి నంగరాగం బొసంగె, నత్తపస్విని యనురాగ మతిశయిల్ల. 21

ఉ. ఈకరణిన్మునీంద్రసతి యిచ్చిననంగరాగముం
బ్రాకటలీలఁ దాల్చి కడుఁ బ్రార్థనసేయఁగ నామెతోడ ని
ర్భయుఁడు రామమూర్తి దను బెండిలియైన చరిత్ర మెల్ల సీ
తాకులకామినీమణి ముదంబునఁ దెల్పి యనంతరంబునన్. 22

సీ. అత్రిభార్యకు వినయంబునఁ బ్రణమిల్లి, కులసతీధర్మము లోర్కిమిగుల
విన నాసచేసెద వినిపింపు మనవుడు, నయ్యవనీజాత కాదరమున
భర్తమాటకు మాఱుపల్కుట లేవాకిట మెలంగుటయుఁ బాయసము నొకర్తు
సేవించుటయును నిషిద్ధ మెభ్భర్త కురూపియైన హరిస్వరూపి గాఁగ

గీ. మదిని రూపింపమి కడుదుర్మార్గమగు మహోత్తరంబుగ నాత్మభర్త యగుట
యార్తిఁ బదరుట యశుచియై యుత్తవిల్లుటయును గూడనికర్యము లయని నిచె
నత్తపస్విని సత్కృపాయత్తయగుచు. 23

క. భూసురపూజావిషయా, వాసక్తకలగుటయొప్ప దనిమరియునుసా
ధ్వీసాధుచరిత్రంబుల, భూసుతకెఱిఁగించె నత్తపోహితకరుణన్. 24

గీ. అట్లు దెల్పినసీత ప్రహర్షయయ్యె, నంత శ్రీరామలక్ష్మణు లత్రిమౌని
కథితపుణ్యకథాసమాకర్ణనమున, దృప్తులై మోదవారాశిఁ దేలుచుండి. 25

ఉ. అత్రిపురాంతకప్రతిముఁ డత్రిమునీశ్వరుఁ డాదరింపనా
రాత్రి వసించి వేగినఁ గరంబులు మోడ్చి తదాజ్ఞనొంది సౌ
మిత్రిసమేతుఁ డత్రిసతి మెల్లన వీడ్కొనివచ్చియున్న భూ
పుత్రినిగూడి యేగె నృపపుంగవుఁ డారఘురాముఁ డాదటన్. 26

వ. చనుచు వనగమ్మున లక్ష్మణుఁ డన్నం గనుంగొని. 27

చ. ఒకగణి కామతల్లి సుమనోజ్జ్వలయై మృదుపల్లవాళిఁ బా
యొకవిటపోపగూహనను నైయిదె సాఁగెను రామ చూడు మా
నొకగణి కామతల్లి సుమనోజ్జ్వలయై మృదుపల్లవాళిఁ బా
యొకవిటపోపగూహనను నైయిటు సాగుట యుక్తమే సుమా. 28

వ. అనిపలికి. 29

క. ఆధరణీశ్వరుఁ డనుజస, హోదరమునఁ గాంచి యచల సరిగికనిమెఁ బ
ర్ణాదుల మునివరుల నప, ర్ణాకుటతోపముల నయ్యరణ్యమునందున్. 31

క. కనివారి యాశ్రమములకుఁ, జనివారల నాసంగు ఫలరసంబులఁ దేని
ల్లోని యమ్మునీశ్వరుల వీ, డ్కొని రాముఁడు దీవలల్లి కొనినవనమునన్. 31

వ. జానకీలక్ష్మణసమేతుండై పాపాంతకంటక సంస్పృష్టంబులై పాదంబులు గందు
చుం దొట్రుపడ మందగమనంబునం జనునెడ. :2

ఉ. నిక్కి విరాధనామరజనీచరుఁ డొక్కఁడు వచ్చి జానకిం
గ్రక్కునఁ బట్టి మూఁపునఁ దగంగ వహించి విశేషరోషుఁడై
మెక్కఁగఁ గొంచుఁ బోయిన నమేయబలాఢ్యుఁడు రాముఁ డంతఁ బే
రుక్కునవాని కడ్డపడి యుద్ధతుఁడై యనుజుండు దోడుగన్. 33

వ. ఇట్లు రామలక్ష్మణులిరువురు నెదిరించి. 34

శా. క్రోధోద్రేకమనస్కులై రఘువరు ల్ఘోరాస్త్రజాలంబుల
న్వేధింపం దనుజాధముం డతియుదారావేశుఁడు విస్తారమా
యాధారేయుఁడు సీతఁ డించి వెసతో వారాముని న్లక్ష్మణు
న్బాధింపన్ సమకట్టి పట్టుకొని యంసద్వంద్వముం జేర్చినన్. 35

ఉ. వారలఁ గాంచి సీత వగవన్ జనకాత్మజఁ గాంచి వారలు
న్వారనిదీనతం బొరయ వారును రయంబునఁ బోఁదలంచుచున్
శ్రీరఘురాముఁడుం బురుషసింహుఁడు లక్ష్మణుఁడుం బలారి నే
పారఁగఁ బోఁ జని కదిమి పట్టిరి కంఠము రెండు ప్రక్కలన్. 36

ఆ. అదిమి పట్టి వాని నల్పసత్త్వునిఁ గ, నెఱంగి బుధులకందఱికి హితంబు
లైనవాక్యముల నాఖ్యలు బోధించి, వి మి కమిశరోష వేగలకును. 37

చ. తులువ భయంకరాస్త్రములఁ ద్రుంచుట యెంతయు నొప్పుఁగాక నీ
తులు వలుకంగ నేలయని దుర్మతి నీలచేతికిచ్చి గం
తులవునె పోకపోకుమదె త్రుళ్ళఁ దగించెద మంచు వానిచే
తులవనిఁ గూల్చి రొక్కమొగిఁ దోయజమిత్రకులాబ్ధిచంద్రముల్. 38

సీ. లలితారుణప్రవాళలతాకదంబంబు, స్తోకమై శారికులావారమగుచు
శకభూనిషేవ్యమై యమృతచంద్రకిరణాళి, కూలమై సుహితవిశాల మగుచు
మహానీయగండక మదజలమాత్రక, భూమమై రాజీవధామ మగుచు
వరాశికెనగు వనరాశిఁ గనుఁగొని, రాఘవుండనుజ గోత్రాసుతాస
గీ. మేతుఁడై చని సద్గుణోపేతుఁ గని యె, సత్యకళ్యాణాంతరంబున నధికనిష్ఠఁ
దపమొనర్చు మహాత్ము శాంత విమలాత్ముఁ, దీక్ష్ణకరకోటిధాము సుతీక్ష్ణనాము. 52
గీ. కాంచి యాతని మన్ననఁ గాంచి సన్న, తించి యవ్వాని యాజ్ఞ వహించి మించి
తన్నుఁ బ్రార్థించు మునుల యుత్తమతపోవ, నంబులకు నేఁగి యొ నయంబు మీఱ
వ. అరిగి ప్రియాసహితుండగు నారాఘవుండు. 54
సీ. మునికుమారులకుఁ గమ్మని ఫలంబులు దెచ్చి, యొసఁగి లాలించుచు నొక్కచోట
పాదికాంక్షులతపోధనవాంఛితకంబుల, నాటజముల్గట్టుచు నొక్కచోట
వాచంయమికథిత వరపుణ్యకరకథ, లూఁకొని యాలించు నొక్కచోటఁ
దాపసులకు నుపద్రవములు గావించు, రక్కసులనుద్రుంచుచు నొక్కచోట
గీ. ఋషివరేణ్యుల కజినోత్తరీయకాను, లొసఁగి దీవెనలను గొంచు నొక్కచోట
నొప్పు మునివన్నెలుగొనుచు నొక్కచోట, రాముఁడు చరించె సుగుణాభిరాముఁ డతియు
క. మునిజనఘనహితవర్తన, మునఁ గొన్నదినంబులచట మోదించుచు రా
మఁ డేఁగుఁదు వారలకీ,డొక్కని తగుగతిని దక్షిణఘనో తపంబుల్. 56
వ. కావున నగస్త్యాశ్రమసమీపంబున కరుగు నవసరమున. 57
సీ. సితపీతకాంతులఁ జెన్నొందు పథికుల, కతిమాత్రశోకమోద మావహింప
శౌకపైకాశ్రయ శాఖాంతరస్వాస్థ్యమై వలపులు సందడింప
వృక్షశిఖాకర్బుర మేచక కేకాళి, నీలపింఛంబయి నెమ్మినింప
నిజసోల్లాసిత ద్విజసరంబయి, యుపురి మెఱయుచు ల్వాపరాను
గీ. వామరోర్ధ్వప్రసూనంబు సుమావళుల నేలు, బాలసహకారవనదంబు పజ్జకేగుఁ
గాంతమాయూరగనాటకంబుఁ గాంచుఁ, గొమ్మపండులుగోయు నక్కొకనయందు.
వ. ఇవ్విధంబున ముదంబునొందుచు, శ్రమంబుఁ గుందుచు, తలంకుచు వడంకుచు పొడ
పొడ నడుగిడు పుడమిపట్టిం గనుఁగొని రాముండు. 59
క. యాసను ఖరయవిసర మా, యాసము రాసేల వలవ దడవికనుచుఁ జా
యా సముచితముగ మున్నుం, దయాసముధికవృత్తిఁ దెల్ప నది వినవు కటా! 60
క. లాయమ్ములు రిపుజనవిపు, లాయమ్ములు సంతతవిపులాయమ్ములు నా
లాయమ్ములు మనకిపుడు లు, లాయమ్ములు భయదఖగకులాయములయ్యెన్. 61

క. కాంతారమ్ముల నడుతఱ, కాంతారమ్ములఁ జిలుకఁగా నోపుదె స
త్కాంతారమ్ముల నలికెను, కాంతా రమ్మనుచు విభుఁడు గౌఁగిటఁ జేర్చెన్. 62

వ. ఇట్లు బహువిధోపలాలనంబుల నలరించుచు నంత నయ్యాస్పదమ్ములు దుర్గమారణ్య మార్గంబుల ప్రయాణులై చని చని యొక్కనాఁడు. 63

ఉ. రాసుకు లక్కవ శవసరాశిసుధాకరు లెంతయేని సం
త్రాసము సర్కవ శవసరాశిసుధాకరమైన కోన ధా
త్రీసుతఁగూడి చొచ్చి విహరించిరి రాముఁడు లక్ష్మణుండు న
బ్జాసనకృత్య మేరితర మానుగడ గి తొలంగఁ బెట్టఁగన్. 64

వ. అది మఱియును బ్రసిద్ధాశ్వత్థప్రవృద్ధ కపిత్థవటాశోక దాడిమీతరు సంభృతంబును పారిజాతకామ్రాక శ్లేష్మాతకపిండీతకబిభీతక కేతకీభల్లాతకీ జంబూ జంబీరాంబర నింబ భూనింబకదంబ కదంబ భూమిజంబు కాశ్యడంబక కాకోదుంబరి కాంబుజ భూమిజంబు కాముఖానోకహ సంకులంబును శితిసారక హారుమారక కుమారక కలికారక వనమయూరక సాల రసాల తమాల కృతమాల తూల తాలహింతాల నారికేలభండీరాంకోలమద్దాలః కృతమాల సాలవిశాలంబునుం గలిగి త్రివిష్టపంబు విధంబున రంభాసురభ్యైరావత మందారేంద్ర సురసాకృతాన్వితంబై ప్రథిత ధరాక్రమంబున దుంభీస్యందనవీరతగుధనుర్బాణాంచితంబయి నభోమార్గంబు చందంబునఁ దరణివనుమనోహరంబయి గాధోభువనంబుకైవడి నవ తాళ్రీజంబయి సత్యలోకంబు ప్రకారంబుఁ బ్రహ్మణ్యశారదా గాయత్రీసముపేతంబయి జటీసమూహంబువలనుపుఁ జటీకౌశిక శాండిల్యలోమశ కపిలానుకూలంబయి కైలాసంబు పోలిక పాశుపతహైమవతీ శివాధికంబయి, బలిసద్మంబునువుఁ, కితవపలాశరాక్షసీ సంయుతంబయి యభయాధికంబవ్యును గుహ్యకారాఁ లక్కఁధయాంకంబయి బుతుపున్నాగమయూరారిష్ట వ్యాఘ్రముఖ సమన్వితంబవ్యును బుతు పున్నాగమయూరారిష్ట వ్యాఘ్రముఖ సమన్వితంబయి నాగవల్లీలవలీలతా బహుసుతాత్రివృతా ద్రాక్షాదిలతా బహులతాభిరామంబయి యొప్పునయ్యరణ్యంబునం దట్లు ప్రవేశించి పెటుల నెదుటఁ జెట్టికొని మెట్టకొట్టుకొనలం బురులువిప్ప యాడుట్టి నట్టువపిట్టకిట్టులం గాంచి హర్షోత్కర్షంబునొందుచు నొకొక్కపట్టునం బుట్టల నిక్కినిక్కి దిక్కులు మూచు గాధేరంబులం బట్టికొన సంకించు శబరశాబకులం జుట్టికొని ప్రోవులై పోవు సారమేయంబులకు దూరంబుగాఁ దొలంగుచు, బండి గురివిందతీవపప్పరంబులనీడలం బండి విశ్రమించుచుం బండినకంటకఫలంబు లుపయోగించుచు, ప్కంధాగ్రంబులకు ముస్నగని తవనంతరంబున న్నిసుపులకు నిజలాంగూలదండంబు

ఱూఁతలుగా నొసంగి యెక్కించుకొని శాఖాగ్రంబులం దుముకు శాఖామృగంబుల సహాయం బపేక్షించుచు, నకులంబులు లేలిహానకులంబుల విదళించు నేర్పునకుం బొంగుచు, భుజంగసమాలింగితమ్ములగు ద్రుమమ్ముల కొమ్మలు భుజంగాలింగితలగు కొమ్మలం బోల్పఁ బట్టగు ప్రదేశంబులం దిరుగుచు, ననేకవిధ మార్జాలజాలంబుల నాలోకించుచు, సారంగంబులగు కృష్ణసారంబులవారంబు లీరంబులం బాఱు నారవంబు లాలించి, ఘోర క్రూర మృగంబులుగా శంకించి పరికించుచు, కమలాకర తీర మహీరుహాగ్రశకున నిపతితంబులగు ఫలంబులు జలంబుల బుడుంగు బుడుంగు మనుచుం బడు చప్పుళ్ళు మెప్పొదవ నాలకించుచు, నుత్తుంగంబులగు పర్వతశృంగంబులనుండి వెలువడి జలజలఁ బ్రవహించు సెలయేళ్ళననుకరించు పూఁదేనె వాఁకల సమీపంబుల నిలుచుచు, వింతలగు కస్తూరితావులు వెదచల్లు కపురంపుటనంటి బోదియల నారసికొనిపోవుచు, రేపకడఁ మేల్కాంచి యెరలు వెట్టి పిల్లల నెఱకల నిడికొని యొదిఁగి నిదురించు కారుకోడిపిట్టలం బిట్టులికించుచు, సర్పవృశ్చికంబులకు వెఱవక వెరవున వెలుతురుకై వత్తి నోటంగఱచి పట్టికొని యల్పవిశాలంబులగు గిరిబిలంబుల దూఱి చని యందు నిదురించు నేదుపందులం గడకాళ్ళు పట్టికొని వెనుక కీడ్చికొనివచ్చు నిషాదుల సాహసంబున కచ్చెరువునొందుచుఁ బథమ్మునఁ దమ్ముం గాంచి భయమ్ము గ్రమ్మికొన రయమ్మునం బాఱులై పాఱు శశకాది క్షుద్రజంతుని కరమ్ముఁ గరమ్ముగ నికరమ్మునం బోవిడుచుచు, మృగయాపరిక్షిప్తపిశిత పృషత్కాంబులు మనుఁబోతులం గ్రుచ్చికొని యుచ్చి పనిన వేగంబునం గాఁడినవాఁడిన జోకలగు మూపిమోకల నాలోకించి యాకులంబు నొందుచు మఱియుం గొన్ని సంకటస్థలంబులఁ బాదంబులం దీవలల్లికొనినం బోఁజాలక మిట్టిమిట్టిపడు కణుతుల సమీపంబునకుం బోయి బంధమోక్షంబు గావించుచు నశ్రమంబులగు తాపసాశ్రమంబులచెంతం గాసారంబుల తీరంబులం బర్ణశాలలు విశాలంబులుగా నిర్మించికొని వసించుచు, వల్మీకబిలంబులు వెలువడి దీర్ఘజిహ్వాపల్లవంబులు సాఁచి చిఱుచీమలంజవిచూచుచు నలుకువొడమినం జుట్టచుట్టికొని వెలికింజిప్పల ప్రోవుగనొప్పుఁ గొంతవడికి భయంబుదీఱిన నెప్పటియట్లతిరుగ నారంభించు నాలువల నాలోకించుచు, వివిధమధుమధుర ఫలపలంబుల నాఁకలిపుచ్చుచుఁ, బువ్వురాల్చిన తరుషండంబు తారకాగహితంబగు నాకాశంబు చందంబుగా వితర్కించుచుఁ గంఠీరవంబులకుంతితోత్కంఠం గుంభికుంభస్థలంబులు వగులించిన సందలి క్రొమ్ముత్తియంబులు రాలుటగా నెఱుంగక బదరీఫలభ్రమ దట్టంబులగు పత్త్రపుట్టికలం బెట్టుచు, విటపాగ్రంబుల నమాఁసమ్ములగు నెమ్మలు గనుఁగొని చిలుకపులం బల్మృగంబులం బట్టి

యచటఁ బెట్టికొని భక్షించుటగా నూహించుచుఁ దరుశిఖరకులాయపరినిక్షిప్త నిజాండ గ్రసనోద్ధతకృష్ణసర్ప సమాలోకన జనిత మహాశోకరోషవేగ పరిభ్రమిత పక్షికులార్త నాదంబులకుం గనికరించుచు, మచ్చికలచ్చుపడం బెమ్మునెఱిఁగి పచ్చికపట్టులకు నచ్చి మెచ్చివిచ్చలవిడి మేయుచున్న సారంగంబుల చరమాంగంబు లధిష్ఠించి తత్ఖుర స్పర్శనంబున నీఁగిదికెగయు శలభవిసరంబుల సరభసంబునం బట్టికొని మ్రింగి క్రమ్మఱ నెప్పటియట్ల తేళ్ళ మూఁపులఁ బాదంబులు మోపి యుల్లసిల్లు భరద్వాజంబుల నభివీక్షించుచు, నిలువెల్లం జలిచీమలు గఱచి పట్టినం గాళ్ళఁజాలక తరులతాగుల్మంబులు సాల్పడఁ గొట్టికొను పెట్టపొట్టపింజరుల యుగ్రదవంబులు దప్పించికొని పోవుచు నార్ద్రప్రదేశంబుల విహరించియు బుప్పరసంబులు పుక్కిళులంబట్టియుం జచ్చుచుంబోవుచున్న జంటీఁగల వెనువెంటం దప్పకచని క్షుద్రపటలనిష్కుహమ్ములగు వనోకహమ్ములం గనుంగొని తన్నిమిత్త సమాయాతభల్లుక వ్రాతంబులందోలి తద్గర్భమ్ములఁ గరమ్ముఁ జొనుపుటకుఁ గరమ్ము నిఱుకటమ్మైవశమ్ముగాకున్నం గొనగోళ్ళనవియించి కాఱు మధుధారలం దోయిళులంబట్టి క్రోలియుం దనివిసనక తాలితెఱియలం జేతులు వఱపి మధుకోశంబులు దీసి యొసంగినం బొట్లంబులుగట్టునెడ నెఱుఁగక చిన్నిపూఁదేనె పొరలం బురువుల తుట్టెలని పాఱవైచు చిన్నవారలంజూచి నగుచు మరల నేరించు చెంచునాయకుల వింతమాటలకు సంతోసంబునొందుచు ఫణిఫణామణి తోరణ విశాలసాలసౌధాంతర జ్యోతిరింగణ దీపికాదీపితమృదుగుళుచ్ఛ సుమలతాకాయమానమధ్యప్రదేశ మకరందపరిక్షాళిత శిలాతలాసీనభిల్లపల్లవాధరీ వినోదమధుర వేణునాదంబులకుఁ గరంగుచు నిజతంతు సంతానంబుల గుల్మాంతరమ్ములు నిరంతరమ్ములుగాఁ గర్పటాకారంబున నేర్పన నల్లి దానిం దగుల్కొని చిక్కిన కీటకంబుల దంశంబు లుపదంశంబులుగా భక్షించు నూర్ణనాభంబుల యాలోచనంబులకుఁ దలయూఁచుచు మేఁపుల సందడిం జెదరిపోయిన సమయంబునఁ బొంచి చని క్రోల్పులులు పలుఁగులంబట్టికొని పాఱునెడ నిజశాబకంబు లొసరించు నార్తిందెలుపు ఘీంకారంబు లాలించి గ్రక్కునం గలసికొని వ్యాఘ్రంబులని గ్రహించి పిల్లగుమిం గపికొని పొదల సంతసంబునం బొదలుచు ఘుర్ఘురధ్వానంబులం బుడమి వ్రక్కలించికొని యొక్క ప్రోవుగా నిదురఁ జొక్కియున్న స్తబ్ధరోమంబులం దెలుపుచు శవక్రసంత్రన్యోన్య సంఘట్టనోద్భూత ప్రభూతవన దావానలజ్వాలాకలాపంబునకు సహాయంబైన మధ్యాహ్నసమయోష్ణ కిరణోష్ణాసహిష్ణువులై వడవ్రేఁగఁబడి పొరలు సైరిభంబుల నిధనంబులుగా నభివీక్షించుచు, మృతమృగకళేబర దుర్గంధ గర్తవర్తన ధూర్తమృగ ధూర్తనమ ఘాతంబులకు

మ్రోయుచు, చమరీమృగ వాలవ్యజనవీజనోజ్జనిత మరుచ్చలల్లతాలతాంతడోలికా సంస్థితంబులగు మిళిందబృందఝుంకారంబులకు వినోదంబు నొందుచు, శశశునకంబులు వెనుకొనం గనుకనింబాటి ముట్టారిం దోలంగఁ దమ్ముం జేరిన రురువారంబులం గటాక్షించి తద్విరోధంబులగు జంతువుల నదలించుచు, మనోహరవిపరీత భయానకంబులకుఁ దానకంబులగు ఖగమృగస్వనంబు లాకర్ణించుచు, నిరోధిత తరణికిరణ ప్రసరణతరులతాశిఖర పరిపక్వఫలప్రతిబింబిత తారకాకోరక ప్రకరంబు నుంబోని ఫణిఫణామణిప్రభాపటల ధగద్ధగితంబున కచ్చెరువందుచు, వనేందిరాకిసలయహస్త పరిస్రస్త ముక్తాఫలక్రమాభివీక్షిత బాలతృణాంకురాగ్రమాలికా ప్రతిభాసిత హిమానీ బిందుసందోహంబుఁ గొనియాడుచు నిండారం బండిన దొండపండులదండం దండిగఁ జెక్కుచు జిగురుం గండెల దండోపతండంబులగా బెండువడి పడిన పీలిపిట్టలం బట్టికొని మెచ్చువచ్చు కుచ్చులం బుచ్చుకొను శకుంతాంతకుల చెంతకుం బోవుచు దివాచర నిశాచర మృగపక్షి ప్రచరణంబులనను కమల కైరవ వికసనోన్మీలనంబు వలనను ప్రభాకరోదయ కలాస్తమయ కాలనిరూపణంబు గావించుచు మెట్ట యుడుతపిల్లలంబట్టి విడుచుచు శార్దూలంబులం దోలుచు తరక్షువుల శిక్షించుచు శరభంబుల సరిపెట్టుచు గవయంబులం గడతేర్చుచుఁ గణుజులకుం దొలంగుచు వాఁడిగల ముండ్లు గాఁడినం దూఁగాడుచు నోష్ఠ్యదైశ్య సంశోషణంబు లగు సంభాషణంబులాడుచు వర్షాతపహిమానీ నివారణంబుగా గుజ్జుమావులపజ్జకుం బోవుచు గుముగుమవిసరంబు లేఁచుచు నీరంబులం దూఁగుచుఁ గొంతదూరంబు చనిచని యొక్కనాఁ డొక్క పుణ్యాశ్రమంబుఁ గనుంగొని యందు. 65

మ. భవనారణ్య భయప్రతీతు సుగుణ భ్రాజిష్ణు విద్యారిపు
ర్భవనాగారిఖగాధిపు న్నియమిసంభావ్యప్రభావాఢ్యునిన్
భువనారాధ్యుని మాత్రవచ్చులికితాంభోరాశి సఖ్యంభసం
భవనాథున్ జగదేకవంద్యుసుమలోపాముద్రప్రాణేశ్వరున్.

క. కని మ్రొక్కెన్ సీతారాముని గ్రక్కునఁ గౌఁగిటిచ్చియుత్తమ మునిమక్కువనెం
కొక్కున నక్కునఁ గదియ, సుసు జెక్కులు నొక్క కడుమనోమోదమునన్. 67

ఉ. అంబుజమిత్రగోత్రకలశాంబుధిసోముని రాముని బ్రమో
దంబునఁగన్న పుత్త్రునివిధంబున సెంతయునాదరమ్మురూ
పంబుసహించెనోయనఁ గృపన్మునిడేల్చె సుఖాసనార్ఘ్యపా
ద్యంబుల నిష్టవాక్ప్రనిచయమ్ముల సిల్లలరించి పెండియున్. 68

క. లక్ష్మణుఁ గృతలక్షణుఘనఁ, లక్ష్మణుమన్నించి తనకులసతినని చెనా
లక్ష్మీసమానయగుజనక, క్ష్మాధీశసుతఁ బూజఁ గావింపంగన్. 69

వ. నియోగించి రామలక్ష్మణుల నుచితాసనసమాసీనులం గావించి మధురవచనరచనల
నలరించి రాముం గనుంగొని. 70

ఉ. కాయము వొంగనిన్నుఁ బొడఁగాంచితి ధన్యుఁడనైతి నాదినా
రాయణమూర్తివీవు మునిరక్షణకై యిటులుద్భవించినా
వాయననీతనూజభవదంగనపంకజహాక్షిలక్ష్మిసూ
నీయనుజుండు లక్ష్మణుఁడు నిక్కము శేషఫణీంద్రుఁ డారయన్. 71

చ. త్రిదశవిపద్దశాప్తి గుఱించి విరించి స్మరించినన్ ధరి
త్రిదశరథోర్వరావరసతీత్రయమందుఁ జతుర్వరాకృతు
లుద్దమనఁ దాల్చి పుట్టితివి మోఘము విష్ణుఁడ వీవు తావక
ప్రదరనిపాతితంబులగు రాక్షససైన్యములొక్క ప్రేల్మిడిన్. 72

వ. అని యభినందించి మఱియుం బుణ్యకథావిశేషంబు లుపన్యసించుచు నిట్లుండనగ
స్త్యుండొక్కనాఁడు రఘుపుంగవుం గనుంగొని నీవింక నిందుండవలవదు గౌతమీతటం
బున నుత్కటంబగు పంచవటంబుగలదచట నుటజంబునిర్మించికొని జానకీలక్ష్మణ
సమేతుండవై యప్రమాదంబున నుండునదియని చెప్పి రాఘవున కమోఘశిలీముఖంబు
లొసంగి యాదరాతిశయంబున. 73

క. హస్త్యయుతతనునిఁ బ్రణత, భస్త్యస్వాయవరుని రామభద్రునిఁ గరుణ
న్నత్యధికంబగునటుల న, గస్త్యుఁడు దీవించెఁ గౌతుకం బలరారన్. 74

వ. దీవించినం బరమానందంబునొంది రామచంద్రుండు మునిచంద్రుం గనుంగొని. 75

క. వింధ్యమునణఁచితి బలపరి, పంథ్యభ్యర్థితుఁడవగుచుఁ బాణితలమునం
గంధ్యుదకమ్ముఁ ద్రావిత, వంధ్యతపోవిభవపొగడ వశమే నిన్నున్. 76

వ. అనియిట్లు ప్రత్యభినందనపూర్వకంబుగా వీడ్కొని. 77

క. సాలనుఁ సాలపనసత, మాలవకుళపూగనక్తమాలసదమిసీ
తాలమగువనంబున సీ, తాలక్ష్మణసహితుఁడై ముదంబున నరిగెన్. 78

గీ. ఇవ్విధంబున నరిగి మదేభసింహ, శరభశార్దూలభల్లూకసైరిభతతి
గలిగి కాకఘూకారవాక్రాంతమగుమ హావనంబుల విహరించు నవసరమున. 79

సీ. వటముఖతరుశిఖాచ్ఛటలు గనుంగొని, యుక్రూరసర్పంబు లేయటంచు
గుడుక్కుఁబర్వులవాఱు క్రోడంబులను గనుఁగొని యిభగజములోకోయటంచు

వావిరి మెఱుఁగు శిఖావలంబులఁ గని, యివి పెనుభూతంబులే యటంచు
వీచికాసదృశతరీచికల్గనుఁగొని, యివి దీర్ఘదీర్ఘికలే యటంచుఁ

గీ. దరఁ ద్రాక్షాశివల్లీవితానసంచ, యల్లలితపీ ధమ్మిల్ల భిల్లపల్ల
వాధరులఁ గాంచి మునికన్నెలా యటంచు నడుగునడుగడ్డుకుఁ దన్నుఁ బుడమికూఁత.

వ. వెండియు. 81

చ. వికచసరోజగంధి పృథివీసుత రాముని కేలుఁ బట్టి కం
టకతరుదుష్టసత్త్వనికటం బిటుఁ జరియింప నేలయొం
డొకభయశూన్యమై యెడ కొయ్యన నేగుట యుక్త మంచు మీ
రకుధరపత్త్రిఁ గూఁజూపుఁగను రమ్యమునందుఁ దలంచి ముగ్ధయై 82

వ. ఇట్లు గరము పల్కు జానకిం గనుంగొని కొండొకవిషాదంబు గదిరి నెమ్మొగంబునం
దోఁపనీక మఱుమాటల నిట్లనియె. 83

క. చాలవశతనివురించిన, గాలవశతములను వేడ్కఁ గనుఁగొను వైదే
హీలతలుఁ బోలిచె వైదేహీలలితలతాంగి చూడు మింపొందంగన్. 84

ఉత్సాహ.
కొమ్మకొమ్మటంచు నేర్చి కొమ్మకొమ్మపండులుం
గుమ్మరించు రుచుల మించు కొండచఱుల జున్నులు
న్నెమ్మి మీఱ నెమ్మొగులుకు నెమ్మి పురులు కన్నులు
న్నమ్మతిగనోసంగు రామచంద్రుఁ డవ్వనంబునన్. 85

వ. ఇట్లు సంగుమ వనవాసం బనాయాసంబగు నట్లు సేయుచున్న యన్నం గనుంగొని
లక్ష్మణుండు తన మనంబున. 86

సీ. స్యందనంబు శతాంగమయ్యె భూజానికి, జిహ్వయుఁ బున్నాగ మయ్యెఁ బొన్న
జగతీశునకు నుటజంబు భవనమయ్యె, నవనీపతికిఁ జీర్ణమయ్యె రజము
అధిపవరాళికి మావులశ్వరత్నములయ్యెఁ, బంట్లయ్యె నృపునకు భల్లుకమ్ము
లధిపతికి ఘనంబులయ్యెఁ బత్త్రింబులు, దరులయ్యె నిగమములు నరవరునకు

గీ. భద్రకలశంబులయ్యెఁ గుంభములు ప్రభున, కఖిలజనమాన్యునకు గోతులయ్యెఁ గపులు
ధరణిపలవంతమైనఁ విధాతృకృత్య, మెవ్విధంబునఁ దలఁగుదు రెట్టివారు 87

క. మేలగు వీణారవముల, మేలుక నెడు రామవిభుఁడు మృదువిగ్రహుఁడై
కాలమున నృగాలంబుల, యూళల మేలుకొనఁజొచ్చె మగ్రాటవులన్. 88

వ. అని వగచి జానకిం గనుంగొని. 89

గీ. సీతతోఁగూడ నందు వసించెదక్క, మీపయిఁ నొక్కచోట సౌమిత్రి యుల్ల
మల్లసిల్లుచునుండ గల్పోటజంబుఁ, గట్టికొనియుండె రామభూకాంతుఁ డలర. 103

వ. ఇవ్విధంబున నివసించి సమస్తోపచారంబులు లక్ష్మణుండొనరింప సుఖంబుండి సమయ సమయంబుల పండ్రెండేండ్లు గడపి యల్పావశిష్టంబగు నత్రయోదశవత్సరంబునం దొక్క నాఁడు. 104

మ. ధరణీనందనకుంతలంబులు సుమిత్రానందనా తెమ్ము పో
మ్మగయుంబారఁగ రమ్మటంచుఁ బనుప న్మోదంబు న్లక్ష్మణుం
డు రహింబూవులుఁ గాయలాకులును బండ్లు న్గోయఁ దక్కాననాం
తరసీమన్విహరించుచుండ నతివిస్తారాద్భుతాపాదియై. 105

క. క్రతుభుగ్రిపునాశమును,గ్రతుసితోద్యన్ముక్తి కరవాల మన
క్రతరంబైతోఁచె శత,క్రతుమాయాకలితమగుచు గగనతలమునన్. 106

వ. అంతరిక్షంబునం బఱతెంచి సమక్షంబున నిలిచిన యలక్షితకాంక్షేయకంబు నభివీక్షించి లక్ష్మణుండు దక్షిణహస్తంబునం బరిగ్రహించి తత్తీక్ష్ణ పరీక్షార్థంబు గానప్పుడ.

క. ధారాధరనిభములగుమహీరుహముల నఱక మానులే తెంచి ధరి
త్రీరమణపుత్త్రి భ్రదనసి,ధారాహతులను సేయఁదగునే తరులన్. 108

వ. అనిపలికి వారించి యమ్ముని యారాజనందను నుద్దేశించి. 109

మ. ఫలసంఘంబులు లేవు రావు ఖగము ల్పత్త్రంబులున్ భక్షణా
ర్హ్ములసత్కాంతులు గావు కావున మహావ్యాళ్యాళికిన్ రావు బూ
వులుగుత్తుల్గారావు మాత్రమునఁ దావు ల్లేవు రాజేంద్రనీ
వు లసద్బాహుబలుండవి వ్వేదురుఁ బో త్రుంచన్మి తూటాడుమీ. 110

చ. అనవుడు రాజనందనుఁ డహర్పతితేజుఁడు లక్ష్మణుండు చ
య్యనఁ దను హెచ్చరించెదు మహాత్ములకున్ మ్రొక్కి మొప్ప నాశర
ధ్వన మొనరించి యందు రుధిరప్రవితతి ప్తకపోలువిం గృపా
ణనిహతసత్కపాలుని ఘనవ్రతశీలుని దైత్యబాలునిన్. 111

క. కని మునిపుత్త్రుఁ జంపితి, నని భయకంపితశరీరుఁడై కడు వేగం
జని తన యన్నం గనుఁగొని, వినిపించెం దనదు సర్వవృత్తాంతంబున్. 112

వ. వెండియు. 113

క. వరవర రోయుఁగర గుల్మాంతరితుండై తపము సేయు తాపసవంశో
త్తరు నొకబాలకు భయద,ఛురికాహతుఁ జేసినాఁడఁ జుమ్మని పలుకన్. 114

ఉ. ఏమ్మె సహోదరా దనుజవీరులఁ జంపి మునీంద్రరక్షసే
యా వ్వనమందు వచ్చి దురితాత్ములఁ జంపక యిట్లు సాధువృ
త్తి న్మునియై సమాధినిరతి న్మదమొందుచునున్న వానిబా
లున్మడ దెవ్వ నేసి కడు లోపితకర్ములమైతి మక్కటా. 115

వ. అని యనేకకథంబుల ననుజసహితుండై విచారంబు నొందుచున్న యన్నరేంద్ర చంద్రు సమీపంబునకు మునీంద్రు లరుగుదెంచి భవదనుజభుజాసిధారాదళితమస్తకుం డగు నతండు దనుజుండు వీనిం దునుమాడుట యనఘంబని యతనికి మనస్తాపోపశమనంబు లగు వాక్యంబులు దగుభంగి నుపన్యసించి యనంతరంబ సౌమిత్రిం జేరంగని యిద్దురాత్ముండు విద్యుజ్జిహ్వుండను రావణసహోదరి యగు శూర్పణఖయం దుద్భవించినవాఁడని తదీయజన్మప్రకారంబుఁ దేటపడం బలికి మఱియును.

ఉ. జంబుకుమారుఁ జంపితి నిజంబు కుమారక దీన నీకు దో
సంబు దలంచిచూడ నవసంబును లేదు ముదంబునొందు మా
త్రింబడనేల యీతని వధించితినంచుఁ దపించు వృత్తి స
ర్వంబును నీకెఱుంగఁగ ధ్రువంబుగ నిప్పుడు విన్నవింపమే. 117

క. అనిన విషముసేయఁగఁ దన, జనకునిఁ జంపిన శిరోధి సమయింపఁగ ని
ట్లొనరించెను తప మితనిం, దునుమాడిన దీన నీకు దోషము గలదే 118

వ. అదియునుంగాక మదీయప్రేరితుండవై యొనరించుటం జేసి పాపంబునకు సంశయింపం బని గలదే యని వాచంయమిప్రకరంబు నిజాశ్రమంబులకుం జనియె నిట్లు మహాముని ప్రబోధితులై రామలక్ష్మణులు నిర్విచారులై యుండిరంత నొక్కదినంబు.

క. శూర్పణఖ వచ్చి యటు పరి, మార్పంబడిన కొడుకుఁ జూచి యాలింగనఁ ద
న్నేర్పఁగ నగ్గహన మద్రువ, వాపులు బొబ్బలు వెలంగ నాక్రందించెన్. 120

వ. ఇట్లాక్రందనంబు సేయుచు మృతుండగు సుతుం దలంచి. 121

శా. తంత్రిం జంపినవానిఁ జంప్రతుకు నుద్యద్విష్ణు నిచోఁ గడు
న్వ్యంద్రం బైన తపంబు సేయుచు నిను న్వేవీరుండు హింసించెనో
తాంత్రీ నామది శోకమాయెను మహాదౌష్ట్యంబు సంధిల్లఁ దే
కృంద్రం జంపక యుంచు నద్విప్రకవ క్రీపోలిక్ సద్దంష్ట్రియై. 122

ఉ. వానలఁ గాంచి వానుతు నమానుష తేజు వధించి ట్టి దు
ర్మానినిజాపకున్న మిము గ్రుందఁగ మోఁదెద నన్నవారల
మ్మానినిఁ గాంచి భీతియుతమానసులై తగ నిట్లు పల్కి ర
మ్మా నిజమాలింపుము మొక మర్త్యవరేణ్యుఁడు ద్రుంచె నావుకన్. 123

శూర్పణఖ నన్నుం గలసి భవత్ప్రియానుజప్రియాసహాయుం బపేక్షింపక కామోప
భోగంబు లనుభవింపు మని పల్కిన నవ్వుచు నతం డారక్కసిం గనుంగొని. 133

క. సుమతీ చంపక విడిచినఁ, బ్రమదంబునఁ బొంగి చనక ప్రత్యుక్తులఁ గూ
టము గోరెను నాతో రా, సుమతున్ జంక సెత్తికొనుమను భంగిన్. 134

క. అని పలుకునంత దానిం, గనితద్వాక్కృతాకృతి యును ఖరనిస్వనమున్
దన కద్భుతమగుడు ధరాత్మజయ గియె నగినఁ గ్రోధతామ్రాననయై. 135

ఉ. ఆదనుజాంగనాధమ ధరాత్మజఁ గన్గొని నిన్ను మ్రింగెదం
గాదనువారు లేరనుచు గర్వముఁ దక్కవటంచు డాసి వా
ద్భేద వాక్యసంతతులు ప్రేలిన రాముఁడు కర్ణనాసికా
చ్ఛేదన మాచరింపుమనఁ జెచ్చెరలక్ష్మణుఁ డట్లొనర్చెన్. 186

క. ముక్కునఁ జెవులుఁ దెగిపోవుడు, నక్కుటిరక్కసులు వెగడనురురవము నా
టక్కరి మిక్కిలియేడ్చుచు, నిక్కరణి న్యాయధర్మవే మీకనుచున్. 187

చ. వాలమ ద్రొక్కినం గినియు వాయుభుగంగనభంగి నింగి వా
తూలరయంబునం బఱచి దుర్మతి యప్పిశితాశి యన్న పే
రోలగమున్నచోటు రుధిరోద్గమవైకృతకర్ణనాసికా
మూలము లెత్తియున్ బలుప ముందఱ వ్రాలెఁ గరంబు దీనతన్. 138

వ. వ్రాలి మహారోదనంబు సేయుచు నన్నం గనుంగొని. 139

ఉ. ఒక్కరుఁ డుండు దారయును సహోదరుఁడుం దనుఁ గొల్వ రాజసం
బెక్క వసుక్షితిం దిరుగ నెక్కడివారలు మీరటంచు నే
నక్కడకేగి వారివిధ మారయఁగోరినఁ గర్ణయుగ్మము
న్ముక్కును గోసి చేనిడిరి మోసముగాఁగ ఖరాసురాగ్రణీ. 139

శా. నాసాకర్ణవిహీనతైతిని చింతం బొంద నింతేనియున్
న్నీసామర్థ్యము లెక్కసేయక స్వయాంధీభూతులై కావను
ల్లాసాధిక్యతనున్నవారని కడు న్లజ్జింతు నన్నీచులం
బ్రాసాసిక్షురికాదిసాధనముల న్భంగింపు మెచ్చింకులన్. 141

చ. వారనికిట్టి నిష్టపరివారపలాశసమన్వితుండవై
వారణహస్తసన్నిభభవద్భుజవిక్రమ మెక్కడేగి యె
వ్వారని సేయఁజాలక జరంజెడి పాటిన పాఱునీక వే
వారలఁ జంపకున్న మనవారలకుం గడుఁ గీడు మీఁదటన్. 142

ఉ. కావున సంశయింపఁ బనిగాదు ధరాసుత భీతినొందు నే
న్వావలిఁ గాంచి యట్లు కుటసద్రిగుహాన్ని వసింపఁ జేసి య
చ్చోఁ విశిఖాసనాస్త్రపరిశోభితహస్తుఁడనై ముదంబునం
గావలియుండు మేను కురకంటకులం బరిమార్చునంతకున్. 154

వ. అని సీతారక్షణంబునకు లక్ష్మణుం బదిలపఱిచి. 155

మ. కలభాలోకనచారుచంక్రమణవక్త్రశ్రీ వసూత్రిభూ
తలయోద్ధత్యమహోగ్రమూర్తి క్రియ రౌద్రప్రస్ఫురన్మూర్తియై
విలువమ్ముల్దగులీలఁ దాల్చి కనె నవ్వీరుండు రాముండు ని
శ్చలనైశాచరమాన్యము న్నరకువాంఛాన్యము న్సైన్యమున్. 156

వ. అంత నబ్బలంబులు గంతు మిగిలి. 157

ఉ. చేరఁగ వచ్చి శూర్పణఖ చెప్పినవీరుఁ డితండె యంచుఁ గ
న్నారఁగఁ జూచి లేశము నయంబు దలంపక యుద్ధక్రోధమే
పారఁగఁ జుట్టుముట్టిన మహాబలుఁ డాతఁడు గన్నుదోయి కెం
పారఁగ నబ్బలాటవి బయల్పడఁ జేయుఁ దలంచి యుగ్రుఁడై. 158

శా. మధ్యాహ్నోష్ణసహస్రభాను క్రియ రామక్ష్మాధినాథుండు వా
ర్నిర్ధ్యానముతోఁ జమూనిసర ముర్వీభాగము న్నిండి సా
న్నిధ్యాభూతముగాఁగనుంగొని మహోన్నిద్రప్రస్ఫురన్మూర్తియై
పథ్యాహీనము గాఁగ నించె నిషువు ల్ప్రత్యాలీఢపాదస్థుఁడై 159

శా. శ్లాఘాలంఘ్యపునర్భవేద్ధగుణదీ సత్సౌదామినీజాలమున్
జ్యాఘాతస్తనితంబు దీర్ఘ విలసచ్చాపైంద్రచాపంబు న
వ్యాఘాతాంబకవృష్టియుం గలుగు రామాభ్రంబు రక్తప్రవా
హౌఘంబు ల్గురిగించె భూతవితతు ల్హర్షింప సైన్యాటవిన్ 160

వ. పెండియు రఘువరుండు కోపోద్దీపితుండై. 161

ఉ. కొందఱఁ గుత్తుకల్దునిమి కొందఱఁ జెక్కులు చెక్కి కొందఱం
గొందలమందఁ జేసి మఱికొందఱ మేనులు నించి కొందఱం
జిందఱవందలై పడఁ జేసి విశేషరయంబు పేర్మి న
య్యందఱఁ గూల నేసె నరుణాన్వయుఁ డందఱ కన్నిరూపులై. 162

ఉ. ఒక్కెడ నేలఁ గుల్చదియు నొక్కెడ నశ్వము లుక్కడంగు వే
ఱొక్కెడఁ గేతువుల్ విఱుగు నొక్కెడఁ గాల్బలంబు గూలు నిం

నొక్కెడ రథ్యముల్ నలుఁగు నొక్కెడ వ్రాలు శతాంగపఙ్క్తి దా
నొక్కెడ రాముఁ డివ్విధినొకో తొలఁగించెను బాణకోటులన్. 163

క. అని తను సురలగ్గింపఁగ, ననితరసామాన్యవిక్రమాధికుఁడై రా
మనరేంద్రుఁ డివ్విధంబున, ఘనతరశస్త్రహతి రిపుల గాసియొనర్పన్. 164

ఉ. జన్యమునందుఁ జాలక నిశాచరసైన్యము దైన్యమంది రా
జన్యుని దేఱిచూడక వెసం బఱవన్ ఖరుఁ డడ్డమేగి యి
ట్లన్యశరణ్యశూన్యులక్రియం జనుచుండఁగ నేను గల్గ మే
దిన్యధినాథుఁ గూల్తునని త్రిప్పె నిశాచరకోటిఁ గ్రమ్మఱన్. 165

ఉ. క్రమ్మినవిక్రమమ్మున సగర్వుని శాత్రవుఁ జుట్టుముట్టి వా
లమ్ములు గ్రుమ్మరించు నకలంకమనస్కుఁడనాముఁ గాంచు సై
న్యమ్ములఁ గ్రమ్మరించి ఖరనాముఁడు రాము నెదిర్చి తత్సమ
క్షమ్మున నిల్చియిట్లనియెఁ గన్నుల నెఱ్ఱఁదనంబు తోఁపఁగన్. 166

ఉ. మక్కువ నిన్నుఁ జూడఁగ సముత్సుకఁ జేసిన మత్సహోదరి
న్ముక్కును గర్ణముల్ చిదిమి మోసమొనర్చితి వంతఁబోక నీ
ద్రుక్కడిమూఁకఁ ద్రుంచి కడు మోదమునొందెదు నీవు నీవ పే
రుక్కును దేజముంగల మహోద్ధతుఁడైన నరేంద్రుచాడ్పునన్. 167

వ. అని పలికి మఱియును. 168

క. స్వేచ్ఛావిహారపరుఁడ వి, శ్వాచ్ఛాదితయశుఁడఁ జూడు మఱిమఱిఁ జేతు
న్మచ్ఛితశరముల నీ కంఠచ్ఛేదము ఖరుఁ డన న్వాఁడఁగ నను వినవే. 169

వ. అనిన విని రామచంద్రుండు మందస్మితసుందరముఖారవిందుండై యద్దనుజాధముం గని.

క. తనుదాన పొగడికొను టొప్పని పని యని యార్యజనులు పలుకుదు రిపుడీ
పని చేయక మాటలచే, తన జరగఁ దలఁచి తివ్విధంబుఁ దెలిసితిన్. 171

వ. అదియునుంగాక. 172

ఉ. భీరుల ముందఁ జెట్టికొని బింకములాడెదు వెక్క సఖ్యమేఁ
గోరిన నస్మదీయకటు ఘోరతరాద్భుతమార్గణాగ్నికిం
బోరనొల్ల నీరుధిరపూరము నాజ్యముగా ఘటించి పెం
పారెదు ప్రాణవాయువుల నాహుతులియ్యమి ధార్మికత్వమే. 173

చ. అన ఖరుఁ డల్గి దూషణుఁడు నత్త్రిశిరుండును దోడుగా నరేం
ద్రుని ఒటు బాణజాలములతో నెదిరించిన రామభద్రుఁడుం

బమపడి వానితోడఁ దలపడ్డఁ గరంబును బోరు ఘోరమ
య్యెను గులపర్వతాళి నవియించెడు కార్ముకభీకరార్భటిన్. 174

వ. అట్టియెడ. 175

సీ. నక్తంచరధనుర్విముక్తనారాచపరంపరాసారంబు రాఘవాద్రి
ముంచిమించినఁ బెనుమంచుఁదుంపురుల నణంచు చండ్రగాంశుచందమునను గ్ర
మూర్తియై రాముఁ డమోఘశిలీముఖ, వ్యాపారమున వానితూపులడఁచి
నిశితబాణంబు లన్నిశిచరపతిమేన, గ్రుచ్చినొచ్చి ఖరుండు బీరు
గీ. వోనితాల్మి నరేంద్రునిపై ననేక,పరశుపట్టిసముద్గరప్రాసముసల
శూలకరవాలపటుభిండిపాలవితతి, విసరె నమ్మన నఱికె యవ్వీరవరుఁడు. 176

క. కేతనము విఱిచి తురగ, వ్రాతంబులఁ గూల్చి యర్కవంశ్యుఁడు వెసఁ ద
త్సూతుఁ దునుమ విరథుఁడగు, నాతని కెడసొచ్చె దూషణాఖ్యుఁడు కడిమిన్. 177

వ. అన్నకు దలకడచి కోపాటోపంబున. 178

చ. రయ మధికంబుగాఁ జని విరాధవిరోధి నెదిర్చి ఘోరదు
ర్జయపథవర్తులైన త్రిశిరప్రముఖుల్ దగు తోడుగా మహా
భయదరణంబు సేయఁ గని పార్థివుఁడుగ్రతఁ బోరుచుండ నా
క్కయఁడ మెక్కవచ్చి విశిఖంబుల ముంచె ఖరుండు రామునిన్. 179

ఉ. దూషణము ల్సెలంగ ఖరదూషణముఖ్యులు పెల్లురేఁగి య
భ్యావసున న్ననిందొడరి పోరుటఁ గాంచి బలంబులెల్ల సం
తోషము నొందిరొక్కుమొగిఁ దోఁచినఁ గోపమునొంది రాక్షస
ద్వేషణుఁ డాతఁ డప్డు పరివేషగతుండగు భానుచాడ్పునన్. 18)

వ. మండలీకృతకోదండుండై. 181

క. తుంగమదవుసాచ్చిన మాతంగవిభునిబోలి రామధరణీశ్వరుఁ డు
ప్పొంగుచుఁ జెచ్చెఱఁ దత్సేనాగంబుల రూపుమాపి యలుక మలఁగమిన్. 182

సీ. శుష్కవంశాటవీక్షోభంబు గావింప, సకరోష్ణ వనహుతాశనునిభంగిఁ
పృథుబుభుక్షాపరిపీడితంబయి మృగవ్రజము గన్గొనిన సింగిభంగిఁ
గన్నులఁ గప్పిన గవిసెనల్వీడి గువ్వపదుపుఁ జూచి పెనుపత్రిభంగి
సంవర్తసమయప్రజానాశమొనరింప, వర్తించు శాసమవర్తిభంగి
గీ. వెఱసి దైత్యకోటి నక్కఱఖండ, కాండకాండపాతుఁ ద్రుంచుచుండఁ జండ
భానుకులవార్ధిపూర్ణవిధునిఁ గాంచి, యొక్కరొక్కరుఁ డధికాగ్రహోగ్రుఁడగుచు.

ఉ. కేవలశాలుఁడై యానఁగఁ గేలఁ గృపాణము గ్రాలఁగాఁ బృథు
గ్రీవము మీఁదికెత్తికొని కేకలువేయుచుఁ దాఁకినం బృథు
గ్రీవుని ఫాలభాగమున శ్రీరఘురాముఁడు నించె సజ్జ్వల
త్పావకసన్నిభంబులగు బాణములాతఁడుఁ గూలె నేలపైన్. 184

గీ. ఇవ్విధమునఁ బృథుగ్రీవు నేపడంచి, యజ్ఞశత్రుని బరిమార్చి యంతఁబోక
శ్యేనగామిని దునుమాడి వానితోడి, వారల ననేకదైత్యుల నీరుచేసి. 185

వ. అనష్టంభవిజృంభితుండగు రాముని సహింపక. 186

ఉ. ఎక్కడఁబోదు నాయెదుర నీవని దూషణుఁ డారఘూత్తముం
గ్రక్కునఁ దాఁకి తీక్ష్ణవిశిఖంబులు నాటిన వానినన్నిటిం
జెక్కులుసేసి రాజకులసింహుఁడు రంహుఁడు మేనువెచి తా
నక్కటికాత్మ విల్లువిమి యాతనిఁ గూల్చె రథంబు ముఖ్యగన్. 187

క. దూషణుఁడు పడుటఁ గనుఁగొని, శేషించిన దైత్యబలము చెదరిపఱచిన
గ్రోషావేశంబున న, ద్దోషాచరుల న్మగిల్చి దుర్ధషలీలన్. 188

క. అశనినిభబాణవిద్యా, కుశలుండగు రామవిభుని గోపమున నిరం
కుశవృత్తి నడచి యప్పుడు, త్రిశృంగగిరివోలెఁ దాఁకెఁ ద్రిశిరుం డంతన్. 189

వ. ఇట్లు తలపడి. 190

మ. ఖరుఁ డానందము నొందఁ భూతచయమాకర్ణింప నారాజశే
ఖరుఁ డాయాజని యస్మదుద్ధతి నెఱుంగన్ జాల వారాజశే
ఖరుఁ డాజి న్ననుమార్కొనన్ వెఱచు శక్యంబౌనె నీకిట్ల మ
త్ఖరనారాచపరంపరాప్రణిహతిన్ గష్టంబువచ్చుం గటా. 191

వ. అనిపలికి. 192

గీ. పీఁకమెయిఁ దాఁకి మాయ ననేకములు ఘటించి నదు లబ్ధిఁజేరి నశించుభంగి
మాయ లాతనిఁ జేరక మాయమైనఁ, గ్రోధమానసుఁడై రక్షసాధముండు. 193

ఆ. కనలి కనకపుంఖకనదంబకంబులు, రయము మెఱయ వైవ రాఘవుండు
వాని నడుమఁ దునిమి వానివక్షమునఁ గ్రొ, వ్వాఁడిశరము లేయ వాఁడు గనలి. 194

క. ఈడంబోక పెనఁగిన, వాఁడిమగఁడు రామవిభుఁడు వాలికతూపుం
గాఁడంగ నేయ నతఁడు తూఁగాడుచు నిలఁగూలె దూషణాంతకుఁ డార్వన్. 195

వ. త్రిశిరుండు గళితశిరుండైనం గాంచి తక్కిన రక్కసిమూఁక లొక్కమొగిం బట్టుముట్టుటయు. 196

క. కార్చిచ్చు పేర్చినిబిరీ, సార్చుల వన మేర్చుపగిది సద్దనుజులఁ బో
కార్చి యనంతరమునఁ గృప, గూర్చిన మది ఖరుని గాంచి క్రూరరహితుఁడై. 197

చ. చెలియలిముక్కు వోయె నను సిగ్గున కోర్వనివాఁడ విష్ణుత
మ్ములతల లూడఁ గాంచితివి మోసము గు దురహంక్రియాభిమా
నుల కిటు దైన్యహీనుని నిహంగనఁ గోన్కఁ గరంబు జాలివు
ట్టె లఘుత కోర్చి యీచలము డింపుము నీ బ్రదు కేను గోరితిన్. 198

క పలుకంగ వమ్చుఁ బలికిన, పలుకులు సెల్లిప నెట్టిప్రాజ్ఞుకైనం
దలమే చలమేటికి నీ, తలమీఁదకు వచ్చెఁ జావు దప్పఁ దొలఁగినన్. 199

వ. అనినం గవలుగదుర ఖరుండు. 200

క. నిను నస్మదీయబాణ, ప్రణిహతుఁ గావింపకున్నఁ ప్రజలు ననుఖరుం
డని వెఱతురె నను బరిమార్చిన దైవము నీవకావె సిద్ధము జగతిన్. 201

గీ. అని పెలుచనాడి నిజరథ మధికచిత్ర, గతులను జరింప రాము సప్రతిహతప్ర
భావుమార్కొని ఖరుఁ డిషుప్రకరముల ది, గంతరముఁ గప్పె యూర్చె బ్రహ్మాండమద్రువ

ఉ. ఆర్చిన రామచంద్రుఁడు దయామహితాత్ముఁడ యయ్యు వీనిఁ బో
కార్చినఁ గాని కాదని దురాత్ముఁడ వైచెడు బాణకోటిఁ జ
ల్లార్చి నరాద నిన్నఁ గని యక్కటికంబు జనించి యిట్టులా
రార్చినఁ గాన విజ్ఞుఁడు మహాత్ముల పల్కులు లెక్క సేయునే. 203

చ అని పలుఁ ద్రుంచినం గనలి యాఖరుఁ డొండొకచాప మెత్తిన
న్మనుజవరుండు వెండి తునుమాడిన నన్యశరాసనంబు న
ద్దనుజుఁడు దాల్ప రాముఁడు పదంపడి దానిని ద్రుంచి వానితా
ల్చిన విశిఖాసనంబు లవలీల నరేంద్రుఁడు రూపుమాపుడున్. 204

ఉ. అన్యధనుర్గ్రహమ్ము రయంబునఁ బూని ఖరాసురుండు రా
జన్యుని పేరురమ్ముపైఁ బృషత్కవరమ్ములు దూర్చి సన్నతిం
దైన్యము నొందఁజేసెదను దారుణకర్ముఁడ నే నటన్న న
మ్మాన్యుఁడు రాముఁ డుగ్రతరమార్గణవారము నించెమేనునన్. 205

వ. వెండియు. 206

క. మాయావి ఖరుఁడు బహువిధ, మాయలు గావింప దైత్యమాయాఘ్నులస
త్సాయకములు కలుపుచు రఘు, నాయకుఁ డాతని శరాసనంబున నఱికినన్. 207

క. మండిపడి శక్తి వైచిన, ఖండించిన రాముఁ గాంచి ఘనభయదగదా
దండము వైచి నఱకను, ద్దండుఁ డతం డొండువిల్లు ధరియించు గడన్. 208

ఉ. సారథిఁ గూల్చి రథ్యముల సారథికన్నను మున్న కూల్చి త
ద్ఘోరపతాక నన్నిటికిఁ దోల్తఁ గూల్చి యనంతరంబునం
గ్రూరతఁ జక్రరక్షకులఁ గూల్చి కడంకఁ దదీయమస్తముల్
ఘోరనరక్తపూరములు వొడ్మ వడిన్ ధరఁ డొల్లఁ జేసినన్. 209

వ. వేలుపులు విరులవానలు గురియించి రివ్విధంబున. 210

గీ. ఖరుని దునుమాడి యుద్ధసంగతిని నోడి, పాఱిపోయెడు నక్కంపనుని విడిచి
మునులు గొనియాడ చుట్టిరా మోదమందె, మనుజహితుఁ డంతఁ దన ప్రియానుజులఁ గూడి,

గీ. కడఁగి ఖరదూషణాది రాక్షసులఁ దునిమి, యాశ్రమమునకు వచ్చుచున్నై యట్లు వచ్చి
భార్యయును దమ్ముఁడును దనఁ బ్రస్తుతింప, మునులు దీవింపఁ బర్ణశాలను వసించె. 212

వ. తదనంతరంబున. 213

ఆ. కంపితాంగుఁడై యకంపనుఁ డంతయుఁ, బ్రాణభీతివట్లు పాఱి లంక
సొచ్చి యందుఁ గనియె సోత్కంఠమనస్కుఁ, బాంధవోపకంఠుఁ బఙ్క్తికంఠు 214

వ. కని సవినయంబుగా నతని కిట్లనియె. 215

చ. మునిజనవైరి శూర్పణఖ ముక్కును నొప్పెడు కర్ణయుగ్మము
న్మన ఖరదూషణాదుల సమస్తనిశాచరసైన్యయుక్తుల
న్మనుజుఁ డొకండు కేళిఁ దునుమాడి సతీసహజుల్ భజింపఁగా
వనమున నున్నవాఁడు మునివర్గము సేవలు సేయుచుండఁగన్. 216

క. అని రాముని వృత్తాంతము, వినిపించెనంతలోన వినువీధి మహా
ధ్వని సేయుచు శూర్పణఖాంగన రావణుఁ జేరి శోకగద్గద యగుచున్. 217

ఆ. మనుజులిరువు రొక్క మనుజ తోఁ జనుదెంచి, బ్రహ్మచారులగుచుఁ బంచవటికి
నరుగుదెంచి యచట ననఘ నీయల్లుఁడ, దపోభిలాషుఁ జంబు హత మొనర్చి. 218

క. వానిమృతికిఁ జింతించెదు, దాని న్మనుఁ బట్టి క్రూరతగకల వాలా
న్యాశితధారఁ గొక్కటి, నానాసాకర్ణధారణము సేయుటయున్. 209

క. అలిగి జనస్థానంబునఁ, గలిగిన పదువాల్గు వేల ఘనరాక్షసులం
గలహమునకు నడిపించుచు, వెలలె ఖరుఁడు దూషణాది వీరసహితుఁడై. 220

వ. వెడలి కదనంబునకుఁ గదియించుటయును. 221

ఉ. ఎక్కుడఁ జాచి కం బుడమి యానినకైవడి దైత్యకోటి పే
రుక్కునఁ జుట్టుముట్టిన మహోగ్రధనుర్చ్యుతమార్గణావలిం
జెక్కులు సేసి చేయనివచించెద రాముబలం బకంపనుం
డొక్కఁడు దక్క సైన్యపతులుగ్రతదంబకవహ్ని కీలలన్. 222

క. వెన్నెలయునసగు నగు సతికి, న్నెలవగుఁ గప్పుఁగొప్పు గేల్గవయొప్పుం
దిన్నెలఁ దెగడు పిఱుఁదులు న,న్నెలఁతక యొప్పుఁగాక యన్యుల కగునే. 210

సీ. కర రాత్రులందు జక్కవలఁ బాపిన ట్టు, పసిఁడికి దావిఁ గూర్పని యుదసడి
పవలు వికసనముఁ దొవలకీ దిసంతు, చివురుల నిపురంగఁ జేసినసడి
నెల నొకతీరుగా నిలువనీయనిరవ్వ, లే దూండ్ల నసటుఁ గూర్చినకొలంత
వెన్నెలఁ జుక్కల వెలుఁగనీని తగడా, రిసుకతిన్నెల నెగయించురోయి

గీ. పాపికొనఁబోలు నీఁతిగుబ్బలను మేనుఁ, గగ్గురుఁ గేలుఁదోయిఁ జొక్కెంపుఁ బ్రమోము
బుజములును గోరులును నిద్దపుంబిఱుఁదులుఁ, దనొనగ్విఁగఁ జాలి నెత్తమ్మిమాలి.

క శయమా పరిస్ఫుటకు శ్రీ,శయమా లసదలికులాతిశయమా సుబిలే
శయమా జన నాభిజలా, శయమా సతి కీకులేమి సరి సంశయమా. 242

వ. అని యివ్విధంబున సీతాసతీసౌందర్యంబు సంక్షేపరూపంబున. 243

క. నీచచరిత యగు నాఁజి,నీచరి తెల్పుటయుఁ దగవిని మన మలరఁగా
నాచెనఁట్రికక్కసుండా, లోచనఁ గావించెఁ బద్మలోచనఁ బట్టన్. 244

గీ. రమణిఁ దేనిట్టు లూహించి రాముఁ డలఘు,రాదులనరాదులను బట్టి కాన నుక్క
డంచె ననుమాటు నిజహృదయంబుఁ గలఁప, గపటమానసుఁ డగునశకంఠుఁ డంత

క. ఏచినవిరహానలమునఁ, దోఁచక నొక్కరుఁడ వెసలి త్రోచినతాల్మి
న్నీచన నోంబుఁజుఁ డగుమా, రీచుం దనపూర్వమంత్రి బుభుభయదకరున్. 246

వ. చూచి తనోభీష్టంబుతెఱంగు సమస్తంబు నెఱిఁగించి లోకవిద్రావణుం డగు
రావణుం డిట్లనియె. 247

ఉ. కాంచన మాయలేడి వయి గొబ్బున రాముని లక్ష్మణుం దొలం
గించుము పర్ణశాలకు నొకించుక దూరము నంతలోనఁ బె
న్వంచన రామదేవిఁ గొనివచ్చెద మెచ్చెద నీప్రతాప మ
గ్గించెద నెల్లకాలము సఖిత్వనిధీ యటుసేయు మింపునన్. 248

చ. అనవుడు దీని కియ్యకొన కడ్డ. పలికెనఁ బ్రాణగొడ్డపుం
బని యగు వీనిచేత నొడఁబడ్డ నరే ద్రునిదొడ్డనాగసం
బునిగుడు మీఁదబడ్డ శరము న్మడిఁబడ్డశరంబు వోవునే
యని యడిఁబడ్డపల్కు క్రియ నాతని కిట్లనియె న్నయంబునన్. 249

ఉ. దీపము గాంచి మిడఁగఁబఱతెంచి నశించినపుర్వభంగి ను
ద్దీపితవిక్రమాఢ్యుని సతీహరణంబునఁ జావువచ్చుఁ గా

దీపని రాఘవేంద్రునిపయి న్మన మేఁగుట మీఁలు క్రొవ్వి దా
మేపున నేటిగట్టుపయి కెక్కినయట్లుగ దా తలంపఁగన్. 250

ఆ. చిన్ననాఁ డతఁడు నన్నలుంగున నెత్తి, నూఱుయోజనములు వాఱ దవ్వ
జలధివిసరివైవ వెలసితిఁ జావక, నతనిదివ్యలీల లద్భుతములు. 251

క. శైశవమున నతఁడు ధనుః, కౌశలి కాకుండి యుతు విఖండనఁ జేసెం
గౌశికునాజ్ఞ సుబాహుఁ, గౌశికనిర్గత్యతాటక న్మను గాఁగన్. 252

క. అని రామునిబల మెఱిఁగి, చిన నాతఁడు వినక కినుకఁ జెందుట మదిలోఁ
గని మారీచుఁడు శ్రీరా, మునిచేఁ జచ్చుటయు పరమమోక్షం బనుచున్. 253

ఉ. క్రూరుఁడు తాటకాత్మజుఁడు కోమలకైతవకృష్ణసారసా
కారత నెంతయు న్సొబగుగం దనరె న్వెలిచుక్కచాలుచే
ధారుణిసంచరింపఁగ సుధానిధిలాంఛనమైనయట్టి త
చ్చారుసుధాసుబిందువిలసద్వపువొప్పఁగ వచ్చెనో యనన్. 254

క. అంగము బంగారముఁ గన్నుంగవ పృథునీలతరమణులుఁ బొడవగుప
చ్ఛృంగములుఁ గుఱుచవాలము, సుంగల్గి కురంగమై మనోవేగమునన్. 255

ఉ. రాముఁడు లక్ష్మణుండును ధరాసుతయుం దలిరాకుటింటఁ జే
తోముద మొప్ప నుండి అదదూరమునం బరిఫుల్లమల్లికా
క్రామితగుల్మమధ్యలతికాపృథుభాసితపుష్పడోలికా
ప్రాముఖనీలభాకలితబంభరనాదము లాలకించుచున్. 256

క. ఉన్నయెడ వానిమువ్వురు, నున్నయెడకు నేగి జిహ్వ కద్దియగునో కా
కున్నో యని చూచుగతి నన, లన్నాలుక సాఁచి తినుచు లఘునమొప్పన్. 257

వ. కురంగంబు కుఱంగటు మెలంగుటఁ గనుంగొని కురంగలోచనయగుసీతాంగన రాముని
కరాంగుళిఁ బట్టికొని. 258

చ. కనుఁగొను మింతచక్కనిమృగంబు జనించుట యద్భుతంబు నా
మనమున దీనిఁ బెంచుటకు మక్కువ మిక్కుటమయ్యెఁ బట్టితె
మ్మనవుడుఁ దత్పరిగ్రహసమాహితవ్రతుఁడై కదంగె రా
మనుకులవరేణ్యుఁ డంగనలమాటలకుం బతు లుత్సహింపరే. 259

వ. ఉత్సహించి సౌమిత్రి నాలోకించి. 260

క. ఈ వచ్చెను సారంగము, నేవిధమున నైనఁ బట్టి యిచ్చుటకు న్నే
వేవచ్చెదునంతదనుక, మీవదినెను గాచియుండుమీ నీవనుచున్. 261

క. సారంగధరుఁడు మున్గ్రిత, సారంగము వెనుదవిలిన చందంబున నా
సారంగసదృశదృష్టిన్, సారంగము వెనుక రామచంద్రుఁ డరుగుచునన్. 274

చ. శిరమున మేనఁ గ్రన్నలుచుక్కలఁ జేర్చికొను స్థలతాగ్రహాం
తరములఁ బొంది పొంచినను దారికి నడ్డముపోయి దట్టపుం
దరువుల మాటునన్నిలుచుఁ దర్పరతం దృణముష్టిఁ జూపు భూ
వరకులనాథుఁ డావారిణగర్వముఁ జట్టున పాయఁ జాలిరై. 275

వ. అత్యవసరంబున. 276

గీ. తృణము గఱచుట చంచలదృష్టి గనుట, భయము నొందుట వెన్నిచ్చి పాఱుటయును
జూడఁగా నప్పు డమ్మాయలేడి సమర,భారమున నోడి పాఱెడిపందవోలె. 277

వ. మఱియును. 278

సీ. దాఁటుచోఁ బూర్వపాదద్వంద్వ మొక్కెడఁ, గదియించు టంజలిక్రమముగాఁగ
లిలఁ బాఱుచో ఖురంబులు నెటికాలఁ బడి, మ్రొగ్గుట యొప్పగు మ్రొక్కుగాఁగ
నురుతరశ్రమమున నుబ్బగ వెడలు నిర్ఘోషకంబు పాద్యంబు గాఁగ
దిసనెడ రాలి తృణలేశ మతిపవిత్ర మ్మగుదర్భాసనమ్ము గాఁగ

గీ. జేరి యెదురేగు టాతిథ్యసమ్మానగను, రాము నొప్పించె మాయాకురంగ మప్పుడు
పరమపురుషుఁడు హరిసమర్పణముగాఁగ, ముక్తిఁ గోరి యొసంగెడు మునియుఁబోలె.

వ. వెండియు నక్కురంగశాబకంబు నగంబులనక నగంబులెక్క రయంబునఁ బాఱుచు మా
యావిగా రామునిపై శరవర్షంబుఁ గురిసెడు దానిం బోలె చరమ ఖురపుటా
గ్రంబుల ధరణీపరాగంబు మీటుచు రాతిసవశిఖయాం బగు నల్పపాత్ర బునుం
బోలె మిట్టి కెగసిపడుచు మృత్యువు ముఖగహ్వరంబునం జొరంబాఱు కరణి గుహా
ముఖంబులం దూఱుచు భ్రాంతాత్మయగు వసరంబునం బోలె భ్రమించుచుఁ బూరుషుని
సంపదయుం బోలెఁ దంతఁ దోఁచి యదృశ్యం బగుచు దరిద్రునిం బోలె దీనా
నంబుఁ జూపుచు సమీరంబునకుగిది నలక్షితవేగంబై గరుడనిరోధంబున గర్వారాం
గభాసురంబై యాపురుషునికడ పుణ్యం కుటిలమార్గగామియై నరకంబున కోర్వనిదా
నిం బోలె నసిపత్రివనంబులకుఁ దోలంగుచు ఘోరదుర్గమారణ్యమార్గంబున బహుదూ
రంబుగా నెలయించికొని చనుటయు రాఘవుండు నిజాంతర్గతంబున. 280

క. తమ్ముఁ డిడిమాయలేడి మమ్మన నమ్మఁదగదని పలుకవచ్చితి మో
సమ్మయ్యె దీని నుగ్రశరమ్ముఁ గూల్తునని భయదరంహస్తురుఁడై. 281

ఉ. తూణములోని బాణ మతితూర్ణముగాఁ గొని నారిఁ గూర్చి యా
క్షీణమదంబునన్ ప్రతిపక్షుఁడు రాముఁడు తూలనేసె ని

స్ఫారిణము దుర్విషాణము విరాజితశోణము సత్క్రసాలయా
ఘూర్ణనము ఘోసఘాణ మఘకర్మధురీణముఁ గైతవైణమున్. 282

వ. తచ్ఛరంబుకంబు నాటుటయు. 283

చ. స్మయరహితుండు నిర్దళితసత్త్వుఁడునై తనతొంటిరూపు వి
స్మయముగఁ దాల్చి రాక్షసుఁడు చచ్చెనెడన్ వెస లక్ష్మణా హతో
స్మి యనుచుఁ బేరెలుంగున నరచి ముఖంబున నెత్తురోల్కఁ గ
వ్వయఁ దగు రామబాణహతి నాతఁడు ప్రాణము వీడె ధన్యుఁడై. 284

క. ఇవ్విధమున మారీచుని, క్రొవ్వడఁచి యలుకుచును రఘుప్రవరుఁడు పెం
దవ్వరుదెంచితి నని వెస, నవ్వనముఁ బాసి వచ్చు నంతటిలోనన్. 285

మ. అనుజా లక్ష్మణ చేర రావె యనుదీనాలాప మారాముఁ డా
డిఁ జందంబునఁ దాటకాత్మజుఁడు నూటించం బల్కుటాలించి హా
యని ధాత్రీసుత వెచ్చనూర్చి పెనదైన్యం బాకృతిం దాల్చెనో
యన సౌమిత్రిముఖంబుఁ గాంచి యిటులమ్మా యంచు భీతాత్మయై 286

క. ఓయన్న సుమిత్రాసుత, మీయన్న వనంబులోన మిగిలినఁ గనరా
వో యన్నఁ బలుకవేమిటికో యన్నఁడు లేనిభీతిఁ గూలెను మనమున్. 287

గీ. అసురవరులను సురలఁ దన్నాఁగి రేని, భయముఁ జెందనిశూరుఁ డిప్పగిదిఁ దమ్ముఁ
డా యనుచుఁ జీఁబిల్చెను డాయఁబోఁగ, దయ్య తడవేలనయ్య ప్రణయ్యముగదయ్య.

ఉ. అంజలిసేతు రాముని రయంబున నిప్పుడె కూడఁబోయి నా
కంజలి దీర్పుమంచు ధరణీసుత వేఁడిన లక్ష్మణుండు బ
ద్ధాంజలియై తదీయచరణంబుల మస్తము మోపి యేల భీ
తిం జలనంబునొందఁగ సతీమణి యుండుమనూల్లసత్పదా. 289

క. లలన పదునాల్గుభువన, మ్ములభారము మీఁదఁబడిన మోయఁగలఁడు త
ద్బల మీవు నేనెఱుంగమె, చలింపవల దింక రామచంద్రునికొఱకున్. 290

క. క్రించుఁదనంబున రాముని, వంచింపం బెటికి దనుజవంశాధము లూ
హించి పెడమాయలను ప్రచరించి చెడుదురు రగ్గిగడిన క్రిములవడువునన్. 291

వ. అనిపలికి మఱియును పదగ్రజుండు హరిణపరిగ్రహార్థం బరుగునవసరంబున. 292

క. వదలక భక్తిమెయి నీ, వదినెను గాచికొనియుండు వాతాయువుఁ బ
న్నైవ ననియరిగెం జెప్పుచుఁ, దదీయవచనంబు లెట్లు దాఁటుదుఁ జెప్పుమా. 293

చ. అనవుడు రామచంద్రుఁడు మహాపద నొందె సహోదరా రయ
మ్మునఁ జనుదెమ్ము తుంటుఁ గడుఁ బొమ్ముచుఁ జీరిన నంటుబోక న

న్నుచితమార్గవర్తి దయాపరిహీనమనస్కుఁ గాచినయ
న్నను ఫలమేమి యన్నను వెసంగఁ బోవఁగదన్న మ్రొక్కెడన్. 294

క. అనుటయు నధోముఖుం డగు, ఘనచింతాక్రాంతుఁడును వికలితాత్ముఁడు న ద
త్తనియుత్తరంబు నగుచు నా, తనిఁ గన్గొని సీత క్రోధతామ్రాక్షియై. 295

మ. ఇదెమీయన్న మహాత్ముఁడై పిలిచెఁ బొమ్మీ యన్నఁ బో వేమి నీ
మదినూహింతు తొ కాక కాన నొరుల న్మాతోడ నేతేరఁ బూ
న్గదయామూర్తివె యంచు నిష్ఠురము లన్యాయంబుగా లక్ష్మణు
న్ననతీరత్నము దూఱ నాడె సదసన్మార్గజ్ఞ లగ్గా దుఃఖితల్. 296

వ. ఇట్లాడి దుఃఖాతిరేకంబున. 297

క. నాచిత్తము నిను బోఁట్లకు, గోచరమే యన్న చావుఁ గోరి నను మది
న్వేచితివగు టెఱుఁగుటె గితి, నీచ సుమిత్రాసుత దురాత్మ నిహతవివేకా. 298

క. నాటం బగునస్మదటజ, నాటమునకడ నిలువ నీకు నల దనవుకు న
మ్మాటలు తనహృదయంబున, కీఁటెలపోటులయి నాట నిట్లని పలికెన్. 299

ఉ. ఆరఘురాముఁ డాత్రిదశుఁ డక్కట యిట్టి మదగ్రజాతుఁడు
గ్రూరము నిన్నుఁ బాసి చనఁగూడదు నాకని యొత్తి చెప్పని
ష్కారణదుష్టకోక్తుల ఘుం బనిమాడ పల్కె దిట్లు నీ
వానికు న్నవ త్తున్న హృదయస్థితి రాముఁ డెఱుంగకుండునే 300

క. అని పలికి రామచంద్రుఁడు, చనినపథముఁ బట్టి చనియె సౌమిత్రియు నా
వ్వనిహృదయంబు రావణుఁ, డనుకూలంబైన సమయ మని ముద మొదవన్. 3 1

క. అన్యాయుఁడు ఖలుఁడు విఫలి, తాన్యాయుఁడు ఘోరరూపుఁ డంతట మాయా
సన్న్యాసి యయ్యె నారా, జన్యునిసతిఁ బట్టు దుర్విచారముతోడన్. 302

గీ. ఇట్లు కర్మందియై తనువెల్లఁబూది, పూఁతఁ దనరార నొకజలపూర్ణకలశ
మమర ధరియించి హరహరా యనుచు వచ్చి, పర్ణశాలకుఁ గడుసమీపమున నిలిచి.

క. దేహిభవ నగుఁ డాతఁడు వై, దేహి భరితవినయఁ గాంచి దేవీ భిక్షాం
దేహి యనుడు జానకి సం, దేహింపక యెదురువోయి ధృతిదళ్కొత్తన్. 304

వ. అర్ఘ్యపాద్యంబు లొసంగి నిభృతయై యిట్లనియె. 305

ఉ. ఇందొక విశ్రమింపుము యతీశ్వర మాపతి వచ్చి మిమ్ముఁ బూ
జించు నతండు పొన్నొడలిజింక తటాలున నిందువచ్చినం
త్రించిన దానిఁ బట్టికొని తెమ్మని వేడుకమీఱ నేను ప్రా
ర్థించినఁ దన్నిమిత్తమున దివ్యధనుర్ధరుఁడై సహోదరున్. 306

క. పుత్రసహాయు సుమిత్రా,పుత్రకు నుపమాయు సుగుణభూషణు ఘను న
స్త్రత్రాణపరాయణుఁడై, ధాత్రీపతి కాఁపు వెట్టి దా నిపిఱుందన్. 307

గీ. అరిగి తడవయ్యె హా లక్ష్మణా యటంచు, దైన్యమునఁ జీర నాతనితమ్ము డతఁడు
నతనిఁ గవఁబోయె నుల్కుచు నడవి నొంటి, నున్న నానఁ బరివ్రాజకోత్తముండు.

వ అని చెప్పి. 309

క. కుశలంతి వసుధ నేలిన దశరథుకోడలను రామధరణిప్రభార్యన్
దశదిశల న్విశదం బగు,యశమునఁ జెన్నొందుజనకునాత్మజ ననినన్. 310

క. అతివా నీ వాకుచస,త్కృతివాక్యంబులకు నాకుహృదయము వలరె నీ
గతి వానల నెండల నీ,యతివామాంగంబు వసట కాపన యయ్యోన్. 311

చ నెలఁ బురుడించుమోము మహనీయతరం బగుచన్నుదోయి వె
న్నెలవడదాఁకు దేహము నణీయతరం బగుమధ్యభాగముం
గలుగఁగఁ జేసి భాగ్యనిధి కాంత నొనర్పక నిన్నుఁ జేనకు
న్నెలఁతఁగఁ జేసె నేరుఁగ నేర్చు విధాత్రుఁడు దుర్విదగ్ధుఁడై. 312

క. నవనీరజగంధివి కదా, నవని రజోగంధి యగుట యన్యాయము దే
వవిలాసినీకదంబము, నవధీరణ సేయఁజాలునందము గలుగన్. 313

గీ. అని మఱియు నుద్దురాత్ముఁ డయ్యవనిజాత, దర్శనముఁ జేసి నీదుసౌందర్యమునకు
సర్వభువనంబు లేలెడి సార్వభౌము,పత్ని వగు టెంతయును లెస్స పద్మగంధి 314

చ. అనుటయు వారిఁ గాంచి వినయం బొకయించుక లేక సీత న
న్నుచితరీతి నీతి విడి యాడెదు దుష్టనికృష్టపద్ధతిన్
మనమున నన్యులాంగనలు మానక సన్నుతి సేతు రిట్లు వ
చ్చునె పరికించిచూడఁ బరిశుద్ధుఁ నోట నశుద్ధవాక్యముల్. 315

క. నానాథు శౌర్య మదిత,నానాథుని కార్య నీవనాథుని గాఁ హీ
నా నాతోఁ బల్కెదు తగు,నా నానాలోకవాళనముఁ గోరి కటా. 316

క పితృనాయతిఁ బురముఁ దృణ,ప్రతిమానముఁ గాఁ దలంచి భ తుదఘునవన
స్థితి కోర్చెఁ గాక లోక,త్రితయము నేలంగ వలఁతి దృఢభుజశక్తిన్. 317

వ. అనిన నయ్యతివ్యాజపరివ్రాజకుం డయ్యవనిజ కిట్లనియె. 318

క. నిన్నును నీనాథుం గనా, నెన్నికొనెను గాని నిర్జరేశ్వరుఁ జెఱసా
ల న్నిలిపి రాక్షసులచే, సన్నుతిఁ గనినట్టి నన్నుఁ జర్చింప వశమా. 319

ఉ. నీ విటు విన్మ సీత మహనీయుఁడు తాత పులస్త్యుఁ డప్ప వి
శ్వావసుఁ డన్న యక్షపతి వానిజయించి తదీయపుష్పక

ఘనశైత్యకారకఘనసారమి(శిత, పృథులచందనచర్చ హృదయ మలర
నక్షత్రవివిధవనోత్సాహకల్పిత, పరిమళాగరుసుధూపములు మలయ

గీ. మెచ్చి బలమున నేఁ జెఱదెచ్చినట్టి, ఖచరకాంతలు తనునూడిగములు సేయ
బాలకైలాసమును శిమాప్రతమునగను, జేసి యాదేవుదశకంఠుఁ జేరఁదగదె. 330

వ. అనిపలికి యాక్షణంబ. 331

క. శశివదన ఖరఖరబర్హిర్ముఖ, శశిరేఖలు బండెసాలలు నిడుఁ
ద్రపుటీక్షింపు మనము వీం,శతికరములు దిశశిరములు సమనాకృతిఁ దనర్. 332

గీ. మెఱయు సూడలు గలవక్త్రితెఱఁగుఁ దోఁప, నెదురనిల్చిన జానకి హృదయ మదర
నేమిసేయుదు నిటుకు మాయామృగం బ,దేల చనుదెంచెఁ బొమ్మంటి నేల విభుని.

వ. అని తలంచి నిగుడుభయాతిరేకంబున. 334

క. ధరణీసుత ధాటింబడి, పరమం బగుమూర్ఛ మునుఁగఁ బట్టుకొని నిజే
ద్ధరథమున నిడికొని సగర్వుఁడై రావణుఁడు పోవఁ దదవసరమునన్. 335

ఉ. ఇంచుక తేఱిమాటి మొగమెత్తి దిశల్ పరికించి తన్ను నో
క్కించుకభీతి లేక కొనియేగెడు రాక్షసనాయకుం బ్రతీ
క్షించి కరంబు బెగ్గడిలి చిత్తము తత్తఱపడ సీత దుః
ఖించెఁ దదీయశోక మెఱిఁగింపఁగ బ్రహ్మకునైనఁ దీఱునే. 336

వ. దుఃఖించుచుఁ దనమనంబున. 337

క. పుణ్యవతియుఁ దిమాట ల,గణ్యములు గణింపనైతిఁ గల్గెనె ఘోరా
రణ్యమున నిక నా కు శ,రణ్యమనుచుఁ జింతమిగుల రాముఁ దలఁచుచున్. 338

క. క్రోధాత్ముం డై తొల్లివి,రాధుం డెత్తికొనిపోవ రక్షించితి త
ద్బాధయుడిపి యిప్పుడు రఘు,నాథ కృప రావిదేమి నను జెఱఁ దలఁగన్. 339

ఉ. నే యనుజన్ముఁ గూడి రఘునీర దురాత్ముకు వీనిఁ ద్రుంపరా
నే యను లక్ష్మణా కను వివేకవిహీనత నిన్నుఁ గొన్ని య
న్యాయము లాడి తత్ఫలము నందితి నిప్పుడె యన్నఁ దోడి తే
నే యను వీనిఁబట్టి పడవేయను వేయునేల ప్రొక్కెదన్. 340

క. రావణుఁడు నన్నుఁ జెఱఁగొని, పోవుమను న్నాఁడు వీనిఁ బోకార్చి నమం
గావఁగ నిప్పుడె రఘువర, వేవచ్చినఁ గాక కీర్తివికలత గాదే. 341

వ. అని మఱియు ననేకవిధంబులం బలవించుచు. 342

చ. ఎక్కడఁ జొత్తు నేనితెరు వెవ్వదివి క్కడఁ కేమిబుద్ధి వ
న్నిక్కడిదాత్ముఁ డెత్తికొని యేగెడు నిప్పుడె ముట్టుముట్టి మ

త్రెక్కొని వీని కంఠముల నెంతయు మేదినిఁ గూలఁ దాఁచి నక్
జక్కఁగఁ బ్రోవరయ్య సురసాధ్యవియచ్చరకిన్నరోత్తముల్. 343

క. పరమపతివ్రత సీత, స్సరగునఁ గొనిపోవు రాక్షసాధముని వీనిం
దెరువునఁ గాఁగరు మీరుం, దరుగుల్మలతాదులార దయలేమిఁ గటా. 344

సీ. దనుజుండు నన్నుఁ బట్టి వినువీధిఁ గొనిపోవఁ, గానరా విది యేమి గంధవాహ
పావను నాఁగి నిర్దయుఁ జూడ్వఁ డని వేఁడ, మాటలాడ వి దేమి మహాసులార
యరసి రక్షింపుమా యమ్మ యనుచుఁ బిల్వ, తల్లి యిట్లు తగునె వసుమతి నీకుఁ
గనలి యాతనిశిరఃకాంతార మేర్పక, తరులఁ డాఁగెద వేమి దావవహ్ని

గీ. కరుణ నన్నుఁ గాచుటకు నిజకాండములను, రావణుని బట్టి ముంచు గోదావరి యను
వడిగఁ బాఱవ విదియేమి జడత నొందె, దనుచు బలవించు నలుదిక్కు లాలకించు.

క. అవనిజ యిట్లు పొగిలెడు, నవసరమున సంచలించె నగములు దా
మవనిజము లగుటఁ దలఁప, నవని స్వహజగుణ మెట్టులెడ విడుచునే. 346

వ. అయ్యవసరంబున. 347

మ. మహాయాకారముఁ దాల్చి రాఘవుల సమ్మోరిముఁ డావంచనం
గొనిపోవన్ దనుజాధముం డిచట నిక్షోణీసుతం బట్టె నే
మని యీనింద దొలంగఁ ద్రోతు మిఁక నాహా చచ్చినంగాని పో
దనియో లేచలు జేరెనుం గురవకాంతంబుల్ దవాగ్నిభ్రమన్. 348

గీ. ధరణిజాక్రందనోద్గతధ్వానఘూర్ణ,మాన కానన మృగపక్షిమండలంబు
పలుమ లెల్లయుఁ దనగారెఁ బత్త్రికంతు,మారుఁ డా శ్రీ రామునకుఁ దెల్పనో యనంగ.

సీ. కన్నులెఱ్ఱఁగఁ జేసెఁ గలకంఠబృందంబు, బుసకొట్టుచును ఫణుల్ విసముఁ జిలికెఁ
గటము లదర నిల్చె గంధసింధురములు, ప్లవగజాలంబులు పండ్లు గొఱికె
మొగములు జేవుఱింపఁగ శుకంబులు గూసె, నొలిఁ గపోతము లూంకరించె
ఘూకము ల్గుఱుగుఱుఁ గ్రుడ్లు ద్రిప్పఁగఁ జొచ్చెఁ, గేకిసంఘంబులు కేక లిడియె

గీ. నఖిలభూతహితుం డగు నట్టి రాము,వనిత బలవంతమునఁ జెఱఁ బట్టి గగన
వీథి వడిఁ గొనిపోయెడు వేళ దుష్ట,దనుజుఁ గన్గొని కినుకఁ జెందిన ట్లనంగ. 350

వ. అంత నజ్జనకనందన. 351

ఉ. ఏ మిథిలాధినాథుసుత నిద్ధయశుండగు రామభార్యఁ బాం
డోమునులార యక్షవిహగోత్తములార ఫణీంద్రులార వే
వామొఱ యాలకించి యలఁకాపతు వీనితల ల్హరించి పో
రే మహనీయులార మదధీశునకున్ మిముఁ గరంబు మెచ్చఁగన్. 352

క. అని ఘోరగృధ్ర మఱువడిఁ, గొనిపోయెడు సర్వవనితకుసుమ మగుచున్
జనకజ యేడ్చుటయుం దధ్వని విని కరుణారసప్రధానుం డగుచున్. 353

క. నాకపతికి వెఱవక మై, నాకము రావణు నెదుర్ప నలిరేఁగుచుఁ దా
నాకడలి వెడలి కడువడి, నాకపథంబున వచ్చె నని సుర లెంచన్. 354

ఉ. పాతకశాత్రవుండు నరపక్షిబలుండు జటాయు వల్లసం
పాతిసహోదరుండు నృపభామిని శోకము సత్వరానుకం
పాతిశయంబునన్ విని మహాబలు రావణు నాఁగ మున్న కం
పాతిరేకాదిదీప్తిఁ గులపాంసను దృష్టిపథంబు నాఁగఁగన్. 355

వ. అమ్మహాబలుం డడ్డుపడి 356

క. కంతీరకమద్యాను దశకంఠ విషవసనీయ కంఠకులు మహో
త్కంఠం దునిమి సమర్యపకంఠమునను నతు గరిశకటు నెయిదిన్. 357

క. అనవృతము నతఁ డాతని కి, ట్లనుఁ బులుఁగా నన్ను గెలువఁ గునే నిన్నే
ట్లున జంపు దేటివగ నీ, వను నమచుఁ దలపడిరి బోరు ఘోరం బయ్యెన్. 358

చ. ఖగదనుజాన్వయోత్తము లప్రతిమానులు కామరూపు ల
త్యగణితసత్వ లూర్జిత యానయము లాశుగ వేదు లుగ్రప
న్నగమనజాశనుల్ మిథిలనాథసుతాప్రియతాపకారకుల్
దగిన శాస్త్రసాధనలు దార్కొని పీఁక జటాయురావణుల్. 359

వ. ఒండొరుల నఖశిఖంబుల వ్రేటులాడు సమయంబున. 360

గీ. అక్షిగతుఁ డగు రాత్రిసాధ్యతుఁ డుగ్ర, పక్షినాథ ఖత్రుతపత్రుఁ డయ్యె
నాతుణంబున రాత్రిసాధ్యతుచేతఁ, బక్షినాథుఁడును విశీర్ణపత్రుఁ డయ్యె 361

ఉ. నొచ్చియు నీడఁబోవక వనోద్ధృతి రావణుఁ గాంచి వంచనం
దెచ్చితి రాఘవేంద్రసతిన్ మగపంతము గాదు నీకుఁ బా
టచ్చరవృత్తి గాని యిఁక డక్కులు సెల్లవు మన్నఖాహతిం
జచ్చిన మేలు నీకనుచు సాహసవృత్తిఁ గడంగి యాతనిన్. 362

గీ వదనములు చీలఁ గంఠముల్ చిదమఁ గోరు, నెనసి వడిఁ బోరు నభమున నెగపి పాఱుఁ
గ్రమ్మఱను జేరుఁ జాఁకిఁ గాఁచి వగలఁ, గూరుఁ బలుమాఱు మీఱు ననూరుసుతుఁడు.

వ. మఱియు నద్దండఁ డద్దయు నద్దిలేనికడిమిం గ్రద్దరించుచు గ్రద్దతేఁడ నెద్దయుం
బ్రొద్దు ప్రొద్దుకొలవఁ సావి యుద్దియుడులర నద్దనుజుం దాఁకి పోరి పోరి పెద్దవాఁడు
గావున. 364

క. పక్షములు దనుజకరవాలక్షతులం దెగుడుం గడుఁ జలంబతి పడియుం
బక్షిశ్రేష్ఠుండు పవిభగ్నక్షోణీభృచ్ఛిఖరగతికఁ ధరణిన్. 365

క. సీతం గైకొని దశముఖుఁ, డాతతుఁ డగురక్కసుండు పఱచెడనని దుః
ఖాతిశయంబున బ్రాలిన, రీతిం గూలుటయు నతివ బ్రిదిలినతాల్మిన్. 366

వ. కంఠగతప్రాణవాయు వగుజటాయువు నుద్దేశించి. 367

చ. అసురవిరోధిఁ గ్రుంచి నను నారసి ప్రోవఁ దలంచి భీమమౌ
సమర మొనర్చి వైరిశితసాయకభగ్నగరుద్వయుండ వై
శ్రమమున నివ్విధంబున ధరం బడఁ జూడఁ గనైతి నీకుఁ బు
ణ్యమునకుఁ బోవఁ బాప మెదు రయ్యెఁ గదయ్య ఖగప్రభూత్తమా. 368

గీ. అసురవరుఁడును ఖలుఁడు నన్యాయుఁ డధముఁ, డై రావణుఁడు జరు మమరనోసఁగి
పరమపుణ్యాత్ము నిన్నిట్లు పడఁగఁ జేసె, ధాత నీయెడఁ గడుఁ బక్షపాతి యగుచు

వ. అని మఱియు సత్యశరణ్య యగు నవనీకన్య తనమనంబునఁ. 370

చ. అరయఁ బరోపకారపరుఁ డై యితఁ డీగ్గెను బుణ్యలోకసు
స్థిరుఁ డగుఁ గాక యంచు వగఁ జెందు ధరాసుతఁ గొంచు రావణుం
డరిగె సరిత్సరోవనమహావనపావనయోగికాశ్రమో
త్కరశిఖరాలయాదులను దాఁటుచు లోకభయంకరాకృతిన్. 371

క. తటుతటు వ్రాదయా మపర నంతట జనకజ యొక్కశైలతటమునఁ గనియెం
దిటముగ విహరించెడుమర్కటవర్యుల నివ్విధమునఁ గాంచి వెనుకగన్. 372

క. పార్థివుఁ డు వార్తాకథ, నార్థం బర్థం బొసంగి యగచరులను సం
ప్రార్థన సేసెడుగతి వస్త్రార్ధంబున నగలు ముడిచి యవనిన్ విడిచెన్. 373

గీ. ఎట్టకాలము బుట్టినింటి కేగు, తాను మనుగొన్న సొమ్ములఁ దగఁగ నెరవు
దీర్చగతి నొప్పె రాఘవుదేవి సుమణిఖచితభూషణములు రత్నగర్భ నిడిన. 374

క. ఆగము నివ్విధముగఁ దన, నగలు మిగులఁ బైటచెఱఁగునను ముడిచి వడి
న్నగచరులయొద్ద విడువగ, నగన యనుచు మొఱయిడు మను ఘనధ్వని ఒడియెన్. 375

వ. ఇవ్విధంబున నాశ్రితప్రియయు సంతప్తయు నగుజానకీపరిత్యక్తప్రకాంచనమయ
భూషణంబుల నయ్యగచరశ్రేష్ఠుం డగుసప్తాశ్వఁ దనుండు దాపులం బనిచి సుగుప్తం
బుఁ గావించె నంత. 376

సీ. మానినీఘనశిరోమణిఁ గాక రత్నకలాపకలాపము ల్పాపతితముఁ
గావించి హా నాథ కావరావే యంచు, దిగులొందుజానకివగపుఁ గాంచి

కనలి లోనుడుకుచుఁ గలఁగుచునపార, తీరంబుఁ జేరి యత్త్రిదశవైరి
మాయావిహారి దుర్మార్గుండు రావణుఁ, డంత సన్నద్ధుఁడై యుద్భటి తి

గీ. వంశవంశాటవికిఁ జిచ్చువహ్ని యనఁగ, జలధి గని భీతినొందుచు సాతనూజ
సీత సకలంకఁ గొని కడు శీఘ్రముగను, లంక సకలంకఁ జేరె నిశ్శంకుఁ డగుచు. 377

వ. లంకకుం జని జనకనందనం దనయుపవనాశోకవనమధ్యంబునం బదిలపఱిచి యద్దుష్టుం డిచ్చో ధరణీపరాగపరిచ్ఛన్నశరీర వై నవయ నేల మదీయాంతఃపురప్రవేశంబుఁ గావించి సమాపభోగంబులం బొందు మనుటయు జగన్మాత యగుసీత యిట్లనియె. 378

మ. గతితప్పక రవి సంచరించినను లోకాలోక మూటాడినం
గతి శ్రీరాముఁడె నాకు సాధ్వి నిజగత్కళ్యాణ నే నన్యసం
గతి కాసింతునె హంసి కాకను నెవం గామించునే ఘోరదు
ర్గతిపాలై చెడ నిట్టులాడెదు నినుం గాలంబు చేరం గటా. 379

వ. అనుటయు. 380

క. కను లెఱ్ఱవార మిగులం, గనలుచు రావణుఁడు పలుకుఁ గతిసత దనుజాం
గనలార వేచియుండుం, డని జానకిఁ జూపి చనియె నంతట నిచటన్. 381

క. ఒకమృగముఁ జంపి నిజశా, ర్ఙ్గకాగ్రమునఁ దగఁ దగిల్చి మోదమ్మునఁ బ
ర్ణకుటీరమునకు వచ్చెడు, నకుటిలుఁ డారాముఁ డెదుర ననుజుం గనియెన్. 382

చ. కనుఁగొని గుండె జల్లుమనఁగా శుభగాననఁ గానలోన సీ
త నొకత డించివచ్చితిక దా మదదానవదానవత్కరిం
ప్రనిబిడ మిత్యరణ్య మిటు రానవురా దవురా పదద్వయం
బనయము సంచలించెను సుమా లసమానసమానసస్థితీ. 383

ఉ. ఈమృగశాబముం జనకజేప్సితమై తగఁ బట్టితెత్తు మా
యామృగమేని గూలిచి రయంబున నిప్పుడ తెత్తుఁ గానలో
నీమృగనేత్ర నేమరకు మీ వని యెంతయు నొత్తి చెప్ప నా
నామృగసంకులం బగువనంబున నొక్కతె డించి వత్తురే. 384

వ. అదియునుంగాక. 385

చ. వినుమిది మాయలేడి వెనువెంటఁ జనన్వల దంచుఁ దొల్లి నీ
వనుపమబుద్ధివై తెలియ వాడితి విప్పు డరణ్యభూమి సీ
త నొకత డించివచ్చితి పదంపడి రాక్షసబాధ నొందునో
యని కలపోయవైతి వకటా వికటం బగుధాత్రిప్పునన్. 386

వ. అనిన విని యుల్కిపడి సవినయంబుగా లక్ష్మణుం డన్న కిట్లనియె. 387

క. నీ వాడినచందంబున, నా వారిజనేత్ర సీత నారసి యుండ
న్నీ వాడినచందంబున, రావే లక్ష్మణ యటంచు రాఘవుఁ డనినన్. 388

ఉ. సారసనేత్ర నన్నుఁ గని చయ్యన నిన్నఁ బొమ్మటంచు వి
స్తారకఠోరయై పలుక సమ్మతి వచ్చితి నోడ నేఁడె
వారికి లోను గాఁ దని భవన్మృగయాక్రమ మే నెఱింగి నీ
పూఁటకు నుండఁ దెల్పిన మహోగ్రదవానలతీక్ష్ణనేత్రయై. 389

క. వినరానిమాట లాడినఁ, జనదెంచినవాఁడఁ దప్పు నైపు మనుడు మ
న్ననము బలము నెఱింగియు న, న్ననాఁడ వటంచు రాజశేఖరుఁ డనుజున్. 390

క. పద పద పోవుద మే మా, పద వొందెనో జనకతనయ భయమున ననుచుం
బదములు తొట్రిల దీనా, స్యదుఁడై రాముఁడు నివాసపదమున కార్తిన్. 391

వ. నానావిధంబు లగుదుర్నిమిత్తంబులకుఁ జిత్తంబు తల్లడపడ వచ్చి సోదరున కభి
ముఖుండై 392

సీ. రాజీవనేత్ర నారాక తా నాలించి, యెదురుగా వచ్చు నేఁ డేలరాదు
హరిణశాబకముఁ బట్టి ద్వారకట్టి తెచ్చితి, నా కని యెపు డేల యెదురరాదు
కొమ్మను జేరి పల్కులు నేర్చుకొనుకీర, పలుకంబు నేఁ డేల పాడి చనియె
వాటికసితమల్లికాభిరామం బగు, నుటజంబు నేఁ డేల యొప్పదటెగ
గీ. కలికి కరచరణాద్యంగకములఁ గలుగు, శాలిభూషణశింజితం బేల వినఁగఁ
బడదు నేఁ డుగ్రరాక్షసాపహృత యయ్యె, సీత నిశ్చయ మిది సుమిత్రాతనూజ.

క. అని పలికి పర్ణశాలఁ, గని జానకి లేకయున్నఁ గడువడి హా చం
దనగంధి యెందుఁ బోయితి, వని మూర్ఛాపరవశాత్ముఁ డై మహిఁ బడియెన్. 394

ఆ. పడిన యన్న నెత్తి పట్టి యేడ్చుచు సుమిత్రాసుతుండు వల్కెఁ దగునె యిట్లు
ధైర్యమంద రామధరణీశ వినకున, మిట్టి వాంతరము నిండు నందు. 395

క. అని కటకటఁబడి శ్రీరాముని గను మూర్ఛ యందు మునమిని వెతికెన్
జనకజనుఁ బల్లవాగారనికటకుల్యాంతరముల రామసహితుఁడై 396

సీ. ఈరీతి శోధించి యెందును గనరాక, యన్న శ్రీరాముఁ డోహో యటంచు
గొంతెత్తి పిల్చుచుఁ గొమ్మ డాఁగితె యంచు, మొకములు త్రింగెదా నటంచుఁ
బర్ణశాలాసమీపంబున రోయుచుఁ, బావులు గోయంగఁ బోయె ననుచు
వనజాక్షి రోసి కన్గొనుట కష్టం బంచు, హా యేమిసేతుఁ గాంతా యటంచుఁ

గీ. గావ మన కింకఁ దో దేరు గలరటంచు, డాయరా వేమి నను దమ్ముఁడా యటంచు
బాల కారగ్గిసాలు గాఁ జోలు వనముఁ, బాహులు గ్రసించెనో యంచుఁ బలవరించు.

సీ. ఇందీవరాక్షి న న్నెందు రమ్మనిపిల్చె, నని కోకిలస్వరం బాలకించు
నదె చంపకామోదహస్తశాఖం బని, వామలతాపల్లవంబు గాంచు
నదె గంధగజయానయరుణాధరం బను, నిండు బండిదొండపండుఁ గాంచు
నదె తత్ప్రకటకాంగిపాశవల్లు లం చుఁ, గమనీయతరకోరకములఁ గాంచు

గీ. దంబు మీఱు మృగాక్షి దంతంబు లనును, దాడిమీప్రసవబీజసంతతులు గాంచుఁ
గొమ్మ పాల్పారు చెక్కుటద్దమ్ము లందు, లలితసారసకదళీదళములఁ గాంచు.

వ. మఱియును. 399

చ. గజములఁ గాంచి గంధకరిగామిని యంచుఁ గలంగు మి చు నం
బుజములఁ గాంచి పద్మముఖి పోయితె యంచుఁ దలంచు బంభర
వ్రజముల గాంచి భృంగచికురా యని చేద్పును నాకుజోపను
లుబ్జములఁ గాంచి పల్లవనుకోమలహస్త యటంచు వంగుగాన్. 400

వ. వెండియు బ్రేయసి నుద్దేశించి. 401

క. రమ్మా యను బల్కవు మా,రమ్మా యను డాఁగు టిది వగమ్మా యను వై
రమ్మా యను నిదకుటు భా,రమ్మా యొను గడు నవాదగమ్మా యనుచున్. 402

ఉ. మా యను జేరదే నె చెప్పుమా యనుఁ బల్కవి దేమి ముద్దుగు
మ్మా యనుఁ దాళఁజాల వినుమా యను నా వెత దీర్పపొన్నికో
మ్మా యనుఁ గష్ట మాయెనా యుమా యను నాపయి నింతనిష్ఠుర
మ్మా యనుఁ బంతమా యను సమానమా యన దైవమా యనున్. 403

క. బాల విప్రలాభ్రకణజం,బాల వదాచరదురోజబాహ్లీక వయుచుం
బాలశశివదన వగవం, బాలయితివె ధాత మిగులఁ బాలసుఁ దగుటన్. 404

సీ. వనిత నీ వావటించి కందమూలంబు, లనుపమానరుచిభక్ష్యములు నాకు
భక్తి నీవొసఁగిన ఫలరసంబులు లసదమృతోపమానంబు లతివ నాకుఁ
బటుపూతముగ నీవు పఱచినకుశములు, రమణీయ తూలతల్పములు నాకు
నబల నీ వేటినయడవిమల్లెలు కల్ప,కప్రసూనంబులు కలికి నాకుఁ

గీ. దివిరి నామేన నీ వలందినపరాగ, మమితశీతలమృగమదరజము నాకు
రమణి నీవున్న పొదలు సౌధములు నాకు, నువిద నీతోడి గహనమయోధ్య నాకు.

వ. అని యి ట్లనేకవిధవిలాపంబులు పలుకుచు వగచుచున్న యన్నరుఁ గనుంగొని
యవిరళబాష్పకణపరిపూరితనిజకపోలయుగళుండగుచు సుమిత్రాపుత్రుండు తన
రీతి నూరార్చుచుండె నంత నక్షణ్యమ్మ దమ్ము. 406

సీ. సారసారససారసారసమధురసా,సారంబు లైన కాసారములను
అంగీకృతాభంగభృంగీసుసంగీత,సంగతరంగత్తుంగములను
సంతతాక్రాంతాప్రకాంతగాఢధ్వాంత,దంతురితాద్రిగృహాంతరముల
నాగతుండపరాగభోగిభోగాభోగ,భాగత్యుపత్యకాభోగములను

గీ. బ్రాంతరంబుల నాశ్రమోపాంతములను, గోటివిధఖచరాంగనాకూటకూట
కూటకోటుల మసలక కొమ్మ వెదకి, సీతఁ గనరామి కెంతయుఁ జింత నొంది. 407

క. ధూర్తమృగధూర్తపటుతర,గర్తంబులఁ బర్వతముల గహనంబులఁ దా
త్యార్తులయి వెదకి రొక్కఁడు,హూర్తంబును నున్నచోట నుండక సీతన్. 408

వ. ఇట్లు పరిశోధించి మగుడం బర్ణశాలాసమీపంబునకు రుగుదెంచి యెందునుం జనక నందన సందర్శింప నేరకున్న యవసరమ్మున రాముండు సహజున్నాలోకించి.

సీ. కొమ్మ యీకొమ్మఁ జేకొని నిల్చెఁగాఁబోలు, నిచట నీక్రొమ్మావి యింపు నొందెఁ
జిలుకల కిచటఁ బల్కులు నేర్పెఁగాఁబోలుఁ,జుమ్మ యీకర్ణికారమ్ము ప్రబలె
దిగులున దీని సంగటఁ బట్టెఁగాఁబోలుఁ, నిచట నికురువకం బిగురు లెత్తెఁ
దిలకినీతిలకంబుఁ జేతిమాడఁగఁబోలు, నిచట నీతిలక మి ట్లెలమి గాంచె

గీ. నిచటఁ గడువేఁడినిట్టూర్పు లియ్యఁబోలు, నింతి యీసిందువార మత్యంత మమరె
నాతి యిచ్చోట వెడనవ్వు నవ్వఁబోలు, మిగులఁ బువ్వులతో నీనమేరు వొప్పె.

వ. అని పలికి. 411

క. తస్కరముల నమృతం బిడి, విను లతలం బెనుచు పాలవెల్లిసిసువునాఁ
జనుజంకసయసఫల మిపు, డనయముఁ గృశియింపదే యినారాద్గత యై. 412

చ. కరు లుపపింగదృష్టు లురగంబులు గోకము లచ్ఛభల్లము
ల్శరభములు సృగాలములు సైరిభము లృలు లీతరక్షువు
ల్సరసిజనేత్ర నేఁచుటకు సంశయమే శుకపుండరీకబం
భరపికశారికాదు లిటు మానక నీగతి నన్ను నేఁచఁగన్. 413

సీ. బిసబాహు లని హంసపిండు వేధించెనో, వేధించునే మేఘసాధువేణిఁ
గవలానన యటంచుఁ గరియూధ మేఁచెనో, యేఁచునే ఘనపింగదృష్టివధ్యఁ
గికపాణి యటంచుఁ గోకిల లెంతయుఁ బెనో, యలమునే మిలుర మాభిరామ
నవకోవలి యటంచు భ్రమరముల్ మూఁగెనో, మూఁగునే చంపకామోదదేహ

గీ. కటిఫలధరి యని శకక్రజవ డెట్లు, మిడిసికించెనో పసికించు నెట్లు
వాసనలఁ బొప్పగుఁ లుక్క జవాదిపూఁత, యనుచు నెంతయు భ్రమ నెందు నాత్మయందు.

వ. మఱియును. 415

సీ. జనకజాతఁ గజాతసమనేత్రఁ గానరే, జంబూవిశాలభూజంబులార
మధుపరాగపరాగమృదుగంధిఁ గానరే, లలితరసాలసాలంబులార
జలదమాలతమాలసమవాలఁ గానరే, మహితమాలూరభూరుహములార
ఘనలతాంతలతాంత కమనీయఁ గానరే, పటుజటోత్కటవటకుటములార
గీ. మధురబంధూకబంధుకమ్రాధరోష్ఠిఁ, గానరే గురువుచ మీరు కాంతరేఁగు
లార యని విభ్రమాద్భ్రుఁడై నరేంద్రుఁ, డచట నచ్చటఁ దిరుగుచు నడలి యడలి 416

క. గములార నఱలుఘనవా, గములారా ఘోరపన్నగములారా సిం
గములార మృగములార వ్యగములారా నగములార కానరె సీతన్. 417

వ. అని యివ్విధంబున యుక్తాయుక్తవివేకవిహీనునిం బోలె దృగ్గోచరంబులగు పదార్థంబుల నెల్ల జనకనందన నడుగుచుం జని చని లక్ష్మణుం గనుంగొని. 418

క. అనుజా మన మిరువురము, న్నిను జానకియొద్ద లేనివేళఁ గుపితుఁడై
దనుజాధముఁ డొకఁడు ధరాతనుజాతం గొనుట నిశ్చితం బూహింపన్. 419

క. జనకజ నిర్జ్యోత్సఁ గాంచితి, మని తెల్పెడుభంగి భల్లుకావలి మొఱసె
న్నిను పవనిజ వెదకెమగతి, ఘనవృక్షాగ్రములఁ గపినికరమును మెఱసెన్. 420

వ. అని పలికి శోకాతిరేకంబున నొడలెఱుంగక లక్ష్మణుం గనుంగొని. 421

ఉ. ఎవ్వఁడ నేను రాముఁడ వహీనబలాఢ్యుఁడ కానెఱుంగు దీ
వెవ్వఁడ వేను లక్ష్మణుఁడ నేటికి వచ్చితి మిట్టికానకుం
జవ్వని సీత లేయుటకు జానకి యెక్కడ నోయి లక్ష్మణుం
డివ్విధినున్న వాఁ డనుచు నేడ్చుఁ బరిభ్రమితాంతరంగుఁడై. 422

చ. జనకజ నిందుఁ గాన ముటజంబు విడి కాదొకో రామచంద్రుఁ డా
జనకజఁ బాసి యొక్కనిముసంబును దాళఁగఁజాలఁ డేనురా
మనరవరుండఁ గానో యనుమానము గల్గెడు నంచుఁ గ్రమ్మఱిం
జని యుటజంబు నెవ్వదకి జానకిఁ గానక వంత గ్రమ్మఁగన్. 423

చ. మనమున వెదకి మానిని సీతనుఁ గానకున్న నె
మ్మనము గలగె నాకు వినుమా వినుమానిక మీఁద చిచ్చు పె
న్మన నెడమకన్ను మున్ను నఁ గనుంగొనఁజాలుదు రెండునున్నఁ జ
య్యన గతి నాకుఁ జూపరు దయాపరివర్జితచిత్తవృత్తులై. 424

వ. అని విరాళిఁ దాలిమితూలిన దాశరథి దాళఁజాలక యాలిం దలంచి. 425

ఉ. పాంథమనోధనాపహృతిఁ బ్రాభవుఁ డైనశుకాఖ్యుఁ డిప్డు పు
ష్పంధయశింజినీకలితసారబలం బగుతుంటవింట ద
ర్పాంధత నూనమార్గణచయంబుల నొడక గ్రుచ్చి నాగుహా
ద్గ్రంథి నలంచె గావున సుకర్ణి భవద్వచనామృతంబునన్. 426

వ. అని వగచి. 427

క. క్రమ్మఱ నిట్లను బృథుశోకమ్మున మహిజనకతనయ కడువడి నన్నుం
గ్రమ్మినతాపము దీఱునె, కమ్మనికెమ్మోవిపానక మ్మీకున్నన్. 428

వ. అని పలికి యలుక వొడమ నమ్మహీసుతాప్రియుండు 429

క. సాధుచరిత్ర యనందగు, మైథిలి నొప్పింపకున్న మహి నిప్పుడ సం
బాధింతు నస్మదీయ, క్రోధోద్రేకంబు వెలయఁ గ్రూరాస్త్రములన్. 430

క. నను రాజమాత్రుఁ గాఁ దలఁచిన సురగంధర్వయక్షసిద్ధాదులఁ ద్రుం
చినఁ గాని తీఱ దిదె కన్గొను మనరామునకు లక్ష్మణుం డిట్లనియెన్. 431

గీ. అంబుజాసననిర్మితం బైకరంబుఁ, బొలుపు నొందుజరాచరభూతకోటి
నీవు గాపాడువాఁడవు నీఱు సేయు, టుగ్రకర్మము తలపోయ నుడుకుదక్క. 432

గీ. ఏల తాలిమిఁ దూల సీతాలతాంగి, నిచ్చోట నచ్చోట వెదకుద మెట్లులైన
నేను గొనివత్తు సంశయ మిఁక తవలవ, దగ్గిలో నున్న నబ్ధిమధ్యమున నున్న. 433

వ. అని పలుకుచుండ రామచంద్రుం డపశమితపరితాపుండై క్రోశమాత్రంబు ధరణీ
కుమారిక నరయుచుం జని మార్గమధ్యంబున. 434

ఉ. ఖండితపక్షుఁ డై మిగులఁ గాఱునసృక్ప్రరిషిక్తవక్షుఁ డై
తుండము ధాత్రి నూఁదికొని తోరపుమూర్ఛ మునింగి జేవుఱుం
గొండవిధంబునం ధరణిఁ గూలినపక్షివరేణ్యుఁ గాంచి మా
ర్తాండవరాన్వవాయకలశాంబుధిసోముఁడు రాముఁ డుగ్రుఁ డై. 435

వ. రాక్షసుం డనుతలంపున. 436

క. నీచమతి సీత నీరజనీచరుఁడు గ్రసించి యిట్లు నిష్కపటుగ్రీ గుం
జూచితె లక్ష్మణ మఱలం, జూచి తెఱవులోన నిశ్చల గ్రుమ్మఁ బడియెన్.

క. కావునఁ గడుఘోరం బగు, నీవనమున సంచరించు నిష్కపటాత్మం
జీవనము గొనెద వెస వి, ల్లీవన యనుచుంతలోన నిట్లనె నతఁడున్. 438

సీ. ఘనులార రామలక్ష్మణులార యేను రాక్షసుఁడను గాను మీజనకుఁ డగుద
శరథభూమీధవసఖుఁడ జటాయువ, న్వాఁడ రావణుఁడను దానవవిభుండు

జానకిఁ గొని యాకసంబునకుఁ బఱచుచో, నాపెదీనాలాప మాలకించి
వాని నెదిర్చి దుర్వారతఁ దీవ్రూసి, పాతంబునఁ బ్రభగ్నపక్షయుగ్మ
గీ. కుండనై సీతవార్త మీకుం దెలుపఁగ, వలసి నిలిపితిఁ బ్రాణము లిన్నలున విపుడ
తొఱఁగెద నటంచుఁ దంతలఁ దోర్చుకొనుచు, విహగవిభుఁ డంతఁ బ్రాణంబు
వీడుటయును. 439

ఉ. పక్షికులాధిప్రాణహీనుభానుఁడ మాయమై కూర్మిగాఱ మా
పక్షము వచ్చి నీవిటులు ప్రాణము వీడితి విప్డు నిన్నుఁ బ్ర
త్యక్షముగాఁగఁ జూచి కడు దారనిశోకము మించె మానవా
ధ్యక్షుఁడు తండ్రి పఙ్క్తిరథుఁ డంతమునొందు తెఱంగు మీఱ క్రియన్. 440

ఉ. ఏటికిఁ రాముదేవిఁ గొని యేగెడు రాక్షస నీ వటంచు మి
న్నేఁటికి సడ్డ మేగిన మహీభృదధీశునిభంగి నాఁగి త
త్పాటితపక్షకుండ వయి ప్రాణము వీడితివయ్యొ దైవ మి
చ్చోటు నదృష్టహీనుఁ గృపఁ జూచినవానిక చేటు గూర్చెడిన్. 441

క. అని వగచి వగచి తగునిం, ధనములు సొదవేర్చి పక్షినాయకుఁ బయిఁ జే
ర్చి నిబిడశోకు లగుచు వహ్నిం నొసఁగి రయ్యన్నదమ్ము లిరవుగ నువిధిన్. 412

వ. తదనంతరంబున. 443

క. నరనాథులు ఖగనాథుం, గఱచేరిన పుణ్యలోక మనుచుం గోదా
వరి సాఁచి మృగామిషమున, నురుపిండముఁ బెట్టి రొగిఁ దిలోదక మొప్పన్. 444

వ. ఇట్లు జటాయువుం బుణ్యలోకచిరనివాసిం గావించి. 445

సీ. ఓషధీశ్వరుని బీఱూవరసంబు ప్రార్థింపఁ బోయినభంగిఁ దీవ లూక
సంబు ముట్టిన యరణ్యంబు రామలక్ష్మణులు దురంతశోకప్రభగ్న
హృద్వృత్తు లగుచు మహీసుత వరయుచుఁ, జని చని మించు క్రౌంచవతిఁ గ్రౌంచ
వతిఁ బ్రవేశించి యావలఁ దమసాందిఁ, గన్గొని తత్తీరకాననమున
గీ. నతనుబాణాతనుప్రణిహతమనోంబు, జాతయై లక్ష్మణునిఁ జెయి సాఁచి పట్టి
కొనినదాని నయోముఖిఁ గ్రూరఁ గామరూపిణి రక్కసిని వేఁ విరూపఁ జేసి 446

సీ. పటుదీర్ఘబాహులబ్ధప్రాణిసంఘుగ్ర, పంక్తిలి యగుకబంధుని భుజాంత
రంబునఁ జిక్కి ఘోరం బగుతద్వక్త్ర, తాకార మీక్షించి యద్భుతాంత
రంగులై వానికరంబులు ఖండించి, రామలక్ష్మణు లుగ్రరాహుముఖని
ర్గతచంద్రాబ్జినీనాథుల నొప్పి, రాక్షసంబున శాపమోక్ష మంది

గీ. వారలకుఁ దత్ప్రవృత్తి సర్వంబు నెఱుఁగఁ, జెప్పి చేదోయి నంత మోడ్చి వినయమున
నాకబంధుఁడు దాను దివ్యపురుషుండు, గానఁ దనతొంటిరూపంబుఁ గలుగ నిలిచి.

క. భూపవరులార యిదె మ, చ్ఛాపవిమోక్షంబుఁ బూర్వజన్మకృతమహా
పాపవినాశము నయ్యెన్, మీపదదర్శనముకతన మిగుల వెలిఁగితిన్. 448

చ. అని వినతించి వాఁడు జనకాత్మజ యున్నెడ వేఁడినన్ మహీ
జనవరులార మీరలు వెసం జని మంత్రులఁ గూడి ఋశ్యమూ
కనగనగంబులం దిరుగు కంజహితాత్మజసూను వాలియ
న్వనచరనాథుసోదరు నవశ్యముఁ జూడఁగఁ బొందు ధీరులై. 449

క. ఆసుగ్రీవునితో సఖ్యాసము గావింపుఁ డతఁడు వనచరుల మహో
ల్లాసమునఁ బిలువనంపి ధ, రాసుత వెదకింపఁజాలు రభసత ననుచున్. 450

క. ఈవిధమున దనునాముఁడ, వావిలమతి నెఱుఁగఁ జెప్పి యరిగిన హరివి
శ్వావిద్భల్లుకహరిశర, భావనవనభాగమందు నరుగుచు నెదురన్. 451

సీ. ఆశ్రమము న్లతాంతసులతాంతముఁ గూజితశుకపికధ్వం
గాశ్రయము ప్రసాలవకుళార్జునతిందుకనింబవారస
మ్మిశ్రమము న్వశ్వేతభద్రమేదురగుల్మయుతంబు నొక్కపు
ణ్యాశ్రమముం గనుంగొని రహార్పతితేజులు రామలక్ష్మణుల్. 452

వ. కనుంగొని. 453

క. వెసఁ జొచ్చి యందుఁ గన్గొని, రసమానవ్రతసమాగతాయాసభరి
న్నుసరిత్ప్రస్నాపితశం, గసటాపటలప్రకలితకబరి న్శబరిన్. 54

క. కని తచ్ఛబరాంగన భ, క్తిని వే నర్ఘ్యాదివిహితకృత్యము లొనరిం
చిన సంతసించి నగవరు, లనవద్యులు ఘనులు దశశతాంగతనూజుల్. 455

వ. పరమపవిత్రకుశాస్తరణంబుల సుఖాసీనులైరంత. 456

చ. పొసఁగి భక్తిఁ దచ్ఛబరి భూనుతకీర్తికి రామమూర్తికి
న్బొసఁగి కందమూలమధురోరుఫలంబులు తృప్తిదీరఁగా
మెసఁగి నరేశ్వరుండు హితమేదురవాక్ప్రకరంబు దానితో
నెసఁగ రచించుచు న్మిగుల హృత్ముద మొప్ప వసించె నయ్యెడన్. 457

చ. తనదుహితప్రవృత్తి విదితంబుగ రామునకు న్వచించి యా
తని వినతించి రాఘవపదంబుల నొందల మోపి మ్రొక్కి వే

తనువుఁ దొఱఁగి తత్క్షణమ దివ్యవరాంగనఁ బొందె సత్తపో
ధనులకు నంద రానిసుపదంబులు భక్తికి యోగ మెక్కుడే. 458

క. తనివి సనక యీవిధి నా, తనిని నుతు లొనర్చి శబరి తనువుఁ దొఱఁగినం
గని యబ్బురపడుసోదరుఁ, గని యప్పుడు పలికెఁ గౌతుకస్ఫురణ మెయిన్. 459

ఉ. నూతన్మయు భక్తియోగము విశుద్ధమునుక్కులు గానిపూరుషు
ల్లక్ష్మనెసంగువారు పదిలక్షులు వెట్టి నుతిసి తునే
లక్ష్మికి బాహ్యులయ్యును ఫలప్రదు నన్ను నెఱింగి మా వు
ల్లక్ష్మణ భక్తి నెంగిలిఫలంబులు వెట్టి నుల్లసిల్లుమన్. 460

గీ. అని పలికి రాముఁ డనుజసహాయుఁ డగుచు, నాశ్రమంబుఁ గన్నుల నరిగి గాంచె
నధికతరవారికేళీసమాగతాప్సరోవరం బగు పంపాసరోవరంబు 461

వ. దారి మంజులతారుంజపుంజరంజితం బగు తత్తీరంబుఁ జేరం బోవు నవసరమ్మున.

చ. అరివిలయుండు లక్ష్మణుఁ డవార్యతి తేజుఁడు కన్గొ కిట్టులన్
నరవర చూచితే యిను మృణాలముఖంబున దాను గొన్న శై
వలముల సంగ్రంథకునెపంబునఁ గ్రమ్మఱ నొల్కెడున్ మనో
హరతరపంకజాతనిచయంబులు ప్రత్యుపకార మొప్పదే. 463

ఉ. సారసగంధియు న్నవలశైవలవాలయు నుత్పలాక్షియుం
జారురథాంగపీవరకుచద్వయయుం గలహంసయానయు
న్వారమృణాళబాహువుఁ గుశప్రభునాభియు నై తనర్చెడి
శ్రీరఘురామ మాడు సరసీమణి దాసరసీమణి క్రియన్. 464

క. తీరస్థితంబు లగుధా, త్రీరుహములు ప్రతిఫలించెఁ దెలియుము నది న
ర్వీరమణ వనాంబుజహ, స్తారమణీయప్రకల్పితముకుర మొకో. 465

చ. నరవర తన్ను నాడి జనంబులు పంక మధోగతంబు సే
యురుచిరమూర్తి యిన్నది పయోరుహజాత పరాగయోగని
ర్హరిత మదద్విరేఫ మవి నాధిక యాటఁ దలంపఁ జిత్రమే
యరయ గజప్రదాత యగునాతఁడు తోత్ర మొసంగకుండునే. 466

క. అని పలుక రాముఁ డాదిఁ, గనుఁగొని తన్మధ్యకమలకైరవవిచర
ద్ఘనభృంగములం గని క్రన్నన సీతావిరహావేదనాహతమతి యై. 467

వ. తమ్మునిఁ వీక్షించి. 468

చ. వనమున రాత్రి పాపహృతభార్యుఁడనై వగ నొందు నన్నుఁ గ
న్గొని తనయింటి దానవులు కోరి హరించెద రంచు భీతిచే
ననిశముఁ బెట్టిఁ బాయదు రథాంగము చూచితివే వనాంతర
మ్ము గజపర్ణశాల ననుఁబోలు నభాగ్యులు లేరు చూడఁగన్. 469

క. మరుఁ డైదవశరమున న న్నురవడి నేసెడిని గాకయున్న స్వరసీ
వరతీరంబున నాకు న్స్మరదళమానస్థ నిట్లు మఱుఁగఁగ నేలా. 470

మ. తగ నిన్నద్యుదకస్ఫురత్కుముదపద్మస్తోమగంధంబుఁ దీ
రగతాశోకరసాలకుందసుమసౌరభ్యంబునుం గ్రోలి యా
శుగ ముగ్రత్వము దాల్చి నాకు హృదయక్షోభంబు వెంచె న్మరా
శుగపంచాహతి వోలె లక్ష్మణ బుధస్తుత్యోల్లసల్లక్షణా. 471

ఆ. తాపహారియిన్న దీపవనంబు సంతాపకారి యయ్యెఁ దరుణిఁ బాసి
యున్నవాఁడ నగుట నురుభుజ నాకు సీతాపహారిఁ జూపు మే పడంతు. 472

వ. అని శోకావేశుండై పలుకుచుండు సహోదరుండు సాంత్వనవచనంబుల ననునయిం
చె నంత. 473

ఉ. శోకముఁ దక్కి రాముఁడు విశుద్ధమతిం జని కాంచెఁ బుష్పితా
శోకముఖద్రుమాగ్రపరిశోభితబర్హిశిఖండినీకులా
స్తోకముఁ గూటకోటిపరిశుద్ధనిశాపతికాంతవేదికా
నేకము సానుసంచరదహీంచమూకము ఋశ్యమూకమున్. 474

వ. కని తదుపాంతకాంతారాంతరంబున ననుజసహితుండై రాముండు ధనుర్బాణతూ
ణంబులు సహాయంబులుగా నుండె నని చెప్పి మహానందంబున. 475

ఆశ్వాసాంతము.

ఉ. మిత్రామిత్రవిభేదశూన్య బుధసన్మిత్రాఖిలామిత్ర భ
క్తత్రాణైకపరాయణా నిరతవృత్రఘ్నార్చితాంఘ్రిద్వయా
పత్త్ర్యధ్యక్షవిహారదా సుహృదయాబ్జా వేంకటాఖ్యోల్లస
ద్గోత్రాభృన్నిలయా సుగాహిమలయా క్రూరోగ్రయామ్యాలయా. 476

క. ఆధివ్యాధిహరణ భక్తాధీనాంతఃకరణకరుణాచరణా
సాధుజనావనచణ భవపాథోనిధ్యుత్తరణ కృపాప్రాభరణా. 477

కవిరాజవిరాజితము.

పరసిరుహోదర సన్నుతపాదరజఃపరిపూతరసాతలయా
పరమకృపాకర పామరభీకర భానుసుధాకరకోటివిభా
తరుణశుభాంగ మహీహృదయంగమ తార్క్ష్యతురంగమ దీనదయా
పర మధుసూదన ప్రణుతసుధోదన భవ్యవినోద నరాదహరీ. 478

గద్య. ఇది శ్రీసూర్యనారాయణ పదాబ్జధ్యానపరాయణ భూమధైర్య
వినయ రామశాస్త్రితనయ పండితసేవాసముచ్చయ క్రొత్తపల్లి
లచ్చయ ప్రణీతం బైన దాశరథివిలాసం బను మహా
ప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము.



శుభమస్తు.

అవిఘ్నమస్తు.

శ్రీశారదాంబాయైనమోనమః

# దాశరథివిలాసము.



## పంచమాశ్వాసము.





వనితాయుతవక్ష సు
ధీవర మాధవసదృక్ష దితిజవిపక్షా
పావనమునిపక్షా భ
క్తావనకృతదీక్ష వేంకటాద్ర్యధ్యక్షా.

వ. తదనంతరకథావిధానం బవధరింపు మట్లు రామలక్ష్మణులు ఋశ్యమూకోపాంత కాంతారంబున విహరించుచుండి రని చెప్పి వాల్మీకి వెండియు నిట్లు చెప్పందొడంగె నట్లున్న సమయంబున. 2

చ. హరితనయుండు కన్గొనియె నాదట భీతము లై చూపుల
న్సురుచిరరూపుల న్ఘనవిశుద్ధగుణౌఘులసత్కలాపులం
బరమరవిప్రతాపులను మర్దితదీనజనానుతాపులం
గరధృతచాపుల న్నియమికర్మకలాపుల వీతపాపులన్. 3

క. కని తననిజాప్తులం గనుంగొని యవ్వానరకులాబ్ధికువలయహితులం
గొని చని తగ వారల కమ్మనుజాధీశ్వరులం జూపి మనము గలంగన్. 4

క. మునిధర్మపరాయణు లయ్యును ధర్మధురీణు లగుచు నున్నా రలు ధ
ర్మనిరతు లెవ్వారల పంపున వచ్చిరొ మీరుఁ దెలియఁ బోలునె చెప్పుఁడా. 5

వ. అని వాలిపంపున వచ్చినవా రని వానరనిభయంబున నడిగి యడిగిననితరయము నభి ప్రాయంబు గ్రహించి సుజనవిధేయుండగు నాంజనేయుండు రచనంబులగు వచనంబుల నిట్లనియె. 6

క. వీరలఁ జేరి వారలు, వీరలు మహనీయు లిట్టివీరల నొరు ల
వ్వారలు వ్రపంగఁ జాలరు, వారలు తము దామ యెఱుక స్వచ్ఛందగతిన్. 7

వ. వచ్చినవార లని తలంతు నని పలికి మఱియు నిట్లనియె. 8

మ. హితవాచంయమివేషధారులఁ గృపాదృగ్జాలురన్ క్షత్రియా
కృతు లీవీరలు వాలి నేపడఁచి కిష్కింధాధిపత్యంబు స
మ్మతి నీ కిత్తురు మేను లొప్పఁగ రమామాన్యప్రకాశుండు స
ద్గతి నేతెంచె సుదంష్ట్రి జగత్కల్యాణచారిత్రతల్. 9

ఉ. వారివిధంబు సర్వము బ్రభుత బుగ నారసి వచ్చి తేవెత త
న్వారికి నీవు సఖ్యము నవశ్యముఁ గూర్చెద నట్టులైన నే
వారికి లోనుగాని బలవంతుఁడ వయ్యెద వెట్టివైరులం
జీరికిఁగొందువే ప్లవగసింహుని వాలిని గీలి నేర్పవే. 10

క. అని వారిసమీపమునకుఁ, జని మాయాభిక్షుకత్వసంభృతుఁ డగుచు
న్వ మెల్లఁ ద తనూనూత్నవేషసన మొప్పఁజేయఁ దగియెడునిభృతిన్. 11

ఉ. చేతులు దోయిలించి కపిసింహుఁడు వాయుసుతుండు మ్రొక్కి ని
ర్భీతులు సద్వినీతులు సపేశలనీతులుఁ బూతులుం జగ
త్త్రాతలు మీరు మానుల నిధంబున ఘోరవనాంతసీమ
యాతులు గాఁగ నేటికి దయామతులార యెఱుంగఁ జెప్పరే. 12

వ. అని యడిగి వెండియు. 13

క. చక్రీశసదృశబాహులుఁ, జక్రధరోపములుఁ జక్రచక్రాంకులుం
జక్రహితరిపుప్రభులు సువక్రవిక్రమపేశలులు సుకటిచక్రులు మీరల్. 14

క. మహి నెవ్వారలు వీరలు, బహుసుగుణావహులు నియమిభావనహులనా
గ్రహులు మహోన్నహు లెయ్యెడ, నహింశయనునిద్వ్యాకృతు లన నలరెద రనిన్. 15

ఉ. ప్రాణసతీసువార్తఁ గొని రాఁగ ధీరునిగా నెఱిఁగియో
స్థాణువరంబునం బరమసాధ్వికి నందనుండు దగం జగ
త్త్రాణునిచేఁ బ్రజాతుఁ డగుధార్మికుఁ డంచుఁ దలంచియో పరి
క్షీణవిచారుఁడై ముదముఁ జెందెను రాముఁడు తన్మహోక్తులన్. 16

వ. ఇట్లు సంతసించి సహోదరుం గనుంగొని. 17

క. మనవృత్తము సర్వము లక్ష్మణ యితని కెఱుంగఁ జెప్పుమా యనవుడు స
జ్జనమణి సౌమిత్రి నరేంద్రుని యానతి మిగుల నతిగతో నిట్లనియెన్. 18

# పంచమాశ్వాసము.

ఉ. భానుకులాబ్ధిపూర్ణహిమభానుఁడు పఙ్క్తిరథాధిపుండు త
త్సూనుల మీఁదఁ దగ్రజుఁడు సువ్రతచర్యుఁడు రామనాముఁ డా
త్మానుజు నన్నలక్ష్మణసమాఖ్యుని గూడి కడఁగి భార్యయుం
దానును వేడ్కఁ బంచవటిఁ దాత వచస్స్థితి నుండె నంతటన్. 19

క. ఈసుశ్లోకునిసతి సీ, తాసతి యేమిగపురమును దౌదవ్వుల సం
త్రాసవనస్థితి మెలఁగెడు, సాసమచయమునందు రాత్మసాహాయ్య యై'న్. 20

క. తత్కాంతారత్నము నే, తత్కాంతారస్థలముఁ గంటు మను పరీ
గోత్కలిక వెదకి విపులా, పత్కలితుల మొక్కచోఁ గబంధు మహాంధున్. 21

క. కని వాని వానిశాపం, బును దగ్ధముగా నొనర్చి పొలుపుగ నపు డా
ధనునామునిచే సుగ్రీ, వుని విని తత్సఖ్యమున నవుం బనుతెల్లన్. 22

మ. అని తన్మర్కటనాథదర్శనసమీహాబద్ధహృద్గ్రంధిరై
విను మిచ్చో నివసించినాఁ డురుజగద్విఖ్యాతమూర్ధన్యమా
గ్ధన్నితాంతస్ఫుటదీప్తివక్రాళిఘాటనాత్యంతప్రశస్తాంఘ్రిప
ద్మన కీరామున కబ్జజుం డగచరేంద్రుం గొల్వ రా సెం గటా. 23

వ. అని పలికి యున్న దెసకు దిన్ననై కన్నీరు మున్నీరుగా వగచుచున్న యన్నరవరున
కుత్తరచరవరుం డిట్లనియె. 24

క. ఏపగిది నవార్యము లగు, నాపదలకు ద    బోఁగల రార్యులు శోక
స్థాపితహృద్వృత్తులకుఁ, బైపయి నాప  వోఁడముఁ బలముఁ దొలంగున్. 25

వ. కావున సుస్థిరుండ వగు మని యనునయింప    నంతరంబున రామలక్ష్మణులం గని 26

క. బంటు నిటు వినుఁడు శోకం, బంటనిహ్వా   ములతోడ నజ్జనకసుతం
బంటువెలఁదిమోములు దగు, పంట వెదకి కాంచునట్టిపని నాదిముఁడీ 27

వ. అని యిట్లు. 28

క. తగఁగ నవికులుల నవికలు, లగుఁదని లగుదంబిడ మగు  ఖీర్ఘితగం
బగువాలముఁ ద్రిప్పుచు న,య్యగచరుఁ డిట్లనియె నైజ మగుగతిఁ దెలియన్. 29

క. అంజనకుఁ బ్రభంజనునిద, యం జనము నొందినాఁడ హనుమద్విఖ్యా
తిం జను లెన్నఁగ ఖలులఁ బ్ర, భంజన మొనరించుసత్ప్రభం జనువాఁడన్. 30

క. సుగ్రీవాగ్రసచివుఁడ న, దగ్రగ్రావాగ్రవాసినై యిమ్ముఁ గని భూ
పాగ్రణులు భవత్సఖ్యస, మగ్రావాప్తి నెదఁ గోరి యతఁ డిట్లను నమున్. 31

వ. అని ప్రశంసించి. 43

క. హృష్టమతిం బురుషాగ్రచ,తుష్టయము మనందగుసచివచతుష్టయము మెప్పం
దుష్టయము భువనపూర్ణో,త్కృష్టయశు రాముఁ జూడఁ దివిరెను ముదితో౯. 44

క. నిటలతటసుఘటితాంజలి,పుటుఁ డై మర్కటవిభుండు పులకపటలము
ల్పటుగతి మేన నలమికొన, నటు చని రాము న్మహాత్ము ననుజాన్వితు౯. 45

సీ. కని పేద పెన్నిధిఁ గనినచందంబున, నత్యంతసంతోషి యై తదీయ
చరణారవిందసంస్పర్శితనిజఫాల, భాగుఁ డై యానందబాష్పసలిల
పూరితాక్షుం డగుసూరి సమీక్షించి, రాముండు గరుణాభిరాముఁ డగుచు
గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చికొనియె నంతరంబున సుమిత్రానందనునకు మ్రొక్కి

గీ. యగని మన్నన వడసె నయ్యవసరమున, రాముఁ డనుజన్ముఁ గూడి తోరమగునొక్క
చోట నాసీనుఁ డయ్యె వనాటుఁ డొక్క, వలనఁ గూర్చుండెఁ దనసచివవరు లలర.

క. తగ నెల్లవారుఁ దమఁ గొలు,వఁగఁ గొలువు వలరించురామవల్లభుఁ డపు
డయ్యగచరులు గొలువ నగమున, వగపునఁ గూర్చుండె దైవవంచన నకటా. 47

వ. అట్లున్న యవసరంబున సామీరి నుద్దేశించి రాముండు సూరి కిట్లనియె.

క. ఈతనికతమున భవదీ,యాతతవర్తనము లెల్ల మయ్యెను మారుం
బూతాస్మచ్చరితంబును, వీతాఘుం డితనివలన వింటివి నీవు౯. 49

వ. కావున. 50

గీ. మిత్రసత్పుత్రఖండితామిత్ర నీవు, మైత్రి గానియెడుమున యానపాత్రమునను
నిశ్చయంబుగ విపదంబునిధిఁ దరింపఁ, గోరినారము దగ నియ్యకొనుము దీని. 51

చ. అనవుడు సంతసించి తగ నట్టుల సేయుదు మీరు నేను స
ఖ్యనిరతి నున్నవారము ప్రియంబునఁ బొందొదవంగ మాను నేఁ జ
క్కగు నను స్తకార్యములఁ గంజహితాన్వయులార వేఱ వే
యనఁ బని యేల రాల నుదకాగ్రముల న్నిలుపంగఁ జాలమే. 52

వ. అని పలికి మహేంద్రుం డై రామచంద్రుం గనుంగొని. 53

క. తన జాతబుద్ధియై భూ,తన జాతహరించి మూర్ఖతను జరగినయ
ద్దనుజాతతజవనైన్యా,తనుజాత మడంచి మహిసుత న్వేసఁ దెత్తు౯.

క. అని సుగ్రీవుఁడు పలికిన, విని సుగ్రీవునకు రామవిభుఁ డప్పుడ యా
తనిచేఁ దనచే నిధ న్నా,తనిచేఁ దనచే నిడె న్మనం బలరార౯. 55

వ. ఇట్లన్యోన్యంబును జేతం జేయి వట్టి సఖ్యంబు గావించి మఱియు నగ్నిసాక్షికంబుగా నర్కసాక్షినందనుతోడ సర్వసాక్షి యగు శ్రీరాముండు మిత్రత్వంబు సంఘటించె నంత. 56

క. లీనగతిఁ దొల్లి నీ యూర్పులీనగ లీనగమున రుచు లీనఁగ వైచె
న్నాభనిభా యని జనకసుతానిక్షిప్తాలంకృతంబులు చూపన్ 57

క. ఆపోవనిమాడ్కిలఁ బు, డాపూపా వ్యసనమునను నాభూషణము
ల్చేపట్టి లక్ష్మణునకుం, జూపెట్టుచు రాముఁ డధికశోకాతురుఁ డై. 58

వ. మహీతలంబునం బరమమూర్ఛాపరవశుం డై పడి కొంతవడికిం గొండొక తెలిసి నిజచరణసమీపంబున దుఃఖాతిశయంబునం బొరలుచున్న సౌమిత్రిం గనుంగొని. 59

క. ధరణీతనయామధురాధరసంపర్కగతము సుధాబిందులు నాఁ
గరమునఁ దనరారె నీముఁ, గఱిముత్తియములను జూడఁగా సౌమిత్రీ. 60

క. వనగజకుంభంబులఁ బుట్టిన సతికుచకుంభముల నటించిన నీహా
రనికాయంబున కిటు వల, సెను జిక్కుపడంగ నెలవుఁ జెడ ఘన మగునే. 61

గీ. తగి తాటంకములధగద్ధగలు మాసెఁ, గాంచికాకింకిణీక్వణక్వణన ముడిఁగె
లలితమంజీరపటుఝుళంఝుళలు డొంకెఁ, దరుణి నెడఁబాసియున్న కతమునఁ గాదె.

క. ధృతి నగ లేఁతిఁ దాల్తుం, బతిఁ బాసితి ననుచు భూవిపతిసుత సేయుం
గతిమాలి భూష లిదె నా, గతి వైరాగ్యంబుఁ దాల్చెఁ గాంచితె వత్సా. 63

వ. అవి యనేకవిధంబుల వగచి వగచి పుత్తమిప్పట్టి నప్పుడె యొడఁబాసినట్టులఁ జిత్తంబుల నుత్తలంబు క్రొత్తసేయం బవనసుతుండు ప్రియవచనంబుల ననునయింప నూఱడిల్లె నిట్లు సుగ్రీవునితోడం బద్ధసఖ్యుం డై యావానరేశ్వరు నుద్దేశించి ప్రమదాతిరేకంబున. 64

ఉ. మిత్రతనూజ పాత్ర మగుమిత్రుఁడ వైతి పవిత్రగోత్రగో
త్రత్రుటనాశుప్రకటితప్రబలాస్మదమోఘపత్రుల
శ్శత్రులు నీకుఁ గల్గిన వెసం దునుమాడెద నన్నఁ బుణ్యచా
రిత్రుని రాముఁ గన్గొని హరిప్రియపుత్రుఁ డనంతతోషియై. 65

వ. సకరుణంబుగా నిట్లనియె. 66

క. నా కగ్రజుండు వాలి య, నాకోగ్రేసరుఁడు బలిమి నాయాలి రుమం
గైకొని వెడలఁగనడిచిన, నా కీగ్రావమున వేసనం బడరలసెన్. 67

క. నయ మొక్కింతయుఁ దలఁప క, నయమును బాధింప రామ నరవర యిట్టే
నయమును వెడి తిరిగెద వే, నయమును జూడంగ వాలి ననుపుము శక్తిన్. 68

వ. అని పలికి యంత నిలువక. 69

శా. నిష్కారుణ్యుఁ డగారిదారకుఁ డుర న్నిశ్శేషశుష్కద్రుమో
చ్చిష్కారుండ వనం దర్చి వెస భస్మీభూతుఁ గావించి ధా
నుష్కాగ్రేసర ఘుష్కరాత్ములను నన్నుం బ్రీతి వీక్షించినం
గిష్కింధాధిపతిత్వ ముందెదఁ గడుం గీశు ల్ప్రశంసింపఁగన్. 70

క. తనయాలి విడుచుఁ దఁడుం, దనయాలి న్విడుచు నతఁడు దశరథభూభృ
త్తనయా లేశంబును వే, తన యాలిక నుందురు గదా తలపోయన్. 71

వ. అని పలికి మఱియు నవ్వాలి ధైర్యస్థైర్యాదిగుణంబు లగ్గింపం దలంచి యిట్లనియె 72

స్రగ్ధరావృత్తము

మాయావిం దన్ని చించెన్ మదమునఁ బ్రబలోన్మాదుఁడై తన్నుఁ జీర
న్మాయావిం దుందుభి న్నామమున డంచి మడిపె న్మానవస్వామి నిత్య
మ్మాయావిశ్వంభరాభృత్స్వవ్యసననిరతుఁగా హాళి నం దోలె శ్రీరా
మా యావీరాధివీరు న్రఘునృపతనుజుని సామర్థ్య మెన్న న్వశంబే. 73

వ. మఱియు నబ్బలాధికుండు. 74

క. దుందుభి నడంచి దివి సుర,దుందుభులు సెలంగ శక్తితో నప్పుడ త
న్మందరనిభకుణపంబు న, మందరభసుఁ డగుచు వీచె మహిమాధికుఁడై. 75

వ. ఇట్లు ఋశ్యమూకాచలాగ్రంబునకు. 76

క. జోటుజోటు నెత్తు రురుల వీ,చుటయుం దప మాచరించుచుఁ జట్టిలుఁ డౌకఁ ద
చ్చోటనుండి కటువు లదరం, బటపటు వికటగతిఁ దంతపటలి గొఱుకుచున్. 77

ఉ. క్రొవ్విన నిన్నగాగ్రమునఁ గుణపం బిటుపట్టి వైచె నేఁ
డెవ్వఁ డతండు హారిజభవేశ్వరు లడ్డినైనఁ జచ్చుఁబో
యివ్విపులాధరాగ్రమున కెక్కినయంతన యంచు శాపమీ
నవ్విపులోగ్రవాక్యనిచయంబులు వింటిమి నేను వాలియున్. 78

వ. ఇవ్విధంబున మతంగమహాముని క్రుద్ధుండు శపించుటం జేసి యీనగంబున నున్న నన్ను మాయన్న వెన్నడింప వెఱచియున్నవాఁ డని పలికి యతనికిం దనకుం గలపూర్వవైరకారణంబు సవిస్తరంబుగా నెఱింగించి విషాదవేదనాదోదూయమానమానసుం డగు భానుసూను ననునయించి మేఘగర్జితసంకాశంబులగు భాషణంబులఁ బూవకులభూషణుం డిట్లనియె. 79

క. ఆలింపుము రవిసుత నీ, వాలిం గూడెదవు నిశ్చయంబుగ నిఁక లే
దాలస్యము జవవచ్ఛర,కీలిం గీలించి వాలి గీలిం గూల్తున్. 80

క. నేలఁ బడఁగూల్తు హరిసుత, నేలఁ బడంజాలి వానరేశ్వర నీచే
నేలఁబడం దల్పవ మిఁక, నేలపడఁతిఁగూఁతు వెదక నీపని సుమ్మీ. 81

వ. అని నమ్మికదోఁప నాడుటయు సుగ్రీవుండు జడస్వభావంబుగా నిట్లనియె. 82

క. మాయన్న మున్ను దుందుభి,మాయ న్నశియింపఁజేసి మడచిన కాయం
బోయన్న కదల్చినఁ జూ,మ్మీ యెన్నఁగవచ్చు వాలి నణఁచెద వనుచున్. 83

చ. అన విని నవ్వి రాముఁడు మహామహుఁ డందఱుఁగూడి వాసవి
ప్రణిహతదుందుభిప్రకటరాక్షసకాయము హేయమున్ గనుం
గొని చరణాంగుళి న్మొనయఁగోటున మీటి దచ్ఛవంబు యో
జన మగుదూరదేశమున శైలమున న్వడిఁ గూలెఁ గూలిచెన్. 84

క. కని విస్మయంబు మనమునఁ, బెనఁగొన వానరులు రాముఁ బ్రభుహర్షముగం
గొనియాడి రంత నారవి,తనయుం డిట్లనియె సద్భ్రమప్రమదమునన్. 85

ఉ. వాలి జవంబున న్విసరివైచినకాయ మితం డు గాలిచే
న్వ్రేలునఁ దూలమీటెఁ గడుపింత యొజన దిప్ప డెండుటం
జాలిక యయ్యె నాతని వధింప సమర్థుఁడవేని ప్రాని యీ
తాళము లొక్కకోల వసుధం బడఁ గూల్చినఁ జాల నమ్మెదన్. 86

క. అని తాళస ప్తకముఁ జూ,పిన దశరథనామకాశ్యపీనాథసుతా
గ్రణియుఁ గపీశుఁడుఁ దను మెచ్చ నల బాణంబు వింట సంధించి కడున్. 87

చ. లలి విడువం గలంబ మవిలంబగతిం దృణరాజస ప్తకం
బిలనొకపెట్టఁ గూలి పడఁ గేసి ధర న్విస దూసి ధారుణీ
తలమును దాసి భోగుల పదంబు క్షణంబున డాసి రాముఁ
మ్ములపొదిఁ జొచ్చె నెల్లరుఁ బ్రభూతభయాస్పదు లై కనుంగొనన్. 88

క. తాళములఁ గూల్చె వెసఁ బా,తాళముఁ గని బాణ మత్యుదగ్రత వెడలం
దాళక భూతంబులు బే,తాళంబులు భీతి నొందెఁ దత్క్షణమాత్రన్. 89

క. తాళ్ళు దెగ నింక దనుజుల,యాళ్ళయొడళ్ళఁ గల మంగళాభరణములం
ద్రాళ్ళు మనకాళ్ళసంకెల,త్రాళ్ళును దెగు ననుచు దివిజతతి దివి నలరెన్. 90

క. అప్పుడు తాళము లొఱఁగెడు,చప్పుడు కకుభముల నిండ సకలకుభంబు
లొప్పపుడు వాలిం దునుమక, తప్పఁ డితం డనుచుఁ దరణితనయుఁడు వొంగెన్.

వ. మఱియుం దశమస్కంధంబున నపరిమితానందంబు నొందె నయ్యవసరంబున. 92

శా. బంధూకారుణభానుసూనుఁ గని భూపాలుండు సుగ్రీవ కిం
ష్కింధాద్వారముఁ జేరి వాలి ననికిం గేల్గొల్పు మే నంతటు
న్నధాభార్గవుఁ డీతఁ డంచు జను లెంచ న్నింగిబాణంబున
స్కంధాంతర్నివృత్తి వాలి నెగుఁదుం గ్రౌర్యం బశాఖ్యంబుగన్. 93

క. అని సుగ్రీవుం బురికొల్పి నరేశ్వరుఁ డనుజాఁడును గలిసి ఖముఖ్యు
ల్గనఁ గొలువ నేగి తత్సవిధవనాంతరమున వసించె ధానుష్కుండై. 94

ఉ. వాలి నెదిర్చి పోరుబలవంతులు లే రనుచుం గడంగి దే
వాలినుతు ల్సెలంగఁ గను నర్వాతపప్రమరోజ్జ్వలద్యశ
శ్శాలి నొనర్పనో తరులచాటున డాఁగెను వాలిఁ గూల్పఁగా
కాలములోన రామునకు గ్రద్దమె వాలియు గూలి గెలియుగన్. 95

వ. అతనితనంతోషితస్వాంతుండగు రత్నమణిసంతతిఁ కిష్కింధానగరస్వామ్యంబుఁ
జేరి మీఱి. 96

ఉ. ఏ సుగ్రీవుఁడ వాహనోన్ముఖుఁడనై యేతెంచితి న్నిన్ను నీ
తా సుగ్రీవునొనర్పు చుధయుదాహ్వానంబుఁ గావింపఁ దా
రాసౌందర్యరతీమనోహరవదనప్రాగల్భ్యతాకర్ణ
వ్యాస గుం డమరేంద్రనందనుఁడు దుర్వారుండు దర్పోద్ధతిన్. 97

గీ. గ్రాలి విలయకాలకాలకాలుఁడు కేలి,గూల మొక్కమూలపాలు చేసి
వాలివచ్చుచున్న వాఁ డన నవ్వాలి, తాఁ కెఁ దనయమిత్రుఁ దరణిపుత్రు. 98

వ ఇట్లు. 99

క. తలపడ నిద్దఱయుఁడు ను,త్తలపడనిమనంబుతోడఁ దాఁకెఁ గరుణముం
దలఁపఁ దనివార్యుఁ డీతని,తలఁబడ నేయు వెస దశరథసుతుండనుచున్. 100

క. అబ్బలియు లబ్బరంబుగఁ, బొబ్బలిడుచు బొబ్బమొకము బొబ్బమొకంబున్
బెబ్బులియున్ బెబ్బులి యన్, గుబ్బలి గుబ్బలి యనఁ జలముగొని కవియంగన్. 101

క. దంతంబులఁ గఱచుచు నఖ,కుంతంబులఁ జీఱుచుం బ్రకోపు లగుచుఁ బ
ల్వంతంబులు వలుకుచుఁ దదు,పాంతఁబులశిలలు నలఁగఁ బదహతి నెసఁగన్. 102

ఉ. ఫాలము లెత్తివాఱి రిగిభ్రకుటిదారుణ కారణాహవా
స్ఫాలితబాహులై రిపువిఫాలతత్పరులై కరంబుల
న్వాలము లెత్తి త్రిప్పుచు నవారణ వారణ యుగ్మకంబు నాఁ
బోలి పెనఁగి రాప్లవగపుంగవు లింద్రదినేంద్రనందనుల్. 103

జ్ఞానము గాఁగ నెంతయుఁ బ్రయత్నముఁ జ్ఞప్తిరించి తెచ్చి స
న్మానముతోడ నుంచె సుమమాలిక నేలికకుఁ దపాలికన్. 117

వ. అంత. 118

క. కంధరధృతమాలికు ఘన, కంధరనిభదేహు రవిజుఁ గని రాముఁడు ద
ర్పాంధు భవదగ్రజన్ము సు, ధాంధఃపతిపుత్త్రుఁ బిల్వు మాహవమునకున్. 119

చ. అనవుడు సంశయంబు హృదయంబునఁ దోఁప నడంచికొంచు వే
చని విబుధేంద్రనందనుని సాహస మొప్పఁగఁ జీరెఁ బేరెలుం
గున సమరంబుసేయ నిదిగోఁ జనుదెంచినవాఁడ నంచు న
ధ్వని విని వాలి పంకజహితప్రభవు న్నపయింప నుగ్రుఁడై. 120

వ. చనుదెంచునెడ నెడసొచ్చి నఖనిజితతార యగుతార యిట్లనియె. 121

క. ఇను బలవంతుని పెనుబ్రా, పున వచ్చినవాఁడు తపనపుత్త్రుఁడు కాకు
న్నను బోరి పాటి మరలం, జనుదెంచునె కలని కిది విచారించు మెదన్. 122

క. హృదయేశ నామదిం గడుఁ, బెదరొందిన దదియుఁగాక ప్రియ కుడిదెస నా
కదరుచున్నది పోఁగూడ దనుచుఁ దద్వచనములు పెడచెవులఁ బెట్టెన్. 123

వ. ఇట్లనాదరించి హితోపదేశిని యగునమ్మత్తకాశినిం గనుంగొని. 124

క. తరుణి నను జయింపఁగ న, త్తరణిసుతుఁడె కాఁడు నిశ్చితంబుగ విను మి
ద్ధరణిఁ బ్రయత్నంబున నవ, శరణము నొందఁగ వలదె దైన్యం బైనన్. 125

క. బోటీ నీమాటలు నా, బోఁటిమహావీరు లెడలఁ బొసఁగ వనుచుఁ గో
పాటోపమానసుండు న, నాటవిభుం డరుగుదెంచె నర్కజుఁ దాఁకన్. 126

వ. ఇట్లు వచ్చి. 127

క. కోపరసం బొడ లూనెనొ, కో పరికింపంగ నవఁగఁ గుముదరిపుజుతో
నోపంద మద్భుజాహతి, నోపం దర వానె తలఁగు మోటమి వచ్చున్. 128

చ. అని వెస నాడి సౌరి నొకహస్తమునం గుదియించి యొంటికే
ల నతనిమస్తకంబునఁ బలం బెసలారఁగ గ్రుద్దినం గడుం
దనరెను జా వెఱంగి తనతమ్ముని గొంగిటఁ జేర్చి స్వాధికా
రనిఖిలభార మాతనిశిరంబునఁ బెట్టె నొకోయనం బలెన్. 129

వ. ఇవ్విధంబున. 130

క. గ్రుద్దిన నీడంబోవక, ప్రొద్దునిసుతు వాలి యురముఁ బొడుచు నిరువురుం
దద్దయు నద్దవిడిం జెన్నొద్దు లగుచు వ్రేటులాడుచున్నట్టితఱిన్. 131

క. సుగ్రీవుఁడు మాలాస్యగ్రీవుం డగుట వాలి సుపుడు దెలిసి భూ
పాగ్రణి సముగ్రదోఃప్రబలోగ్రుఁ డగుచు వాలిఁ దునుమ నూహించె మదిన్. 132

ఉ. రాముఁడు ధార్మికుం డురుశరంబు గుణంబునఁ గూర్చి భానుజుం
డీ మొనరించి యాతని వడిం గొని నచ్చినయట్టి వాలి శా
ఖామృగశాలి పేగురముఁ గాఁడఁగ నేసెఁ గలంబమున్ దగు
న్సోమకుచాటున న్నిలిచి నూటిదలిర్పఁగఁ గాలవేదితన్. 133

వ. ఇట్లు దృష్టిముష్టిసౌష్ఠవంబు వెలయం దెగవాఁపుటయు. 134

ఉ. తాళము లేడుఁ గూల్చి వసుధాధరముం బెకలించి మించి పా
తాళముఁ జొచ్చి వచ్చినకదంబము వాలి యురంబు దూసిపోఁ
జాలఁ నిల్చు టెంతయును జానెసఁగ న్వెస వానిప్రాణవా
తూలము దీల్చుచున్న దనఁ దోయజమిత్రతనూజుఁ డార్వఁగన్. 135

వ. అంత. 136

చ. సరభసవృత్తి రాముని పృషత్కము రంబున గాఁడినం దివీ
శ్వరతనయుండు హా యని దివాకరనందను వీడి ధారుణీ
ధర మురుభీకరస్వనహతం బయి కూలిన భంగి వాలి గం
హారిదిగఁ ద్రుంగ వ్రాలి తదనంతర మాన్పఁ గాంచి వీనుఁగై 137

ఉ. తార హితంబుఁ దెల్ప నతిధార్మికుఁ డారఘురామమూర్తి ని
ష్కారణ మేల నాపయిఁ బృషత్కము వేయ నటంచుఁ దద్వచ
స్సారము నీవు చేసి పరమక్రియ వచ్చి త్వదీయకైతవ
స్ఫారత నిట్లు పాలయితిఁ జావఁగ నీ కిది పౌరుషం బొకో. 138

క. మించిన ధార్మికుఁడవు కడు వంచన గావించి వృక్షవారము నడుమం
బొంచి నను గూలిచితి వెం,రించి నమం గెల్వ నవ్వరించికి వశమే. 139

వ. అది యట్లుండనిమ్ము. 140

సీ. నను జేరఁ బిల్చి తమ్ముని రాజ్యమున కేల, పాపి వాఁడ వటంచుఁ బల్కవైతి
వతనికి నీకుఁ బోరిత మెట్టు లయ్యె ము,న్నని తెలియంగ నన్నడుగవైతి
వతని కీవా రాజ్య మంత యు నొసఁగిపొ,మ్మనవలి కీ వనుచు న న్నాడవైతి
వినజునితో వైర మేల నీ కని సన్న,తింప సఖ్యము సంఘటింపవైతి
గీ. వింతయేటికి న న్నెదిరించి పోరఁ, గ్రూరనారాచమునఁ బడఁగూల్పవైతి
వకట రాజ్ఞ సమగ్రుఁడ వయ్యుఁ బొంచి, ప్రమదఁ జేసితి విప్పు డేనుందు నిన్ను. 141

వ. అని మఱియు నతనిసాహసాదిగుణంబు లగ్గించి విలపించుచు. 156

క. ధరణిం బడి పొరలెడు తఱి, వరవరుశిర మంకసీమ సంధించి తదీ
యరమణి నిజాశ్రుకణసం, భరితానను జేసి మిగుల బరితాపమునన్. 157

చ. కనుఁ గనువిచ్చి యోప్లవగనాథ కనుంగొను మేను దార బా
రను నను జూడ నీకు మది రాదు వి ష్టసుభాగ్య నౌట నీ
తనయు ననంగదర్పవిజితస్ఫురదంగవిలాసు శత్రుసై
న్యనికరభంగదు న్మణిమయాంగదు నంగదుఁ జూడు మర్మిలిన్ 158

క. కను విచ్చి ననుఁ గనుంగొను, మని యఱచుచు నంగదుఁడు పరాంతికభూమి
న్వినుఁ బొరలుట యువరాజ్యం, బున కని నను బూన్చు మనుచు మ్రొక్కుటయె పతీ.

క. ఇనజుఁడు సుగ్రీవుఁడు నా, కనుజుఁ డగుట యతని వైభవావ్యాప్తి సేయ
న్మనుజానిచేఁ జావవలసెఁ, జనునే యెవ్వరికి సహజశత్రుత్వంబుల్. 160

వ. అని ధర్మంబుఁదోఁప నాడి. 161

గీ. మఱియు శోకాంబురాసినిర్మగ్న యగుచు, హస్తయుగ్మకమున నిజమస్తకంబు
మోదికొనుచును దనతొడమీఁద నున్న, ధవునితల డించి తార రాఘవునిఁ గాంచి.

క. ఒకతోఁ బోరకు నా వరు, నురుతరుషండంబులోన నొదిఁగి యొదిఁగి సం
గరధర్మకోవిదుండవు, ధరణింబడఁగూల్చితివి విధాత్సనిచెయిదిన్. 163

ఉ. నీసతి సీత నెత్తికొని నింగిఁ జెలంగుచు నేగ రావణుం
డానుదర్వృత్తి నాసురగణారి వధింపక నీవు నావిభుం
జేసితి కాలగోచరుఁగఁ జెప్పెడి దేమి యొకండు నేరమిం
జేసిన శత్రు వేలొకనిఁ జేసితి సామ్యము చెప్పినట్టుగన్. 164

క. మిత్రతనూజున్ ఘనుఁ డగు, మిత్రునిఁగా నెంచికొని యమిత్రత్వంబుం
గోత్రరిపుసుతునిపై నో, ధాత్రీశ్వర మాంపు టధిక ధర్మమగాదే. 165

వ. అని పలికి యంత నిలువక. 166

క. పాలనునిరీతి నోభూ, పాలక భార్యాసుతులకుఁ బాపితి విపుడీ
వాలినిఁ జెప్పెడి దేమీ, నాలిని బిడ్డలను గూడి యుబరుదె సుఖివై. 167

వ. అని పలికి వెండియు ననేకవిధంబులం బలవించుచుండె నయ్యవసరంబున. 168

చ. అదరుచు వాలి యాలిఁ బ్లవగావలి మేదిని వ్రాలి యున్నయం
గదుని మనోహరాంగదుని గన్గొని వేదనపేర్మి గాఢగ
ద్గదిక నెలుంగు రాలుపడఁగా ననియె న్వనుఁ దేల చాలనం
గదదురపిల్ల నెల్లకుఁ గాలమునూఁడి, జేటు తప్పునే. 169

క. ఇఁకఁ బుత్త్రసత్కళత్రాదిక బంధుసహోదరప్రవృత్తతర మగుపొం
దిక నాకుఁ గడచనియెఁ గుం,దక ధైర్యము నూఁదుఁడీ మనమ్ముల మీరల్. 170

వ. అని పలికి తనవారి నెల్లం గలయం గనుంగొని. 171

ఆ. మున్ను నన్నుఁ గొల్చియున్న చందంబునఁ, దపనప్రభుత్త్రుఁ గొల్చి తదనువర్తు
లగుచు మెలఁగుఁ డతఁడు దగవరి యశనినిం,దించి నాదె చావుఁ దెచ్చికొంటి 172

వ. అని పశ్చాత్తాపపరవశుండై. 173

క. దారం దారను నఖజిత,తార స్మితకాంతిదంతతార స్మణిమం
జీరం జేగంజీరిక,భీరోత్తుల వగపు మాన్చి ప్రియు మిగులోత్తర్. 174

మ. కొడుకుం గౌఁగిట జేర్చి మోహమునఁ జెక్కుల్నొక్కి ముద్దాడి యొ
క్కుడు మోహంబున వాలి యిట్లనియె నీకు న్నేమకం దంద్రిపెం
దొడవై నాడట తీర్చె నిన్నుఁ గనుసంతోషంబు నాకింకటం
గడతేరెం గలనాల మెవ్వరికి నేకాకారతం జెల్లునే. 175

క. అని మతిఁ దనయు నుచితవచనముల నూరార్చి బాష్పసలిలోద్గముఁడై
తనయుదుర మిగుల వగ నొం,దునలి హితసుతున కంగదుం జూపి దయన్. 176

చ. అనుజుఁడ చింతఁ దక్కు పరమాదరణంబున నాదు వాక్యము
ల్వినుము మునం దుర్వివేకినయి వేయువిధంబుల నిన్ను బాధవె
ట్టినఫల మీవిధంబున ఘటించె నటుంచుము దాని వీని నా
తనయునిఁ బూర్వమత్కృతనిబంధముఁ దలఁపక ప్రోవుమీ దయన్. 177

వ. అని తనయునకుం దగినవచనంబులు వెండియు నుపన్యసించి యొప్పగించి తమ్ముఁడా నీకు సర్వంబునకు రాముఁడె కలం డని నిశ్చలాంతఃకరణంబున రామచంద్రున కభిముఖుం డై. 178

క. కలలోనెవ్వనిపదములు, దలఁచిన నఘచేతి వగుచుఁ దనరుచు నుండుం
గలలోకము లప్పదములు, గలలోకైకనుతు నిన్నుఁ గంటి న్గంటిన్. 179

మ. అని తద్దివ్యపదాంబుజద్వయమరందాసక్తహృద్భృంగవ
ర్తనుఁడై తృష్ణ నిరాకరించి భవహర్తా రామ శ్రీరామ రా
మ నను న్సత్కరుణాకటాక్షమున సన్మానింపు మంచుం దొరం
గ నొగిం బ్రాణములేనఁ బోర్లుచున సుగ్రీవాగ్రజుం డొక్కటన్. 180

వ. ఇవ్విధంబున సకలసద్గుణశరధి యగుదాశరథిశరపాతపాతితపాతకుం డగునతండు.

సీ. ఫలములు లాకులు దిని దిగంబరతఁ దిరుగు, పట్టిన చారు లేగడు ట్టిగతికి
ఫలములు లాకులు దిని దిగంబరతఁ దిరుగు, పట్టిన చారి యయ్యుఁ దానపుడు చనియె

వ. ఇట్లు దివిజరాజనందనుండు దివిజరాజరాజధానిం బ్రవేశించుటయుం బ్లవంగాంగనలు నింగి నగుల నగలం బొగిలి రందుఁ దార శతారాయుధనందనుం దలంచి. 183

క. భిదురనిభం బగు రామ, ప్రదరం బుదరంబుఁ గాడి పడిపోయితివా
పద రవిసుతుఁ జూడ్వఁగ నా, మది నపగతశూర ఘూర్ణమణి యని తలఁతున్. 184

క. ఆహార మెడలి కడు ముక్తాహారత నివ్విధమున నలఁగితె యిచ్చో
నాహా నా బాహాబల, మాహవమున నగటుఁ జిత మయ్యె నికటా. 185

వ. అని పతియు నతినిగణంబు నగ్గించి పోవయు మున్న సమయంబు. 186

ఉ. రామునియాజ్ఞ లక్ష్మణుఁ డరాతిభయంకరు నాంగదేయు ను
ద్దామునిఁ బురస్కరించుకొని తారను దారకుమారకుం గపి
స్తోమము వర్ణన దనని సాం పగు మాటల నూఱడింప సు
త్రామతనూభవున్ హితకృతాముఁ దహియించుపూనికన్. 187

వ. సుగ్రీవుం డంగదుం బురస్కరించుకొని సమస్తవానరచమూసమపేతుండై సముత్పాటితరామసాయకుం డగు వానరనాయకుం దగ్గటి దగ్గుత్తిఁ బట్టి యేడ్చుచు నొకింతసేపునకు ధైర్యంబు చిక్కంబట్టి యుష్ణాపబుఁ బవిత్రజలపరిప్లుతంబుఁ గావించి గంధమాల్యాద్యలంకరణశోభితంబుఁ గా నచిత్రవాహనంబు నిడి బలవంతు లగు బలీముఖప్రకరంబు మోచికొని రాఁ బ్రేతభూపరిసరకాననంబునకుం జనియుక్తక్రమంబు శిబిక డించి చందనాదికసౌరభపదార్థసంచయంబుఁ గూర్చి పేర్చిన శోకబునం జితి పేర్చి యప్పాదుపై వాలికళేబరంబుఁ జేర్చి యప్రదక్షిణంబుగాఁ దిరిగివచ్చి శిరఃప్రదేశంబున నంగదప్రయుక్తయుక్త బగు నప్పార్చిఁ బ్రవృద్ధార్చిఁ గావించి విరక్తియుక్తు లాడంచు నచిత్రక్రమంబున నగ్నికార్యంబు దప్పెనంత వానరవధూవిలాపంబు లొక్కుమొగిం దిక్కులఁ గ్రమ్ముకొనియె నందుఁ దార మనోవల్లభు నుద్దేశించి. 188

ఆ. అతులసుందరాంగయుతుఁడ వగుచుఁ దార, రతిఁ గరంచి సంగరంబునందు
హరికుమార భస్మ మయిపోయితివె యక్క, టకట రాజమౌళి యంబకాగ్ని. 189

క. అని పలికియుఁ బెక్కుదెఱఁగుల, వనిమిషపతి సుతునిఁ గూర్చి యార్చెడు తారం
గొని పంపాతీరమునకుఁ, జని సుస్నాతు లయి రద్రిచరవరు లెల్లన్. 190

వ. ఇట్లు పవిత్రస్నానంబులు గావించి. 191

క. వలయుఁ దిలోదకములు నిశ్చలభక్తి నొసంగి షోడశమహాదానం
బుల నన్నదానములఁ దృప్తులఁ జేసిరి బ్రాహ్మణులఁ గపులఁ దగురీతిన్. 192

వ. పురియుం బరమశోభనంబుఁ గావించి రప్పురవరంబు సమస్త సంభార సంభరితంబును వారాంగనా నృత్తగీత విచిత్రంబును మంగళ తూర్యరవ సంగతంబును సకల జననయనానంద కరంబునై కరంబు విలసిల్లుటయు. 204

ఉ. అంతనఁ గాంచనసంతతిసమ్మదంబున నంబుజమిత్రపుత్త్రి న
త్యుత్తమనోహరాంబరనవాభరణాన్వితుఁ బుష్పమాలికా
క్రాంతగళప్రదేశు నొడికంబుగఁ దోడ్కొనివచ్చి తత్సభా
భ్యంతరసీమ పీఠమున నాతనిఁ గూర్చి రమాత్యు లొప్పుగన్. 205

క. చామరము లిడిరి వేల్పుం, జామల కెనవచ్చు ప్లవగచంద్రముఖులు ని
స్సీమాభిరామ భూషా, స్తోమ ఝళంఝళలు సన్నుతులు సేయంగన్. 206

గీ. తొలుత రాఘవుఁడు కృతప్రతిజ్ఞుఁడయ్యెఁ, గాన నీవును బ్రత్యుపకారపరుఁడ
వగుమనుచుఁ బత్తురిసరుఁ దెల్పనరుగుదెంచె, మిత్రుఁడను నొప్పెసఁగనీతచ్ఛత్రమంత.

వ. పట్టాభిషేకసమయం బాసన్నం బగుడు హనుమజ్జాంబవదాదు లవనీసురసహాయులై పుణ్యాహవాచనపూర్వకంబుగా హోమవిధి యథావిధి నిర్వర్తితంబు గావించి.

చ. కలువహారంబు లంబువులు గల్గి భూరిసువర్ణకాంచనో
జ్జ్వలకలశంబు లందికొని వానరరాజ్యవరాభిషేచనం
బలవడ నాచరించిరి మహాగుణశాలికిఁ బ్రొద్దుమాలిక
య్యర్ఘులు రామచంద్రుని దయామృతముం జిలికించునట్లుగన్. 209

క. అమరనవరాజతతికి నయ్యమరు లవరనాథునిఁ గ్రహాధికృతికి న
ర్యము మున్నభిషేకించిన, క్రమమున సుగ్రీవు నఖిలకపిపదమునకున్. 210

క. అభిషేకం బొనరింపఁగ, నభిషిక్తుండయ్యె భాస్కరాత్మజుఁడు కపి
ప్రభుఁడగుచుఁ దారకామధ్యభాగభాగమృతకిరణు నాకృతి నంతన్. 211

గీ. సకలవానరులకు రామచంద్రుఁ డనుమోదముగాఁగ నప్పుడ యంగదునకు
విదితమగు యౌవరాజ్యసంపదకు నర్హుఁ, జేసి పట్టాభిషేకంబు సేసెఁ గరుణ 212

వ. ఇవ్విధంబున గోత్రశత్రుపుత్రునకుం బూజ్యయౌవరాజ్యపట్టాభిషేచనం బాచరించి ప్రాజ్యసామ్రాజ్యంబు వడసి మార్తాండనందనుండు రెండవ చండకిరణుం డనం బ్రజ్వరిల్లె. 213

ఉ. అత్తఱి వానరాగ్రణి మహోన్నతలీ సచివప్రయుక్తుఁడై
మత్తిలవెల్ల వెల్లన సభాగ్యుఁడై ప్రవరించి రాజ్యసం
పత్తిఁ గరంబు రంగిలి నృపాలతనూభవదివ్యదర్శనా
యత్తపదబ్జుఁ డబ్జహితాత్మతనూభవుఁ డుల్లసంబునన్. 214

క. చనిబద్ధాంజలిపుటితా, ననుఁ డున్నయవినయాభయవినమితశిరస్కుం
డును నగుచు రామచంద్రుం, గని ప్రమోక్కి యతండు ప్రీతిఁ గౌఁగిటఁ జేర్చెన్.

వ. అపరిమితానందభరితాంతఃకరణుం డగుచు నతని కిట్లనియె. 216

క. ప్రతిన నెఱపితివి నీవు, ప్రతిహతబలశాలివగుట బ్రతికితిఁ గృపనన్
బ్రతిపాలింపుము ప్లవగ, ప్రతతి ప్రాప్తించు నీకు బ్రమదం బెదకన్. 21.

చ. అనవిని సంతసించి నలినాప్తతనూజవుఁ గాంచి రాముఁ డి
ట్లను బురికిన్ని పొమ్ము శరదాగమనమ్మున నమ్మ ధారుణీ
తనయను వార్తఁ దెమ్ము విదితమ్ముగ నిప్పుడు వానకాలమం
దఘు వసింతు సోదరసహాయత నిగ్గిరిగహ్వరంబులన్. 218

క. భగ్నకజనపదయనయనో, త్కృష్ణయవన్యబులు వనఁగాఁ గపిసేనా
ఘుష్టితభూభాగుఁడవై, హృష్టమ్ముగ నరమ్ము కార్తికాగమనమునన్. 219

చ. అనుఁడు దదాజ్ఞ వానరసహస్రసమేతుఁ డగుచు గా మహోత్సవం
బునఁ బురికేఁగుదెంచి కపిముఖ్యుఁడు భాస్కరనందనుండు త
జ్జనకను తారవేమణకుఁ జాలినమర్కటకోటి. బిల్వఁ బం
చి నిఖిలమంత్రిపుంగవవిశిష్టసహాయము పెంపొనెంతయున్. 220

క. రమణీమణియగు తారా, రమణీప్రియుఁడగుచు భాస్కరసుతుఁడు మెఱసె
న్మను నధికభూమణ మనో, రమఁ గూడి ప్లవంగరాజ్యమున కధికృతుఁడై. 221

వ. ఇట్లు సంప్రాప్తమనోరథుండై మహాసుఖంబు లనుభవించుచుండె నంత నక్కడ రాముండు సౌమిత్రిద్వితీయుండయి ప్రవర్షణగిరిబిలంబుల సీతావియోగసాగరంబు నిస్తరింప నుపాయంబు గానక సంతప్తచిత్తుండై యుండె నంత. 222

క. కాలము నందోఁచెఁ దొలకరి, కాలము నిబిరీసకాళికా కాలము భే
కాల మతిరిక్తశైత్యము, సూలము పాంథజనములకు శూలంబగుచున్. 223

క. ప్రాగ్జ్యోగత బహుళాఁ జలముజ్జాలాపిహిత ముగత మోయయుచు చతు
ర్దిగ్జాలిన్యము వరదహి, భుజ్జాల్యస్ఖ వర్షబులు వృపాలు ప్రవహించెన్. 224

చ. ప్రబలిన లాహకంబులు నభంబున ఘూర్ణిలుచుం దటిల్లతా
ప్రబలత లోకమెల్లఁ దిమిరస్థగితంబుగఁ జిచ్చుఁ ప్రదే
శబలభిదుగ్రచాపవిలసత్ స్థితియొప్పఁగ వృష్టిఁ గల్గఁజే
సె బహుళభూమికోటులఁ గృశింపఁగఁ జేసినతాప మాఱఁగన్. 225

క. వెనుమిట్టిది పల్లంబిసె, యనిజనముల కేప్పరి ప నవళింబుగ వృ
ష్టి నిరంతర ధారాపాతమున భువనంబు భూమ్యనేకమయమ య్యెన్. 226

సీ. ద్యోధునీనిర్ఝరల పాథోంతరపరిస్ఫుటత్పుండరీకషండంబులనఁగ
వ్యోమకేశునిజటాపూర్ణ్యహాభోగంబులఁబూసిన వెలిబూది పూఁతలనఁగ
ఖచరులు దడిపోవఁగా నాకసంబున నాఱఁగట్టిన తెలిచీరలనఁగ
దొలుకరిఁజీవనలమానసముఁబాసి పఱతెంచు రాయంచ బారులనఁగ
గీ. మించుపగవాని గర్భీకరించినట్టి, నింగిజవరాలిగండపాండిమములనఁగ
జకితవాతఃజాతసంజాతపాండు, రాభ్రములు మించెఁ దచ్ఛరదాగమమున. 238
గీ. భూసతీస్తనగిరుల మున్నూసికొన్న, లలితకస్తూరికాపంబు దొలఁచిపునని
తాభ్రమోజితచంద్రంబు లెఁడెనఁగ, నలరెను సితాభ్రములుప్పొంగ తాభ్రములను. 239
క. అడఁగె న్భేకంబుల రొద, లడిగె న్నేచుంబులంచ ఖజ్జనములం
గడఁగె న్విఘుండు శరములు, గడిగె న్పృథుఁడేచి విరహాగణముల నెఱుకన్. 240
చ. కలుషతఁ దొల్లితీరములఁ గాచిన భూమహాకోటిఁగూల్చి త
త్కలుషతనిట్టులయ్యె ననఁగా నదు లెంతయు నిర్మలంబులై
కెలకెలఁబొఱఁజొచ్చె నది పంతయుసంజన దెట్లుఁ గాంచనో
ర్ములుగలవారికిన్ ఘనతయెచ్చునట్టు లొగ్గఁ బాడియే. 241
వ. అంత. 242
ఉ. దక్షిణగాములైన జలదంబుల కొక్కధరావరుండు ప్ర
త్యక్షముగాఁగ స్రుక్కుచుఁ బ్రయాణము మానినవో యనంగఁ బ్రా
గ్దక్షిణభాగమందున నగస్త్యమహోదయమైన మేఘమా
లాక్షయమయ్యె నంబర మహర్నిశమొప్పె శరత్సమాదృతిన్. 243
సీ. మతియుఁ దచ్ఛరదాగమంబంతి నంతరిక్షముపోలె రాజహంసలఁ బెనంగి
పక్షిరాడ్ధ్వజభూరివక్షఃస్థలముపోలె లాలితకమలానుకూలమగుచు
ధర్మాత్మభీతుసభాస్థానంబుపోలె నలక్షితపంకకలంకమగుచుఁ
బ్రమథనాయకునిశిరఃప్రదేశముపోలె విమలభాసురదీవివిహితమగుచు
గీ. డంబుమీఱెడు చంద్రమండలముపోలె, నధికతరచారుకువలయహర్షమగుచు
నట్టిజలదాంతసమయసమాగతప్ర, చిత్రతరపాత్రశారదరాత్రులందు 244
క. వెరవరి లోకేశుఁడు త, స్కరజారవ్రజములనెఱు చలిచీమలపై
మురుగతిఁ జల్లినభ్రుగ్గను, కరణిఁ గువలయాను మోది కౌముది ప్రబలెన్. 245
ఉ. అట్టిశరన్నిశన్ హిమకరాతప మాత్మకు నార్తిగూర్పఁ దోఁ
బుట్టువుకేలుపట్టి రఘుపుంగవుఁ డాలి విరాళిఁదూలి న

స్ఫుట్టులిశింపఁ జొచ్చెఁ దతిభీకరు లీస్మరవారిజారులీ
పట్టుఁ బ్రాణముల్విసుతుఁ బ్రాణములేటికి సీతఁ బాసితిన్. 246

వ. అనిపలికి, చంద్రోపాలంభనపరుఁడయి లక్ష్మణుం గనుంగొని. 247

క. ఇతఁ డమృతకిరణుఁడే కాఁ, డతివిషముఁడు గాకయున్న ననుఁ జూడ దారా
యుతుఁ గానినన్నుఁ దారా, న్వితుఁ డేఁచం దగునె యామినీచరవృత్తిన్. 248

క. తగ నెందుం గువలయహితుఁ, డగు రాజుకళాప్రపూర్ణుఁ డగుఁ గాక కడుం
దెగనిక్కళత్వ మిమ్మల విబుధగుణద్వేషి కగుఁ గాని తక్కె నెచెపుమా. 249

క. అకలంకుఁడ సన్మార్గుఁడ నకుటిలుఁడ నటంచుఁ బొంగు నమవసఁ గ్రుంగున్
సకలంకుఁ డసన్మార్గుఁడు, సకుటిలుఁడుం గార్యుఁ డితని చంద మెఱుఁగమే. 250

వ. వీని రాకపోకలు జనంబు లెఱుఁగరే యని వెండియు. 251

ఉ. ఈతఁడు చోరకోటికి ననిష్టుఁ డటందురు కొంద ఱీతఁడే
ఘాతయొనర్చుఁ బాంధుల నకారణ విమ్మిహిరాంశుఁ డెంతయున్
ద్యోతకుఁ డంచు లోకములు దూఱఁగ నించుక సిగ్గునొందఁడా
పాతలపోయఁ గార్యుఁ డగు నాతఁడు లజ్జ నెఱుంగఁ డేకదా. 252

వ. అని యివ్విధంబున. 253

క. వనజారిదూఱి మీఱిన, జనకసుతా విరహవహ్ని సమునీద్ధృతి న
మ్మనుజేంద్రుఁ డంతఁ గందర్పునిఁ గూర్చి విశేషరోషపూరితముఖుఁడై. 254

క. తుంటరులఁ జిలుక తేజియు, నంటినఁ గనుఁగందుపూవుటమ్ము లెవరికిం
గంటఁబడని సచివుఁడు మున్, కొంటి నుసటికంటిమంటఁ గ్రాఁగిననీకున్. 255

క. అట్టివిలుకాఁడ వీవే, యట్టుఁ విరహిజనహృదయపాటనమునకుం
దిట్టవయితి వూహింపఁగ, నిట్టివిగా వే విధాతృకృతచిత్రంబుల్. 256

చ. కటుకటపూవుబాణములఁ గమ్మని విల్లునఁ దాల్చి చిక్కితే
రటునిటుఁ ద్రిప్పుము న్హరినహోయతి నెంతయుఁ దర్పకుండవై
యటుఁ దపం బొనర్చుచు ధరత్మజఁ బాసిన రాజమౌళిపైఁ
బటుగతి నేలపోయెదవు భస్మముగాఁగల కంబకాగ్నిచేన్. 257

వ. అని పలికి నిట్టూర్పునిగుడించి. 258

క. తమ్ముల శోకమ్ములఁ గుం, దమ్ములు నందమ్ములగుచుఁ దనరారెడుచోఁ
దమ్ముల నేయకు ననుఁ గుసుమ, దమ్ముల నేయుము మటులైనఁ దనువుఁ దొఱఁగుదున్.

క. అనిమతియయి నిర్వేదంబున, వనజారిన్ దూఱిదూఱి వసుధేశుఁడు మె
ల్లనిచల్లనిగాడుపుఁ బి, ల్లతెమ్మెరన సోయవకఁ జలంబటిపలుకున్. 260

ఉ. తావులు గ్రుమ్మరించెదు లతాభవనంబులఁ దూఱివచ్చు గ్రొ
మ్మావుల నీడకేగు నట మానికొలంకులఁ జేరఁబోవు న
వ్వావెడలుం బరిస్ఫురితనూవరజంబు గలందు మేనసీ
తావిరహార్తి రాముఁ డొక తావునఁ గాల్నిలువంగ నేరమిన్. 270

వ పరితాపంబు నొందుచుం బరిభ్రమించుచుఁ బరవశత్వంబు నొందుచుండు నుచితవచన
శిశిరోపచారంబులఁ గొంత సేదదేర్చి లక్ష్మణుండు. 271

ఉ. ఏలపరిభ్రమించెదు మహీశ మహాశనికల్పతావకా
భీలశరావలీజ్వలనభీమశిఖోష్ణసహిష్ణు లిప్పుడీ
ర్వ్యాలురు సత్యరాష్ట్రగిరిపాలురు గా రటులైన సాధ్వి
బ్భూపలలనాకుమారి నృపపుంగవ ముందఱఁ దెచ్చియుంచరే. 272

ఆ. అంతయేల యినజుఁ డాంజనేయాంగద, జాంబవత్ప్రముఖ్యశాఖాచర
భల్లుకోత్తములను బటుగతిఁ బిలిపించి, సీతవెదుక నాజ్ఞసేయకున్న. 273

చ. అనుటయుఁ గ్రోధశోకవివశాత్ముఁడు రాముఁడు లక్ష్మణుం గనుం
గొనికనుఁగొంటివే ప్లవగకుంజరు వాలి వధించి తన్మహా
ఘనవిభవంబు లిచ్చుటయుఁ గైకొని దుర్మదమెక్కి నింతయున్
మఱలఁ దలంపఁడయ్యెను రుమాపతి గోతుల నమ్మఁజెల్లునే. 274

క అనిపలికి మఱియు నతఁ డిట్లనుఁ గిష్కింధాపురమున కరిగి యతఁడు భూ
తనయారయఁ బూనుట మదిఁ, గని సైఁపము కాకయున్న ఖండింపవా. 275

మ అని యిట్లానతియీ రయంబున సుమిత్రాతోకోద్భవుం డేగి కాం
చె నభోల్లేఖిశాఖిశాఖాఫలరసస్వీకారసమ్మోదన
ర్తనశాఖామృగశాబకోత్కరయుతాక్రాంతోరుకాంతారము
న్ఘృణిస్తోమజితాంధకారమును గిష్కింధాపురీస్వర్గమున్. 276

వ. కని చేరంబోవు నవసరమ్మున నచ్చటి ప్లవంగపుంగవులు తమలోన. 277

మ. అహిమాంశుండు మహానురాగమునఁ బుత్రాలోకనాపేక్ష ని
మ్మహిఁ గేతెంచెననంగ నొప్పెడు జగన్మాన్యుం డనంతాభరో
ద్వహనాశక్తసమర్థుఁ డీతఁడని తత్సౌందర్యగాంభీర్యస
న్మహిమాలోకనదర్పంబులను సంభ్రాంతాత్ములై చెచ్చెరన్. 278

క. చని సుగ్రీవుం దారా, వనితాప్రియుఁ గాంచి చెప్పిరి వానరవరు లి
ట్లని రోదినాయకసుత, వినుమొక విన్నపము విన్నవింతుము తెలియన్. 279

చ. అని పదివాలిఁ దోడ్కొని యహర్పతినందనుఁ డాసమానుతోఁ
జనియెను రామునిం బ్రథితశాత్రవగోత్రవిరామునిం గనుం
గొని యటు లేగి రాఘవునకున్ హృదయంబునఁ గ్రోధశాంతికై
మను మును లక్ష్మణుం గనిచి మోదముతో నతఁ డట్లొనర్పఁగన్. 293

వ. మోడ్పుఁగేలు ఫాలంబునం గీలించి. 294

క. పదపడి శిరమునఁ దత్పదపద్మంబులకు మ్రొక్కి ప్రస్తుతు లొసఁగ
న్మది యదరుమండ నప్పుడ, యద్యుదితేందుసమానముఖుఁ గొమ్యావఁ బలికెన్. 295

క. శాంతగుణాకర చతురా, శాంతంబుల నున్న గాద్రివరముఖ్యుల నే
నింతకుమును పిలిపించితి, సంతోషము నొందు మిపుడ చనుదెంతు రనన్. 296

వ. నీదయాళుండు రఘునందనుండు మహాసంతసంబునం దపవనందనుం దదమాత్యులం గనుంగొని కనుఁగొనలఁ గరుణారసంబు జాలువాఱ వారలం గలపికొనియుండె నంతం గతిపయదినంబులకు. 297

శా. లాంగూలోచ్చలనోదితశ్వసనలీలాధూతధారాధరో
త్తుంగుల్గా గలవీర్యదప్పురి లధికోద్యుక్తు ల్మహీభృన్మహా
భీలాంగు ల్నఖగాయుధోద్ధతులు నిర్భీతు ల్చతుర్దిక్కులన్
లాంగూలోత్తము లేగుదెంచిరి మనోల్లాసంబు సంధిల్లఁగన్. 298

వ మఱియును. 299

క దాశరథులకుం గిష్కింధేశునకు న్నుతపం జహీశతనొందం
గీశులు సనుదెంచిరి నాకేశసమానబలు లవని యొసంగ శరణికన్. 300

క. గిరినిభుఁడు గధమాదనుఁ, డరిపంకజమత్తకుంభి యగు గ్గజుండు
న్హరిక్రముండు కేసరి, యరుదెంచిరి ప్లవగసైన్యులై వేర్వేఱఁగన్. 301

సీ. అపరిమితాద్రివరానీకములు గొల్వ, నరుదెంచెఁ గుముదాఖ్యుఁ డనువతండు
కొలఁదిపెట్టఁగరాని కోఁతియాఁకలతోడ, నరుగుదెంచెఁ గవాక్షుఁ డనువతండు
గణుతింపరాని వృక్షచరభటాలిఁ దోడ్కొనివచ్చెను శరభుం డనువతండు
లెక్కయిడఁగఁజాలలేని వానరులతోఁ, జనుదెంచె వడిఁ దారుఁ డనువతండు

గీ. లలి వసుఖ్యాతకీశబలసహితముగ, నర్థి నేతెంచెఁ గుంజరుం డనువతండు
వరయ నంతింత యనరాని తరుచరాలి, తనరఁ గనుపట్టెను పనసుం డనువతండు. 302

క. వివిధవిపినాటసైన్యపరివృతులు పరిమధనులు నపరిమితబలులు వ
చ్చి విడిసిరి వినతమైంద,ద్వివిదులు నలనీలదధిముఖప్రముఖుల్. 303

చ. అతిబలు లుగ్రవేగులు మహాశనికర్కశదీర్ఘబాహు లు
న్నతతను లన్యసైన్యవిపినజ్వలనాకృతు లిద్ధకేసరి
శతబలులైన వృషభగవాక్షు లెంతయుఁ దన్నుఁ గొల్వఁగా
శతబలి వచ్చెఁ బద్మహితసంభవు పంపున బంపొనర్పఁగన్. 304

క. నల్లనిమేనులు నెంతయుఁ, దెల్లనిమోరలును గల్గి దీర్ఘ లెల్లను భే
దిల్లఁగ బొబ్బలు వెట్టుచు, భల్లుకములతోడ జాంబవంతుఁడు దోఁచెన్. 305

క. మానవనాయక భాస్కరసూనులకు సంతసంబు సొంపువహింపం
గా నేగుదెంచెఁ దరుచరసేనలు దనుఁ జుట్టిరా సుషేణుఁడు కడిమిన్. 306

క. అద్రులఁ గనకాద్రిసురేల, రుద్రుఁడు తారకల హిమకరుండునుబోలె
న్భద్రం బగుగపిభటసముద్రంబునఁ బవనసుతుఁడు ముఖ్యుం డయ్యెన్. 307

క. శతవర్షబిందుతారాతతికిం బరమాణు సైకతలవంబులకున్
న్మితిఁబెట్టుఁగాక సంఖ్యాపితతి నెక్కింప విధి యశక్తుఁ డగు న్నా. 308

వ. ఇవ్విధంబునం గట్టాయితం బగు వనచరచమూసమూహంబు సముద్రజలంబులం బుడిసిలింపను, బ్రహ్మాండభాండంబు పగిలింపను కులాచలంబులు విసరివేయనుం జాలి కయ్యంబునకుఁ గాలు ద్రవ్వుచుండె నంతటను. 309

క. అనుపమతరవారిసేనా, వననిధి ఘననీలగజగవయశరభనిశా
తనఖరకేసరివేష్టనమునఁ బవనసుతరక్షితతిఁ బోలిచెన్. 310

వ. భుజబలాంగదుం డగు నంగదుండును విపులకపిసేనాసమేతుండై సేనాముఖంబునకుఁ గావలై నిలిచె నట్టియెడ. 311

ఉ. అక్షులకుం బ్రియం బొదవుచుం బ్లవంగమసేనఁ గాంచి రా
మక్షితినాథుఁ డాదరసమగ్రుఁడు భాస్కరపుత్రుఁ గాంచి ప్రా
గ్దక్షిణపశ్చిమోత్తరపథంబుల జానకి రోయ నెంతయుం
దక్షుల బుద్ధివానరులఁ దప్పక యిప్పుడె పంపు మిప్పుడున్. 312

క. అనవుడు మహాప్రసాదం, బనఘ యటులు చేయువాఁడ ననికపిసేనం
గని పొంగి జనకజావిచయనత్వరిచిత్తవృత్తి నర్కజుఁ డంతన్. 313

క. వినతు స్వనతాసుతజవవినుతుం గని నీవు నూఱువేల్పలగులం
గొని నేర్పునఁ దూర్పునకుం జని జనకజ వెదకి రమ్ము చయ్యన నెలకున్. 314

మ. అని తద్దిక్పతిభూరిభూభృదురగోష్ఠాగారమంజీగుహా
ఘనగంభీరసరిత్ప్రవాహములు వేర్పం దేటతెల్లంబుగా

నిజుం డాసతి యీ తెఱంగి వినతుం డేగ న్వడిం బూర్వది
గ్వనితాకర్ణపుటప్రపాట విరావాపూర్ణసైన్యాఢ్యుఁడై. 315

వ. తదనంతరంబున. 316

చ. అనిలసమానవేగు ననిలాత్మజు నాత్మజసన్నిభుం గనుం
గొని రఘువంశశేఖరులకుం దగ నాతనిఁ జూపి వారి కి
ట్లనియె దృఢవ్రతుండు చతురాగమవేదియుఁ గామరూపకుం
డనిలసమానవిక్రమవిహారి మహారివిహారి యారయన్. 317

సీ. కనకాద్రి మెచ్చ దీతనిధైర్యరమ మించు జడదారిదొరకుఁ జేపడియె ననుచుఁ
దపనుని మెచ్చ దీతనితేజ మెక్కుల మొకరీతిగా నుండ నోడు ననుచు
నుదధిని సరకు సేయఁడు వీనిగాంభీర్య మలమంథనగముచేఁ గలఁగె ననుచు
నీమహామహుజవం బీడఁ గాదను ది యురువనోరయమున కోప దనుచు

గీ. నీకటునితాల్మి భూతధాత్రీవనితను, గెలిఁ గాపించుఁ జంతుప్రకృష్టభార
శమన మొదఁ గోరి యొక్కొకసారి బ్రహ్మ, విష్ణురుద్రాదులకు మొఱవెట్టుననుచు.

క. అంతియకా దీతఁడు తన, కాంతి మనంబుల జయించెఁ గంతుని గారి
కాంతునకె యగు నీహనుమంతుఁడు ధృతిమంతుఁ డంశుమంతుఁడు కాఁడే 319

ఉ. చాలు నితం డొకండ కులశైలసదృగ్ఘనబాహుబలుం డిలా
పాలపురంబులు న్వెదకి భామిని సీత నెఱుంగ రా యశ
శ్శాలి మహాత్ము నీతని వెస న్నియమింతు నవార్యదుర్ధిష
త్కాలవహిత్రభూరిహరినికుంజముల న్మహిపుత్రిఁ గోరఁగన్. 320

వ. అని పలికి కరువలిగడిలిపట్టిఁ గౌఁగిటం బట్టి సస్నేహంబును, సబాంధవంబును, సగౌరవంబును, సవినయంబును సాదరంబును గా నతని కిట్లనియె. 321

క. అతిబలకపిసేనాపరివృతుఁడ వగుచు యామ్యదిశకు వేచని తద్ది
క్స్థితధరణి వెదకి రమ్మా హితతనూజ న్నీవ పరమహితుఁడవు నాకున్. 322

చ. అనవుడుఁ బొంగి నింగి నొరయం దనవాలము వైచి భానుజ
న్మనకు నరేంద్రసూనులకు మ్రొక్కి మహామతి యుద్ధ వారి కి
ట్లను ననిలాత్మజుండు జనకాత్మజఁ గన్గొని వచ్చువాఁడ నం
బునిధిఁ గడాచియైనను జము న్విదళించియు నైనఁ దెచ్చెదన్. 323

అని పలి°. 324

తత్క్షణము దక్షిణమునకుఁ దెరలెనన్న, వానరుఁ గన్గొని రాముఁ డత్యంతప్రాప్త
చిత్తుఁడై నిజకార్యసంసిద్ధి యితని, కతన నగునని తలఁచి యూఁకొను నంపె. 325

క. మానక వెండియు నప్పవమానసుతుం బొగడి రామమహీనాథుఁడు ప్ర
జ్ఞానిధి జనకజకుం బ్రత్యభిజ్ఞానార్థం బంగుళీయకం బొసఁగుటయున్. 326

వ. స్వామికార్యధురంధరుం డగు గంధవహనందనుండు గంధగజంబు తరుణకిసలయం బుఁ బరిగ్రహించు చందంబున నయ్యంగుళీయకంబుఁ గరంబు రాగంబుమీఱం దత్క్షణంబ దక్షిణకరంబు సాఁచి. 327

క. కొని వారివాక్యముల నూఁకొని వానరసమితిఁ గూడికొని వారల వీ
డ్కొని దక్షిణపథముం గైకొని యేగ నొక్కెడ మలమికొని హెచ్చింపన్. 328

వ. ఇట్లనిలనందనుం డంతసత్త్వసంపన్నులగు నల నీల గజ గవయ గవాక్ష గంధమాదన దధిముఖాంగద జాంబవదాదిమహావీరపరివృతుండై యెల్లవిధంబులం బుడమిపట్టిం గనిపట్టి వచ్చుపట్టి ప్రతిన వట్టి చనియె నంత. 329

ఉ. ఆదట నున్న యున్నతమహామహిభృత్పరిసరంబు ల
త్యాదర మొప్పఁ దెల్లముగ నాతనికిన్ వివరించి భీమసం
పాదితవంగసైన్యము నపారముఁ దోడ్వడఁ బంపె నా ప్రతీ
చీదిశ సీతఁ జూడఁగ సుషేణుని వైరివనీకృశానునిన్. 330

క. అతనికి నొకమాసంబు, న్మితి వెట్టి యనంతరమున మిహిరసుతుఁడు ద
గ్గతపర్వతగహనాదులు, వితతమతిం దెలిపి రామవిభుఁడు నుతింపన్. 331

క. ఒక్కొక్కఁడ చాలి నాలుగు, దిక్కులు వెదకంగఁ జాలు ధీరులఁ గపులం
జెక్కుల్ద్రెఁ దోడుచేసియు, దక్కుమధంబునకు వా శతబలిం బుచ్చెన్. 332

వ. అతండు నొక్కమాసంబునం జనకతనయాన్వేషణంబుఁ గావించి మరలువారై
చనిరొ నిట్లు. 333

క. కాష్ఠామాత్రమునఁ జతుః, కాష్ఠావిచయనసమర్థగతులు కపివరుల్
స్ఫోష్ఠాహంకృతు లెసఁగఁ గ, రిష్ఠాత్ములు చనిరి గహ్వరీసుత నరయన్. 334

వ. ఇట్లరిగి. 335

క. తరుచరవర్యులు మనుముగఁ, దరుణిం ధరణీతనూజఁ దడవిరి మిగులన్
దరుల నదీనదంబుల, దరులం దిమిరప్రగాఢతరులం జరులన్. 336

సర్వలఘుసీసము.

వెదియఁ దరుచరులు మసలక యటనిజ వెదకఁగఁ దొడఁగిరి వివిధగతుల
బిలములు మొకములు మొలఁగెడు సెవులు బులుఁగులరుతములఁ బొదలుపొదలు
నుడువులఁ బొరువులు మలలను శిలలను బొలములఁ గొలఁకులఁ బులినములను
బురములఁ నుపవనములఁ గటకములు నహులవివరములు గహనములను

గీ. మనుజు దపములుగలిగెడువనములును శబరులయునదులఁ దలిరుఁబరఁగులతలు
నటజములు నవటములు బహుళశిఖరము, లపరమితభయదకరము లగుతలములు. 337

వ. ఇట్లరయుచు వెండిరు. 338

ఉ. భానుసహస్రచారుతరభానుపరిస్ఫుటధాత్రి నీఁగఁగా
లూనిన యంతవట్టయిన నూనమునొందక యుండునట్లుగా
జానకి నుర్వరతయ జానుగ రోసి యెఱుంగలేక యా
వ్వానరు లెల్లఁగూడికొని వచ్చిరి క్రమ్మఱ దైన్యచిత్తులై. 339

వ. దక్షిణదిశాపరిశోధనార్థం బరిగిన యాశోధనులగు హనుమదాదులు తక్కుం దక్కిన యక్కపులెల్ల నొక్కమొగిం దిక్కులఁద్రువం జనుదెంచి రాజపుత్రరవిపుత్రులం గాంచి నమస్కరించి తమపోయివచ్చినచందం బెఱింగించువారై యిట్లనిరి. 340

మ. సితకీర్తి ప్రియులార యేమఁ బ్రతీచీప్రాగుదీచీదిశ
స్థితశృంగోన్నతిపర్వతంబులఁ బయస్స్రోతాపగాతీరవి
స్తృతకాంతారములం గుడుంగముల ధాత్రీపుత్రి శోధించిన
చ్చితి మెచ్చోటను వార్తయైన వినమా సీతానిమిత్తంబుగన్. 341

క. ఇఁక నేఁడు పదురువారము, పెకలింతుమొ భూతధాత్రిఁ బెల్లగిలన్నా
ప్రకలాద్రులఁ ద్రొతుమొ వా, నికిశోఘలు వెఱుకుదుమొ యశోధనులారా. 342

గీ. ఆజ్ఞ యొసఁగుఁడు మా కనిరంత రామలక్ష్మణలు సినజుండును దక్షిణంబు
వెదకఁబోయిన యమ్మహావీరవరుల,మీఁదఁ బ్రాణంబు లిడియుండి రాదరమున.

వ. అంత నక్కడ దక్షిణంబునకుం జనినవానరు లాలస్యంబుఁ దక్కి యెక్కినమ్రానుల మరల నెక్కి వీక్షించుచుఁ, దడవిన ప్రదేశంబులు వెండియుం దడవుచు, నేము నేము జనకజం బొడగాంతుమని ప్రతినలు పట్టుచు రాఘవుండు మహానుభావుండు తదీయకార్యనిర్వాహకుండ నర్వోత్కృష్టుం డని యాడుచు హనుమంతుం గొనియాడుచుం జని చని. 344

సీ. కొండలు శోధించి కొండల లేమిన్నఁ, గొండలు బురదగాఁ గలఁచివైచి
పొదరిండ్లు పరికించి పొదరిండ్ల లేమిన్నఁ, బొదరిండ్లు బయలుగాఁ జిదిమివైచి
తరువులు వీక్షించి తరువుల లేమిన్నఁ, దరువులు వ్రేళ్ళతో నురులఁద్రోచి
నగములు గనుఁగొని నగముల లేమిన్న, నగములు బిట్టు పెల్లగిలఁజేసి

గీ. గుహలు దఱఁగాంచి సీత గద్దుహల లేమి, గుహలు నగ్గోలుపఱచి యుక్కొంతులిట్లు
తరులుగిరులును పొదలుబొదలు కొలఁకులు,గుహలు శోధించియామ్మహామహులు వరియు.

వ. సీతాన్వేషణంబు గావించుచు. [illegible]46

చ. ఫలములు గాంచి రేఁగి దముపార భుజింపరుఁ బువ్వుఁ దేనియ
గ్గొలఁకులఁ గాంచి గ్రోలఁ దమకింపరుఁ బెద్దవరించియొని నే
మలసతనొందివారు మన గాఁక లిఁకెప్పియు లెక్కసేయరు
గలఁగరు వాన కెండకును గాలికిఁ గార్యభరంబు పెంపునన్. 347

సీ. అచ్చోట జనకజ నరయుదు మనిపోను, రచ్చోట లేకున్న దైన్యము వహింతు
రాకడ సీత నాలోకింతు మనిపోదు, రాకడ లేకున్న నలసు లగుదు
రాచక్కి మహిపుత్రిఁ జూచెద మనిపోదు, రాచక్కి లేకున్న నలఁగఁబడుదు
రందు రాఘవుదేవిఁ గందు మనుచుఁబోదు, రందు లేకున్నను గుందుచుందు
గీ. రంబుదత్పత్రిఁ గన్గొందు మందు రకట, కడచనియు మాస మందురు కపులు మనకు
నాత్రిఁ బవనేల తచ్ఛ్రవణ ర్తవిందు, మందు రొకకొందఱికతి నందు మఱియు.

సీ. రామునిఁ బల్కు కీరరమణి సీతఁగా, నూహించి నిలిచెద రొక్కమాటు
దాతచ్ఛద మగులతాతన్వి జానకి, యోయని చూచెద రొక్కమాటు
ఘనకలాపభిహంగఁ గలకరి భూపుత్రి, యొక్కయని తలంతు రొక్కమాటు
పటునిశాచరవిద్ధ పద్మిని రఘురామ, సతిదంగా భావింతు రొక్కమాటు
గీ. పోతుఁ బాసి తపించుకపోతి మహిజ, యున్నదని చేరఁబోవుదు రొక్కమాటు
శాఖ్యవృత్తుల మై గవిసూనుఁ జేర, జంపు వనభీతిఁ గొందఱు శైలచరులు. 349

ఆ. మఱియు వివిధగతుల వసలక జనకజ, యున్నచో టెఱుంగ కున్న తంబు
లైన పర్వతములు నగములు శోధించి, యలసి సొలసి యున్న యవసరమున. 350

చ. అభయగతిం బిలంబు నొకఁ డారసి తారసిలంగఁ దత్స్వయం
ప్రభగుహఁజొచ్చి గాఢతిమిరంబుఁ గ్రమించుచుఁబోయి యాత్మరీ
తి భరితసన్నికృష్ట నొకతెం గని భక్తి నమస్కరించి త
చ్ఛుభకరుణాగ్రదృష్టి గుహ సొంపుగ వెల్వడి రొక్కపెట్టునన్. 351

వ. ఇట్లు మహాయాసంబునం బెక్కుదినంబులు పొచ్చిన యాబ్దిలం బనాయాసంబున నొక్కక్షణంబున వెల్వడి ప్రభావతీప్రభావంబున కచ్చెరువు నందుచు నిరాశ్రిత క్షుత్పిపాసాశ్రమములై యుండి యన్యోన్యముఖావలోకనంబు సేయుచు నిట్లనిరి. 352

మ. ఇఁక సేయఁగలకార్య మెద్ది మన కయ్యబ్ధోపవంశోత్తరం
డకలంకుండగు రాముభార్యఁ గననెట్లొ యెల్లచో ట్లింత ద
క్కక శోధించితి మెందునుం గనము శోకధ్వాంతవిచ్ఛేదకం
బకటా చంద్రముఖీసువార్తవగుఁ గా కన్యాంబులం దీఱునే. 353

క. అరిరంత నంగదుం డిట్లనియె న్వానరులకుఁ జాల మనసిజ నెటకుం
బనిగలదే పోఁగ మన, కనవరతముఁ బ్రాయోపవేశ మొందుట కరయుఁడీ. 354

సీ. అనుచు గద్గదకంఠుఁడై యెల్లవారల నీక్షించి మఱియుఁ దా నిట్టులనియె
నవనిజఁ గనుఁగొన మని యటువోయినఁ జంపుఁ గాని యనుగ్రహింపఁ డర్క
నందనుం డొంట రా నందుల కిచ్చోటఁ బుచ్చెఁగ నసువులు పొందు మీర
లెల్ల మీమనమున కిష్టమౌనెలవుల కనుచు మోమున దైన్య మాక్రమింప

ఆ. నశ్రు లురులమున్న యంగదుఁ గనుఁగొని, యఖిలవానరులు మహార్తిఁ దూలి
నిశ్చయముగ నేము నీతోడివారము, గాక మాకుఁ బోవఁ గలదె మఱియు. 355

చ. పనుగము రామచంద్రునకు సమ్మతిగా నొనరించి పుణ్యలో
కములు జటాయు వెంతయు సుఖంబునఁ బొందినయట్లు రామకా
ర్యమున ననుప్రపంచముఁ దిరంబుగ వీడితిమేనిఁ బుణ్యలో
క మెమరు వచ్చునంచుఁ బ్లవగప్రభు లాతనిఁ జుట్టి యేడ్చిరా. 356

వ. ధైర్యహీనవంతు లగుహనుమంతుండు వారల కిట్లనియె. 357

క. మనము పరమాత్ముఁ డగు రాఘుని మనమున బడయలేనిమూర్ఖుల మని యా
య్యనఘుఁడు నిజకారుణ్యం, డనిపించ్యలఁ జేయుఁ జచ్చినం బాపున్నకా. 358

ఉ. కావున ధైర్యము న్విడిచి యకారణ మిగ్గిరిగహ్వరంబులం
జాపఁగ నేల యప్పరమసాధ్వి నిలానుతఁ గాంచి పోయి ధా
త్రీవరు మన్ననం బడసి తేజము నొందఁ దలంపుఁ డిట్లసం
భావితచిత్తవృత్తు లగుపాలకులట్లు తలంక నేటికిన్. 359

వ. అని పెండియు ననుచితవచనంబులం దేర్చె. 360

క. కడఁగుండు సీతవెదకం, గడుగుండు ముఖంబు లశ్రుకలితంబులు న
వ్వడుగుండు కాక్య మనునెడ, నడగుండు పగిది విహంగనాథుఁ డొకఁ డొగిన్.

వ. సంపాతి యనువాఁడు. 362

ఉత్సాహము. అచటనుండి వారి క్రిందఁ గరుగుదెంచువాఁడు త
ద్వచనసరణిఁ దనదుమద్దఁదమ్ముఁ డీల్గుటరసి వృ
త్తచరణాథ వరులఁ జేరఁ జనుదువపుడు కాంచి వా
నిచరితం బెఱుంగలేక నిఖిలకపులు భీతులై. 363

ఉ. కాలినపక్షకంబులు క్రియఁ గల్గినమేనునఁ గూటరాశి యనం
గ్రాలుగళంబు నెత్తికొని క్రచ్చఱవచ్చెడు నొక్కభూత మ

శాకులుని ప్రేరణంబునఁ దగ నర్మరణేచ్ఛ వహించియున్న కీ
శాలిఁ గ్రసింప దీనిపనినా మనకెల్ల మనోరథంబులున్. 364

క. అని మనల మ్రింగుకును బో, న్మని నిర్ణితాత్ము లగుచు నఖిలకపులుఁ వా
నిన చూచుచుండఁ జేరం, జనుదెంచి విషాదమెసఁగ సంపాతి యనున్. 365

క. ఎక్కడి జటాయు వతఁడే, చక్కటి సమరంబు సేసి సమసెఁ బిదప మీ
రక్కరణి నెల్లెఱింగితి, రక్కట చెప్పుఁ డేమ వానియుగ్రజుఁ డఁ జూడీ. 366

క. వానికిశోకంబున నె, వ్వానితో రణము సేర్చె వానికిఁ బోరం
గారణము మీదురాకయుఁ, గారణముం జెప్పుఁ డీవు గారవమెసఁగన్. 367

వ. అని యడిగి చింతాపరిక్రాంతుండై. 368

క. కలుషలశోకంబు రెక్కల గాలి నిడిచ్చవేయు కలఁడు కృపణుండై
కలఁగ బవనలసె మన ము వికలమయ్యె జెప్పుడ తత్సకలవృత్తంబున్. 369

వ. అనిన నప్పవంగపుంగవుఁ కొప్లవంగపుంగవు లిట్లనిరి. 370

సీ. దశరథసుతుఁడు సీతానాథుఁ డనుజన్మసహితుఁడై పితృనాజ్ఞ సర్వకంబుఁ
బూని పంచవటంబున అంతఁ బర్ణకుటీర మొనరించి నియతి నుండఁ బజ్జ్ర
కంఠుండు రామలక్ష్మణులను వంచించి జానకిఁ గొనిపోవు సమయమున జ
టాయువు రావణునాఁగి మహాహవం బొనరించి యొసరించి యుక్కడక్క

గీ. దనుజచంద్రహాసదలితపక్షుండై, ధరణిఁ గూలె దైత్యనాథుఁ
డెక్కడేనిఁ జనియె నక్కడ రాఘవు, లవనిజను లేమి వలమటించి. 371

వ. తదన్వేషణార్థం బరణ్యంబుల బరిభ్రమించుచు నా రెకురంబు ర్వతోపమానుండై పడి
యున్న జటాయువువలన నత్వృత్తాంతంబు విని యనంతరంబున ప్రాణపక్షి
ణుండగు నప్పక్షివరేణ్యు దశరథక్షితినాథుంబోలె దహించి తిలోదకంబు లొసం
గి శబర్యాశ్రమంబును బంపాతీరంబును గడచి ఋశ్యమూకంబున వనచరేశ్వరుం
డగు సుగ్రీవునితోడం బద్ధసఖ్యుండై తద్ధితంబుగా వాలిం దునిమి తత్పదంబొసంగినం
గొని పువమింగల ప్లవగపుంగవుల రావించి సీతాన్వేషణనిమిత్తంబుగా నెల్ల
దిక్కులకుం బుచ్చిన నే మిద్దక్షిణ బుగమున జనుదెంచి యొందునుం జనకనందన
సందర్శింపనేరక యూరకపోఁ దీరక ప్రాయోపవేశంబునం బ్రాణంబులు విడువ
నున్నవార మనిచెప్పి యప్పలుఁగు తెలికి వెండియు నిట్లనిరి. 372

క. పక్షివర నీవు నీగతిఁ, బక్షవిహీనం బగుట విపక్షకృత మొ శా
పాక్షరసంకలిత మొ మా, కీక్షణమున దెలియఁబల్కుమీ నీవనుడున్. 373

ఉ. దేవ మొలర్చు భానుఁ గని చేరఁగ నోపుదు నేవ నేనయుం
జావిపులాద్రిశాయుఁడు జటాయువు నేనును బన్నిదంబునం
బోవఁగ సూర్యరశ్మి ముదు బో దిర నమ్మహనీయు వేగికి
న్లావులలావులెల్ల వికలత్వము నొందుచువచ్చెఁ జెచ్చెరన్. 374

ఉ. తమ్ముని పక్షయుగ్మకము దగ్ధము గొంకుట కోర్వలేక శీ
ఘ్రమ్మున నెద్ది మూర్ఛిలి ధరాపగనోన్ముఖుఁడైన వానికా
గ్గమ్మున నాత్మపక్షములఁ గప్పిన నప్పుడు కాక నా పత
త్రమ్ములు గాలె నాతఁడు సురక్షితుఁ డయ్యె మదాత్మ వొంగఁగన్. 375

వ. ఇట్లు చండకిరణప్రచండకిరణదగ్ధగరుద్వయుండనై 376

క. ఇక్కుధరంబునఁ బడి కడుఁ జిక్కినవాఁడ నగు సేవ నేయుచు నిచటం
బెక్కుదినములుండి యతం డెక్కడ కేని చనె యథేచ్ఛాపరుఁడై. 317

వ. నాఁటంగోలె నాకుమారుండు సుపార్శ్వుండను సుపార్శ్వుండు నిత్యంబు నాహార
వర్తనంబు నిర్వర్తించుచుండం బడి జటాయువు ముని స్థానంబగు జన్మస్థానంబు
సుస్థానంబుగా నున్నవాఁడ నిట్లుండి యొక్కసమయంబున మదీయపూర్వసంపాదిత
పుణ్యకర్మవశంబున బాలసఖుం డగు నొక్కతపోధనుం గనుంగొని సభక్తిక
సాష్టాంగదండప్రణామంబు లాచరించి ప్రార్థించిన నస్మద్దీనదశాకారణంబుఁ
దనదివ్యతపోమహత్త్వభావంబున నెఱింగి నావలన వెడియుం దెలిసి యక్కరుణా
కరుండు నాకుం గరుణించి పత్త్రివరా ధరాసుతాన్వేషణంబు నెపంబుగ నగచరులు
రామాజ్ఞ నెన్నఁడే నివ్వంబునకు వరుగుదెంతు రమ్మహాత్ములకు సీతావృత్తాంతంబు
దేటపడం దెల్పి లబ్ధపక్షుండవు గమ్మని దీవించి వేంచేయుటయు నాఁటంబట్టి మీ
రాకఁ గని పెట్టి ప్రాణంబులు చిక్కంబట్టియున్నవాఁడఁ గృతార్థుఁడ నైతి నని పలికి
తమ్మునిం గూర్చి యార్చి పేర్చిన శోకంబు డిపికొని యవ్వానరోత్తముల సహాయంబు
నం బుణ్యనదీ స్నానంబు గావించి జటాయువునకుం దిలోదకపిండప్రదానంబు పెట్టి
పవిత్రుండై వారలం గనుంగొని. 378

చ. నగచరులార యింక మరణవ్యవసాయము మానుఁ డిప్డు సీ
తఁ గనువిధంబు మీకు విదితంబుగఁ దెల్పెద దూరదృష్టి మా
కుఁ గలదు లంకనున్నది యకుంఠితసద్వ్రత రాముదేవి యి
మ్ముగ శతయోజనంబులు సముద్రముఁ దాఁటుఁడు కానవచ్చెడున్. 379

క అని మఱియుఁ బెక్కుభంగులు, వనచరులకుఁ దెల్పి పక్షివర్యుఁడు సంపా
తి నిజపత్త్రమ్ములు గల్గిన సంతసమంది వారికిం దగ ననియెన్. 380

ఉ. ఎక్కలు నాకు నత్తఱిని నేనిక్షపం బ్రభవించె సత్త్వమిం
పెక్కుపతివ్రతామణి వహీసుత వీఁపునఁ బెట్టి లంకతో
నిక్కడఁ దెత్తునో కడు నహీనజవాధ్యు మదీయపుత్రకుం
జక్కఁగఁ దోడ్కొనందునో ప్రశస్తగుణాస్పదులార చెప్పరే. 381

చ. అనవుడు సంతసించి శశినాధిప జానకియుండె లంకలో
నని తెలియంగఁ జెప్పితి సహాయము గాదొకొ నీవు నీసుతుం
డును జనఁ జిట్టవర్తనఁ గడుం బఱపైన సముద్ర మెవ్విధం
బునఁ దయినం దరించి మహిపుత్రిఁ గనుంగొన నేమిచాలమే. 382

క. అని పులకించెనిఁ బోవం, బనిచి కపిప్రభులు నెఱఁగు బంటిదొరలు ను
బ్బున నాడుచుఁ బాడుచుఁ జని, చని దక్షిణవార్ధితీరశైలోత్తమమున్. 383

చ. మలయగిరిం బ్రదక్షిణనమస్కృతు లొప్పఁగ నెక్కి వానరా
వలి గనియె న్సముద్రము నభంగతరంగరవాతిరౌద్రము
న్వలితనిజోరుఫేనరుచిలజ్జితనిర్మలతత్తశూద్రము
న్జలచరభద్రము న్మహితసాంద్రప్రవాళలతావినిద్రమున్. 384

క. కని తత్తరంగశీకర,జనితపరమశైత్యముం బ్రసన్నతలీలం
గొని మలయసమీర మెదు,ర్కొని తనుమార్గశ్రమంబు కొంచెపఱుపఁగన్. 385

క. ననఁ బ్లవగు లెట్లు కడచెద, రని నవ్వొకభంగి ఫేన మడరం బోని
త్తునె వీఁగల నాఁగక నన, ననువున భంగంబు లంతకంతకుఁ బెరుఁగన్. 386

వ. ఘూర్ణిల్లుచున్న వారాకరంబుఁ గనుంగొని భయభ్రాంతు లగువారును మూర్ఛాపరవశ
త్వంబు నొందువారును మహానందంబు నొందువారును తరుగుల్మలతాగ్రంబులనుండి
వీక్షించువారును విస్మితులగువారును, సరకుసేయక తత్తరంగంబుల నోలలాడువారు
నై రఘుత సంగడుండు తమవారిదెసఁ గలయం గనుంగొని. 387

క. ఎవ రెన్నియోజనంబులు, జవమున జలరాశి దాఁటఁ జాలుదు రనిన
న్నవదశయోజనములదాఁక వచించిరి ప్లవగభల్లుకప్రభుముఖ్యుల్. 388

గీ. ఇట్లు తమతమశక్తుల నేర్పఱచి, యఖిలవనచరులును దెల్ప నాలకించి
యింద్రనందననందనుం డిట్టు లనియె, వారలెల్లను సంతోషవనధిఁ దేల. 389

చ. అసదృశవేగి వాలి కెన యైనధికుండగుఁ గాని తక్కఁగాఁ
డసమున నీఁతఁ డంచుఁ గపులందఱు సంస్తుతిసేయు వారిరా
శి శరభసంబునం గడచి సీతఁ గనుంగొని లంక నగ్రకే
లిసలిపి మామనంబు లమలీమసవృత్తిఁ దలిర్ప వచ్చెదన్. 390

వ. అని తాను శతయోజనంబు లవలీల దాఁటనోపుట యగ్గడించి యొక్కింత విచారించి
వెండియు న త్తరుచరులతో నతండు. 391

క. తరుచరు లానందింపఁగ, శరనిధి వెస నుత్తరించి జనకజఁ గని త
త్పురిఁ గాలఁ జమరి క్రమ్మఱి, యరుదెంచుట నాకు శక్య మానో కాదో. 392

వ. సంశయంబు గలదని పలికి ధైర్యాతిరిక్తంబుగ వెండియు. 393

చ. అది యటులుండనిండు మదమారఁగ నియ్యెడ నుండుఁ డేను బో
యొద నిదె పల్వలాకృతి వహింపఁ బయోనిధి దాఁటి నాఁగ నం
గదుఁ గని వారలెల్లను సగౌరవ మొప్పఁగ నాడి రీవు చా
లు దుదధి దాఁటి యెల్లపనులు న్సవ కూర్చి మమ్ముఁ బ్రోవఁగన్. 394

క. అయినను నీవేగినఁ గ్రుటి, యయినను నే మోర్వ జాల మనయంబున మా
నయనములు చల్లఁగా నీ, దయిశుభాంగంబు గాంచి యలరుదు మెపుడున్. 395

క. ఈకడలి కెడలి తగనవ, నీకనక్యం జూచి రాఁగ నీవోపుదు నీ
పోక కపివరులయసువుల, పోకసుమీ కలమె నిన్నుఁ బొమ్మని పలుకన్. 396

సీ. పసితనంబున ఫలభ్రాంతి నుక్కఱి బాలభాను నెవ్వాఁడు చేపట్టివిడిచె
దుష్టవర్తనుల దైత్యులఁ బట్టి పాలార్చి మునులచే నెవఁడు దీవనలువడసె
దివ్యాస్త్రముల కసాధ్యుఁడుగా బ్రహ్మాదిసురలచే నెవ్వాఁడు వరములందె
నితనిచే మనపనియెల్లఁ దీరఁ గటంచు మద్రి కన్యనికి రాముం డొసంగె
గీ. నెల్లవిధముల జానకీ నేనకాంతుఁ, బ్రకటగతి నని యెవ్వాఁడు ప్రతినవట్టె
నట్టివానవంతుఁ డతిశాంతుఁ డరికృతాంతుఁ, డుండ మనకేల యోయంగదుం డకగణ.

వ. అని యివ్విధంబున నాంజనేయుండు వినుచుండఁ బలికి వెండియు నమ్మహావీరు
జన్మబలపరాక్రమప్రకారంబు లగ్గడించి యయ్యంగదుం బురస్కరించికొని జాంబ
వదాదులు హనుమంతుం బ్రశంసావచనంబుల నగ్గించుచు డగ్గఱి. 398

శా. ఖద్యోతద్యుతినిర్జితాత్మరుచి లోకప్రాణసత్పుత్ర నీ
వుద్యచ్ఛ్రమగతిం బయోధితరణోద్యోగంబు గావించి యా
పద్యుక్తంబగు వానరావళిఁ బ్రబుద్ధప్రాణవాతంబుగా
విద్యాజీవ కడంగుమా జనకజాన్వేషార్థ మర్థించుచున్. 399

క. వనచరు లిట్వనరాశిఁ, గని భీతిల్లెదరు తమకుఁ గడవఁ గోఁటిదిగా
దని పురుషోత్తమ నీకి, క్కనధిపటిపుఁ దాఁటు టెంతభరమూహింపన్. 400

క. గురుఁడగు వారియమ భవద్గురుఁడగు వారియముఁ బక్షిఘోటకుఁడు జగ
దుఁడగ వారియమునా నీగురియమున కెట్లు లెయగు న్నైవర్గా. 401

వ. అదియుంగాక. 402

చ. ఒకనిముసంబునం బహుళయోజనములను బ్రొద్దుతేరితో
నొకనిముసమ్మునం బాయక తదుష్ణము నోర్చి నభఃప్రచారివై
సకలకలావిభూతి రవిసత్కృప నేర్చినయట్టినీకుం జో
టుకడలి దాఁటు టేపని కటా యిటు లొప్పరికించి మాటలే 403

వ. అని మఱియుం బెక్కుభంగులం బ్రార్థించి యగ్గించుటయును వానరేశ్వరుఁడు వారి
దైన్యదైన్యంబు వాపం బూనుచు నిట్లనియె. 404

మ. రయితం బిచ్చకగుటఁ గేసరికిశోరం బెట్టులంఘించు సా
క్రియఁ బాథోధిఁగడాచి యందుఁ జని పఙ్క్తిగ్రీవు లంకాపురీ
త్రయసౌధోపవనోపకంఠముల నాక్ష్మాపుత్రి నీక్షించి యా
ర యనస్ముద్రిక నిత్తుఁ దెత్తు ముదమారం బ్రత్యభిజ్ఞానముల్. 405

క. అని పలికి వారలెల్ల, దనమోమునఁ జూడ్కు లునిచి తద్దయుమోదం
బునఁ జూచుచుండ నప్పుడు పవనజుండొప్పారె హైమవతసింహాగతిన్. 406

వ. మఱియును.

చ. అతులితపర్వతాగ్రమున నాహనుమంతుఁడు వొల్చెఁ బూర్వప
ర్వతశిఖరోదితోజ్జ్వలదివాకరబింబసదృక్షుఁడై సమా
వృతకపివక్త్రపద్మములు విస్ఫురితంబులు గా నిజాననో
ద్ధితరుచిభాను లొప్పఁగ మహీచరఖేచరకోటి చూడ్కికిన్. 407

క. ఇప్పగిది నొప్పి యెల్లరుఁ, దప్పక దీవింప నిజపదద్వంద్వంబుం
గుప్పించి యుప్పరంబున, కప్పుడెగసెఁ బర్వతాగ్ర మవని సమముగాన్. 408

వ. ఇట్లు లీలావాలోచ్చాలనంబుఁ గావించి నిఖిలవానరమనోనయనానందకరుండును
రామకార్యపరాయత్తచిత్తుండు నగు నప్పవనప్రియనందనుండు దక్షిణాభిముఖుండై
సముద్రలంఘనంబు గావించి. 409

క. గిరిచాపవినిర్గతమై, యురుజవమున నిగుడు శరమొకో యన లంకా
పురదహనార్థ మడరె నం,బరచరులకు విస్మయంబు మల్లడిగొనఁగన్. 410

వ. వెండియు నత్తరుచరసత్తముండు. 411

క. ఖేటకమురీతి వాలముఁ, బాటవమునఁ ద్రిప్పికొనుచుఁ బటురభసమునన్
ఖేటములఁ బట్టికొన నా,ఖేటమునకుఁ జనినయట్లు కీర్తిగుఁ డయ్యెన్. 412

వ. అంత. 413

గీ. ఘనమనోరయవాయువేగగరుడజవ,శరశరభసంబులను మించి చనుచున్న
హనుమఘనదేహ మంతయు నంతరిక్ష,గోచరము గామిఁ బ్లవగులు చూచు చుండిరి. 414

వ. మోముల విన్నందనంబు గదుర నమ్మహాత్ముఁ రాక వార్చి త త్తీరనికటాతలంబులం
ప్రాణంబులు చిక్కంబట్టియుండి రంత. 415

క. ఆ కార్యపరత్వము నిర్భీకత్వము దృఢరయంబు బీర మరసి య
ట్లాకాశంబున నేగు మహాకాయుం గాంచి పొగడి రంబరచరులున్. 416

గీ. ఇట్లు ఖచరాభినుతగతి నేగునమ్మహాత్ము కాయోద్ధిశల్యసనాహతాబ్ధి
పాయయిచ్చుటయొప్పె నప్పరమసాధ్వి, నందు వెదకుచుఁ జనియెనో యనిన కరణి.

వ. ఇవ్విధంబునం బరమసాహసంబున నేకచరుండై ఖచరసంస్తూయమానగమనంబు
నం జను నయ్యనచరవర్యు నుద్దేశించి నిజకుక్షిసురక్షితంబగు మైనాకక్షితిధరంబున
కంబుధి యిట్లనియె. 418

ఉ. ఇమ్మహిరుట్ప్రసూతము డహీనజవాఢ్యుఁడయ్యైన నిట్టులో
క్కమ్మడి సాహసించి శతయోజనము ల్చన దప్పి పుట్టుఁబో
మ్మమ్మహనీయ వేగు భవదగ్రమున న్నిలుపంగ రామకా
ర్యమ్మునకెవ్వరేనియు సహాయము సేయుక మాననేర్తురే. 419

క. ఈకడలి నెడలి వచ్చెదవు, మీ కార్యముఁ దీర్చనోపు దీ వెట్లును మే
నాకక్షిఁ బుట్టి వాఁడవు, నాకుక్షినవృద్ధిఁ బొందినాఁడవు గానన్. 420

ఆ. అనుడు నట్లె యగుననిఁ శింశుమారక,ర్కటకకాకులొప్ప ఘనవిశుద్ధ
పాదశోభి యగుచుఁ బాథోధిమిత్రత, బయలు మీఱయ వెడలెఁ బర్వతంబు. 421

వ. ఇట్లు కడలి వెడలి హనుమంతున కభిముఖుండై. 422

ఉ. ఓకపివంశసాగరపయోరుహశాత్రవ వాయుపుత్ర మై
నాకుఁడ వార్ధిపంపున ఘనత్వరితంబున వచ్చినాఁడ సౌ
మ్యాకృతి గొంతసేపు నిలు మస్మదురూన్నతకూటకోటి ని
ర్లోకరయంబునం జనఁగ నేల శ్రమంబు జనింపఁ దెంపునన్. 423

వ. అని పలికి వెండియు. 424

క. హాలసదృశనఖర కోలా,హలబహుళం బిప్పయోధియం దునికి హాలా
హలగళుఁడు బావ కోలా,హలుఁ డన్న పి మాద్రి కన్నయాతఁడు నాకున్. 425

చ. అనవుడు నమ్మహాసివయి హస్తము సాఁచి ధరేంద్ర వార్ధిబిం
బినఁ జను వెంచితంటి కడుఁ బ్రీతము నుఁడ నైతి జానకిం

గనుఁగొని కాక విక్రమముఁ గాంచుట మేలె తలంప నూఱుయో
జనములమాత్ర దాఁటుట యసాధ్యమె పొమ్మని వీడుకొల్పడున్. 426

వ. అగ్గిచును నచ్చెరువందుచు నమ్మే నారుంచు సనుటయు మున్నీటు మిన్ను దటిసి
పోవుచు నబ్బల్లిముఁడు. 417

క. సురక్షేవరగంధర్వోరగ్రవిస్మయకామరూపధారణము పేర్మిన్
సురసమ్మతి నేతెంచిన, సురస మ్మతివొంగ ననిచి సుస్థిరుఁ డపలన్. 428

శా. ఛాయాగ్రాహిణి తన్ను నాఁగిన నవష్టంభంబునం బేర్చి త
న్మాయాజాలము లెల్ల మాన్చి వెస నంక్షేత్రంచరీప్రోజ్జ్వల
త్కాయంబు న్నిజవాలపాశముఁ జిక్కంగట్టి యంభోధిని
ష్పాదన్మగ్నఁ జేసి విలపింపం జంపి తా నేగుచున్. 429

క. వే లవణాబ్ధిఁ గడచి యా, వేలం బవమాత్మజుండు వీక్షించె మహో
ద్వేలశతయోజనాంబుధి, వేలఁ గుసుమసౌరభాతివేల సువేలన్. 430

క. దండిమగఁ డిట్లు కనియె ద్దండగదాదండవాలవండ మెసఁగ న
ఖండపయి న్వ్యాయోక్షఁడ, గొండపగిది ప్రాఁకెఁ బిట్టు పుతలముగుంగన్. 431

ఉ. మానవమంతుండు సువేలమీఁదఁ దడిగి శైత్యాపాదిమందానిలం
బనుకూలంబగుచుండఁ గన్గొనియెఁ దుంగాంచద్విటంకాకరి
స్ఫుస్సౌధస్థితదగ్ధ్వజాంశులహరీఖద్యోతశుంభాకరిన్
దనుజాహ్వానగజేంద్రబృంహితమహాధ్వానోగ్రలంకాపురిన్. 432

వ. కనుంగొని నిజాంతర్గతంబున. 433

క. గోపుర వలరాజునకుం, గాఁపుర మల కాపురంబు గనుఁగొన నీలం
కాపురమున కెన యగునే, కాపురమయ్యె న్నిశాటగణభరితంబై 434

క. ఈవీటు సురభయంకర, రావణపాలిత మగుటఁ గరంబొప్పదు సౌ
మ్యాకృతియైన విభీషణు, చే వెలయు నటంచుఁ దలఁచెఁ జిత్తములోనన్. 435

ఉ. ఈగతి నెంచి తత్పురి మహీసుతరోయఁ దలంచి భూరిహే
మాగసద్వృక్షకర్కశనిజాంగముఁ గుంచి సమీరనందనుం
డాగిరి డిగ్గి డిగ్గి కులనందనములైన పురోపకంఠభూ
భాగములం దలిర్చువిరిపందిళులం గని యాత్మ మెచ్చుచున్. 436

సీ. నవరత్నఖచిత సుందరవేదికాయుద్య లసితంబులైన యాలయవరములఁ
గల్హారచక్రచక్రమరాళశైవల స్ఫారంబులైన కాసారములను

మకరందబిందు సమాక్రాంత మేదినీ భాగంబులైన యుపవనములను
రత్నకాంచన మహారజత సింహాసన స్థానంబులైన యాస్థానములను
గీ. జవలనంటి వెలింగెడు సౌధములను, నతిపవిత్రతర మహాశ్వశాలములను
కామరూపధరుండగు కపివరుండు, వెదకి జానకిఁ గానక విహ్వలించి. 437

గీ. మఱియు రథశాలలు మందురలును, నాయుధాగారములుఁ గృతకాచలములుఁ
బ్రాకటశిరోగృహంబులుఁ బ్రబలు ప్రపలు, నంతిపురములు నరసి యనంతరమున.

ఆ. అనిలసుతుఁడు రావణాంతఃపురంబున, నవనితనయ నరయ నరుగువాఁడు
లంక బింకమింక లంకిణి నిశ్శంకఁ, బిలుకుమార్చెఁ గడిఁది బీరమొప్ప. 439

ఉ. వంచనఁ దత్పురంబుఁ జొరవచ్చిన వారి నెఱింగిపట్టి బా
ధించు నిశాటి తన్ను నవధీరణ సేయుచు వచ్చి చంపనూ
హించిన నివ్విధంబున మహింబడ మొట్టునఁ దాఁచు నవ్వలా
పించుచుఁ గూలె లంక యరిబృందముచే పడునంచుఁ దెల్పుచున్. 440

క. లంకాస్వరూప యగు నా, లంకిణి గూలుటయు నిష్కళంకుం డనిరా
తంకుండు నగు మమణిప, ర్యంకము నరపేత్రి కానిలసితం బగుచున్ 441

వ. అనేకవిధాలంకరణ శోభితంబగు లంకాధ్యక్షు శుద్ధాంతంబున శుద్ధాంతఃకరణుం డగు వృక్షచరాధ్యక్షుండు మానవాధ్యక్షు శుద్ధాంతంబు నరయుచుం జని చని కాంత విధుకాంత శిలాస్థగిత విశాలరమణీయతరంబగు నొక్క ప్రదేశంబున. 442

సీ. మణిమద్యపుత్రికా మహిత నిజప్రతిబింబభేదముఁ జలకంబు కతన
వీణావిరాజితస్వీవాక్ప్రకర విభాగము దగు దాశమానము కతమున
రమణీయ దీపికా రత్నదీప ప్రభాన్యాయ దము నొందు సన్నము కతమున
చంద్రికాపాండురసౌధదీప్తిచ్ఛటాంతరము చకోరమోదంబు కతనఁ
గీ. దగ నెఱింగి యహర్నిశాతారతమ్య, మశననిద్రా విహారభోగాదికములఁ
దెలిసి భావగతంబుఁ జూపులన తెలిసి, సకల కార్యాంబులకు నవసరము దెలిసి 413

క. స్వస్త్రీ సమానలగు న, త్తుస్త్రీ నివహంబులు పరిచర్యలొనర్పన్
వస్త్రాభరణంబులఁ గుసు, మాస్త్రశరప్రతిమ దేహయష్టి వెలుంగన్. 444

క. ఈ మేని యొద్దిగాఁ దగ, దామే లికఁ డాని దీని కనుమానము లే
దే మేనిఁ బసిండికిఁ గల, దే మేలగు తావి యనుమతికిఁ బాత్రంబై. 445

వ. ఒప్పు మెఱయుచున్న 446

గీ. కాంచనాభోద దేహ ముక్తాఫలప్ర, వాళరదన రదచ్ఛద వారణపతి
యానలసమానయసమాన మానగుణభరితఁ గృశోదరి మందోదరీసమాఖ్య. 447

క. దబ్బాటునఁగని జనకజ, నుబ్బాగఁగఁగంటి నని మహోజ్జ్వలుఁ డెవలో
నబ్బా కీడు దలంచితి, నబ్బాలిక వేడ్క సల్పు నాయిబ్బంగిన్ 448

క. పతిఁబాసిన కతమున న, మ్మతిలేమిం దాల్మిఁదూలి మగువ రఘువరు
స్మృతిఁదలఁచుచు మేనున్ వసు, మతీరజము వర్వ వగల మఱుఁగక యున్నే. 449

వ. అని తెప్పతలంపుచేసి మఱియును రావణవిహారస్థానంబు లగు నయ్యాయి ప్రదేశంబులఁ బరమపవిత్రచరిత్ర యగు జనకపుత్రీసమన్వేషణపరుం డై యొందునుఁ గా డనూపడున్న హనుమంతుండు నిజాంతర్గతంబున 450

సీ. కడుఁ బ్రయత్నమున లంకాపురి శోధించి, కాంతాతిలకమును గందునొక్కొ
కని రామచంద్రుఁ డిచ్చిన యభిజ్ఞానమె, య్యెడఁ జేసక్క సీతచే నిడుదునొక్కొ
యిడి ప్రత్యభిజ్ఞాన మెలమిఁ గైకొని కపు, లీశ్రీప వసధి లంఘింతునొక్కొ
లంఘించి శ్రీరామలక్ష్మణ సుగ్రీవులకు శుభవార్తఁ దెల్పఁగలనొక్కొ
గీ. తెల్పి జలరాశి దాఁటి పృథ్వీవధూటి, పుత్రిఁగని కపులుబ్బ నప్పాటిపాటి
మగల రాఘవులకుఁ దెల్పి మారుతియను, పొగడునకుఁ బాత్రభూతుఁడనగుదునొక్కొ

క. అని తలఁచి యనిలతనయుం, డనిలజవుం డంత నొక్క హర్మ్యము నెదురం
గనుఁగొని తదగ్రమునకుఁ, జన్యగమున కెగయుచు హరిశ్రీయుం దాఁటితగన్. 452

క. రామరమణియగు సీతా, రామామణి వరయునంత రహిం వచ్చెంత
ప్రామాగ్రపూగబహుళా, రామ మొకటిఁ గాంచె నంతరంగము పొంగన్. 453

చ. ఫలదళబంధురప్రసవబంధనచారుశిలాటుమంజరీ
లలితలతామహీరుహవిలక్షితనిష్కుటము మ్లుగాంచి య
వ్వలనికిఁ జేరఁబోయి హరివర్యుఁడు గృహాంతరంబునం
గలయఁ జరించి భాగ్యమునఁ గామినినొక్కతె రాతుసీవృతన్. 454

సీ. మంచుబొట్టులఁ బసమించరి తమ్మికైవడి మోము కన్నీట వాడుదోఁపఁ
దామరతూండ్లు బెండడి డిందువడు మాడ్కిఁ బుజములు దుమ్మున బ్రుంగుచువడ
కొండచే వ్రేగిలిన యివుర నా వేఁడి నిట్టూర్పుచే వాతెఱ యొప్పుఁదప్పఁ
బొగచుట్టికొనదివ్వె జిగివట్టిన గతి మాపుమఁ బుట్టమున మేని పొలుపు తూలఁ
గీ. దడి మకిలవొందినట్టి యద్దముల కరణిఁ, జెక్కులులఁ గ్రమ్మ చెమటుచేఁ జెన్నుదొరఁగ
మానినియలంత నొక పెనఁ బ్రమానినీడ, నుల్లముడుకఁ బ్రలాపించుచున్న దాని. 455

సీ. అపయశంబునకుఁ జోటైతి నాహా యని, విన్ననిమోముతో నున్న దాని
బలిథక్తి సతుల కాపద్ధారియని రాము, నడుగకఁ దలఁచుచు నున్న దాని
మనుజాదులు గ్రసింతురని భీతి సంగంబు, చెన్నఱ వడఁకుచు నున్న దాని
నాథుఁ జూడంగల్గునా యనుతలపోత, నల్లంబు మఱుగుచు నున్న దాని

గీ. దుష్టచేష్టాసురీసమావేష్టనముఁ, సిద్ధనఖకేసరిప్రతిరుద్ధబాల
మృగియనఁగ నెంతయుం దనహృదయమదర, నుసురువిడువంగఁగమకించుచున్న దాని

క. అనఘన తాంతం జింతా, వనతవదన పిహిత కృత్తవస్త్రాంత స్త్రీ
హనుమంతుఁ డంతనంతం, గనె దుఃఖాక్రాంత రామకాంత భ్రాంతన్. 457

క. కని మునికన్నెయగుట భూ, తనయయగుటఁ దెల్పు సద్విధంబున జడల
ల్లిన కేశపాశమున మ్మన్నఁ బొరలెడు జానకిం గనుంగొని వంతన్. 458

చ. తగునె విధాత కిట్టియువిదం బతిఁబాయఁగఁ జేఁత సీతయు
ప్పగిది నెసంగుచున్న పతిభక్తి విశేషముచేత నొప్పెడుం
దగనియులంత మోము వెలిదమ్మి దుమారమున న్మనంగ హీ
నగతి మలీమసార్ధవస స్థితి నెంతయు నొప్పకుండియున్. 459

క. క్రిక్కిఱిసియు రక్కసులలో, నిక్కంజదళాక్షియొప్ప దించుకయును బ
ల్లక్కసుల నాగవల్లిక, చిక్కి క్రియ యయ్యె నేమి సేయఁగవచ్చున్. 460

క. మతిచెడి రాక్షసుచేనవ, మతినొందితి నిట్టు దిక్కుమాలి మిగులదు
ర్మతినంచు దూఱుకొంచుం, బతివ్రతాతిలక మిత పడునె కటకటా. 461

గీ. మధుకరవ్యాప్తి సుపరాగ మహిత పంక, జాతమునుఁబోలె నిమ్మహీజాతమోము
చూర్ణకుంతలభృంగసంకీర్ణమగుచు, భూపరాగపరాగసంపూర్ణమగుచు. 462

వ. అని వెండియు ననేకప్రకారంబుల శోకించుచు జానకీసమాశ్రయాశోకానోకహ
శాఖోపశాఖావిలీనుండై తదీయలక్షణంబు లిమ్ముగ విమర్శించుచుండ నంత. 463

చ. బలిమిఁ గుబేరునిం గెలిచి పంతమెలర్పఁగఁ దెచ్చికొన్నయు
జ్జ్వలరుచి పుష్పకం బసురవారిజనేత్రలు గొల్వ నెక్కియ
క్కలనికివచ్చి సీత నతిఖిన్నఁ గనుంగొని మానినీ కరం
బలమట మాని నీమహృదయంబున నన్గయికొన్నఁ గూడదే. 464

క. నినుఁ గానని వగ రాముఁడు, ననుజన్ముఁడుఁ జాకయున్న నంబుధిఁ గడువం
జనునే కడచిన మనుజాదనుల గెలుచుటెట్లు వారిఁ దలఁచు టుడుగుమీ. 465

సీ. జగదీశ్వరుండగు శర్వావాసంబుఁ గైలాసంబు బంతిగాఁ జేసినాఁడ
శక్రునంతటివాని సాధించికట్టితే వలతియా పుత్రుండు గలుగువాఁడ
నలకాధిపతి నన్న యనక మానంబులోఁ గొలలు విమానంబుఁ గొన్నవాఁడ
దేవతలకునైనఁ దేటిమాడఁగరాని పట్టణంబు జలధిఁ బడసినాఁడ

గీ. బ్రహ్మ చంపకుమని నను బ్రస్తుతించి, విడువు మన జము మందల విడచినాఁడ
నట్టి నన్నొల్లిద మెయిసర్చి యధికభోగ, భాగనుత్తమ వీక్రమ వడటమేలె. 466

క. పతివీరయనుచు ననుఁ బలు, పతియుఁ దివస్పతియుఁ బ్రేతపతియును నంభః
పతియును గొలువంగ మఱిఁ బలి, పతి యని పలవింతువో యశోధామ నరునిన్. 467

ఆ. పద్మహస్త కరుణఁ బట్టి కైకొనవు మన్మథుఁడేఁ గాని జారవారలకును
దలఁపు దీర్చి నన్ను దౌవారికునిఁ గాఁగఁ, జేసి యేల రాదె చెప్పనేల 468

వ. అని మఱియుఁ గామోపహతుండు గావున నవివేకభాషణంబు లాడుటయుం
జలించి, 469

క. పరపురుషులఁ జూడని యప్పరమపతివ్రత తృణంబు బరికింపుచుఁ దాఁ
బరుషవచనుఁ డనుచుం డిప్పగుసువ వాకుటయు నొవ్వఁబడి యిట్లనియెన్. 470

శా. సారాచారవిదూర క్రొవ్వినమతిన్ శార్దూలి గామించునా
సారంగంబును బెంటిసింగమును వాంఛం జేర నూహించునా
సారంగంబును శాతతన్ఖరవిస్తారాహతిం గూలు న
ట్లామూఢి న్నను సాధ్వి నాసపడి చావంతఃకృతిం దోఁచెనే. 471

క. ప్రభుతిలకుండగు రామప్రభు భార్యన్ నన్ను నాసపడితివి యహి న్
ప్రభఁ గాంచి చేఁదోపు శలభప్రవృత్తి యగాదె నీవలం బూహింపన్. 472

క. ననుఁ గారింపక దనుజాంగనలకు నాజ్ఞాపరంబుఁ గావింపుము భూ
తనయా గ్రహింపుఁ డనుమ వీ, తనయుక్తి నిట్లాడకుము వృథావచనంబుల్. 473

క. భోగేచ్ఛ లేదు ప్రాణ, త్యాగేచ్ఛయె గాని నాకు దనుజాధమ ని
ర్భోగేచ్ఛ నన్నుఁ గోరక, భోగేచ్ఛుఁడ వైతి గానఁబొమ్ము రఘుపతిన్. 474

వ. అని పలికి తన్ను నుద్దేశించి. 475

ఆ. కలుషమార్గఁ గామిఁ గామి గామికి నీవు, నెట్లు తెలియవచ్చు నిపుడు రామ
చంద్రు సాంపరాయసాయసాయకముల, నవని నొఱగి పొరలునపుడు గాక. 476

వ. అని యథోచవనయా నవిరళబాష్పజలపూరిత కపోలయయ్యుగ్మకరాయై చెక్కిటఁ
జేయిఁ జేర్చి తలయూఁచుచు దైవంబుఁ దిట్టుచు నిట్టూర్పు నిగిడించుచు నూర
కుండుటయుఁ బఙ్క్తిగ్రీవుండు సీతం గాచికొనియున్న రాక్షసీనిరీక్షణల నిరీ
క్షించి రూక్షాక్షరవచనంబుల నిట్లనియె. 477

క. ఈకరణిఁ దపింపక సౌమ్యాకరణము రెండు నెలలకయినఁ గలుగు న
ట్లేకరణి నేని దీనిన్ శికరణ నొనర్పుఁడనుచుఁ జెప్పుచుఁ జనినన్. 478

వ. పాలదిండిపాలంతులుం బుడమిపట్టిం బట్టుముట్టి రావణుం జెట్టవట్టు ఘని బిట్టు బాధ
లం బెట్టి పెట్టి యొక్క యవసరమ్మున. 479

క. కావలివారలు జనకజ, కావలిదెస నిద్రనొంద నపుడెతేఁగి యశో
కావనిరుహంబు డిగిమొం, కావని ఖేదమునఁ బరపుపావనిఁ బొడఁగన్. 480

వ. యిట్లు డిగి. 481

మ. వినయంబెల్లఁ గపిస్వరూపమున నావిర్భావమైనట్టి చా
దున్న సామీరి నతోత్తమాంగుఁడయి మోడ్పుంగేలు ఫాలప్రదే
శనిబద్ధంబొనరించి భక్తి మెసఁగన్ జ్యోజాతకుం జేరి మ్రొ
క్కినవిభ్రాంతభయాంతరంగయగు మం గీతున్నమీక్షించుచున్. 482

క. ఇతఁ డెవ్వఁ డొక్కొ ప్లవగా, కృతివాఁడుండొఁచె రాక్షసేశ్వర మాయా
కృతి నేతెంచినయట్టి సుకృతియేనిం బట్టి మ్రింగఁడే యనలరన్. 483

వ. అని బహుప్రకార విచారంబులకుం జొచ్చి తలంకుచున్నంత శాంతస్వాంతుండు హనుమంతుండు సాంత్వనస్వనంబున నక్కాంత కిట్లనియె. 484

క. మాయమ్మ రాముదూత సు,మా యమ్మలికంబు వాయు మాపద లెల్ల
న్మాయమ్మగు నీయలుకసుమా, యమ్మగు నక రావణాసురపతికిన్. 485

చ. అనఘుఁడు భానుసూనుఁడు మహాత్ముఁడు రాముఁడు సంతసింపఁగా
జనకజ నిన్నుఁ జూడఁగఁ బ్రశస్తుల వానరుల న్విధించ వా
రుసరిగి రెల్లదిక్కులను రోయఁగ మత్ప్రకృతంబు పేర్మి ద
క్కినమున కేనువచ్చి కృతకృత్యత నొందితి నిన్నుఁ గాంచితిన్. 486

క. హనుమంతుండనువాఁడఁ బవనపుత్త్రుఁడ నేకలోకవంద్యుఁడ జగతీ
తనయఁ బొడఁగంటి నని రా,మునకు న్వినుపింపఁ గనుట మునిశాంతలరా. 487

క. విను మారీచుని మాయ,న్మనఁగిన్ శ్రీరామలక్ష్మణులు నినుఁగోల్పో
యినవారలగుట లజ్జా,వనతకదనులగుచు నరయువా రొక్కెడన్. 488

ఉ. ఆయటవీస్థలంబున జటాయువుఁ గాంచి త్వదీయవర్తనం
బాయనఘుండు దెల్పి తదనంతర మాత్మఁ బరిత్యజింప శో
కాయతవృత్తిఁ బక్షిరఘునాథుఁ సన్విలపించి తత్పత
న్మాయకు నగ్ని సంస్కృతి నొనర్చిరి నాకజగన్నివాసిగాన్. 48

వ. తదనంతరంబున భవన్నిమిత్తంబుగా మహారణ్యపథంబులం బరిభ్రమించువారు. 490

గీ. బంధురహితానుబంధుఁ గబంధుశాప, మోక్షితునిఁగా నొనర్చి లోలాక్షి శబరి
శబరిభక్తిశోభంగు పూజలుగ్రహించి, పంకపర్వతశంప నప్పంపఁగడచి. 491

వ. ఋష్యవానరచయాకంబగు ఋష్యమూకంబునకువచ్చి భక్తి నత్యగ్రీవుండగు సుగ్రీవు
తోడ నగ్నిసాక్షికంబుగా సత్సన్నిధిం జెలిమిఁ గావించి. 492

క. తరణిసుతుఁ డోలి నాతని, తరుణిం గైకొన్న వాలిఁ దనుచరకాలిం
దరణికులుఁడు శ్రీరాముఁడు, ధరణింబడఁ గూల్చి తత్పదం బొసఁగ దయన్. 493

క. పేర్చినధృతి వాలిం బరిమార్చి యతనివైభవంబు లన్నియుఁ దన్నుం
జేర్చిన వానరుల న్సమకూర్చి యనిచె నాల్గుదెసలకు న్నినురోయన్. 494

వ. ఇవ్విధంబునం బ్రత్యుపకారపరాయత్తచిత్తుండగు మిత్రపుత్రుండు 495

ఉ. పంపినవానరోత్తము లపారబలాఢ్యులు మారుతత్వరన్
ల్గుంపులుగట్టి యుద్దెసలకుం జనఁ గొందఱు మేము యామ్యది
క్సంపరిశీలనార్థము విసంజనుదెంచి కనంగలేక పెం
దెంపునఁ బ్రాణము ల్జలధితీరమున న్విడువందలంచుడున్. 496

క. చావఁ గలదె మీరు గడుం, జేవగలిగి జలధి దాఁటి సీతం గనుఁడు ల
జ్జావనతవదన యగుచుం, జావఁ దివిరియుండె లంక జానకి యనుమన్. 497

క. ఖగపతి యొకండు దెల్పిన, విగతప్రాయోపవేశవృత్తులమై వా
ర్ధి గనుంగొని నన్నుఁబొమ్మని, నగచరు లనుపంగ దాఁటినాఁడఁ బయోధిన్. 498

వ. ప్లవంగసంప్రార్థితుండనగు నేను బూర్ణశతయోజనవిస్తీర్ణఘూర్ణమానమహార్ణవావ తీర్ణుండనై సూక్ష్మవానరరూపంబున లంకాపురంబు రాత్రియం బరిశోధించి రావ ణుండు సీతోడ దుర్భాషణంబు లాడుచున్న నవసరజ్ఞుండనై వానిపయిం దెంపు సేయక యిక్క్యశోకానోకహాగ్రంబున నొదిఁగియుండి యద్దురాత్ముండు వోయినం బొడగట్టితి నని పలికి మెల్లనానవకుల నుద్దేశించి వర్ణియుక్తవర్ణని కిట్లనియె. 499

ఉ. ఆదట భూమదైన్యకనవాచలు లందఱుఁ గామరూపు ల
య్యాదట సారవేగపాసితాశుగు లందఱు శూరులైనవా
రందఱు నిన్నుఁ గాంచి చరితార్థత నిమ్మెయి నొందియున్న వ
న్నందను పుణ్యకీర్తుల ననం దరుచారికి బ్రహ్మచారికిన్. 500

ఉ. అన్నలినాక్షి యిట్టనియె నన్న భవద్వచనోద్గమత్సుధా
క్లిన్నమనస్క నయ్యె నిటుఁ గృత్రిమవానరరూపమూని మా
యన్నను గాఁచియుంబలుప సారము రక్కసుఁ గాఁగ సంశయా
పన్నహృదబ్జనై యొకఁడు వల్కెడ నేర్పడ విన్నవించెదన్. 501

క. రాముని దూతననుచు నా, తో మాటలంబల్కితివి సుతుండవు నాకు
న్నీ మోముఁ జూచుటం జే, తో మోదంబయ్యెఁ బల్కెదు న్నీతోడన్. 502

ఉ. రాముఁ శరణ్యభూములకు రాఁబనియేమి తదీయ భీమసం
గ్రామములోన నెవ్వరు పరాజితులై రతఁడే శ్రితంబునై

ప్రేమ వహించి యుండు మహిభృన్మణిఁ డే క్రియ మేని వాఁడు త
త్స్వామియుఁ దమ్ముఁడుం గనుఁ బ్రసన్న మనస్థితి నున్నవారలే! 503

క. సౌమిత్రి యెట్టివాఁడా, రామునకు న్రవిజునకుఁ జిరంబగు సఖ్యం
బే మెయిఁ గల్గె బయోనిధి, నే మెయి దాఁటితివి తెల్పు మేర్పడ నాకున్. 504

చ. అనవుడు నమ్మనిట్లనియె నమ్మ భవత్పతి కైక వాంఛకై
కనలక వచ్చెఁ గాననముఁ గయ్యము సేయఁగ నోడె భార్గవుం
డనితరసాధ్యుఁ డా నృపతి కాతనిచే మృతినొందిరట్టి వా
రవరయులు తాటకాదులు ఖరాదులు ఘోరవనాదు లంగనా. 505

వ. మఱియు నమ్మహాధనుర్ధరుచే మారీచాసు లనేకులు పంచత్వంబునొందిరది యట్లుం
డనిమ్ము. 506

క. వాలమునఁ గ్రూరు రావణుఁ, గీలించి చతుఃపయోధికీలాలములం
దేలించిన యవ్వాలిం, గూలించె నరేంద్రుఁ డొక్కకోల న్లీలన్. 507

క. సువ్రత రామునకేది ప్రి,యవ్రతమని తొలుత నడిగి తాలింపుము స
త్సువ్రత మదియొకఁడేల ప,తివ్రత ప్రియు మేకసతీవ్రతముఁ గదున్. 508

క. రాముఁడు మేచకజలద, శ్యాముఁ డతఁడుఁ దమ్ముఁడుం బ్రసన్నాస్యులునై
కామిని యెట్లుందురు నీ, లేమినిఁ గడు జిత్తసులు చలించు మనుండన్. 509

తే. లక్ష్మణుఁడు లక్ష్మణుఁడు కృతలక్షణుండు, తప్తకాంచన భానురధామదేహుఁ
డన్నయెడఁ భక్తిగలఁడు నిన్నాత్మఁ దలఁచి, తలఁచి వగనొందు మాతల్లి తల్లి యనుచు.

క. నీవు ధరాపతితండ్రులు, గావించిన భూషణములు గాన్పించిన సు
గ్రీవునితో బద్ధస్నే,హావేశితబుద్ధి యయ్యె నధిపతి మిగులన్. 511

వ. రామలక్ష్మణులకు నావిధంబునం గల యనుకంపాతిశయంబును మజ్జనకుండగు
జగత్ప్రాణుని ప్రసాదంబు కలిమిం గడలిఁ గడచి వచ్చితి మదీయాగమనంబున
కెదురు చూచుచున్న కపినికరంబు కరంబు నానందంబునొంద నృపదప్రవా బు
నం బయోరాశి మరల నతిక్రమంబునం దాఁటిపోవంగలవాఁడనని పలికి వెండియు

క. భూవిభుఁ డనంతుఁ డనఁదగు, నావిభుతమ్ముఁడు ననంతుఁ డతులితబుద్ధి
న్నీవు ననంతవు తమకున్, నావును నంతటను జనకనందన ప్రీతిన్. 513

చ. వెడ వెడ నమ్మ యిట్లనియె వీరవరా మదధీశునాజ్ఞ ని
జ్జడధిఁ గ్రమించి వచ్చిన యసాధ్యబలాఢ్యుఁడ వౌదు రామభ
ద్రుఁ డిటకువచ్చి దానవులఁ ద్రుంచి బలం బెసలార నన్ను నె
ప్పుడు గొనిపోక గల్గు ననుఁబోటికి దుఃఖము పారమొందునే. 514

చ. అనివదనంబువంచి విపులాశ్రుసమార్ద్రకపోలయుగ్మయై
జనకజ యూరకున్నఁ గపిచంద్రుఁడు తత్సతి కిట్లు వల్కె నీ
మనమునఁ జింతఁ బక్కుము క్రమంబున రాఘవుఁ డింక వచ్చి దై
త్యనికరము న్వధించి ముదమార నినుం గొనిపోవు నంగనా. 515

వ. అంతియేల నీవనుమతింపవు గాక వీఁక నియ్యశోకవృత్తు వాటికాసహితంబుగా నిన్నెత్తికొనిపోయి రామలక్ష్మణులసన్నిధిం బెట్టఁజాలనే యని పలికి వెండియు,

ద్వ్యక్షరకందము. మామము నీమనమున నమ్మ,మామము నను నమ్మి మిన్న మనుమని ననిన
వాని నీ మేను న్నన, నూన మమానమును నెమ్మి నూమము నమ్మనె. 517

చ. అనుటయు సంతసించి జనకాత్మజ యన్గొని మన్నిజాకృతిం
గనవలతేనిఁ జూపెద నగంబులు వాదగు కాలి పెద్దవే
లిఁ జిరుపంగఁజాలి బలిష్ఠుఁడనంచుఁ గడంగి మేనువెం
చెనతఁడు విశ్వరూపముఁ బ్రసిద్ధముగా హరి వాల్చి కైవడిన్. 518

క. చుక్కలు తలపువ్వులుగా, నక్కంజవిరోధిశకలు నవతంసము గా
దిక్కులు వసనంబులుగా, నక్కపి సర్వజ్ఞుఁడో ప్పె నతిపూర్ణుండై 519

ఉ. ఈగతి మేను పెంచిన కపీశ్వరుఁ గాంచి మహీజ చాలఁ బా
లీగతి నద్భుతాకృతి వహింపఁగ నేరికివచ్చు నీవు ము
న్నేగతినుండి యట్ల ధరియింపుము సూక్ష్మశరీరము న్నభో
భాగము భూమియుం దెసలు బ్రద్దలగుం దను వింకఁ బెంచినన్. 520

క. కడు నమ్మితి నీరూపం,బుడుపీథిని మించెఁ బెంచు టుడుగుమి కన్నా
పుడు విరళదేహుఁడై యు,క్కుడు మోదము జనకకన్యకుం బొనరించెన్. 521

వ. ఇట్లప్పటియట్ల సూక్ష్మశరీరుండై యమ్మహీతనయాకుం బునఃపునర్వందనంబులు గావించి తత్సుందరిడెందంబు మహానంద బు నొందందగు భాషణంబులాడి యొక్క యవసరమ్మున. 522

క. హనుమ ప్రయత్నంబున దాఁచినరాముని యుంగరంబు సీతకుఁ గాన్పిం
చినఁ జూచి యాఁడుఁ దైకొని యొడలంతంతయుం గగుర్పొడువంగన్. 523

ఉ. కన్నుల నద్దుచు న్మను మొగంబునఁ జేర్చుచు ముద్దుపెట్టుచుం
గన్నుల నమ్మదాంబువులు గ్రాలుచుఁ గాఁగ గపీంద్రు నెంతయు
న్మన్నన సేయుచు న్మగనిమాటలు దెల్పుచుటుంచు నూర్మికం
బ్రన్నన వేఁడ చన్ ప్రకృతిఁ గాంచినయట్టుల సంతసించుచున్. 524

సీ. ఇందాఁక నను బాసి యెందుండితి వటంచు, విభుఁ గూర్చ వచ్చితివే యటంచుఁ
గడలి నెవ్విధమునఁ గడచి వచ్చితి వంచు, నీ వెట్లుపాసితి నృపతి నంచు
నీవున్నఁ దెమ్మనె రావణుం డనుచును, రాముండు ననుఁ జూడ రాఁడె యనుచు
రామలక్ష్మణులకు క్షేమమే యనుచు న న్నెంత పాపప్రజన్మ మెత్తిననుచుఁ
గీ. చేతు ముదమున శిరమునఁ జేర్చికొనుచు, భర్తృసన్నిధి వడసిన పగిది నధిక
మోహమందుచు మఱియు నమ్ముద్రికాళి, వీక్షణ మొనర్చి పల్కెఁ బృథ్వీతనూజ.
క. మేనికిఁ బ్రాణముఁ దెచ్చితి, దానవు మద్రక్షకమునకు నిదానవు గానం
దానవుఁ గూల్పన్ నరేంద్రుం, దేనవు నవుఁబాటుగల్గదే తేమున్నన్. 526
క. నీవిట వచ్చినపుడు నీతో విభుఁ డేచునియె నన్నుఁ దోడ్కొనిపోవం
గావచ్చితివే యని యా, పోవని మాటల్కులు నిగుడ్చెఁ బొంగుఁ జెలంగన్. 527
వ. ఇవ్విధంబున నతిరిక్తహర్షపరాయత్తచిత్త యగు నమ్మత్తకాశిని యుత్తరచరోత్త
మున కిట్లనియె. 528
క. నీవసమానుండవు నే, నేవిధమున నీ ఋణంబు నీఁగుదుఁ మనిసం
భావిత నీకతనఁ బునర్జీవిత నైతిం గదుం బ్రసిద్ధముగాఁగన్. 529
ఉ. వాపసుపాటులెల్లఁ బవనప్రియనందన చూచినాఁడవ
బ్జాపతితోడఁ దెల్పి రఘుపుంగవుఁ దోడ్కొనివచ్చి రావణు
న్నూపఱఁ జూపవు ల్వ్యగడ రూఢివధింప నోర్చి నన్నసం
ప్రాపితధైర్యఁ జేయుము కృపాపర మ్రొక్కెద వేయు నేట్రికిన్. 530
వ. అనుటయు నప్పవనతనయుం డమ్మలికమ్ము గ్రమ్మదేఱ నయ్యమ్మకు నెయ్యమ్ము
గా నిట్లనియె. 531
క. ఖరనఖరంబుల నరహరి, హిరణ్యకశిపున్వధించు నైదైఱదోఁప
న్నరనఖరంబుల రాముఁడు, దురాత్ము రావణువధించు దురమునఁ దరుణీ. 532
ఉ. సందియమేల రాముఁ డనుజన్మసమేతముగాఁ బ్లవంగపు
ల్వందడిసేయ నెట్లయిన సాగరము న్వెస నిగ్గమించి దై
త్యుం దును మాడి యంతఁ బరితుష్టమనస్కత నొందియాతఁ డో
సుందరి నిన్నుఁ గైకొను విశుద్ధచరిత్రవు శోకమేటికిన్. 533
వ. అని తెండియుం దగిన వచనంబుల నూఱడించి. 534
క. బారాక కెదురుచూచుచు, నీరాకరతీరభూమి నిలుతురు ప్లవగు
లోప్పరా కపివర్య యనుచు, నారాకాచంద్రవదన యొసఁగుము సెలవున్. 535

క. నాపైఁ బ్రాణములిడి రఘు, భూపతియుం దదనుజుండుఁ బూవసుతుండుం
జాపులు దీపులు వట్టఁగ, భూపుత్త్రీ మాకు కృపుడ పోవఁగవలయుంగా. 536

ఉ. జానకిఁ గాంచివచ్చితి నసాధ్యజవోన్నతి లంకనంచు భూ
జానికిఁ దెల్పఁగం గను నిజమ్ముగ నమ్మఁగనిమ్ము ప్రత్యభి
జ్ఞానము నావుడుం జనకకన్యక సంతసమంది యమ్మరు
త్సూనుమొగంబు గాంచి పరిశుద్ధపరిస్ఫుటభాషణంబులన్. 537

ఉ. భాసురచిత్రకూటకృతపర్ణకుటీరమున న్వసింపఁ గా
కాసురుఁ డేఁగుదెంచి నను వాత్రియొనర్ప నరేశ్వరుండు ని
ష్కాసితుఁ జేసె వాని నొకకన్ను వగిల్చి యెఱుంగ రెవ్వరుం
ద్రాసవిదూర యివ్విధము రాఘవు లిర్వురు నేనుఁ దక్కఁగన్. 538

క. కావున నీ కెఱిఁగించిన, యీవిధము నరేశ్వరునకు నేర్పఱచిఁచో
నీవు ననుఁ గాంచి వచ్చుట, భావింపఁ దోఁచుఁ దెలియఁ బలికి ముదమునన్. 539

క. వీఁడు ధరానందనఁ గన్నాఁడని రాముండు మిగుల నమ్మునటుగ సతీ
చూడామణి యొసఁగె న్నిజ, చూడామణి బ్రహ్మచారిచూడామణికిన్. 540

ఉ. నూత్నసరోజగంధి సువనోజ్ఞతమూర్తికి నిర్వధి న్నిశా
రత్న మొసంగినం గొని శిరంబునఁ జేర్చుచు నమ్మణి న్మహా
యత్నముతోడఁ దాఁచి పవనాత్మజుఁ డెంతయు వేడ్క మానినీ
రత్నము వీడుకోల్పడసి రాత సవక్షపరిక్రమార్థియై. 541

క. దుర్భరపరుషాత్ముఁ డయుత, దుర్భవలు జనకకన్యతో రావణుఁ డ
ర్భార్భటిసాడె వినట నా, దుర్భరక్రోధవహ్నివివశాత్ముండై. 542

వ. సహింపక హనుమంతుండు లంకాపురాభిముఖుండై కేళీవనోద్యానంబునకుం జొచ్చి. 543

క. తోఁటలుఁ బూఁదోఁటలు లంటి, తోఁటలు నునఁదమలపాకుఁదోఁటలు లగల్చి
న్వాటములు వాజిశాల, వాటము లురువేదికాకవాటము లూడ్చెన్. 544

వ. వెండియు. 545

సీ. విస్తారఫలతరువిస్తారములు రాల్చె సాలము ల్సాలము ల్నేలఁగలపె
సారమ్ములైన కాసారమ్ములు గలఁచెఁ గొమ్మలు గొమ్మలు గూలఁద్రోయ
గోపురస్ఫూర్తులు గోపురమ్ములు వ్రాఁకె ఖగముల ఖగముల కదలఁదోలెఁ
బోటుల గుడుల పోటులఁ జెదరించె ధామము ల్ధామము ల్నామమడఁచెఁ

గీ. దావలమ్ముగ భద్రదంతావలమ్ము, లున్నశాలలు నురుమాడు నుగ్రవాల
జనితవాతూలవిభ్రమజ్జలదశకల, సంభవుం డగు పవమానసంభవుండు. 546

జనితమహోద్ధతిఁ దనుజసంఘము నుద్ధతి మాన్చి వెండియున్
మొనసిన నుగ్రుఁడిట్లుఁ గపి మూర్తి వహించె ననంగ రాళుఁడై. 558

క. పదవాలకరనఖరములఁ, నదిమి విసఱ్ఱవేసి వచ్చి యస్ఫాళింపన్
మదగజతురగస్యందన, పదాతులవారించెఁ బవనభవుఁ డొకమాత్రన్. 559

వ. ఇవ్విధంబునం జతురంగంబులం బారిసమరి. 560

ఉ. రూఢకృతి న్విరోధుల శిరోధుల వాలము చుట్టి తోరణా
రూఢుఁడు వాయునందనుఁడు రోదసి పిక్కటిలంగ వార్చుచుం
గాఢబలంబునం జలధిఁ గల్పుచుఁ బేర్చుచు నివ్విధి న్సమి
త్ప్రౌఢిమ ఖేచరాళి దనుఁ బ్రస్తుతిసేయఁ జెలంగి యార్చుచున్. 561

ఉ. వారక వెండియుం దనుజవారము దన్నెదిరింప నయ్యెడ
ద్వారముఁ జేరఁబుచ్చు నవార్యబలోద్ధతియై తగఁ బ్రాగ్
ద్వారముఁ జేరి నిల్చి దనవారల చావు గనంబుఁ బందలో
వారలచే నెఱింగి పరివారముఁ గాంచి దశాస్యుఁ డార్తుఁడై. 562

ఉ ఔర విచిత్ర మొక్క ప్లవగాధముఁ డిందఱ నాత్మసోత్తమా
చారుల సచ్చివారుల విచారవిహారులఁ జంపె నద్దురా
చారునిఁ గూల్చి రండని ససంభ్రమత న్నియమించెఁ బాపవి
స్తారచరిత్రులన్ దివిజశత్రుల నేడ్వురమంత్రిపుత్రులన్. 563

ఉ. తప్తహృదబ్జుఁడై విభుఁడు దమ్ముఁటు వంపఁగ సత్వరంబున
న్సప్తహయోగ్రమంత్రిసుతసప్తక మంతయు నుబ్బమీఱ ను
త్తప్తభుజుల్నిశాచరులు దారుణరావుల గూడి కొల్వ సం
తప్తసువర్ణ భాసురరథద్విరదాశ్వచమూసమేతమై. 564

క. చని పవనతనూజుం గనుఁ,గొని పోదువుం డేయుఁ డనుచుఁ గొల్లున సేయన్
హనుమంతుఁడు తపనసముఁ, డనుమాన మొకింత లేక యతిమాత్రుండై. 565

క. గొదకొని మదకరిపదముల, జెదఁ జదిపి రథంగి శుక్రశిష్యబలంబున్
జెదరుపలుఁ జేసి మదమెద్యఁగ దనుజమంత్రిసుతసప్తకముఁ గిట్టి వేసన్. 566

క. వాలము కరవాలముగా, శాలము గావించి మర్కటాధ్యక్షుం డా
భీలముగా దనుజులఁదుం, గాలముగా నప్పుడిమపగాలం బనుమన్. 567

గీ. ఇట్లు పోరాడి యిరువుర నెత్తి కేలఁ, బట్టి శిరముల నొండొండఁ బగులవేసి
దానవామాత్యపుత్రసప్తకము నొక్క, పెట్టఁ బంచత్వ మొసరించి పేర్చి యార్చి.

క. పంచత్వం బొనరించె న్పంచత్వాగ్రుం బంచభూతసహోదాతులం ద
త్పాంచకము మంత్రిపుత్రక, పంచత్వం బెఱిఁగి దనుజపతి మతి వోవన్. 569

క. ప్రాప్తసువాలభ్రమణ, వ్యాప్తజగత్ప్రాణఘనసహాయత హనుమ
ద్దీప్తాగ్ని మంత్రిపుత్రక, సప్తకవన మిట్టులేర్చి సాభసవృత్తిన్. 570

వ. క్రమ్మఱ నెప్పటి యట్ల తోరణస్తంభాధిరూఢుఁ డై విజృంభించుటయు 571

క. హతశేషులచేఁ దనమంత్రిసుతనూజులు దెగుటవిని యధికరోషమున
న్వితుఁడగు రావణునాజ్ఞను, నతనిసుతుఁడు వెడలె నక్షయబలుఁడగుచున్. 572

సీ. కాలకింకరసదృక్కాలదేహంబులు గ్రాల పార్శ్వములు రాక్షసులు నడువ
రథనేమిహయఖురసింధురఖురపదోద్ధితరజము నాకధునిఁగర్దమము సేయ
నింతవిక్రమశాలి నెక్కడఁ గాంచని తండ్రి తనలోన నమితమోదంబు నొంద
నక్షయుం డితఁడు ఫాలాక్షునకుఁ బోఁడు పక్షసమృద్ధవని సురావలి వడంక

గీ. నధికరాక్షసవంశకుఠారుఁ దెల్ప, వికటముగ బక్షులపసవ్యగతులఁ దిరుగ
నరదమున నెక్కియున గ్రద్దలాకుచుండ, నెమి రాక్షసనందనుం డిట్లు వెడలి

క. అక్షయుఁ డీక్షించె న్హర్యక్షసదృక్షు స్స్వపక్షరక్షాదక్షు
న్వృక్షచరాధ్యక్షు నసత్పక్షక్షోదక్షు రాజితక్షున్. 574

వ. కనుంగొని. 575

క. తలపడి తనకంటె న్మును, దలపడి పోరాడి పరతనయుని బాహా
బలజలధిమగ్నమగు నిజ, బలజలధిం గాంచి రోషభరితుం డగుచున్. 576

క. కోలలు గురిసేయ న్వరి, గోలక్రియ హనుమ లెక్కఁగొనక బలువిడి
వ్వాలములు గురియు నసుర కి, సాలంబులభంగి వానిఁ జక్కడఁచి వెసన్. 577

ఉ. పెండియుఁ జండకాండములు వేసిననాజ్యము గ్రుమ్మరింపఁగా
మండెడు నగ్నిపోలె హనుమంతుఁడు పేర్చి దశాననాత్మపు
త్రుం దరచావుచావ నొక దొడ్డశిలం దలవ్రేయ నొచ్చి యా
తం డవశత్వమొందియుఁ బడంపడి విక్రమదోహలంబునన్. 578

చ. మనుజవిరోధి తన్న వెడమాటలు వన్నినఁ గోపమెత్తి య
ద్దనుజవిరోధి యక్షయకృతప్రకృతుల్ దశవొందనీక యా
తని మెడ వాత్మవాలకలితమ్ముగఁ జేసి ధరిత్రి వ్రేయుడుం
గనుఁగవ నస్రుధారలొలుక న్విలపించుచుఁ గూలె నేలుచున్. 579

క. తుయరహితుఁ డనిలసుతుఁ డ,క్షయు రహితప్రాణుఁ జేయఁ గ్రమ్మతి దనుజు
ల్భయవృత్తిం బుత్రపరిక్షయ మెఱిఁగించుటయుఁ బఙ్క్తికంఠుం డార్తిన్. 580

స్రగ్ధరావృత్తము. భీమబ్రహ్మాస్త్రపాశాపిహితు హరిసుతుం భీమదాటోపబర్హి
ష్ఠ్యస్మామేయప్రకాశు న్పృథగచరితు నక్షోభ్యసత్త్వు న్రుమద్య
ద్గ్రీవాత్మాతిక్ష్యప్రతాపు న్పృథుసహితగుణోద్ధి న్మహాబాహు దీర్ఘా
యుష్మంతుం బాఘఁ దద్దైత్యుఁడు గని యధికోన్మత్తుఁడై చేరి యంతన్.

క. పట్టికొని నిజరథంబునఁ, బెట్టికొనియెఁ గానియతఁ డభేద్యుఁ డెవరికిం
బట్టుపడఁ డివ్విధంబునఁ, బట్టుపడుట లీలయనుచు భావింపఁ డెదన్. 590

వ. ఇట్లు మురభిమానంబున నవ్వనచరేంద్రు నిజరథంబునం బెట్టికట్టి మహానందంబున శంఖ
భేరీ మృదంగ ప్రముఖ నిఖిల జయధ్వానంబులు నింగి ముట్టం గదలి. 591

చ. పురమున నెల్లవారుఁ దను బోరన గీర్తనసేయ వారు ల
బ్బురమునఁ జేల నిట్లు కపిపుంగవుఁ దోడ్కొనివచ్చి రాక్షసే
శ్వరునకు మ్రొక్కి చూడుము నిశాచరనాయక కట్టితెచ్చితిం
దరుచరునం దమఁ జూపిన ముఖంబునఁ బుత్రకుఁ గౌఁగిలించుమున్. 592

ఉ. తోరణ మెక్కి రక్కసులఁ ద్రుంచుచు నక్షకుని న్వధించి యా
ధోరణముఖ్యులం జగిపి దోర్బలనిర్జితశక్రజిత్తైన నీ
తోరణమావరించుటకుఁ దోఁచినవానిఁ బట్టితెచ్చితిన్
గారవమొప్ప నిన్నుఁ గొనియాడఁగ నేరితరంబు చెప్పుమా 593

వ. అని మఱియుం బ్రియనందను నపరిమితమధురవచనంబుల నగ్గించి రక్షోధ్యక్షుండు
వృక్షచరాధ్యక్షు నీక్షించి రూక్షాక్షరపరుషవచనంబుల నాక్షేపించి. 594

క. ఎవ్వఁడ వెవ్వఁడు పుత్తెనె, యివ్వనరాశిం దరించి యేతెంచితి ని
న్నెవ్వఁ డిటఁ బంపె నప్పుడు, నవ్వనచరుఁ డసురతోడ నగ్వదరంగన్. 595

ఉ. రామునియాజ్ఞఁ జొచ్చితి ధరాసుతఁ గన్గొన వారిధి న్రఘు
స్వామియనుగ్రహంబున జవంబున దాఁటితి వాయుపుత్రుఁడ
న్నీ మది నొవ్వ దైత్యుల ననేకులఁ బట్టి వధించితిం గపి
స్తోమము సంతసింప నినుఁ జూచి భవత్పురిఁ గాల్చి పోయెదన్. 596

వ. అని పలికి వెండియు. 597

క. అవనీతిపరుఁడవగుని, న్నవనీపతి సంహరించి యవనీతనయా
నవనీతదేహఁ గొనిచను, నవశ్యమున రాక్షసేంద్రుఁ డాగ్రహుఁడగుమున్. 598

క. ఈతయుచరవరుఁ గపటా, న్నీతఁడు వధింపుఁ డనుచు విభీషణుఁ డసురని
ర్ధూతాఘుఁడు వారించెం, దూత యవధ్యుఁడని పలుకుదురు బుధులనుమున్. 599

క. ఈకరణి నివారింప మ,హాకోపము నొంది రావణాసురుఁ డసురా
నీకములఁ గాంచి యీకపి, తోఁకను నగ్గిఁ దవిలించి త్రోలుం డనినన్. 600

మ. దనుజుల్ తైలవిలిప్తవస్త్రవితతిం దద్వానరాధీశవా
లనిబద్ధం బొనరించి ఘోరగతిఁ గీలాప్రస్ఫూర్జద్ధవ్యవా
హనుఁ గీలించి సురేంద్రజిద్విహితబ్రహ్మాస్త్రప్రబంధప్రమో
చనవాతాత్మజుఁ బొమ్ము పొమ్మనిరి హాస్యంబు ల్ప్రసంగించుచున్. 601

ఆ. ఇట్లు సోఁకుమూఁక లెలమి నవ్వుచుఁ దమ, జిహ్వసంతసింపఁ జేరి వాని
తోఁక రవులఁబెట్టి తొలఁగి పొమ్మనుటయుఁ, గాలిచూలి మిగులఁ గసరువొడమి

క. కీలిప్రకలితనిజఘన, వాలాలాతభ్రమణవివర్ధితవహ్ని
జ్వాలాజాలుండై యా, గ్గోలాంగూలోత్తముఁడు సకోపుం డగుచున్. 603

క. పురమునఁ గల బంధురసుం, దరమందిరవారణాయుధస్థలరథ్యా
సురుచిరలసత్ప్రపాసా, వరథంబుల కొక్క పెట్టి దహనము వెట్టెన్. 604

క. పొగవెడలి యెల్లదిక్కుల, బుగబుగ మనుచుంట లెగయఁ బోరిబోరిఁ దనుజు
ల్వగనొంది పత్రికఁ ధయ, దెగడిరి సతిసీత నేల తెచ్చెనటంచున్. 605

వ. అంతం గ్రమక్రమంబున సప్తార్చి ప్రవృద్ధార్చియై పేర్చె. 606

క. దళమగు వహ్నిజ్వాలలు, జళజళయని చిటిలి సౌధబృందము పడఁగా
గళవళ మందుచు హుతభు, క్ప్రళయముగా వగచి మిగుల భయపడి రసురుల్. 607

గీ. రాముకోపాగ్ని యిట్లు మర్కటునిపేర, బూని లంకాపురము నేర్చుచున్న దనఁగ
వాయుతనయుండు గొంటుగైవడి నిజోరు, వాలదండంబు త్రిప్పుచు వర్తిలంగ. 608

సీ. ధామము ల్నిర్ధూమధామము ల్చేసి శోకమరుపూఁదోఁటలు గమలుఁజేసి
వర్త్మంబులను గృష్ణవర్త్మంబు లొనరించి భూతిశాంతయును విభూతిఁ జేసి
కలశాలలెల్ల నింగలశాల లొనరించి జాలంబులను శిఖాజాలముంచి
యవరోధ మధికధూమావరోధముఁ జేసి పటురూపములు విరూపము లొనర్చి

గీ. మండపంబులు మండెను పటుఁ గలిపి, గుమ్మములనెల్ల నిప్పుల గుమ్మరించి,
కాయమానంబులు ధగద్ధగాయమాన, ములుగ నొనరించె హరివాలకలితవహ్ని. 609

వ. ఇట్లాత్మవాలాభీలవహ్నిజ్వాలాజాలంబుల వాతూలబాలుండు లంకాపురభేదనం
బు భస్మంబుఁ గావించుచుండె నట్టియెడ. 610

ఆ. కంటిమంటఁ దోఁక గంటించికొనివచ్చి, గ్రాలుచున్న కాలకాలుఁ డనఁగ
నీతఁ డొప్పెననుచు హృదయంబులు చలించు, చుండ వనుపు లుమ్మ హోర్వరేశ

చ. కోలఁదులఁ జేరువారుఁ దమకుం బొగచుట్టిన నక్రువారిక
న్గోలుకులఁ గాలువారుఁ గపికుంజరుఁ గాంచి భయాతిరేకులై
కేలఁదులఁ బాలువారుఁ గడుఁ గేకలు వెట్టెడువారు నెంతయు
న్వాలపెలఁ బాఱువారు నయి విహ్వలమందిరి రాక్షసాధముల్. 612

సీ. బడబాగ్ని జలనిధి వెడలి లంకాపురి, నేర్చుచున్నదని యూహించువారు
నదె విభీషణుఁడు పుణ్యాత్ముఁ డాతని యిల్లుఁ, జేరదగ్గదని వీక్షించువారు
నీకపి లయరుద్రుఁ డిది ప్రళయంబుగా, కితరంబు గాదని యెంచువారుఁ
గొని తెచ్చికొనినట్లు క్రోఁతతోఁ గయ్యంబు నగ్గిఁ, బెట్టె నేల యటంచుఁ దిట్టువారుఁ

గీ. పూర్ణమై మంటఁ గని హుతభుక్శిఖాక, లాపముల గుందువారు విలాపమందు
వారు బంధుల బేర్కొనువారుఁ బాలు, వారునై రక్కసులు గడవగలఁ బొగులు. 613

క. వాయుసుతుం డెసకొల్పఁగ, వాయుసఖుండు పేర్చి ఘనమువారణనేర్చె
న్వాయుజవాశ్వరథేభర, థాయతకేతన నికేతనాదులఁ దోడ్కొ. 614

గీ. కపికులాధీశ్వరుఁడు దాపికాఁడు గాఁగ, బొదలు నూతనము బురము సొచ్చి
ముఖ్యధన ధాన్యపరిధానములు హరించె, గాలిచెలికాఁడు జిహ్వ ముక్కన్న గాఁడు. 615

ఆ. సమనివార్యభావిసాగరబంధన, సాధనోపకరణసవనములకు
నధికయత్నమొప్ప నంగారములు గాల్చి, చందమొందె బవననందనుండు. 616

వ. తదనంతరంబున నిజలాంగూల భ్రమణాగ్రణి మథన సముద్భూత పావనీయాగ్నిం బూ
ర్వసుధాశన రుధిరాజ్యధారాచ్ఛటాసేకంబున ప్రవృద్ధంబు గావించి మంత్రసుత
సప్తకాక్షయకుమారాది పశువిశసనంబు గావించి పేల్చి పురందరాది బృందారక
సందోహంబు మహానందంబునొంద రక్షస్స్త్రీ విలాప మంత్రంబుతో లంకాపురం
బు పూర్ణాహుతి గావించి తద్ధూమ ఘ్రాణంబున ఖచర కిన్నరీ కాంతా సంతా
నంబులు మొదల సాంజనేయ సోమయాజి యాజీలానిఖంబు నిర్విఘ్నంబు గానానం
దసాగరావభృథస్నానంబు గావించి శాంతి బొందివరలు వాఁడైతనమనంబున. 617

క. వాలాగ్నికీల మరుదై, వాలగతిం జల్లనగుట వసుధాతనయా
శీలకరుణాసుధారస, మూలంబని తలఁచికొని ప్రమోదభరితుఁడై. 618

క. తనసేమము గోరెడు భూ, తనయను గ్రొవ్విల్లి పోయెదనని తదాజ్ఞం
జని కాంచె వారిరాశిం, జనితపరమశైత్యలతితజంతాక్లేశన్. 619

ఆ. కనినదంత దాఁటి కాశకేళిఖురము దగిచినుగడలి దాటెడి పరిశ్రమమున
దన్న పొదరిసూచు దరచరదులల ప్రాణవాయు వడగ నవసమతఁడ. 620

వ. ఇట్లు మహాబలుండు నిజవీక్షకర్కశలాంగూలవిక్షేపప్రసూతప్రభూతమహాబలంబున సముద్రంబు పాయవడంచి యేమియు వనుగడంపు పవనుండున వలివలిముఖుం డదను ల్లోన. 621

మ. చనుదెంచుం బవనాత్మజుండు ఘనఘుంఘుమాయతారావమో
దనవీతెంచెడుఁ దద్రమోవిశరయం బంబు ప్రతీక్షించుచుం
డ వళోభాగము భూమియుం దెసలు నిండం బర్వతేజంబుతో
ఘనుఁ డాకీశవిభుండు వచ్చెఁ బ్లవగోత్కంఠంబు నందంబుగన్. 622

ఉ. దక్షిణవార్ధితీరము మొదంబెసలారఁగ నిట్లు చేగ వ
చ్చ్యాత్మచరిత్రముం గని ప్రహృష్టమనస్కులై వానరాళి ప్ర
త్యక్షసమీరణుం డితఁ డటంచు నుతించి కవుంగిలించి తా
రాక్షితిపుత్త్రివార్తఁ గని యాతఁడు నచ్చెరువొంది యుబ్బుచున్. 623

ఉ. గంతులు వైచి రంతఁ బ్లవగప్రభు లంగదముఖ్యు లమ్మరు
త్సంతతిఁ జుట్టి ముట్టి కడు సంతసమందుచుఁ బల్కి రీవు స
త్సంతతి సన్నుతింపఁగఁ బ్రసన్నజలరాశిఁ దరించి ధారుణీ
సంతతిఁ జూచి వచ్చితి వసాధ్యబలుండవటంచు నెంతయున్ 624

క. వేయువిధంబుల సన్నుతి, సేయ న్మనమునను వేడ్కసేయుం దగన
వాయుతనూజుండప్పుడు, నాయతగర్జాధ్వనిప్రహాసితధ్వనితోన్. 625

గీ. జలనిధిఁ దరించి క్రమ్మఱ సాగరంబు, దాఁటివచ్చుట మొదలుఁ దుదయును గాఁగఁ
గలుగువృత్తాంత మెల్ల నక్కపివరులకుఁ, దెల్పె నెడయక బుద్ధివరుండు. 626

క. సతి రాజవరాళిఁ బాసిన, గతిఁ బ్రాణముఁ జిక్కఁబట్టి గతిలేమి నసం
గతి నిలుగుమిగులసీతా, సతియున్నది రాజవరాళి సన్నిధిలేమిన్. 627

క. కావున వేవేగ న్మన, మీవిధము రఘూత్తమునకు నెఱిఁగింపుటయుం
బోవుద మనవుడు విని సం, భావనమెసఁగం గపిప్రవరులు ముదమునన్. 628

క. ఆడుదురుఁ బాడుదురు గుమి, గూడుదురు సమీరజన్ముఁ గొనియాడుదురే
ట్లాడుదు రోడుదురుత్సర, మాడుదురు మనంబులధికహర్షంబుల్ గాన్. 629

వ. తదనంతరంబున. 630

ఉ. అంగదజాంబవద్ధనుమదాదు లతిత్వర నమ్మహోదధి
స్సంగతతీరము న్విడిచి శైలశిలామహిరుట్లతామహో
త్తుంగనదీవిశాలమగు తోరపుమార్గము పట్టి యంత ను
త్సాంగము భల్లుకప్లవగపుంగవు లెంతయు హెచ్చరింపఁగన్.

వ. నిరంతరప్రయాణంబులం జని చని కిష్కింధాపురసమీపగతమధువనంబుఁ గనుఁగొని

క. ఉల్లంబుల వెల్లివిరియ, నుల్లాసలసల్లహరిక నోలాడి కపి
భల్లూకవరు లవ్వనముం, బల్లన నిఱువంగఁ జొచ్చి భయవిరహితులై. 634

సీ. ఫలములనెల్ల నిష్ఫలములుగా రాల్చి యాకుల ప్రోవుఁ జీకాకుపఱచి
విరిపిండిగొని వావిరి పిండిగావించి లతములు గాఁగఁ బల్లవములూడ్చి
మూలంబులెల్ల నున్మూలము గావించి యూడల వ్రేలాడి యూడఁదీసి
కలకంఠములనొప్పు కలకంఠములఁ జోపి గములయి కుఱుల భృంగములఁ దోలి

గీ. ఘనలతాక్షయములు బరిక్షయమొనర్చి, కపిగణంబు వనమెల్లనుఁ గాసిచేసి
రవనిజావార్తఁ దెచ్చిన యట్టివార, లగుట నించుకయేని భయంబులేక. 635

క. మధుపానం బొనరించుచు, మధుపానమొనర్చినట్లు మత్తులగుచు న
మ్మధువనముఁ గాచువారల, విధువనముం జేసి రసమవిక్రమవృత్తిన్. 636

క. జనకజఁ గనుఁగొనఁ జనమున, వనరాశియు దాఁటి యొద్దువచ్చె ననుచు న
వ్వనరాశిఁ గాసిచేసిరి, వనచరు లనివార్యశౌర్యవర్తను లగుచున్. 637

ఉ. తద్వనరక్షకు లాక్షణమ తాపముఁ గాంచి నమస్కరించి భా
స్వద్వ్యగపుత్ర చిత్ర మొకవార్త వినందగు నంగదాదు లు
ద్యద్విరదంబులో యన భయం బణుమాత్రము లేక వీఁకయు
మ్మధ్వనమెల్లఁ జెల్లఁగిల సొల్పడఁజేసి రొకింత లోపలన్. 638

క. క్షిప్రగతినేను చని ప్లవగప్రభులం గాంచి యొడుపఁగా నడుగక వా
రప్రతిహతప్రభావు ల, గ్రప్రతిము లగుచు నవనిఁ గలిపిరి వనమున్. 639

క. ఇందిందిరములు కుముదము, మరందముఁ గ్రోలునెడ ముష్టిగత నఖ్రములు మో
పందలఁ గుసట్టి మధువన, మందఱు నగచరులుఁ గలఁచి యాడిరి స్వేచ్ఛన్. 640

చ. అని వనముం గలంచిరని యాడినమాటకుఁ బొంగి జానకిం
గనుఁగొని వచ్చి రట్లగుటఁ గాదె భయం బొకయింతలేక మ
ద్వనమున సంచరించెదు రనివార్యపరాక్రము లంచు రామచం
ద్రునకనుజన్మయుక్తునకుఁ దోయజమిత్రకులీనుఁ డిట్లనెన్. 641

క. మన హనుమన్ముఖ్యులు రా, మన రేఖ్వాగ సంతసంబు వల్లడిగొనఁగా
జనుదెంచి యిపుడు మన్మధు, వనముఁ గలఁచి యాడుచున్నవారట వింటే 642

క. కృతకార్యసిద్ధి నరుదెంచితినని సంతోషభరితచిత్తు లగుచు వా
రతిలోకపరాక్రము లీ,గతి వర్తింతురని మదిఁ గానఁగ వచ్చెన్. 643

ఆ. అనిన రామచంద్రుఁడను జన్మసహితుఁ డత్యంతహృష్టమానసాబ్జుఁ డగుచు
నిజము స్వామికార్యనిర్వాహకుల కీర్తి, చనవు దగున కాదె యనఁగ నూఁజ. 644

వ. అని పల్కె నంత ధాత్రీపుత్రీకళత్రసుమిత్రాపుత్రులు తదాలోకన సీతానువార్తాక
థనశ్రవణపరాయణచిత్తవృత్తులై యుండి రయ్యవసరంబున. 645

క. అవనిమిషోద్భవమున పీ,తావన మొనరించి పృథురయంబు మెఱయు న
ప్పావని మున్నిడికొని ప్లవ,గావలి సనుదెంచె ధరణి యంతయు నద్రువఁగన్. 646

ఉ. ఆత్మజవాపహాసితరయం బెసలారఁగ నిట్లు రా సమీ
రాత్మజుఁ డాత్మజన్మవిజితాత్ముఁడు జాంబవదంగదాదివా
తాత్మజులఁగూడి హర్ష వినయంబుల ప్రోవన నేగి కాంచె శు
ద్ధాత్ముల రామలక్ష్మణుల మొంతకశత్రుల సచ్చరిత్రులన్. 647

ఆ. కని నమస్కరించి కరములు జోడించి, తనముఖంబుఁ గాంచి తరుణి ధరణి
తనయ నితఁడు గాంచి చనుదెంచె నిరాముఁ, డాత్మఁ బొంగ నిట్టులని యె నతఁడు.

మ. కనుఁగొంటి న్నతిసీత నశ్రుకణముక్తాదామసంవీత నే
కనికృత్తాంబరభూత ధర్మసలిలాక్రాంతాననాబ్జాతఁ బా
వనశౌశీల్యసమేత భ్రమ్యదసురీవ్యాహారసంభీత నా
త్మనిబద్ధోగ్రఘనద్వియోగపటభూత స్తోకలంకాపురికిన్. 649

సీ. అతిభయదోల్కాసహస్రంబులోపల నొక్కత రోహిణి యున్నయట్లు
కాతకంటకలతాప్రాంతరంబున నొకకలికకల్లి యున్నయట్లు
ప్రసవితేహామృగప్రకరమధ్యంబున నొక్కట సారంగి యున్నయట్లు
బహువిధశ్యేననిశహాసమూహంబున నొక్కఁడు బాలకపోతి యున్నయట్లు
గీ. ప్రబలమార్జారికాకదంబంబులోన, నొంటిమెయిఁ గీర కణఁచు చున్నయట్లు
కృష్ణదైత్యాంగనాప్రతిరుద్ధ యగుచు, నున్నయది సీత సన్నుతాపన్నజాత.

వ. అని విన్నవించి ధీమంతుం డగుహనుమంతుండు. 651

క. ఏ మఱిగి యావ్యదిగ్గత, భూమీధరతరునికుంజపుంజంబుల న
బ్భూమిజ వెదకి కానక, యేమనిపోదు మని వికలహృదయుల మగుచున్. 652

ఉ. కొండ కడంగి రోయుచుఁ గుభృద్వివరంబు నొకఁ డేముఁ గాంచి యా
త్రాండవరీతిశాపిహితంబగు నగ్గుహ సొచ్చి యందు నిం
దుండన కల్గునాననతోఁ దప మొప్పఘటించుచున్న యా
ధ్యుఁడమహానుభావ నొకతం గని భక్తి నమస్కరించుచున్. 653

చతుర్విధకందము.

హంసశశినేత్ర దైవవ్రతంసా। శంసితచరిత్ర। దైత్యనృ। శంసా।
హంసహయవంద్యపారశు, భాంసా హంసనుత నిర్దయూవిధ్వంసా. 68

మాలిని నిగమనిగమవాసా నిస్తులస్వర్ణవాసా, విగతవిగతదోషా వేదవిందాబ్జదోషా
సుగుణసుగుణరుద్ధా శుద్ధపాపీ. రుద్ధా, జగతిజగతిగోళా ఛత్రవత్కృత్తగోళా.

గద్య. ఇది శ్రీసూర్యనారాయణ పదాబ్జధ్యానపరాయణభూసుర ధౌర్యవినయ రామశార్య
తనయ పండితసేవాసముచ్చయ క్రొత్తపల్లి లచ్చయప్రణీతం బైన దాశరథివిలా
సంబను మహాప్రబంధంబునందుఁ బంచమాశ్వాసము



శ్రీరామ.

# దాశరథివిలాసము.



## షష్ఠాశ్వాసము.



క. శ్రీమానినీమనోజ్ఞ, వ్యాల, తామరసమరందపానతాత్పర్యమిళిం
దా మేరుతుల్యవేంకట, నామమహామభృదళిందవాసముకుందా. 1

గీ. అవధరింపు మధికహర్షి వాల్మీకిమహర్షి యిట్టు లనియె నట్లుసంత
సాబ్ధి మునిఁగి రాముఁ డర్కనందనుఁ గాంచి, యిట్టు లనియెఁ బ్రేమ మెసఁగ.

క. ప్రాణంబులు మనకు జగత్త్రాణాత్మకుఁ గరుణఁ జేసి క్రమ్మఱఁ గలిగెం
బ్రాణము లాళింపక మత్ప్రాణేశ్వరి వెదకి నితఁ డుదధిమధ్యమునన్. 3

చ. ఇతని నుతింప నాకు వశమే యది యట్లుల యుండ నిమ్ము నీ
వతులబలాఢ్యులైన ప్లవగాధిపుల న్సమకూర్చి యబ్ధి ను
ద్ధ్రుతఘనభంగలబ్ధిఁ దరించి దశాస్యు హరించి మించి మ
త్సతి సతి సీతఁ జూడక యసాధ్యమనఃపరితాప మాఱునే. 4

సీ. శశికాంతవేదికాస్థలవిరచితసుమశయ్యాతలంబుఁ జెందవాగ్ర
దేహ లై పారభోగ్దీర్ణకారణతాళవృంతానిలాశోల్లవిపులమార్గ
కుంతల లై మహాతాంతాసదృశవిహారికాళతసహస్రములు గన్న
నైగ నూడిగములు సల్ప మద్బాహుత్వమోపలాలిత లై మనోజ్ఞసౌఖ్య
లీల మెలఁగుచుఁ బెట్టితే మకు భూరవాంతరమునఁ గటికినేల రాక్షసీమ
హోగ్రతర్జనముల నొక్కతె వణఁకుచు, నుండవలసెఁ జిత్ర మొకఁడు గంటె. 5

క అని మఱియు వచు రాముం, గనుఁగొని సుగ్రీవుఁ డేమి గలుగ విచారం
బున కడయాకుము ధరణీతనయాపహారువధసలుపుదము ముదమొదవన్. 6

వ. అని యిట్లారాధనసాధనశోభనంబు లగుభాషణంబు లాడి యప్పుడు. 7

క. అవనిఁ గలప్లవంగమపుంగవులన్ జతగూర్చి తెచ్చి కనుఁగొంటె మహా
పావకర్కకాంగు లియ్యోధవరుల కడ్డమె విరోధిదైత్యబలంబుల్. 8

ఉ. సంభరియింపఁ జాలునె యసాధ్యతరం బగుమద్భుగంబు వి
శ్వంభర యంచు నీప్లవగసైన్యము దాఁటెను నభ్రవీథికిన్

దంభ మొకింత లేదు వసుధాధర చూడుము నావుడుం బ్రణో
జ్జ్వలభక్తిశక్తుఁ దద్విభుఁ డతిసింహుఁడు సంతస మంది యిట్లనన్. 9

క. కడు సంతస మందితి నిఁకఁ దడ, వేటికి సబ్ధిఁ జేరఁ దరుచరబలము
న్నడిపింపు మనుడు సూర్యసుతుఁడు సంభ్రమ మెసఁగ సమరదోహలుఁ డగుచున్.

క. హనుమదంగదగవయగవా,క్షనలాంగదపనసదధిముఖప్రముఖకపిం
ద్రనికాంతావళ మగు,సైన్యనికాయము నాహవంబునకు నూల్కొలుపన్. 11

సీ. కుంభినీధరముల గ్రుద్ది బ్రద్దలు సేయుఁ జాలినహస్తము ల్సాఁచికొనుచు
ఖచరకాంతాప్రవ్యక్తఁబులు సుడివడి తిరుగ వాలంబులు ద్రిప్పికొనుచు
దిక్కదదళిత్రుతిస్ఫుటిత బుగా సింహనాదంబులు చేసికొనుచు
వెలయ డెబ్బదిరెండు వెల్లువ ల్గలకపిసేన వేర్వేర వీక్షించి రామ
చంద్రుఁ డధికహర్ష సాంద్రుఁడై యప్పుడి,సేంద్రనందనాంజనేయజాంబ
వత్ప్రముఖవనాటఘల్లుకప్రవరులఁ, గాంచి యిట్టు లనియె గారవమున. 12

క భద్రముగాఁగ నపూర్వస,ముద్ర మనం గండమిగిలి మొన వెడలెడు ని
ర్నిద్రగతి నింక శాత్రవ, విద్రావణకేళి కిపుడ వెడలుద మనుచున్. 13

శా. తద్వాహిన్యధినాథు లెంతయు మహోద్యజ్జైత్రయాత్రాక్రమం
సద్వాక్యాశుగుణప్రయత్నభరితోత్సాహంబునం బొంగి మ
ద్యద్వేదండశరీరధీరణభుజద్వంద్వంబు లుప్పొంగఁ గా
నుద్వాహోద్వహనార్థులట్టులు సమీకోద్యోగులై రంతటన్. 14

క. ఉదయగిరిశిఖరిపిస్ఫురి,తదినేంద్రేంద్రు లన దశరథసుతు లనిలజాం
గదభుజశిరఃప్రదేశస్థులఁ దనర్చిరి మామువారలకు ముదమొదవన్. 15

వ. ఇవ్విధంబున మహారథు లగు దాశరథులు కీశరథులై పొలిచి నడిచి రంత వనచర సమూహంబును భాస్కరసుతప్రేరితంబై పుడమి వడవడ వడంకఁ గడువడి న్నడువం దొడంగె నట్టియెడ. 16

క. తతవానరసైన్యసముద్ధతభూమీరజము వొలిచె దివిషద్గంగా
సితరత్నసరోరుహసంతతికిఁ బరాగ మయి యద్భుతస్థితిదోఁపన్. 17

క. పొన్నఁ బొలఁగతి వాలము, లన్నిటి దివి నొరయఁ ద్రిప్పి యాడుచు వినతో
మిన్నెటిఁ గూడఁ బొంగెడు, మన్నీటికిఁ జేర నడిచె మొన యలఘుగతిన్. 18

చ. ముదమున నిట్లు రెండవసముద్ర మనం గపిసైన్య మేగి త
త్సదమలతీరభూరుహరవిశాలలసత్పులినప్రదేశమున్

చ. కనకరథంబునన్ జనకకన్యక నుంచి పరేతభ్రమకాని క
ప్పన మొనరించి నావుడు కృపాంబుధి యుంచన్ద్రిశప్పు నైన నీ కో
సనుఁడవు గావు నీ వనుచు బ్రాంజలివై ప్రణమిల్లుదేని యే
మనియెడువాఁడు గాఁడు శరణాగతు నిచుం గరుణించు నర్మిలిన్. 81

క. కొలము నొప్పరించితి నాకొలము న్నిట్టుమని నృపవరుం బ్రణమిల్లం
దలపకుట యూహఁ గృశమూ, నలఁపఁ దటుఁ గాన యుపుని గను నిటు సేయన్. 82

చ. వననిధి దాఁటి వారిటుని వచ్చుటను న్మను గాఁగ బాణిం
గొని చని రామలక్ష్మణుల నగణం బని సంధి చేయుటో
పృ నను మెల్లఘంటులను బోఁడిమి నెంతయు నీవు పీఁకఁ దె
చ్చినదివసుం దొడంగి కఁగఁ జేయుము సౌమ్యత రాజమౌళికిన్. 83

వ. అని మఱియు ననేకభంగుల నుపన్యసించుచు. 84

ఆ. వె. దోషగహితు డయ్యెభీషణుఁ డిట్లను, నింక నొండు పలుకులెల్ల మాని
సీత నిచ్చి రాముఁ జేరి ప్రార్థింపుమట్లుగంటె బ్రదుకుఁ దెరువొకండు లేదు. 85

చ. అన విని క్రోధతామ్రనయనాబ్జుఁ డిట్లనియె న్నహోదరుం
గనుఁగొని చాలుఁ జాలఁదగి కయ్యము చేయఁగఁ జాలవేని క్రే
వనొదిఁగి యుండు కిట్లు బలవంతులు మానవులంచుఁ దెల్పుచు
న్మనుజభుగాళికిం బిఱికిమాటలు దెల్పఁగ నేల చేఁగవై. 86

ఉ. యక్షులమీఁద దాడి చనునప్పుడు నుద్ధవిడిం గ్రిహీష్టపా
ధ్యక్షులఁ ద్రోలునప్పుడు భయం బొకయింతయు లేని రాక్షసా
ధ్యక్షుఁడ నొక్కమర్త్య నభయం బని వేఁడుట యెట్లు విద్విష
త్పక్షుఁ బూని నాకు నహితం బొరింపఁ దలంచి తాత్మలోన్. 87

సీ. తపమున మెచ్చి ధాత వరంబులీయ రానెంచి యత్యుగ్ర మాసించినావు
బుద్ధి చెప్పుటకునై యుద్ధవాధీశుఁ డ పినమాతఁ జంపింప మిడిసినావు
బలిమిమై నిర్జరభామలఁ జెఱదెచ్చునప్పుడు వలదని చెప్పినావు
అలనాఁడు వారుఁ బిలువుమాఁపఁగనీక మించినపురముఁ గాల్పించినావు
నిండుకొలువున మనుజుల యండఁ జేరి, కొలిచి బ్రదుకు మటంచు వాక్రుచ్చినావు
వేదబంబుగఁ దలపోసిచూడ నీవు, మొదలనుండియు నగుణమ్ములను నావు. 88

వ. అని తనమనంబున నితండు మదీయవైభవబలపరాక్రమంబులకు నసూయాగ్రస్తుండై
పలుకువాఁడు గాకేమి యని నిశాచరుండు గనుంగొని. 89

మ. వికటభ్రూకుటిదుర్నిరీక్షుఁడగుచు న్విశ్వంభరాదేవిపై
రికటుస్వదన మాచరించి ప్రబలార్చిష్మచ్ఛిఖాజాలవ
త్ప్రకటక్రోధకషాయితాక్షుఁ డగుచు న్బాదంబునం దన్ని య
న్నికటంబు న్వెసఁ బాసిపోవు మనియె న్నిష్కారణాహంక్రియన్. 40

ఉ. పొమ్మని తండ్రియు న్సుగుణభూషణుఁడైన విభీషణు న్మహో
గ్రమ్మగు మాడ్కిఁ జూచి దశకంఠుఁడు దంతతతిం జంద్రహా
సమ్మున వ్రేయఁ బూనుడు ససంభ్రముఁడై పఱతెంచి మాను ఘో
రమ్మని యాఁగ నయ్యెడఁ బ్రహస్తుఁడు హస్తము చాఁచి వారణున్. 41

క. తన్నివ్విధమునఁ గనలుచుఁ, దన్నిన వెతలు మనమునఁ శోకతాపితుఁ డగుచుం
దన్నిష్కృతి గోరవక భ్రాతన్నిష్ఠురవచనముల నతం డిట్లనియెన్. 42

ఉ. ఇల్లములోన నీచెడుట కోర్వక యొంతయు నొత్తి చెప్పిన
న్నొల్లవు ప్రాణమూఁతము నొల్లనివాని క్రమంబున న్మహీ
వల్లభుఁ గానఁ బోయెద నవశ్యము నిమ్మెఁ దొఱంగి సజ్జనుం
డెల్లెడ నెట్టి యాపదఁ దగు నేనిఁ ద్యజించుట నీతిమర్మమున్. 43

క. అని పలికి మ్రొక్కి వీడ్కొని, చనుదెంచి పథక్షితి పూర్వసాష్టాంగంబున్
జనని కొనరించి యాపెకు, వినిచె నిజాగ్రజుఁడు పరిభవించుటఁ దెలియన్. 44

చ. ఇటు వినిపించి రావణునకే నభియాతిగ నైతిఁ దల్లి నీ
కిటు విను మింక రాఘవమహీశ్వరునిం గొలువంగఁ బోయి త
త్పటుకరుణాకటాక్షపరివర్ధితవర్తన నొంది యుండెదం
గటకటపాటు మాని గజగామిని వే సెలవిమ్ము పోయెదన్. 45

క. అనవుడు భయమందుచుఁ దజ్జనని కుమారకునిఁ గాంచి స్వాంతములోన
న్మది పాటిల నిజభర్తృవచనములు దలపోసి వీతసంభ్రమ యగుచున్. 46

శా. సంతోషంబు సుపుత్ర నీకనుచు వాత్సల్యంబునం బల్కి యా
త్యంతప్రీతిఁ గుమారుఁ గౌఁగిటికిఁ దీయం బొంగి యావిర్భవ
చ్ఛాంతారత్నము వీడుకోల్పడసి తత్ప్రాణనాథాహిభూ
కాంతు న్రామసలక్ష్మణుం గనునపేక్ష న్సంభ్రమాయత్తుఁడై. 47

మ. కరమర్థిం జని యాత్మసార సరమం గాశోల్లసన్మందహా
సరమ న్వీడ్కొని రాఘవేశ్వరపదాబ్జద్వంద్వసందర్శన
స్థిరబుద్ధి న్నిజమంత్రులెంతయుఁ బ్రవృత్తి న్నల్వురుం గొల్వఁగా
వరపుణ్యుండు విభీషణుండు జలధివ్యాకీర్ణమా తత్పురిన్. 48

చ. వెలువడి యంతరిక్షపదవి న్లవణోదధి సంక్రమించువా
నలువురు రక్కసుల్ శిబిరనువం దనుఁ గొల్వఁగఁ గొల్వఁగోపులన్
బలుగడి యున్న త న్వరిధవం బొనరించుటఁ జెప్పుచుం గపు
ల్బలువురు గొల్వనున్న నరపాలకు పాలికిఁ బోవుచుంటటన్. 49

క. అంచిత మగుతద్రక్షః, పంచకము దనర్చె మిగులఁ బొంతఁ దనుమ
న్వంచించి రావణాధము, పంచప్రాణములు వెడలి పాఱెడుభంగిన్. 50

వ. ఇట్లు చని. 51

క. రోధనిరోధము వీకవిరోధముఁ జలితాసురావరోధ మధికసం
బాధముఁ బృథులాంగూలో, త్సేధముఁ గపియూథ మసురశేఖరు లెసఁగన్. 52

చ. కనుఁగొని విస్మయంబున బ్రకంపము హర్షముఁ గ్రమ్మఁ గీశవా
హిని దరిఁజేరి రాఘవమహీపతి నారయుచున్న వేళ న
ద్దనుజకులాధినాథుల దితస్వవిరోధుల సాధులన్ జగ
జ్జనుతవాదులన్ వ్యాశవిషానుల వారి విభీషణాదులన్. 53

క. రావణు వేగులవారలు, గావలయు నటంచు నంచి కపులెల్లను ద
ద్భావము లెఱుఁగమి వారల, నేవుఁగఁ బట్టికొని చనిరి నృపుసన్నిధికిన్. 54

వ. తోడ్కొని చని తారకానికరమధ్యభాగభాసితుం డగు(శ్రాంతే)శుమయూఖుండు నుంబోలె సమస్తవానరసైనికాంతరంబునం బ్రజ్వరిల్లుచున్న యన్నరేంద్రుం గనుంగొని సభక్తిసాష్టాంగదండప్రణామంబు లాచరించి రాక్షసోత్తములం గానిపించి మహాత్మా వీర లక్ష్మైస్యై శ్రీరామాన్వేషణార్థంబు పరిభ్రమించు రావణచారులవారలు గానోపుదు రిప్పుడు చకంబుఁ బాడ్వ నొందింతుమే యని పలుకునిజయోధుల వాక్యంబు లాలకించి కరుణారససాంద్రుం డగు రామచంద్రుండు తద్జని వ్వారించి వారిం గాంచి 55

క. ఎవ్వరుపంపిన వచ్చితి, రెవ్వరు మీ రేమిపనికి నేతెంచితిరో
యెవ్వీటనునికి నిక్కము, నివ్వేళలం దెప్పుఁడీ యనియె సస్మితుఁడై 56

తే. నగుమొగముతోడఁ గారుణ్య మిగుర నవ్విభుఁ, రాముఁ డీరీతి నడిగినఁ బ్రణతిఁ దగుచు
భక్తిఁ గేల్మోడ్చి యిట్లని పల్కె నొక్కఁ, డు గుణాగ్రగణ్యుండు విభీషణుండు.

చ. కవినుతకీర్తి యేను దశకంధరసోదరుఁ డన్వయుం
త్రివరులు వీరు వీరనుమతింప భవచ్ఛరణంబు వేఁడి నీ
దవుదయ సిద్ధపుణ్యజనతాంచితభూతి గడుం దలిర్పఁగా
నవు నని యన్నుఁ బ్రోసి భగదంఘ్రులు గొల్వఁగ నిందు వచ్చితిన్. 58

వ. హనుమంతుం డిట్లనియె. 72

చ. కరము దుర౯ మొనర్చి దశకంఠునికంఠము లూడ్చి తత్సహో
దరునకు వానియేలెడుపదం బొనగూర్చుట యెంతపెద్ద నీ
కరయ విధాతఁ గా దని తదంచితశాశ్వతసత్యలోకసు
స్థిరవిభవంబు లాశ్రితులఁ జేర్పఁగ నోపుదు వాత్మమెచ్చినన్. 73

క. అని విని భరతసహాయంబున నారుం గడఁగి తీర్పఁ బోలని కార్యం
బనఘా యొకఁడుం గల్గునె, యని యతని మెచ్చి రాముఁ డభినందించెన్. 74

వ. తదనంతరంబున సుగ్రీవాదులు రామచంద్రుఁ గరుణాసాంద్రుం దనిపొగడిరి విభీష
ణుండును మంత్రిచతుష్టయసహితంబుగా సంతోషించె నంత రాముండు నిశాంత
గతంబున. 75

క. అంభోరాశి గభీరము, గుంభితనక్రాదిజంతుఘోరము విపులో
ర్మ్యాభితకపివారము నిర్గంభస్థితి దీని నెట్లు దాఁటఁగ నగునో. 76

వ. అని కించిన్మీలితలోచనాలోచనుండై. 77

క. తుష్టి నుదధిఁ గొల్చి తదుపదిష్టసరణి గపికులాంబుధి న్నడిపి వనో
ద్దిష్టముఁ బడసెద ననుచుఁ బ్రహృష్టహృదయుఁ డగుచుఁ దలఁపు లిగురొత్తంగన్. 78

క. ఆరాముఁడు శుచి యై దర్భాంచితపత్రతాసనాసీనత నా
హారాంచద్వ్యవహారవిహారంబులు మాని జలధి నారాధించెన్. 79

ఆ. మఱియు భక్తియుక్తిమానసంబునఁ బయోరాశిఁ గుఱుతుపఱిచి రామవిభుఁడు
ధ్యానమేకముఖము గాఁ బెంచి సరదిక ప్రౌఢి మెఱయ నిట్లు ప్రస్తుతించె. 80

క. పరిదోషం బెల్లను దమిఁ బొరసినఁ దొలఁగు నిన్నుఁ జేరి సమ్మోదించుచున్
ధరణిస్థితి భవదీయాదరణంబునఁ గాదె నిలిచెఁ దలపోయంగన్. 81

వ. నీవు సుగుణరత్నాకరుండవు గంభీరుండవు కవిశ్లాఘనీయుండవు నపారుండవు భువన
ప్రశస్తుండవు వని మఱియు ననేకవిధంబులఁ బ్రస్తుతించి కరకమలంబులు ముకుళించి.

మ. మతి నావైపు గరుణించి యీతఁ డమ సన్మానంబు దోఁప స్సరి
త్పతి నావైనము నిర్వహింపు మనుచుం బల్మాఱుఁ గీర్తించి యా
నతుఁ డైనం గరుణించి రాముని జగన్మాన్యుం గనం బోఁ డపాం
పతి నిర్గంధుఁడై యూరకుండెను విబుధుల్ పైపై ప్రసంగింపఁగన్. 82

క. ఇటు పొగడి ఒకఁడి నారికిఁ, దటుకున నాత్మోత్కర్షఁ దలఁకఁ డనుచు సు
త్కటరోషదష్టుఁ డగుచుం గటుకటదరఁ గిల్చి ఘోరకార్ముకధరుఁడై. 83

శా. క్రోధోద్రేకవశోల్బణాత్ముఁ డగుచున్ ఘోరాస్త్రముం బూని య
మ్పాథోరాశి హరింప నిష్ఠురకళాప్రారంభుఁడైన న్ప్రభో
వీథి న్మాసె నినుండు తారకలు పృథ్విం గూలె ముల్లోకము
ల్వ్యాపం జెందెఁ గులాచలంబు లొరగెన్ బ్రస్సెం జతుర్దిక్తటుల్. 84

శా. తద్బాణాగ్రఁబున కట్టు పుట్టుటయుఁ బాధస్స్వామి భీతిం గడు
న్స్వాంతంబున రామచంద్రపదదీక్షాకాంక్షుఁడౌ యుత్తమ
ద్ధ్యానాత్మస్థితి నొందెఁ గాని పటుభక్తిన్ వేఁడుచున్నాఁ డటం
చు న్సజ్జావేగఁ బోవఁ డయ్యె జడరాశు ల్మానసుల న్మెత్తురే. 85

వ. ఇవ్విధంబునఁ బొడము భయాతిరేకంబున. 86

క. బడబాగ్ని వేఁడికి న్నడి,వడియొదునే నిపుడు రామబాణాగ్నిఁ గడుం
జెడనె యని యతనిఁ జూడ, న్వెతలె జడధి మానసంబు వేగిరపడఁగన్. 87

తే. వెడలి తగురీతి మూర్తిభవించి జహ్ను,కన్యకా గౌతమీ ముఖ్య మాన్యనదులు
మూర్తిమంతంబులై తన్ను మునసి కొలువ, నబ్ధిరా జనుకంపరసాబ్ధిఁ జేర 89

క. వెలవెలఁ బోవుచుఁ జనిరా,ములసచ్చరణయుగమునకు మ్రొక్కి వినీతిన్
జలనిధి వచించె నృపవర, పలువవి వారలము కలఁగఁబడమె యలిగినన్. 0

క. ఏ దెలియ నెంతవాఁడ మ,హీమహితోర్వరాధవ న్మహిమ బ్రహ్మసురే
ంద్రాదులు దెలియఁగరు శత్రువిభేది మదపరాధ మాత్మఁ బెట్టకు మింకన్. 91

క. ఈ యుదధి నెట్లు దాఁటుదు,నో యని తలపోసెదే యతీవ బుధవిభున
ధ్యేయుఁడ వమేయుఁడవు నా,రాయణుఁడవు నీవు మార్గ మడుగఁగలయునే. 92

క. కట్టా యూరక వార్ధిఁ, గట్టుటక తపింప నేల గట్లం బెట్లం
గట్టి యొకఁడు కట్టక పోడ,కట్టునె మార్గంబు నన్నుఁ గడవఁగ మీఱన్. 98

ఉ. సేతువు గట్టి రక్కసులఁ జీల్చి వధింపఁగ సీతతోడ నీ
వీతటి నేగు మంచు వచియించి సముద్రుఁ డదృశ్యుఁడైనను
జ్జాతకుతూహలంబున నిశాచరజాతుల నబ్ధికుక్షిసం
జాతులఁ గూల జేసె మును సాగర వేయఁగఁ బూను కోటచేన్. 94

వ. అమ్మహోగ్రబాణుండు తదనంతరంబున నిజసైనికుల నాలోకించి కార్యదశానిరూప
ణంబుగా నిట్లనియె. 95

ఉ. గట్టులఁ జెట్టుల న్దెచ్చి కంధిపయంబడవైచి దడ్డుగాఁ
గట్ట యొకండు గట్టిన సుఖంబున లంకకుఁ బోయి రావణుం

బట్టికదింపవచ్చునని పల్కిన రాముని భాషణంబులం
బుట్టినసంతసంబునఁ గపుల్చెలరేఁగుచు నాడి రీగతిన్. 96

క. ఒకకట్టు గాదు జలనిధి, సకలంబును బర్వతముల సంపిహితము చేఁ
తకుఁ జాలునట్లు గాఁగం, బెకలింతుము మందరాదిపృథ్వీధరముల్. 97

క. అని పలికి మఱియు నిట్లని, రనఘా నీయానతిచ్చినట్టులు సేయం
జనుఁ గాదె సేతుబంధన, మొనరింత మటంచు సంభ్రమోత్సాహమునన్. 98

క. బలిముఖు లవ్వననిధికి, న్బలియుఁడు లొనరించి విష్ణుపతి కెఱిఁగి కడున్
బలిమి మెఱయ నందఱు గ,బ్బలులం బెకలించి తే నృపాలకునాజ్ఞన్. 99

వ. నలుదెసలకుం జని రట్టిసమయంబున. 100

సీ. లవణవారాశిఁ గాలువచేసి యిసుమాలు దాఁటినపవమానతనయుఁ డొకఁడు
తాతకంటెను బలాతీతుఁ డీతం డని పొగడంగఁ దగువాలిపుత్రుఁ డొకఁడు
నుత్తరాశాపార మొకక్షణంబునఁ జూచి వడిరావలెతి శతబలి యొకండు
మును శైలకూటంబు మునులకై మోఁకాలఁ బగులఁజేసినఋక్షపతి యొకండు
దధిముఖుఁ డొకండు గంధమాదనుఁ డొకండు, నీలుఁ డొకఁడు సుషేణుఁ డన్వయుఁ డొకఁడు
పనసగజగవయగవాక్షవినతతార, కేసరిప్రముఖులును దక్కినకపులును 101

మ. విపులాభోగము సంచలింప విబుధుల్వీక్షించి వార్షింపఁగా
విపులాద్రుల్పెకలించి తే నలుఁడు పృథ్వీనాథునాజ్ఞాపిన
క్కపు లారీతిని దెచ్చుట్టి సుధాగ్రావాళిఁ జేసంది ని
క్కపయోరాశిని వైచి కట్టఁ దొడఁగెం గట్టన్మహోజ్జృంభతన్. 102

క. తానేమేని సముద్రుని, పైనుంచిన ముంపఁ దగుటఁ బటుపుధరంబు
ల్చేసంది నలుఁడు సేతువు, ధానోన్ముఖుఁ డయ్యెఁ గడు నిదానముగాఁగన్. 103

వ. అప్పుడు. 104

క. ఒకతరుచరుండు పదిగిరు, లొకగిరిఁ బదుగురువనాటు లొకవృక్షచరుం
డొకగిరిగా నిర్వహమునఁ, బెకలిచి తెచ్చి రతితుంగపృథ్వీధరముల్. 105

చ. కతుకొని వాలపాశములఁ గట్టి మభృన్నిచయంబుఁ గీశుల
ప్పుడు గొని తెచ్చు టొప్పె మును పూర్వసుధాశనులు న్సుధాశను
లడఁగి పయోధిఁ ద్రచ్చి రదిగాదని ఘోరసముద్ర మొక్కఁడొ
క్కఁడ తరువంగఁ బూని రను కైవడి నెంతయు నద్భుతంబుగన్. 106

క. మన్నీటజలముఁ బీల్ప వ,రన్నాయకు లేఁడి తిరుచరులు జలదములం
ద్రొన్నఁ దొడఁగిని కమ్ముచు, మన్నారఁ ద్రవ్వి తెత్తురో గిరు ఘనగిరులన్. 107

వ. తత్సమయంబున. 108

క. అంగస్ఫూర్త్యాంచితయ, జ్ఞాంగఫలప్రక్రియాబ్జజాండంబులచే
తంగౌలలు విశ్వమూర్తిక్రియం గాలికొడుకు దనర్చె నధికాద్రులచేన్. 109

సీ. ఏఁ గుంభకారుండ నివె కుంభము లటంచు నిరుగేలఁ గొండ లొక్కరుఁడు దెచ్చె
నేఁ దంతువాయుండ నివె యంశుకము లంచుఁ గఱకుటాఁబలక లొక్కరుఁడు దెచ్చె
నేఁ గృషీవలుఁడ నిల్లివె హాలంబు లటంచుఁ బఱపైనమ్రాఁకు లొక్కరుఁడు దెచ్చె
నే రథకారుండ నివె రథంబు లటంచు గిరిశిఖరంబు లొక్కరుఁడు దెచ్చె
నొకరొకరిఁ జూచి మెచ్చక యుబ్బుమీఱ, నవ్వులాడుచు శతయోజనప్రమాణ
సేతుబంధనిబద్ధప్రసిద్ధహృదయ, వర్తనస్ఫూర్తు లగుకపిమూర్తు లంత. 110

తే. లంకలో నున్నఘోరసాలంబు లిట్లు, కలుగు మనరీతి సాలము ల్వ్రేటిచి తెత్తు
రసురగోత్రఖనన మిట్లు యాచరింపఁ, దీఱు నని గోత్రముల్ ద్రవ్వి తెత్తు రొప్ప. 111

క. తమకెదురువచ్చుప్లవగో, త్తమాంగముల మున్న వేడ్కఁ దమ తెచ్చినగో
త్రము లిడి నిలిచెద రధిక, ప్రమోదమున భారవహనధర ముడుగఁగన్. 112

ఉ. భూవనితాకుచాద్రులనుబోలు ఝరోదకచందనార్ద్రిగో
త్రాకలిఁ బట్టి యాడినకతంబున సంభవ మైనయట్టి పం
కావహవృత్తి లేక విమలాత్మత నొందఁగ నేమొ తత్ప్లవం
గావలి యుబ్బుమీఱ ననయంబు మహోదధి నీఁదులాడెటల్. 113

తే. సేతుబంధనదీక్షాప్రసితవనౌకు, లాతు లగుకపులకు భాస్కరాతపంబు
గలుగకుండఁగ నీరధ్రగతిఁ దనర్చెఁ, బ్రబలఖచరవైమానికపంక్తి చదల. 114

వ. ఇవ్విధంబున నగ్రజకలను లగు నమ్మహాబలులు నగణగోన్మూలనంబుఁ గావించుట వింత
గాక యుండె నట్లు లేజోనలుం దగులుఁడు భువనవిదితంబుగా సంఘటించిన
తత్సేతుబంధనం బనివిషోల్లాసకరంబు గాకుండియు ననివిషోల్లాసకరం బై వనచర
గమనానుకూలంబు గాకుండియు వనచరగమనానుకూలం బై పుణ్యజనత్రాసకరంబు
గాకుండియుం బుణ్యజనత్రాసకరం బై సమచ్ఛాదిభంగంబు గాకుండియు సమా
చ్ఛాదిభంగం బై రత్నాకరశోభిరామంబు గాకుండియు రత్నాకరశో
భిరామం బై పంచజనపరిగమ్యం బగుటయు. 115

క. గద్దల [illegible], బెడ్డలకై [illegible] కృపాక్షంగలదే
వద్ల [illegible]. 116

ఉ. [illegible] వెచ్చి [illegible] వాలిపుత్ర భా
స్కర [illegible] ప్రసాదవృద్ధ [illegible] దృష్టిఁ జూచి దు

వక్కరయుగ నప్పయోధి నొకకట్ట యొనర్చితి రీయశంబు సు
స్థిర మయి ముజ్జగంబులఁ బ్రసిద్ధికి నెక్కెడి సర్వకాలముల్ 117

క. అనఁ గపులు భవదనుగ్రహ,మునఁ గాక కడు స్వసముద్రమున సేతు వొన
ర్పను మావశంబె నీయన,మునఁ దలఁచినకార్య మది యమోఘము కాదే. 117

వ. అని సన్నుతించి రంత నంతర్వృత్తాంతంబు దశముఖుండు విని కలంగి శుకసార
ణాదిమంత్రులతో మంత్రాలోచనంబు గావించి లంకాపురంబు సురక్షితంబు గా
వించికొని యుండె నద్దినసావసానంబున. 119

క. నూత్నమతి స్వనురాశిఁ బ్రయత్నంబున దాఁటికొన్న యాతనిఁ బోలెన్
రత్నాకరయంతు నంబరరత్నము లోఁగొనియె నస్తగిరి గ్రుంకెఁ దగన్. 120

వ. ఇట్లు కువలయవ్యథాకరకరగ్రహణంబు చాలించి యినుండు శాంతుం డగుటయు.

—: సాయంకాలాదివర్ణనము :—

సీ. పడమటిదొరసానిఫాలభాగంబున నమరించు కాశ్మీరజమ్ము మనఁగ
సంపుల్లలోహితసానుసముచితాస్తమహీధ్రగైరికధాతు వనఁగ
రవిరథపతనకారణవిభాజితసరస్వన్మధ్యబాడబవహ్ని యనఁగ
బ్రాహ్మణార్ఘ్యోదకబాణప్రభిన్నమందేహదేహోత్థశోణిత మనంగఁ
గోకనదపద్మరాగబంధూకబింబ,శుకముఖాశోకతామ్రకింశుకలసత్ప్ర
వాళసురగోపజతుచక్రవాకపక్ష,కాంతి నిరసించి సాంధ్యరాగము రహించె. 122

తే. సాంధ్యరాగప్రథుచ్ఛవి సాగరోద,కంబు కీలాలపద్ధతి గానిపింపఁ
జెలఁగి యసురులు రక్తసేవ సేయఁ, దోఁచి రన నొప్పె నిరులు ప్రదోషవేళ. 123

చ. అనుపమదుఃఖపంకమలినాంగలతాఽపరిశుద్ధయై నవా
వనవనజంబు వాడఁ గరివస్తనచక్రము లుబ్బువీడఁ బ
ద్మిని విమసంగ్రహం బనుభవించె మనోజశిలీముఖాహతు
ల్దనికిన నోర్వలేక వుఁగదా యినుఁబాసినదోషహేతువుల్. 124

తే. విష్ణుపద మనువిఖ్యాతి వెలయుచుండుఁ, గాన నయ్యెడఁ దోఁచు నఖంబు లనఁగఁ
గ్రమతరపద్మరాగప్రకాశమాన,తారకంబులు నభమున బొడకట్టె. 125

వ. అంత నొక్కింతసేపునకు. 126

తే. రాజు చనుదెంచుచున్న వార్త విని ప్రమదాంగన నిజాననాంబుజ మలమికొనిన
భ్రమరకంబుల నెగయించి ప్రబలెననఁగఁ, జీఁకటులు వాసిప్రాగ్దిశ చెన్ను మీఱె.

క. కువలు కువలయము రవిచే, నవయుట విని యమృతసేచనము సేయ సుధా
నవకలశ మెంతయు న్స్వయంవిధాత్రుం డెత్తె నన హిమాంశుఁడు పొడిచెన్. 128

క. త్రిజగత్ప్రవిశద మగు తద్ద్విజరాజోదయము మఱియు నధిక రాజీవ
వ్రజము ముడింగె భువనముల, భుజగవిలసన మడంగెఁ బో భువనములన్. 129

తే. ఇట్లు చంద్రోదయం బైన నెల్లదిశల, వెన్నెలలు పిండి చల్లినవిధము గాఁగ
దెలిపడాంగులు గలిగిన తీరు దోఁప, నిండికొనఁ గప్పు లెంతయు గండుమీఱె. 130

చ. హిమకరదీధితు ల్దనికి హేమమయం బయితోఁచు వార్ధితో
యమునయివీచు వీచులసహాయమునం జనుదెంచు మించునై
త్యములయమారుతంబు మలయం బులినంబుల సేతుబంధన
శ్రీయు ముదుసంగ భావిసమరస్థితు లాడుచు నిద్రఁ జొక్కఁగన్. 131

వ. హనుమదాదులును రామలక్ష్మణులమహాయశంబుతుం బోని యప్పండువెన్నెలబైలు
నారాజశేఖరుం బరివేష్టించి నిద్రాసుఖం బనుభవించి రంత.

క. ద్విజసత్ఫలాప్తిఁ జెలిచిన, వృజినము పచ్చక్రనిరతివేళాపటుహే
తుజనితదోషము రాజు ప్రస్ఫురఁ జెలిచె నన నిందుఁ డల్పభానుం డయ్యెన్. 133

వ. తదనంతరంబున. 134

సీ. తారాపథాంగన దాల్చుతారావళిఁ గనుపట్టు నాయకమణి యనంగ
జారచోరవికారకారిమై పాంథుల నటునిటు నడిపించునౌషధ మన
నాకమహీరుహప్రాకటపూర్వదిశాశాఖఁ దగు గుళుచ్ఛం బనంగఁ
గమలారికరబిసకాండము ల్మెసవెడి యభ్రధునీచరద్ధంస యనఁగ
మిత్రుఁ డరుదెంచుట సహస్రపత్రములకుఁ, బద్మభవుఁ డెఱిఁగింపఁగఁ బంపి ట్టి
భర్మలేఖ యనంగఁ బ్రాగ్భాగమునను, వెలసె నంతయుఁ దెలువెక్కి వేగుఁజుక్క

మ. అగనీజాగ్రము వార్ధి గట్టితిరి లెం డాలస్య మిం కేల యో
యగనీజాతకులార! యంచు నవనీజాళు ల్వడిన్ లేపుచు
న్నవనం గోకిలకేకికీరముఖనానాపక్షిసంఘాత మొ
క్కవిధి న్మ్రోసె విశాలతుంగపటుశాఖాశాఖికాగ్రంబులన్. 136

వ. అంత. 137

క. ఉదయగిరి మండె నన గం, పొదవి ప్రాగ్దిశ వికస్వదుదయము రక్త
చ్ఛదమై ప్రతాప మాకృతి నొదవి యరుగుదెంచుచున్నదో యన మెఱసెన్. 138

వ. ఇట్లు లోకచక్షురాహ్లాదకరుండై భువనచక్షుం డుదయించుటయును. 139

ఉ. అంతకమున్న రాముఁడు సహానుజుఁ డక్కడికోటిలోన ని
శ్రాంతము నొంది కృత్యముల నన్నిటిఁ దీర్చి దివేంద్రపుత్రజుం

ఘాంతకవాయుపుత్రులను భల్లుకనాథసుషేణముఖ్యవి
క్రాంతుల సేతుకృద్దధిముఖద్వివిదాదులఁ గాంచి యిట్లనున్. 140

క. దేవాసురవరులకెక్కి భావంబున నైన నిట్టి పని యొనరింపం
గా వలఁతులె యుదధి మహాగ్రావంబుల నిల్ప మీరు కపులే తలపన్ 141

వ. అని మఱియు ననేకవిధమధురవచనంబుల నగ్గించి కార్యవచనంబులు ప్రసంగించి 142

శా. గర్జాభీమపలాశివాగ్విహితలంకాద్వీపము న్ముంప వి
స్ఫూర్జద్వ్యాహృతరంగవానరబలాంభోరాశి దుర్వివ్విమ
న్నిర్జరస్థితి సేతుకట్టు మది నీక్షింపుఁడీ రంచు స
చ్చార్జమూర్తవపుర్విలాసుఁ డగు గోత్రానాథుఁ డామోదియై. 143

చ. అనవుడుఁ బావనిప్రముఖు లాతనితో భవదీయ సేనయై
దనుజులమీఁది కాలిమును దాఁకఁగ నేర్చిన యుద్ధయాత్రకీ
వనుమతి చేసినప్పుడ జయావహమైనముహూర్త మట్లు గా
వున నెడసేయ కిప్పుడ తవుం జన లంకపయి న్మహీశ్వరా. 144

వ. అని పలికి యమ్మహాయోధు లాయోధనంబునకు నాలోకులు పుటయు నక్కపి యూథంబు యూథనాథసనాథంబై విబుధవరూథినీవిధానంబున గండు మిగిలి రాకానిశాకరోదయంబునకుం బొంగు నీరాకరము ననుకరించి పొలిచి వెడలు నత్యుదయసంబునం బరస్పరాహ్వాననినదంబును దేవదుందుభిధ్వానంబును జలధితరంగ విరావంబును నేకీభవించి దిక్కులు పిక్కటిల్లె నంత రామలక్ష్మణులు వనచర స్కంధస్యందనాధిరూఢులై సప్తజిహ్వుండు ద్విముఖంబులు దాల్చినచందంబునఁ బ్రతాపం బింపేమైనవిధంబున సేనామధ్యం బలంకరించి మహాకపివీరపరివృతులై వంశకరుం డగుఖరకరునకుం గరంబులు జోడించి యంబుధిం బూజించి ప్రార్థించి యాంగికంబు లగు శుభనిమిత్తంబులకుఁ జిత్తంబులు హర్షపరాయత్తంబు లగు చుండ విభీషణుండును మంత్రిచతుష్టయసహితుండై యంతరిక్షమార్గంబునం బఱతేర సేతుమార్గంబున లంకాపురాభిముఖులై నడువం దొడంగి రయ్యెడ. 145

క. మీఁకెదురువచ్చు దనుజానీకంబుల యొంప్పు విరియ నిజ మిట్లునన
ట్లాకడలిఁ దరంగంబు లనేకంబులు వెడలి విఱుగు నెదురఁ గపులకున్. 146

సీ. అంబుధిస్సముభయపార్శ్వంబులఁ గనుఁగొని నడికి కట్టనడుమ నడుచువారు
మేరమీఱి జగంబు ముంచక పాథోధి నిలుచు టబ్రం బని తలఁచువారు
జలనిధికుక్షి నిశాచరు లెట్లు వసించిరో యనుచు నూహించువారు
మేటికడలి యుర్వీమేఖలామేఖలాకృతిఁ గహించె నన్న తర్కించువారు

దర మొక్కింతయు లేక సాగరములోన, నీఁదులాడుచు సేతువు నెక్కువారు
మించి చనువారుఁ జాల వర్షించువారు, నైకపు లాహావాపేక్ష నరుగునపుడు.

వ. ఇవ్విధంబునం గపిచమూసాగరంబు సాగరంబుపై నురవడించి చనువప్పుడు. 148

క. వారిధితరంగశీకర, వారంబుల లెక్కపెట్టవచ్చు ధరణి నె
వ్వారికిఁ బ్లవగచమూవి, స్తారము గణింపవచ్చుఁ జాతుర్యమునన్. 149

చ. అని ఖచరుల్ నుతింపఁ బ్లవగౌఘ మహోద్ధురయంబు మీఱఁగాఁ
జనిచని వార్ధి తీరము నిశాచరహేయము లంక దవ్వులం
గనుఁగొని క్రోధఘూర్ణితముఖంబగుచున్ దరిఁ జేరి రాక్షస
ధ్వని విని యంత నిల్చెఁ బ్రవిదారణకేళికి నుత్సహించుచున్. 150

చ. నిలిచినసేనఁ గాంచి తరణిప్రియపుత్త్రుఁడు చేయి వీచి పే
రెలుఁగున లంక చుట్టు దిగుఁ డింక భయం బొకయింతలేదు వా
బలిముఖు లన్ని కోటకులపాలకుఁ బ్రోలికిఁ బోవ నొక్కట
న్వెలువడి యుక్కి యున్నతనువేలము సద్విటపీవిశాలమున్. 151

వ. ఎక్కుటయు నక్కుధరగహనంబు ధరాసమంబు బయ్యును నప్పర్వతంబు సాంద్ర
కాననసంయుతంబునుంబోలె నయ్యవసరంబునఁ గపులు. 152

సీ. అరివినిర్భేద్యసుస్థిరతరాయోమయద్వారబంధకవాటతతులు గలిగి
పృథులోగ్రదంభోళిభిన్నతుంగోరుదృఢత్రపుస్థగితకుడ్యములు గలిగి
దనుజసంరక్షిత దారుపాషాణయంత్రప్రకల్పితగోపురములు గలిగి
శిఖరసంస్థాపితాసితమణిశాఖరశాతశకలసాలగణము గలిగి
యుగ్రబాణబాణాసనయోధవీర, బృందధనధాన్యఘాసరసేధ్మకలిల
కలితబహువిధయంత్ర సంక్రమానికాచ, ప్రమాపితఘోరదుర్గములు గలిగి. 153

క. భృంగాకర్షిత మదమా, తంగపవనజవపరివాసితసుగంధరో
త్తుంగరథవీరభటసే, నాంగచతుష్టయము గలిగి యతులితభంగిన్. 154

క. ఒప్పారుచుండు లంకాపుర, మప్పుడు వీక్షించి ప్లవగు లధికోత్సుక్యం
బుప్పతిల దానిచుట్టుం, గప్పికొనిరి ఘోరవార్ధికైవడి నంతన్. 1 5

చ. విడిసినసేనఁ జూచి దనుజభీషణహుంకరణంబు మీఱఁగా
విడిసెను సేనయుం గ్రిందియ పేరక పొందెడు సేన సేతువు
న్నడిచెడు సేన పొంగెడుమనస్థితిలో వెసఁగట్టు నెక్కఁగా
నడరెడు సేన యయ్యె రఘువీరున కెంతయు సంతసంబుగన్. 156

వ. ఇట్లు లంకాపురంబున నలుదెసలం బుడమి యీనినక్రమమ్మునం గ్రమ్ముకొనిన యత్తరుచ
రవాహినీవిస్తారంబు. 157

క. నాపుత్రికహృదయపరితాపము వాయుం నని తలఁచి ధరణిసతి సా
ర్షాపరిమితగా మేనఁ, గాపట్టైనుపులకపటలశోభం దనరెన్. 158

ఆ. వె. అట్లు లంకయను మహోలతాభరణంబు, నలమికొనిన వనపులతాళన మన
నున్న సేనఁ గాంచి యుల్లంబుసంతోష,మగ్న మగుచునుండె మనుజవిభుఁడు. 159

వ. సోదరసహితుండుగా వనచరస్యందనావతరణంబు గావించి త్రికూటప్రాంతసమ
విశాలరమణీయప్రదేశంబున యోధవీరసహితంబుగా సమాసీనుండై విభీషణుం
డయ్యాయిప్రదేశంబులు వేఱువేఱ నిరూపించి చూపుచున్న యవసరంబున. 160

క. కోపారుణలోచనుఁడై, భూపాలవరుండు లంకఁ బొడగన టొమ్మెం
దూపుల నేస్తి తత్పురిఁ, జాపుల నేర్తుమ భంగి శోభిల్లంగన్. 161

క. అంత దశాస్యుఁడు తద్వృత్తాంతము విని చింతనొందు తదవసరమున
స్సంతోషము పెరుఁగఁగఁ దత్సంగతి యగుశక్రజిత్తు తా నిట్లనియెన్. 162

ఉ. ఏఁ గలుగ న్విచారపడి యేటికి మర్త్యుల నాప్లవంగుల
న్నేఁగఁగాంచి బెబ్బులి చలింపఁగఁజేసి వధించునట్టు లా
భోగుల నుగ్రుఁడై ఖగవిభుండు హరించెడునట్లు ద్రుంతు వా
రీఁగలు గంధసింధురము నేను ననుం జెనకంగ నేర్తురే. 163

చ. అనునెడ ఖడ్గహస్తుఁడు ప్రహస్తుఁడు రావణుతోడ నీకుమా
రున కెదు రెవ్వ రక్కపివరూథిని నొక్కఁడ త్రుంగఁ జాలుఁ ద
క్కనపిశితాశులుం గడఁగి కీశుల నాశము సేయ నేర్తు రీ
వనితరసాధ్యవిక్రముఁడ వాత్మ విచారము సేయ నేటికిన్. 164

వ. అని పరవసంబు సేసి పల్కె నంత నతికాయ మహాకాయ మహాపార్శ్వ సుపార్శ్వ
దులును ప్రధనసన్నాహసముత్సాహపోషణంబు లగుభాషణంబు లాడుచుండ నద్ద
శాననుండు గండుమిగిలి భండనంబునకు తెండు తెం డనుడు సన్నద్ధం డగు దండ
నాయకులు తత్క్షణంబ. 165

సీ. కాలజీమూతసంకాశదేహంబులఁ గ్రాలురక్కసులఁ జెక్కంద్రేఁ గూర్చి
కాటుకకొండలకైవడి నిరసించు కరులమొత్తము లనేకములఁ గూర్చి
పృథులకేతుస్యందనధరిత్రీకృతదిగిభకర్ణంబు లగు తేరిగములఁ గూర్చి
పవమానవేగంబుఁ బరిహాసమొనరించు నశ్వరత్నము లసంఖ్యములఁ గూర్చి

ఉ. అట్టియెడ న్మహోగ్రబలుఁ డంగదుఁ డింద్రుని మన్మఁ డట్లు ద
న్పట్టఁగ వచ్చు రక్కసులఁ బట్టి నఖంబులఁ దన్ముఖంబులన్
బిట్టు వగిల్చి వాలమున బెట్టు నొగిల్చియు మెట్టిమెట్టి య
ట్టిట్టు విదిర్చియు న్వడి నసురులఁ జంపె విలాసశాలి యై. 189

క. ఇటులు పొలియించి రోషోత్కటుఁ డగుచున్ దశముఖుఁడు గనుఁగొనుచుండం
బటురక్తసిక్తనఖుఁడై, తటుకున రామావనీంద్రు దరికిం జనియెన్. 190

ఆ. వె. చని నమస్కరించి సకలంబు వినిపించి, రఘుకులాబ్ధిచంద్ర రాఘవేంద్ర
చేటుమూఁడెఁ బంక్తిశిరునకు నతఁ డేల, యాలకించుఁ బథ్యమైనదాని. 191

వ. కావున ననుమానంబు మాని భవదీయదివ్యచిత్తంబున నవధరించిన తెఱంగున మాకు నాజ్ఞాపింపుం డని కపులం గనుంగొని పలికిన మందస్మితసుందరవదనారవిందుండై.

క. రశ్మినిభదీర్ఘవాలుర, నశ్మసదృక్కర్కశాయతాంగుల నతినూ
త్నశ్మశ్రుకు విలాసుఁడు ఖర, రశ్మికులజనాథుఁ డాదరము నిండాఁగన్. 198

చ. రవిసుతముఖ్యభూరిశాఖాచరప్రభుసత్తములార మీర లా
హవమునకుం దిరం బగు ప్రయత్నము సేయుఁ డనంగఁ బొంగి నిం
గివగుల వాలదండములు గేల నమర్చి విదిర్చుచు న్రఘు
ప్రవరుని యానతిన్ క్షితిధరద్రుమహద్దృషదుగ్రపాణులై. 194

ఉ. వృద్ధులు బాహువిక్రమసమృద్ధులు వానరు లంత యుద్ధస
న్నద్ధులు గాఁగఁ గాంచి నరనాథుఁడు రాముఁడు లక్ష్మణుండు ను
ద్యద్ధనురుద్ధహస్తులు ముదంబున నిల్చిరి వెన్ను దన్ని య
ట్లుద్ధతి మోహరించిన మహోగ్రబలు లొక్కపు లల్కఁ బెంపునన్. 115

## —। యుద్ధారంభము ।—

శా. పాషాణంబులు వైచి కూటములఁ దీవ్రప్రక్రియన్ ఱువ్వి వి
ద్వేషం బుప్పతిల న్మహీరుహము లుద్వృత్తిం బ్రయోగించి దీ
ర్ఘోష్ఠాకర్కశవాలసంహతిఁ గనత్కేతువ్రజం బూడ్చి య
ట్లీమద్భృతులు గాక లంకపయి నవ్వ్రేష్టాటు లాటోపతన్. 196

సీ. సౌధము ల్సేఁదిస్తారఁబుచే రల్చి కూటము ల్గూటపంక్తులఁ బగిల్చి
నఖములచే హస్తినఖములు గోరాడి వరగోపురముల గోపురము లడఁచి
వాటంబు లైనకవాటము ల్వదలించి గములచే వెడలురక్కసులఁ గూల్చి
యశ్వశాలల గండాశ్మము ల్విండించి దంతావళముల దంతములు గాలికి

స్యందనమ్ముల నురుతరస్యందనముల, గ్రుంగఁ గనుమోచి దానవముందిరావ
కోధవ్యాదయూవకోధనిర్ఘోషు లరిజిగీషు లత్యుగ్రకోషులు కీశులిల్లు. 197

వ. చలము సాధించుటయు నప్పట్టణంబునం గలవా గాముకొంచి బొంది హాహాకారంబు
లొనర్చి రంత. 198

క. మండిపడి దశాననుఁ డను, స్ఫురితులఁ దనుండ నున్న దండాధిపుల
స్యందనమునకు వరూథిని, గంటుమిగుల నడువుఁ డని సగర్వనూత్నరీతిన్. 199

క. వక్రములు విటికి శరశా,లాప్రముఖాలయములం గలఁచి యాడిరి ప్ర
క్షిప్తప్రక్రియఁ దరువను, లప్రతిహతవిక్రమాఢ్యు లగుచుం జెలువన్. 200

క. తరసము మెసవెను మీశాం, తరసము గడు మేలుగాను తలపోయంగా
తరసమ్మత మది కలహాం, తరసముఖులఁ దరువనులను దఱుముఁ డురవడిన్. 201

క. అనుటయుం జేర్చి చతురంగసైన్యంబులం దశాననసైన్యాధిపతులు జన్యంబునకు నాయ
త్తులగుటయు. 202

చ. నరభుజు లాహవోపకరణంబులతో రణభేరికోరుభాం
కరణముతో మదేభతురగంబులతో రథరథ్యకోటితో
నురవడి గర్జితాభ్రములలోకొనుఁ గోయని యార్చి తాఁకి ర
త్రరుచరవర్యులం బగమదారుణచర్యుల ధైర్యధుర్యులన్. 203

క. ఇవ్విధంబున దలపడుటయు నంతకుమున్న కట్టాయితులై యున్న యన్యవనచర
బలంబునుం బొంగి నింగిపగులు సింహనాదంబుఁ జేయుచుం దాఁకుటయును. 204

చ. కరుశరకోటుల న్నఖరదారుణదంతములన్ ధరేంద్రము
ద్గరముల వాలఖడ్గముల దంతకుఠారములన్ ద్రుమద్రుమం
కరపరిఘంబుల న్నగనికాయము గన్గొని పొంగఁ గ్రుంగ న
త్తరుచరమానుపాదు లతిదర్పితులై సమరంబొనర్చఁగన్. 205

ఉ. మేదశ్చాదము లస్థితీగము లిపుఛ్ఛంబులున్ ఛత్రస
త్కాండంబంబులు ఖేటకూర్మములుఁ జక్రగ్రాహసంకీర్ణము
లోత్కటదండహాలలు రక్తవాహినులు రక్షోరణ్యసంభూతము
ల్యాదోనాథునిఁ జేరె మస్తకశిలావ్యాప్తంబులై యత్తఱిన్.
206

లయగ్రాహి.

విచ్చి చనవొచ్చియయు వియచ్చరులు మెచ్చఁగ మహోచ్చవగములొత్తెదితెచ్చియసురాళిన్
గ్రచ్చరులఖుమ్మలను దొచ్చికడురచ్చగము వెచ్చ వెసఁగన్నిగులఁగ్రచ్చకొనిభీత్రు

బుచ్చి బల మచ్చుపడ విచ్చుమరి యుత్తుణువు లుచ్చి చన గ్రుచ్చిపడి చచ్చినశవంబుల్
పుచ్చుకొని హెచ్చిపయి వచ్చెడు తమశ్చరసముచ్చయము మూపులను వచ్చెడు వనేచర్.

క. వాలంబులు విసరుచు వా, తూలసుతాదులు గడంగి తోలుదు బలముల్
తూలశకలములభంగిం, దూలి పఱచె ద్వాఃస్థదెస లద్రువ మొఱ లిడుచున్. 208

వ. ఇట్లు రాక్షససైన్యంబు దైన్యంబు నొంది జన్యంబునకుం దొలంగుటయు, నన్య సైన్యవిజృంభణంబు సహింపక వాహిన్యధినాథులు. 209

క. క్రమ్మఱ భీకరసంగ్రా, మమ్మునకుం గొల్పుటయును మహితవాచకు లు
గ్రమ్ముగఁ గ్రమ్మికొనుచుఁ గో, కొమ్మని తాఁకిటకుఁ బోరుఘోరమ్మయ్యెన్.

వ. అట్టి సందడికయ్యంబు ఱపోలెను మత్తదంతావళంబులును సోలెనుహయంబులును కయ్యంబునకుం గాలుద్రవ్వెను వనచరులును గలహంబు మానెను పదాతులును నోహటించినవారి నిలునిలుండని యడ్డెను సేనానాయకులును బాహాప్రహరణంబులం బూర్వపాదంబులు ముంచెడు రథ్యంబులును బుట్టెను శ్రమంబులును ద్రవెలెను కరంబులును స్వేద మూరెను దేహంబులును బాలెను రథంబులును మరియుం గోసెను వాశ్వికులును గుప్పెను నగంబులును బట్టెను ఖడ్గంబులును దట్టెను కరంబులును గుఠారంబులు వీచెదు సాదులును శరాసనంబు లెత్తెను రథికులును సాంపరాయికాగ్ధమడి గెడు యోధులును మడిఁగెడు సారథులును నొకనికంటె నొకఁడు పదిమడుంగు లెక్కుడుగా విక్రమించువారును బెక్కుచుమంగులుగాఁ బ్రవహించు రక్తపానం బొనరించు భూతబేతాళంబులును దైవమంగులు వోవుట లెక్కసేయక యుక్కుమిగులువారును ద్రక్కులగు ప్రక్కలును ముక్కలగునక్కులును దుండంబు లగు తుండంబులును బిండియగుతనుపిండియు శాదంబు లగు మేదంబులును నిపాతనంబు లగు కేతనంబులును బ్రోన్మూలంబులగు వాలంబులును దూలంబు లగుసాలంబులును శక్రంబు లగు చక్రంబులును బ్రోవులగు ప్రేవులును శకలంబులగు సకలంబులుం గలిగి వాలశైవాలంబును హస్తిశవపర్వతంబును జామరఫేనంబును గీకసమీనంబును రక్తకీలాంబువై యపూర్వనీరాకరంబు ననుకరించె నట్టియెడ దనుజవానరసైనికోత్తములు.

సీ. ఆతతహయఖురోద్ధూత సంజాతమహా క్షోణీరజంబు బగ్గుండిగాఁగ
కరికుంభవిదళనోద్గతసాంద్రతరరక్తధారాచ్ఛటలు వసంతంబు గాఁగ
వస్థిమార్గంబుచే నత్తిన మెదడు చంద్రప్రయోజిత సుగంధంబు గాఁగ
జలజాతనిభకంఠవలయిత దారుణక్షతములు మాలికాక్రమము గాఁగ
ఉబ్బియాడెడు భూతసముత్కరంబు, చారుతరమగు నాగవాసంబు గాఁగ
నాహవోద్వాహమంథపాభ్యంతరమునఁ, బెండ్లిపెద్దలభంగి నొప్పి రపుడేచి. 212

ఉ. అంతట జంబుమాలి వినయంబు నయంబు భయంబు మాలి తా
నంతట నిండ నార్చి గొనయంబున నారి నమర్చి తూపుల
త్యంతరయంబున న్విసర నద్దనుజాధముఁ దోఁకఁ జుట్టి నా
లాంకుఁడో యనంగఁ బవనాత్మజుఁ డుద్ధతి వీచె నద్ధికిన్ 225

క. విఘ్నప్రియకార్యుఁడు మిత్రఘ్నుఁడు మిత్రఘ్నుఁ డసురి దశముఖసహజో
త్పన్నము దొరయుఁడు నతనిఁ గృతఘ్ను వెఁడుపటిచె నతఁడు దారుణశక్తిన్. 226

వ. విభీషణుండు మిత్రఘ్ను పేరురంబు వగులుచు నయ్యెడ. 227

క. నలతపనుల నలతపనుల,కొలఁదిం బోరాడఁగని నికుంభుఁడు నీలుం
దలపడ నయ్యురువుగఁ గొం, దలపడక నగంబు లవఁగఁ దార్కొనిరనికిన్. 228

ఉ. దేవరిపుప్లవంగబలధృశ్యనుకూలవిరావు లుల్లస
ద్గ్రీవులు దీర్ఘహస్తపరికీలితఘోరశరాసనోజ్జ్వల
ద్గ్రీవులు రక్తలోచనశరావులు తీవ్రగతిం బ్రహస్తసు
గ్రీవులు వృత్రవాసవులక్రేణి యొనర్పఁగఁ దాఁకి రార్చుచున్. 229

ఉ. అక్షులఁ గెంపు దోఁప నిశితాస్త్రపరంపర వేయుచు న్విరూ
పాక్షుఁడు లక్ష్మణుం గవియ నాగఘుపత్యనుజన్ముఁడు న్విరూ
పాక్షుఁ డవంగఁ బర్వతశరాసన మెక్కిడి యొక్క కోల నా
రాక్షసు మూర్ఛవుచ్చెఁ గపిరాజి మొదంబున నుబ్బి చూడఁగన్. 230

క. నలువురు దనుజాధీశ్వరు, లలుక శరాసారఘోరులై రామాగ్నిన్
శలభప్రక్రియఁ జొచ్చిన, బలిమి వెలయ నృపుఁ డధిజ్యబాణాసనుఁడై. 231

ఆ. అగ్నికేతు మార్గణాగ్ని కాహుతి చేసి, రశ్మికేతు బాణరశ్మిఁ గూల్చి
కోపమెక్క యజ్ఞకోపను శత్రుఘ్నులఁ, గూలనేసె జంటకోల లేసి. 232

ఉత్సాహ. వజ్రముష్టి మైందుపై నవక్రవిక్రమంబునన్
వజ్రసన్నిభంబులైన వాఁడిముష్టి వేయుచున్
వజ్రవల్లిమీఁద బండి వాలినట్లు పోయి వే
వజ్రముష్టి దేహయష్టి వ్రచ్చెఁ గ్రోఁతు లుబ్బఁగన్. 233

క. ద్వివిదుం డైపై నశనిప్రభుఁ, డవిరళశరవృష్టి గురిసి యార్చుడు వానిం
గవిసి యశనిక్కైవడి శిర, మవిసి నెగిచె ఘోరభూరుహప్రకరములన్. 234

క. ప్రతపనుఁ డంగదుఁడు మహోద్ధతు లిరువురుఁ బోరుచోడలఁ దరుచరతయసం
హతిహతి విదళితధైర్యస్థితిఁ గూలఁగన్ దనుజుఁ డొకఁడు దెగె మదిలోన్. 235

క. దర మింతయు లేక మహో,దరుఁడు శితప్రదరమున సుదరము నొంప నిరా
దరుఁడై సుషేణుఁడు కృశో,దరునిం గావించె దైత్యుదర్పచ్యుతుఁ గాన్. 236

క. ఋషభాధ్యక్షునిపై మక,రాక్షుఁడు రూక్షగతిఁ గవియ నజనితనయుఁ డా
రాక్షసు వృక్షచయంబున, వక్ష మగల్చెన్ స్వపక్షవానరు లలరన్. 237

క. జృంభితవిక్రములు దిశా,సంభరితవిరావు లగు నిశాటవనాటుల్
కుంభుఁడును ధూమ్రుఁడును మద,కుంభులక్రియఁ బోరి రమితకోపంబులతోన్. 238

క. అంతకసన్నిభులైన న,రాంతక దేవాంతకుల రణం బుడిపిరి కా
లాంతకనిభుఁ డగు పనసుఁ డ,నంతభుజావిక్రముఁడు గవాక్షుఁడును ధృతిన్. 239

చ. త్రిశిరుఁడు ఘోరబాణవితతిం గపిసేన వడంకఁ జేసి య
ద్రిశిఖరసన్నిభుండు నతిధీరుఁడు వానరపుంగవుండు నై
నశరభుఁ గ్రూరమార్గణగణంబుల నొంచిన సంచలింప క
ప్పిశితభుజుం బ్రియాలకటపి న్నీపినాటుఁడు నొంచె నవ్వుచున్. 240

క. కుముదాకంపనుఁ గశర,సముదాయంబుల దురంబు చలుపు నెడం జే
జముగా డిడిచి యసురుఁడు, జము దాడికి వెఱచి పఱచు చాడ్పునఁ బాఱెన్. 241

క. ఇషుపంచకమున వానర,వృషభున్ వృషభుం జలింపఁ బ్రేసిన దేవ
ద్విషుసారణు నోసరిలక, వృషదాసారమున వనికిఁ దెరలఁగఁ జేసెన్. 242

సీ. అతికాయుఁ డతికాయుఁడై చలంబున దంభవిసరుల వేర్వేఱ విశిఖపంచ
కంబున నొంప సాలంబుల ద్దళికంఠపుత్రుబలంబు కుంఠితంబు
గాఁ జేసి యార్చి రక్కసిరయు లలుక ధూమ్రాక్షుండు బలువిడి వక్ష మవియఁ
బిడికిటఁ బొడిచిన బెదరక కేసరి కేసరిప్రతిఘుండు కీశులార్వ
దూలముల నన్నిశాచరుఁ దూలనేసె. నమితమాయావి యగుచుఁ దన్నాక్రమింప
విక్రమించిన దనుజులు వెగడుగుడువ, శుషునిఁ బడనేసె వేగదర్శి కడుఁ గలిగి. 243

వ. పార్శ్వచరులు తన్ను విసతించు రీతిని వాని పార్శ్వస్థులు నలంగ గంధమాదను మహాపార్శ్వుఁడు ప్రేసిన నాతనిఁ దరునికాయవినిపాతింజేసి యాతండు నొప్పించె.

క. ఉజ్జ్వలితప్రమదుఁడు వి,స్ఫూర్జితహస్తుఁడు శతబలిన్మహోగ్రతఁ గవియ
న్నజ్జవిడిచి పాఱ నతని, వజ్జా! మహితాగముల విమర్దితుఁ జేసెన్. 245

వ. ఇవ్విధంబునం దలపడి యమ్మహావీరులసమసమరకౌశలంబున విజృంభించుచుండిరి తక్కినరక్కసులు నుక్కుమిగుల నక్కపిబలంబు నెక్కుడెక్కుడని మార్కొనిన నబ్బలద్వయంబున కద్భుతం బగువిగ్రహంబు మహోగ్రంబుగఁ జెల్లుచుండ. 246

క. పాదువుఁ డెయిదుండు కదియుఁడు, చదుర్భుఁడు పోనీకుఁ డడ్డు చనుఁడు రిపులకుం
బెదరకుఁడు చెదరకుం డను, మొదలగునుడు లుభయసైన్యములఁ గడు నిండెన్. 247

సీ. కత్తులచేత మర్కటశరీరంబులు గోసి క్రొన్నెత్తురు గ్రోలువారుఁ
గుంభినీధరములఁ గుంభికుంభంబులు పగిలించి మీఁదికి నెగయువారు
కల్గ్మవాశ్వసుర్వారులై క్రోఁతుల విచ్చుకత్తులఁ దలల్ ద్రచ్చువారు
స్యందనంబులఁ బృథుస్యందనంబులఁ బిండి గావించి రథికులఁ గలచువారు
ఘోరవారాచముల గుది గ్రుచ్చువారుఁ, గ్రూరపాలాశనికరంబు ద్రొబ్బువారుఁ
గ్రొవ్వుఁ జీరెడువారు దాల్ ద్రవ్వువారు, నైరి యుభయబలంబుల నసురకపులు.

వ. తత్సమయంబున. 149

క. అమితప్రవాహినులు శల్యమహాతటమాంసకర్దమాయతశవమీ
నమత్తేభనక్రములునై, యమరె నుభయసైన్యనిర్గమారణ్యములన్. 250

క. అంతట రాఘవుఁడు దిశాదంతిశ్రుతిపాటనప్రదక్షిశరాసా
స్యాంతరణుండై దనుజుల, కంతకు నంతకు లయాంతకాంతకుఁ డగుచున్. 251

సీ. మండలీకృత మహోద్దండ కోదండుఁడై చండకాండముల వేదండతుండ
కాండముల్ ఖండించి కాండప్రకాండ పిచండముల్ చెండించి దండి దనుజ
కుండలమండితగండముల్ ద్రుంచు దోర్దండము లుండి మార్తాండభీమ
మండలసదృశుఁడై పుండరీకభవాండ భాండంబు లవియఁ గోదండ రవము
ఖండమై నిండ రథపిండి పిండిగాఁగ, భండనంబున మొండెము ల్తాండవింప
మండలమునందు రాముండు గండుమిగులు, మిండె మండెడు కాండ జన్మండనంగ. 252

క. అంగము వెరఁగంగ నుఖాగ్రపాంగము లెఱ్ఱవడఁ బోదివె నాసురభటు లా
తంగతురంగశతాంగబ, లాంగమ్ముల నృష్టుఁడు మార్గణాగ్ని జ్వాలన్. 253

క. మన్నిగొనవాహనంబులు పడి,తన్నికొనుగజంబు లొరఁగి తటిఁగడి తేరుల్
మన్నుగొనశవంబులు న,య్యెన్నిష్టు బాణుఁ డగు మహీశుమనుమనన్. 254

సీ. సమదనిశాటవత్కటవాటములపై రయమార నిమువనారసము లెగుచు
విశ్రులాసిపల్లవ విమతాశ్వకారణ్యభాగంబుపైఁ గదంబములు నినుచుఁ
బ్రకట మాయాజాల రక్షోరథికముఖాంబుజములపై శిలీముఖము లేయు
నానాస్వరూపదానవఘోరనాభీదమ్ముల శరసమూదయము నించు
నది విరుద్ధవనరథమదేభవేఘ,వాజుల మీఁద నాళీకవ్యాప్తి నెఱపు
నారయ టుకుఁటి ధన్వి యర్కాన్వయుఁడు, నదశాదెఁదు శేఁడని యమరు లెన్న.

సీ. కుప్పలుగా నేఁ గూలిన రథకేతు దండంబు లురుధవిత్రములు గాఁగ
నడుగక మడుఁగులై కడువడి వెడలెడు కీలాలధారలు ఘృతము గాఁగఁ
దఱచుగా నెల్లెడఁ దొరఁగినసముదగ్ర ధవళకపాలములు సమిధలు గాఁగఁ
బోరిఁబోరి వెడలెడు భూతబేతాళము ల్కదము నొందెడుసభాసదులు గాఁగ
మార్గణాలి ఖిలాక్రమమ్ము గాఁగ, నాగ్రహోహవనీయాగ్ని నాగుదభట
పశువిశసనంబు గావించి ప్రబలి వేల్చె, బుధహితకరుండు రామధార్మికవరుండు.

సీ. శూలప్రతీకాశసునిశితాస్త్రము లేయు నొకమాటు రాజమౌళి కడునలిగి
చక్రసంకాశపృషత్కౌఘము నిగుడ్చుఁ బురుషోత్తముం డొకపరి కడంగి
బ్రహ్మశిరస్సదృగ్బాణజాలము ఱువ్వు నొకవేళ లోకేశుఁ డుగ్రశక్తి
వజ్రనీకాశ దుర్వారేషువులు చిమ్ము నొకతూరి విబుధేంద్రుఁ డుక్కుమిగిలి
కాలదండసదృశోగ్రకాండచయము, ముంచు నొకసారి యకాలమూర్తి కనలి
వ్రాలి యొకపుడు వీరవర్తన మొనర్చె, రాముఁడు శరాసనరణాభిరాముఁ డగుచు.

వ. ఇట్లు రౌద్రవరుద్రుండునుంబోలెఁ బరాక్రమించు నమ్మహాధనుర్ధరు విజృంభణంబు సహింపక శుకసారణమహాకాయమహాపార్శ్వకంపనాదిదానవలోకం బలోకసామాన్యగతిఁ బఱవసంబు చేసి యక్షయశరధి యగు దాశరథిం దొడరుటయుం దచ్ఛరంబులు లోఁగొని భంగంబుల నందిం మటయు నయ్యామినీచరసముదయంబు పాడవడంగ నంతఁ దత్సమయసాంధ్యరాగారుణప్రభాభాసితం బగునభోభాగంబు నపహసించుచున్నదో యన భూదేవియు సాంద్రతరరక్తధారాపరిషిక్త యై యొప్పె నట్టియెడ సౌమిత్రియు ననేకచతురంగజాతంబులం గృశీభూతంబులం గావించి మించెం గుంభినీధరంబులం గుంభికుంభంబులు వగిలించు నాంజనేయుండు నానాజేయంబుల నశ్వతతినికరంబుల నశ్మతరునికరంబుల నశ్వరంబులు గావించె నంగదుండునుం బరువపాషాణప్రహరణంబున నింద్రజిత్తు నంగద నొంచించుటయు నతండతనిం గికరించి సమరంబునకుం దొలంగెం దక్కిన యక్కపినికరంబును రక్కసులం జెక్కుం ద్రొక్కి మొగి నుక్కు మిగుల ద్రుక్కించుచుండె నట్లు గదుం గేడించి ఖండపరాఙ్ముఖుండై దశాననందనుండు దురాలోచనంబున. 257

సీ. అగ్నిసంభవమగునరదంబు శరశరాసనకవచంబులు సంగ్రహించి
ప్రబలెడునంధకారమునకు మారుతమంబుతో ద్వడఁగ రయంబు మెఱయ
నుఱిమెడు జలదమో యన మేఘనాదుం డగవ్యస్వ్యపఘుండు గడఁగి
దళవదనాంతర్గత కఠోరకత్త్యంబు విఱుతుఁబో నేఁ డని విన్నఁ బ్రాఁకి

రాఘవులను వానరప్రకరముల భల్లూకనాయకుల ననేకవివిధ
ఘోరసాయకములం గొదగొని పుంఖానుపుంఖములుగ వీచెఁ బుడమినిండ. 258

క. ఒకదెస వెసవార్చి న్నతి, యొకవైపుననుండి పీచు నుగ్రాస్త్రము లిం
కొకకడఁ గడుఁ బేర్చుఁ గశాపికలై కపిసేన యొదుఁగ భీషణవృత్తిన్. 259

సీ. ఒకమాఱు పదినూఱులు కటారు లరుదారు గతివైవఁ గప్రుండొక్కఁడు సిరుంగ
నొకనిముసమ్ము మహోగ్రమ్ముగాఁ జిమ్ముఁ గఱకుదు మ్మహితుల కనులువోవ
నొకవేళ శరజాల మురులీలఁ బటుసాలచరులపై సేయుం బక్షుములు వగుల
నొకమాటు నగకోటు లొగిమీటు గిపినాథుల శిరంబులు ఫలంబులగతి నలఁగ
బాపురే కొంతసేపు సమీపుఁ డగుచుఁ, జూపు నిజరూపుఁ బ్లవగులయేపుమీర
రూపుఁడై మాపు నరవడిఁ జోపు మేఘనాదుఁ డెంతయు మాయావినోదియగుచు.

గీ. దారుణరణంబు మేఘనాదంబు గాఁగ, దేహఘదీప్తి విద్యుత్ప్రదీప్తి గాఁగఁ
గలితశరవృష్టి వర్షంబుగాఁగ నొప్పె, జన్యమున శక్రజిత్తు పర్జన్యకరణి. 261

వ. ఇట్టియెడ నయ్యింద్రజిత్తుండు శాంబరికుండు గావున భండనంబునం గంతు మిగిలి ఝంఝూసమీరణం బరణ్యంబునం బోలె వానరసేనాకాననంబు నిజాశుగనురుత్ప్రభంజనంబునం బడల్పడం జేయుచున్నం గనుంగొని హనుమదాదులుం దద్దుర్ధరణం బుపలక్షించి వృక్షపృథుక్షోణీధరక్షేపంబు గావించి విఫలప్రయత్నులై యతిప్రయత్నంబున నిజసైన్యంబు దైన్యంబు నొందకుండం దన్మాయాప్రతిబద్ధుండు గాని విభీషణుండు తోడ్పడ నోపి రక్షించుచు నచ్చెరువందుచు భరంబు నొందుచు నిష్కారణంబ రణంబునం గూలువారలకు విషాదంబు నొందుచుం బరిభ్రమించుచున్నంత రాముండు సక్రోధుండై. 262

క. వీఁకం బ్లవగానీకము, డీకొని పోనీక కడవడిం బోరెడు ఘో
రాకారాకరదనుజా, నీకముఁ బోకార్చి క్రోధ మిమ్మడి గాఁగన్. 263

ఉ. రావణి యేయు మార్గణపరంపర వానరసేన దీఁతం
బోవకయుండ భూరిశరము ల్నిగిడించి తదీయబాణవి
ద్రావణకేళి నున్నయెడ రాముని రామునితమ్మునిం దళ
గ్రీవ తనూజుఁ జేసె విపరీతరయాకృతచాపనైపుణిన్. 264

గీ. ఏని గోగోచరుఁడుగాక యెల్లదెసల, నాటుకొని యుల్కకభ్రమణం బొనర్చి
నట్లు మెఱయుడు నైఁపకయనుజుఁ గాంచి, హృదయమునుకంగ రాఘవుఁడిట్టులనియె.

క. వింటివె లక్ష్మణ మాయ, న్వింటి కెగసి కపిబలంబు విఱుచుచుఁ దనచే
వింటిబలుకనూరడు వగ, గంటఁ బడక యిట్లు రిబుధకఁటకుఁడు గడిన్. 265

ఉ. కావున సంశయింపఁ బనిగాదు విరించిశరంబు వీనిపై
వేవిడఁ గర్జ మన్న రఘువీరుని గన్గొని లక్ష్మణుండు దు
ర్భావుఁడు వీనిపై నెరుకఁ బాడియె బ్రాహ్మము నస్త్ర మన్యబా
ణావళి వీని ధూర్తుఁ బరిమార్తము మాత్రక మాత్రి పూర్తిగన్. 267

వ. బ్రహ్మాస్త్రం బల్పనిమిత్తంబునం బ్రయుక్తం బై త్రిజగత్సంహారంబు గావించు నీవు కోపంబుఁ దక్కుమే నీవిధంబున నేని వీనిఁ బరిమార్పక తక్కుదునే యని పలికిన శాంతుండై. 268

— । నాగపాశబంధన కథ । —

క. మాయాశతమ్మున గొంతయు, మాయం బగునట్లు రామమహీకాంతుఁడు ఘో
రాయతమూర్తి ప్రభాకర, సాయక మేయం దలంచు సమయము లోనన్. 269

శా. నాళీకప్రభవప్రదత్తవరగంధస్ఫూర్తి నుద్యత్సమి
ద్వేళాబంధురవిక్రముండు హరిజిహ్వాఖ్యం దతిప్రావిత
త్క్ష్వేళానేకముఖోగ్రదంతభయకృజ్జిహ్వానిశాతోజ్జ్వల
ద్వ్యాళప్రస్రవబంధపీడితులఁ జేయం జూచె భూపాలురన్. 270

వ. రామలక్ష్మణుల నాగపాశంబుల నాశంబు నొందింతు నని తలంచి యత్తులవ రక్కసుండు 271

చ. కనదస్త్రం బరివోసి యేయుటయు నక్కకోదరాస్త్రప్రసం
జనితాహిప్రకరంబు గోఁజుచు మహాశ్చర్యంబు సంధిల్లఁగాఁ
జని యుద్యద్గతి రామలక్ష్మణులఁ జంచత్కార్ముకోపేతులన్
దినకృద్వంశ్యుల నన్నదమ్ములఁ బ్రబంధించె న్మహోగ్రాకృతిన్. 272

క. బంధించిన నురుశరశర, సంధానాకర్ష ణాది సామర్థ్యము లే
మి, ధాత్రి బడసి యూరక, గంధ మదలి పడిన వృషలగంబుల భంగిన్. 273

వ. ఇట్లు నాగపాశప్రబంధబంధితు లగు రామలక్ష్మణులు మేరుమందరంబు లొరఁగిన చందంబునఁ గపిబృందంబున హాహాకారంబు లెగయ వ్రాలి రట్లు వ్రాలిన రాజరత్న ద్వయంబునకు. 274

క. నిద్రావినిద్రుఁ డగు లయ, రుద్రుని కిట నొరఁగఁబడిన రూఢశ్రీకం
ధద్రుమము భంగి నహివృత, పద్మాజీవుఁడు రామభద్రుం డొప్పెన్. 275

గీ. చిల్వత్రాటికట్లఁ జెన్ను దొరంగిన, రాజసుతుల దివిజరాజసుతులఁ
జూచి దోర్దర్పము సోఁకుమూఁకలఁ జేని, పుత్రుఁ డుత్సవమునఁ బురికిఁ బోయె. 276

శా. చెంతం దైత్యులు హెచ్చరించుచు నతుల్ శ్రేయస్మహాభీతి న
త్యంతంబున్ ఖచరాళి సన్నుతులు సేయం బర్వతాభీలది
గ్దంతిశ్రుత్యభిపాతనక్షమజయాధ్మానంబు మీఱంగ ని
శ్చింతం బ్రోలికి నిట్లు వోయి ప్రతివీక్షించెన్ దశాస్యుం బిటన్. 277

క. కరి క్రొమ్ముక్క కపులు విఱిగిరి, వినిహతులైరి రహితు లేల వెఱచెద రిఘదం
బుకఁ దేలు మింద్రజిత్తుం, దనయునిఁ గాఁ గనియు నేఁ దలఁక మనమునన్. 278

వ. అనిన విని యవ్విశ్రవోనందనుండు మందోదరీనందనుం గనుంగొని మహోత్సాహుండై.

క. ఏఁచినశత్రుల సమయం, జూచితివి మదీయహృదయశోకతమంబుం
బాచితి విలువిద్యన్నిం, నేచినక్రియఁ దొల్లి యొరులు నేర్చిరె యెందున్. 280

గీ. రణములోన వింటిరణము మెండుకొన బృందారకులు దలంక దారకుండ
సహితశాస్త్రకోటి సహితవానరకోటి, గొఱతవెట్టి తేమి కొఱఁత నాకు. 281

క. అని మఱియుఁ బెక్కుభంగులఁ, దనయుం గొనియాడి జనకతనయామణికి
న్వినుచుఁ దురగాస్త్రపాశ, ప్రణిహతులై పడిరి చెడిరి రాఘవు లనుచున్. 282

వ. అని సగర్వంబుగా నాడి. 283

చ. భుజదళకద్వయంబు దనుకప్పఁగవుఁ దాప్తులఁ గాంచి మాతుర
వ్భుజగశరోగ్రపాశములఁ బొల్పు హరించితి మిఁక నింద్రజి
ద్విజయము పీటఁ జాటుఁ డని తెల్పుచు నంతిపురంబులోని కా
త్రిజగదభీష్టఘాతుకుఁ డతిప్రమదంబునఁ బోయె నవ్వుచున్. 284

వ. తదనంతరంబున మత్తుండగు నింద్రజిత్తుండు నధికవిలాసం బగు నిజనివాసంబునకుం బోయె నంతఁ గాపురంబున రక్కసులకుఁ గాఁపురంబు నగులంకాపురంబున విజయఘోషంబు విశేషం బయ్యె నయ్యెడ పెక్కను లగురక్కసులుం బుష్పితానోకహానేకఘనం బగునశోకవనంబునకుం జని ధూళిధూసరితాలకజాతవదనకాంతయగు జనకజాతం గాంచి యిట్లనిరి. 285

ఉ. పావని పావనిప్రముఖపాదపచారుల నెల్లఁ గూల్చి మా
రావణి సర్వమార్గణపరంపరఁ ద్వత్పతిఁ దత్సహోదరుం
బోవనికిక్క నేని పొరిపుచ్చె నిజంబుగ నాత్మలోన రా
మావనిజానిఁ గూర్చి వగ నందకు మింక శుభంబు నీ కగున్. 286

క. ఈవని వగలం బొగిలెద, వీవని యోదార్ప మమ్ము నిచటికిఁ బంపెన్
రావణుఁ డఖిలజగన్నిద్రావణుఁ డింక వగవనేల రాజనిభాస్యా. 287

చ. అనుపలుకుల్ విశేషముల నట్లుగుఱుం జెవులార్చి నొంది యు
త్తమతరమధ్య సీత విపదత్క్రమణీయమహాంగి గాఁగ ద్రా
లిన ఘనమారుతాహతిఁ జలించెఁ గదు న్నగరాజస్థితిన్ సుమం
దనరె వినిశ్చలత్వము సుదగ్రవిచారము గల్గియుండుటన్. 288

చ. అనయము మూర్ఛనొందినధరాత్మజవ న్నిజవాక్సుధాభిషే
చనమునఁ దేల్చి పుణ్యజనజాతముఖుల్ చనుపట్టి పుష్పకం
బునఁ ద్రిజటాభిధాన కొనిపోయి రహస్యవిధిన్ నృపుల్ సజీ
వనులుగ నున్నవారని ధ్రువంబుగఁ దెల్పి మఱల్చె యానమున్. 289

క. ఈవిధమున నన్నృపతుల, చావమి యెఱిఁగించి యాత్రిజట పుష్పకమున్
వేవెడలించి యశోకమహావృక్షముక్రింద నద్ధరాత్మజ డించెన్. 290

క. నిక్కము చింతింపకు మీ, రక్కసునకుఁ దనకు వశమె రాఘవుల ననిం
ద్రెక్కొనఁజేయఁగ నిటువిను, మెక్కడినక్క సురలోక మెక్కడ నక్కా. 291

వ. అని మఱియుం దగిన వచనంబుల నప్పరమపతివ్రత కప్పుణ్యాత్మురాలు మనస్తాపో
పశమనంబు గావించుచుండె నంత నక్కడ. 292

క. దర్వీకరపాశంబుల, దోర్వీర్యము మాలి నరపతుల్ చిక్కిన ని
గ్గర్వులగుచు నచటం గదు, నుర్వీరుహచరులు వగచుచుండెడు వేళన్. 293

సీ. నిజరంహజుల శాపన జనించెవారింత యని చనుదెంచు నర్యముఁ డనంగఁ
దనయాంతవారు వేగన నొందిరని మాఱ నరుదెంచు ఖండేందుధరుఁ డనంగ
దివిజపక్షుల దప్పి దీర్చుటకుఁ గ్రుమ్మరు నమృతంపుముద్ద యనఁగ
వినతత మూర్తిభవించి రామునిఁ గొల్వ వచ్చుచుండెడి హరిభక్తి యనఁగ
ఘనుల లీలామనుష్యవిగ్రహుల రామలక్ష్మణుల జేరవచ్చెఁ గల్మషహరపవ
వాశనహుతాశనుండు రణాశనుండు, నారయుండాత్రజనసస్యనాశనుండు. 294

క. వచ్చి నిజకాంతి నగచరు, లచ్చెరువడి చూడ నజగరాస్త్రప్రహతిన్
నొచ్చిన రాముం గనివా, పుచ్చి విడించిసుతుఁ డిట్లు పొగడం దొడఁగెన్. 295

దండకము.

శ్రీమన్మహాభానువంశాబ్ధిసోమా రిపుస్తోమభీమా గుణస్తోమధామా ప్రభాధామ
ధామా జగద్గీతనామా మహోద్దామ రామాభిరామా సురాంచత్రికారామసీమా సమా
రామకామా మునిస్వాన్తరామా క్షమారామ దంచత్క్షమాకామ నీలాంబుదశ్యామ సుత్రా
మగోత్రావనప్రేమ సంగ్రామసోమా కృపాక్షేమ సద్వల్కలక్షౌమధామా భవద్భూధ

రిం ద్వాత్రిభావప్రకారంబు లగ్గింపనెవ్వానికిం దీర దేనంత నీ వాది విష్ణుండవు వాద్యంత శూన్యుండవు వంచప్రపంచస్వరూపుండవు భూతజాలంబుల వ్యాపకమూలంబున న్నుండి యున్నాఁడవు వేదప్రపంచప్రవృత్తంబు సర్వంబు నర్కేందునేత్రంబులుం జాతు పూ హింపఁగా శత్రులు మిత్రులు నీకు లేరైన దుష్టాసురధ్వంసశిష్టావనార్థంబు నర్థించు చుఁ జన్మకర్మములం బొంది నర్తింతు వాదిన్మహామీనకూర్మోగ్ర ఘోణీనృసింహోరు మాయా వటుర్భార్గవాకారముల్ దాల్చి వేదాపహున్ సోమకుం ద్రుంచి హేమాద్రిధారిముఖ్యు న్విదారించి మంథానపృథ్వీధరం బెత్తి దక్షుఁడై హిరణ్యాక్షు ఖండించి తత్పూర్వజుం జంపి హాళిం బలింబట్టి బంధించి మున్యేకవిమాఖుల్ ఖలావన్యధీశావలిం గూల్చి వేదక్ష న్వారించా మరోర్వీపతీదైత్యపుత్రేంద్ర భూదేవులంబ్రోచి తీలీల లీలామనుష్యుండవై దేవ తిర్యఙ్మనుష్యాదుల న్బాధనొందించు దుష్టున్మనుష్యాను లోకత్రయీరావణు న్రావణుం బుత్రమిత్రాదిసంఘంబుతోఁ గూల్తు సందేహము ల్లేదు నీవింకను న్రామకృష్ణావతారంబు లన్ బుద్ధకల్కిప్రకారరూపంబులం దాల్పనున్నాఁడవు వాత్రిం గరీంద్రుండు రావే కటాక్షిం చి రక్షింపవే యంచు మున్నేడ్వఁ బం బొప్ప నిర్వేదఁగాఁ బోషితాశేషభూచక్రమును జక్రము న్విక్రమం బొప్పఁగా వైచి యానక్రముం గూల్చి తీవింక నెన్నేనియుం జేసి తట్లుండని ప్యేమ్మహబ్రహ్మాదుఁ డీవాడు పుత్రుండు నీపంక్తికంఠానుజన్ముండు నీభక్తసం ఘంబులో వారమేకాక యేవార మేభారము న్లేక కైవారము న్నిన్నుఁ గావించు వా వారమే వారమాప్రొద్దు లేప్రొద్దు లావేళ లేవేళ లాత్మన్మహాత్ముల్ భరత్పూజ గావింతు రత్రాంతము న్నిన్ను వర్ణింపఁ గాలేని యీకాలము న్నాలము ల్నీకు దాస్యం బరళ్యంబు శుద్ధాత్మతం జేయఁగాలేని యీకాయముల్గామముల్ నీసమారాధనాహీనము ల్భోగముల్భోగ ముల్నీకుఁ గానన్నమార్గంబ బంధంబు నీవిగ్రహారాధన ల్లేని చంచత్కరంబుల్ కుయంబు ల్గను నీకృపాపాత్రముల్గాక లాభించు నాయుష్యముల్లాయుష్యముల్లే నిర్గమం బాలకున్నట్టి యేబా ములుం బాములే బ్రహ్మవు నీవ రుద్రుండవు నీవ విష్ణుండవు నీవ జిష్ణుండవు నీవ కాలుండవు నీవ నక్షత్రముల్ నీవ భూమ్యాదిభూతంబులు నీవ దిక్పాలురు నీవ యాచార్యుఁడుం శిష్యుఁడుం గర్తయుం భోక్తయుం గార్యముం గారణంబుం స్సరిద్వా ర్ధులు న్వేదశాస్త్రంబులు నీవ సర్వంబును నీవ లోకంబుఁ గల్పించి రక్షించి శిక్షించు టు నీవ పుంస్త్వంబునుం స్త్రీత్వమం దత్వముల్ సౌఖ్యదుఃఖంబులుం జన్మకర్మంబు లు న్నామరూపంబులు న్బాల్యవృద్ధత్వము ల్నీకు లేవింక నేకార్యముం దావకీనాంత రంగస్థమే యైన నీలోకవిజ్ఞాపనం బిట్లు గావింపఁగా వచ్చితి న్సర్వసామర్థ్యకంతుండవై యుండియుం గానిచందంబున న్నాకుల న్మోహుల న్లోకులన్ ఘోరసంసారసంబద్ధులం జేయు నీవీగతి న్నాగపాశప్రబద్ధుండవై చిక్కుటత్యంతముం జిత్ర మిద్ధాత్రి సౌమిత్రి

ద్యచ్చతురత్వ మేది సమయస్థితి మాయను నొందె గాలిచే
నెచ్చట నైన సర్పములు హీనత నొందును యందుఁ జూడఁగన్.

క. కాశప్రకాశుఁడై యా, కాశంబున వచ్చు గరుడు గతి విని భీతి
న్నాశనము నొందె నప్పన, నాశనబంధములు ప్లవగనాయకు లలరన్. 301

క. గరుడపతంగోదయమున, నురగతమోబంధనంబు లుక్కడఁగెఁ గడుం
దరుచరముఖాంబుజంబులు, పొరిఁబొరి వికసిల్లె లోకమును దెలివొందెన్. 302

క. మరుదారమణీతనుగరు, న్మరుదారవ మెసఁగ వచ్చి మది దలరించె
న్మరుదారఁ గసరు సోఁకఁగ, మరుదారఁగ నమరు భూసుతాధీశునకున్. 303

వ. వచ్చి నమస్కరించి నిలిచిన సువర్ణవర్ణసుపర్ణుం డగు సుపర్ణుం గనుంగొని విగతశోకో
దరపాశాభిరాముం డగు రాముం డనుజసహితుండై యమ్మహాపహుం బ్రత్యభినందన
పూర్వకంబుగా సంభావించి 304

ఉ. నీ విటు వచ్చుటం గడు వినిర్మలమయ్యె మనంబు నాగపా
శావహవృత్తి మాన్చి మము నక్కటికన్ దరిఁజేర్చి తెట్లు సం
భావన సేయనేర్తు నిను వద్గుణమూర్తి పతంగవంశసం
జీవన యంచు సన్నుతులు చేసినఁ బొంగి ఖగేంద్రుఁ డిట్లనున్. 305

వ. దేవా నీ వాదిపురుషుండవు పురుషోత్తముండవు గాలస్వరూపుండవు నగుదువు. భవదీయసంకల్పవికల్పంబులం జేసి యీ త్రిప్రపంచప్రవృత్తినివృత్తులు సెల్లుచుండు నట్టి బ్రహ్మాదిసురప్రార్థితజన్ముండ వైన నీకుఁ బలాశవాతాశనబాణపాశనాశనంబు వింత గాదు రావణకుంభకర్ణమేఘనాదాదిదనుజవధవిధోపాయంబు సశ్రమసాధ్యంబ యని పలికి వెండియు సహస్రనామతుల్యంబును భవభయతారకంబు నగు భవదీయ పవిత్రనామస్మరణంబున జనంబులు గలికల్మషంబులం దొలంగుదు రని చెప్పి వానరహృదయభయశోకాతంకంబులతోడ నంతర్హితుం డగుటయు రామలక్ష్మణులు మహానందంబునం బొదలి రయ్యవసరంబున. 306

క. తతనాగపాశబంధచ్యుతులం బంక్తిరథరాజసుతుల న్మహిమో
న్నతులం గని కపు లధికో, ద్ధతులై భయదావహప్రదీపితు లగుచున్. 307

క. క్రూరోరగబంధచ్యుతు, లైరఘవు లద్రిచరుల నాహావమునకుం
బ్రేరేపించుట దనుజుఁడు, చారులచేఁ దెలిసి కడు విచారించె నెదన్. 308

వ. చింతించి యద్దశకంఠుండు సవిస్మయంబును సవిషాదంబును సభయంబునుగా నిజసైనికులం గనుంగొని. 309

ఉ. శాతమహోహిపాశములఁ జాఁకక రాముఁడు లక్ష్మణుండు ను
ద్ఘాతమతూహలంబున స్వసైన్యము సంగరకేళికి న్సమా
యాతముఁ జేసి పేర్చుట మహాద్భుత మక్కపిసేనయు న్సము
ద్యోతితపూర్ణిమాహిమకరోదయవార్ధి తెఱంగు దోఁచెనుక్. 310

చ. పృథివిని వానరు ల్నరులు భేదము నొందమి వింత రాలువా
రిధిపయిఁ దేలియుంట విపరీతము మర్త్యులు నాగపాశసం
శిథిలులు గామి యెంతయు విచిత్రము దానవులార యింతయు
న్విధి చతురాస్యుఁ డేమిటికి విస్మృతు మందఁ గడంగుఁ డాడికిన్. 311

చ. అనవుడు ఘోరమస్తులు భయంకరహస్తులు హస్తివాజివా
హనులు మహారథస్థులు ప్రహస్తముఖాసుర లేమ మేము ముం
డనముసఁ బేరువాఁడి నెగడం గల మంచుఁ గడు న్నిడంబులం
బనివడి గ్రద్దలాడ దిగిభశ్రుతిదారణకారణార్భటిన్. 312

క. లంకాపురంబు వెలువడి, శంకాతంకంబు లేక జలజహితకులా
లంకారుసైన్యము న్నా, హంకారతఁ గవిసి యార్చి రారూఢధృతిన్. 313

ఉ. తాఁకినఁ బోరుపోరుఁ దని తార్కొని కేకలువెట్టి వానరా
నీకము మీఁక డీకొని యనేకవిధంబులఁ దింత్రిణీక శ
మ్యాకమధూకభూరుహచయంబులవైచిన దేవదానవా
నీకము చందమొంది తదనీకినులట్లు పెనంగునయ్యెడన్. 314

సీ. కంఖాణరింఖావిశృంఖలసంఘాతధరణీరజంబు రక్తంబువలన
భూరికాహాళఘోరభేరికాహవజయధ్వను లగ్రబృంహితధ్వనులవలన
బంధురసింధురసైంధవసుభటకబంధము ల్బేతాళపటలివలన
వాలధ్వజనిరంతరాళప్రజనితాంధకారంబు కరవాలకాంతివలన
శ్రమము లాహవవిజయవాంఛలవలనను, జెమటుబొట్టులు చిందగ్గిసెకలవలనఁ
బ్రాణభీతి పరాక్రమక్రమము వలన, డిందుగడ నొప్పె నవు డక్కడిందిపోరు. 315

వ. అట్లుభయబలంబులు సాహవదోహలంబునం బేరువాఁడిఁ బోరాడుచున్న సమయం
బున. 316

క. అక్షిగళద్రక్తు హ్ప్రతతి, ఱతుఁ బృథుశోణితభృత్సద్వృత్తు సుకత్తున్
రతశిరస్తాదత్తువ, పతుయు నతుయువిగత్తుఁ బ్లవగాధ్యత్తున్. 317

మ. పవమానప్రియమాణవుఁ గదిసి కోనస్ఫూర్తి విస్ఫూర్జధు
ప్రవరేష్వాసఘోరటంకృతి నభోభాగంబు గ్రయ్యన్ ధరి

త్రిదశాంక న్నిశితాశుగంబుల విరోధి ద్రెవ్వేసి నొప్పించె దై
త్యవరూధిన్యనుకూలవృత్తి యగు ధూమ్రాక్షుండు తామ్రాక్షుఁడై. 318

క. నొంచిన దైత్యాధముఁ గోపించి నభస్వత్సుతుండు పృథుసాలముల
న్మ్రుంచినఁ దద్ద్రుమములు దూలించి నరాదుండు గళవళింపనిమదితోఁ బో. 319

క. శాతాస్త్ర నిహతి వనచర, జాతున్నొప్పింప నద్రిచరసత్తముఁ డు
ద్ధూతక్రోధమున ధ్వజ, పాతం బొనరించెఁ బ్లవగబలము చెలంగన్. 320

క. కేతనముతోడ నాతని, సూతునిఁ బడవైచి హరుల ద్రుక్కించి కపి
వ్రాతము తన్గొనియాడ వి,భీతకమున యాతుధానుఁ బ్రిదులఁగ నేయన్. 321

చ. విపతితసూతకేతనుఁడు వీతరథాశ్వుఁడు నయ్యుఁ బావని౦
గుపితమనస్కుఁడై గదల ఘోరశరంబుల నొంచి యార్వ న
క్కపికులశేఖరుండు పరిఘాయితదోర్యుగళుండు గావు౦
గృప యొకయింత లే కొకమహీధరకూటము వైచెఁ బిండిగన్. 322

క. ధూమ్రాక్షిభయదుఁ డగు న,ధ్ధూమ్రాక్షుం బిండిచేసి తొడరినకినుకం
దామ్రాక్షుండై దనుజుల, నామ్రక్షోణీరుహముల హత మొనరించెన్. 323

క. తెంపున ధూమ్రాక్షు బలముఁ, జంపెడు నద్రిచరనాథు సైరింపక ని
ష్కంపితవర్తనుఁ డగుచుఁ బ్రకంపనసుతుమీఁద నయ్యకంపనుఁ డడరెన్. 324

మ. అమరాకంపనుఁ డయ్యకంపనుఁడు ధూమ్రాక్షాంతకుం జుట్టు ము
ట్టి మహోకార్ముక మెక్కువెట్టి శరవృష్టి న్ముంప మున్నీతిచే
సమరారంభము మానియున్న యసురు ల్సంరంభులై వానరో
త్తమసేనం దొడర న్విరుద్ధమగు యుద్ధం బయ్యె నప్పట్టునన్. 325

క. అప్రదుపదాతిపదాహత, విపులధరారేణువులు రవిప్రభ నాఁగం
గప్రలుం దైత్యులు సమ్మ,ర్దపుఁ గయ్య మొనర్చి రద్భుతస్థితి వెలయన్. 326

క. బలులగు నకంపనమహో, బలనుతులబలమున దైత్యబలకపిబలము
ల్బలువిడి దుర మొనరించెం, బలలమునకుఁ బోరు డేగపదువుల వోలెన్.

వ. తదనంతరంబున నుభయసేనాస్రస్రావితరక్తధారాచ్ఛటాపరిషిక్తంబై సర్వాసర్వం
మహారజోంధకారం బడంగుటయు నక్కపిబలంబు.

సీ. కుంభంబుల మదేభకుంభంబుల వగిల్చి కుంభులఁ గుంభులఁ గూలనేసి
యశ్వకర్ణములచే నశ్వకర్ణము లూడ్చి నశ్వాలి నశ్వత్థహతి వధించి
యక్షంబుల భయంకరాక్షంబుల విదిర్చి లలిరథంబుల రథంబులను నుల్చి
స్కంధము ల్కర్కశస్కంధంబుల నగిల్చి వీరతరులఘోరవీరతరుల

నలఁపి వైజయంతికల వైజయంతికా, హాతుల నవనిఁ గూల్చి యసురసైన్య
మాహవమున మిగులఁ జీకాకుపఱచేసి, యమితవిక్రమమున నడచుటయును.

క. నిజసైన్యము ప్లవగులచే, గజిబిజి యగుటెల్లఁ గని యకంపనఘోర
ధ్వజ మస్త్రశిఖల నహితు, ప్రజవన్యాఘ్రపు మగుడు నవార్యస్ఫురణన్. 329

చ. ఘననిభుఁ డాంజనేయుఁ డురుకాయుఁ డకంపను తేరి కడ్డముం
జని తరుదగ్రశాతశరజర్జరితాంగుల నంగదాముల
స్వానుకరుఁ ద్రోచి వాలమున వ్రేసిన దానవుఁ డొల్లఁబోక యా
తనిపయిఁ నేసెఁ గ్రూరనిశితప్రదరంబు లనేకసంఖ్యలన్. 330

ఉ. వ్రేసిన వాయుపుత్రుఁడు పవిత్రుఁడు కొండరథంబు గుండగాఁ
జేసిన నొండుతేరి కతిశీఘ్రగతిం బఱతేర శాఖలం
దాని నరాదను ల్పడిపడం గుధరాహతిఁ గాలగోచరుం
జేసి నభంబు నిండికొన సింహరవం బొనరించె మించఁగన్. 331

క. అవ్యాహతబలుఁ డపరిమి,తవ్యాహప్రరచనాతిదక్షుఁ డసురసం
భావ్యచరిత్రుఁ డమిత్రమ,నోవ్యాధినిభుం డకంపనుఁడు మృతినొందెన్. 332

క. శోకవ్యాకులగుడై హా, హాకారము నైన దానవానీకము ను
ద్రేకంబునఁ బురికొల్పి మ,హాకాయుం డాహవమున కాయిత మయ్యెన్. 333

క. అంగదముఖ్యులు వానిప, యుంగవిసిన సైన్య ముత్సహించి యసురసే
నాంగముల రూపుమాపఁ దొ,డంగిన దనుజుండు ధనువు టంకృతి మెఱయన్. 334

చ. కపులఁ గదంబవృష్టి మునుఁగన్ దనుజాధముఁ డేయ నేయ న
క్కపులుఁ గదంబవృష్టి మునుఁగన్ దనుజాధము నేయ మాయచే
విపులరణంబొనర్చి మును విచ్చినసైన్యముఁ గ్రమ్మఱింప న
క్కపులకు దైత్యనాథులకుఁ గయ్యము చయ్యన నయ్యె నయ్యెడన్. 335

క. ముక్కులచెక్కులుఁ బ్రక్కల,ద్రక్కలుఁ గ్రిక్కిఱిసి పడిన పదనరదనముల్
చెక్కులచెక్కలు నక్కడ, నక్కడ నక్కజ మొనర్చె సక్కదనమునన్. 336

క. గుంభితవిక్రము లగుచుం, గుంభులచే మత్తకుంభికుంభము లలతిం
గుంభములయట్లు పగిలిచి, కుంభినిఁ గప్పి రపుడేపుఁగులపీఁగులన్. 337

వ. ఇట్లు వనచరబలంబు లురవడించుటయును.

సీ. బంధురకంధరగంధసింధురములు బలువైనకొండలచెలువు గాఁగ
ధారామనోజ్ఞగాంధారాశ్వజాలము ల్పావనైనతరగల పోల్కి గాఁగ

జృంభన్మహాధ్వజస్తంభోద్ధరథములు తీరైన నావలతెఱఁగు గాఁగ
తతదారుణవిహారదానవాకారము లక్కమనీయజలజంతు కరణి గాఁగఁ
గావిపెత్తురు బడబాగ్ని కరణి గాఁగ, నసురచతురంగసేనామహాంబురాశి
మార్గణమహోత్తుంగవ్యాప్తి మట్టుమీఱి, వానరద్వీపము ముంపవచ్చె నంత. 838

చ. చెలియలికట్టభంగిఁ గపిశేఖరుఁ డంగదుఁ డాత్మయోధుల
గ్గల మగుశాత్రవాబ్ధి మునుఁగం బడనీక సముద్ధరించి ని
శ్చలధృతిఁ దచ్ఛరంబుల కసాధ్యతనుం డయిపోరె వానరా
వలిఁ గడుమేటి యీతఁ డని వారక యెల్లరుఁ దన్ను మెచ్చఁగన్. 839

వ. ఇవ్విధంబున మహాకాయుసైన్యంబు దైన్యంబు నొందించుచు. 840

గీ. ప్రకటగతి డాసి చక్రరక్షకుల నేసి, సూతుతోడ రథ్యంబుల ద్రుక్కఁజేసి
యమ్మహాకాయుఘోరకాయమ్మహార్య, హతినలఁగ నేసి చెలరేఁగి యార్చుటయును.

ఉ. మత్తశిఖండినీధ్వజసమంచిత మన్యరథంబు సూతుఁ డా
యత్తము చేసి వేఱ యొకఁ డప్పుడు వేకొని తేర నెక్కియుం
ద్వృత్తి బలంబులం బ్లవగవీరులపైఁ గవియించి యార్చుచుం
గుత్తుకబంటి నెత్తురులు గ్రోలుచుఁ బోరిరి రాక్షసాధముల్. 842

వ. అట్టి సంకులసమరంబున. 843

క. పృథుఁడు గవాక్షుఁడు నిరువురుఁ, బృథుతర మగురణ మొనర్చి పృథివిఁ గలిపిరా
రుధిరాక్షు వజ్రనాభు, న్రుధిరాక్షున్ ఘోరకటుతరప్రవిహతులన్. 844

వ. పృథుగవాక్షులు వజ్రనాభరుధిరాక్షుల విగతాసులఁ గావించుటసహింపక. 845

సీ. కాలదంష్ట్రుఁడు మహాకాలదంష్ట్రికరాళశస్త్రంబు లేయుచు సహితసైన్య
మెల్ల భీతిల్లంగ నేతెంచుటయు వృషభుండు వానరవృషభుండు వాని
బాణంబు లెల్లను బాణంబుల మరల్చి సింహనాదము దిశాసింధురముల
కర్ణరంధ్రంబులఁ గదలుకొనఁగఁ జేసి యాత్మయోధులకప్పు డధికహర్ష
మావహింప నొకయహార్యకూటంబున, దనుజవ్రేయ నతఁడు దానిఁ దుమురు
సేయుటయును దడవు సేయక వానియే, నుంగుకొమ్ములను దునుంగ నేసి. 846

వ. ఐరావతకులసంభవంబును బర్వతనిభంబు నగు నిభదంతపాటనంబుఁ బాటవంబున
నాచరించుటయు దనుజసైన్యంబుల హాహాకారంబు లెసంగె నంత సగ్గాల
దంష్ట్రిండు. 847

క. ద్విరదం బరద మగుడు నొక, యరదమునకుఁ బోవఁదలఁచనప్పు డరుదుగ వా
నరుఁడు గిరి వైవఁ గపులం, బ్బిరి యతఁ డేకుంగుతోడఁ బీనుంగయ్యెన్. 848

చ. పనసుఁడు కాలకల్పుని శపాతు గజుండును దాఁకి వీఁక బ
ల్వనసమహీరుహాంబులుఁ బలాశకుటుంబులు వైచి యుర్వరం
దునిమి నిశాటసైన్యములఁ దోలిన దుర్భరవిక్రమంబునన్
ఘనగతి దుర్ధరుండు సగగన్నిజయోధుల నూలుకొల్పుచున్. 349

గీ. నడచి యతఁడేయుక్రూరబాణములనెల్లఁ, బువ్వులుగఁ దోఁతె మొఘపుష్పుఁడు సరకు
గొనక కడకాళ్ళ వట్టి యుద్ధముజువాత, నెత్తురుగులంగ మీఁదికి నెత్తివైచె. 350

క దుర్ధరుఁడా సారథివధ, నుర్ధరుఁ డిట్లేసి తుదఁ గనుంగొని ధూమ్రుం
డర్ధేందుబాణజాలస, మర్థుఁడు తీవ్రగతిఁ గ్రోధనాఖ్యుం దాఁకెన్. 351

క. క్రోధనుఁడున్ ధూమ్రుఁడు న, క్రోధనులై వానరాసురులు మెచ్చఁగ నా
యోధన మతిదీర్ఘం బై, క్రోధనగాజిహ్మగముల రూఢప్రౌఢిన్. 352

క. పెద్దతడ వాచరింపఁగ, నద్దనుజాధీశువక్షు మవియఁ బిడికిటన్
గ్రద్దన గ్రుద్దిన నాతఁడుఁ, బెద్దనిదురవోయెఁ గడుఁ గపివ్రజమార్వన్. 353

క. శతముఖుని జంభుఁడున్బోలె, శతశరశతములఁ దొఱఁగఁ జేయుచుఁ గడిమిన్
శతమాయుఁడు శతమాయుఁడు, శతబలినాభీలసింహశతబలిఁ దాఁకెన్ 354

సీ. ఒకమాఱు శూలియై యుగ్రమూర్తి వహించు వహించి నిజదృష్టిశిఖిఁ జెలఁగు
నొక్కమాఱచలుఁడై యున్నతగతిఁ దోఁచుఁ దోఁచి పాషాణముల్వైచి యార్చు
నొకమాఱు జిష్ణుఁడై యురుబలాంతకుఁ డగు నయిశాస్త్రవాగముల్ వాత మొనర్చు
నొకమాఱు ఘనరేఖ నుడువీథిఁ బఱతెంచుఁ బఱతెంచి శరవృష్టిపరఁగఁ జేయు
గంధవహుఁ డయియొకమాఱు గానరాక, యుండునట్లుండి కఱకుదుమ్ముల విసరు
శాస్త్రవాంబునిధి గలంగ శతసహస్ర, మాయుఁ డనపాయుఁ డగు శతమాయుఁ డిట్లు.

క. బలిముఖచమూసమూహం, బలమిఖగకోటినెల్ల నచ్చెరువఱుపన్
బలిమి వెలయ నప్పుడు శత, బలి మిగులం గోపమెత్తి పార్థివులలరన్. 356

మ. కృపయొక్కింతయు లేక పాదపమహావృష్టిన్మహాకాయమం
త్రిపయి న్వానరుఁ డాగ్రహించుట యు దైతేయాధముం డుగ్రగం
ధపరీతాత్ముఁడు దైత్యయుక్తురగంధర్వాళి భీతిల్లఁగా
విపరీతస్థితి ఘోరమార్గణములన్ వ్రేసెన్మహాదార్ఢ్యుఁడై. 357

వ. ఏసివియదంతరంబు నిండ నార్చుటయుఁ బలింపక. 358

క. సారథిశతబలి దానవు, సారథి వేయుటయు దళితసారథికమున
త్తేయరణక్షోణికిఁ గడు, దూరముగా రథ్యవితతి దొలఁగఁగ నీడ్చెన్. 359

చ. శతబలిసింహనాదము దిశాముఖము ల్వగులంగఁ జేయ దు
ర్మతి యను గాథముండు శతమాయుఁడు సైఁపక యొండనూతునిన్
ద్రుతగతిఁ దోడ్కొనర్చికొని తోఁచి వనాటుల నేర్చుచు న్మహో
ద్ధతి మెఱయన్ ద్రుమద్ధతి రథంబని యుంచెఁ గపీంద్రుఁ డుగ్రుఁడై. 860

క. శత కాయుఁడు, శతమాయుఁడు, గతమాయుఁడు వానరప్రకటవిగతశతాం
గత నొందియు శతనొందక, జతనంబున దుర మొనర్చె సమయము నోవన్. 861

ఉ. ఆయతరోమరక్తభయదాక్షియుగుండు కపిప్రభుండు శా
ఖాయుత ఘోరసాలమునఁ గంఠము ద్రేయుచుఁ జాలవొద్చివై
కోయసవృత్తిఁ దక్కు దనుజాధముఁ దోఁక బిగించి చావఁబో
మ్మాయని కూలనేసె శతమాయుని మాయలు మాయమందఁగన్. 862

గీ. ఇవ్విధంబున శతమాయు క్రొవ్వు చెఱచి, సుస్థిరత మించు శతబలిఁ జూడ వెఱచి
దైత్యబలము పలాయనతత్పరత్వ, మగుటఁ గాంచి మహాకాయుఁ డాగ్రహించి. 863

క. ఘనరథముఁ గపిబలముపైఁ, జననిమ్మని పలుకుటయును సారథి సరయ
మ్మునఁ దెరవొసనిచ్చెనఁ, గనుఁగొని దనుజాధములు సగర్వస్ఫూర్తిన్. 864

క. నాదము దివినిండ మహా, నాదముఖాసురులు బలసి నడుమం గపుల
న్నాదగు శరములఁ గూల్తున, నాదర మొప్పంగ నని మహాకాయుఁ డనిన్. 865

చ. ప్రదరముల న్వనౌకసుల బ్రద్దలు సేయుచు నన్యవ్యాధ్భుయ
ప్రదరవముల్చిగుర్చుచు సురవ్రజ మడ్డము వచ్చె నేని యుం
బ్రదర మొనర్తునంచు నలపావని ముఖ్యుల దేహయష్టిక
ల్ప్రదరము లొందఁజేయుచు నృపాలురపైఁ బడనప్పళించుచున్. 866

క. నభము విఱిగి పడుభంగి, స్న భళ్ళరులు వెఱఁగుపడ ఘనప్రదరముల
న్రభసం బుద్రేకముగా, సభయాకృతి దుర మొనర్చె సందడిలోనన్. 867

క. పాదుకొని మహాకాయుని, సోదరుఁడును రక్తపటురసోదరుఁడు మహా
నాదము దివినిండ మహా, నాదుఁడు నతిభీష్మతరరణం బొనరించెన్. 868

క. అట్లున్నదమ్ము లిరువురు, గట్లపగిదిఁ జెట్లపగిదిఁ గపిమసఁగిన స
మ్మెట్లనఁగ శిలలు గట్టుం, జెట్లు విసిరి కపులు రణము సేయుచు నున్నన్. 869

క. దేవాసురసంగ్రామము నా, వెక్కసముగు మహారణం బయ్యెఁ గరు
ల్దీవులుగా సురరథములు, నావలుగా నొప్పె రక్తనదులు భయదమై. 270

క. దండడి నుభయబలంబులు, సందడిశయ్యం బొనర్పసాగిన రుధిరా
నందడిని యుద్ధరంగము, బెండడిరౌ యొప్పెఁ గరులు భీతిల్లంగన్. 871

సీ. కరిఘటాకుంభము ల్కడవలపోలిక బహువిధంబులుగాఁగఁ బగులుచెడలఁ
బృథుహయరింఛోళి పిండిచందంబునఁ దలఁచుగా నందందుఁ దొరుగుచెడల
నసురకరంబులు హస్తంబులట్టులు పటుసాంద్రగతిఁ దెగిపడినయెడల
ఘనరథాంగములు చక్రమ్ములరీతిగా మొనసిరక్తనదుల మునుఁగుచెడల
నతినిశితకంకపత్రమ్ము లాకులట్లు, వాలవాతూలవినిహతిఁ దూలుచెడల
నయ్యెఁ దపనసుతాదు లహంకరించి, మించుచేతుకఁ బోరొనరించుచెడల. 871

క. సంగరదార్ఢ్యమున మహా, సంగర మొనరించుకపుల సమయించుచు దురా
శం గరవాలముఁ బూని తె,సంగరములు ద్రిప్పుచు న్నిశాచరు లలరన్. 872

వ. మహానాదుండు భుజబలాంగదు నంగదుం దలపడుటయు నతండు.

క. కరవాలమూడిపడ భీ, కరవాలము ద్రిప్పివైచి క్రవ్యాదనభా
సురసాలంకృతదేహము, సురసాలం బేసి డాసి చూర్ణము చేసెన్.

క. అనుజానుమహానాదుం జం, పినవాలిసుమాయరోషభీషణుఁడగుచు
న్మొనసి మహాకాయుం డా,తనిపై నిగిడిచె సుతీక్ష్ణతరసాయకముల్. 873

చ. నిచితవర్షధారల వినిశ్చలతం దపరారు సద్రిచా
ద్భునను దదగ్రశాతశరముల్ విపినాటుఁడు లెక్కసేయ కా
తనిపయిఁ గింశుకంబులఁ గదంబములు న్నిగిడింప నాతఁడుం
దునుకలు సేసి తోన పటితోమరము ల్దొరగించి యార్చెడున్. 874

క. పటితోమరములు లీలా,స్పదుఁడై తను దాఁకకుండఁ బట్టి విఱిచి యం
గదుఁడు గదావినిహతికిం, గదలక శిలవైచి నూతుకంఠముఁ దునిమెన్. 875

ఉ. నూతుం గంఠము ద్రుంచి యాతుణమరక్షోభ్యతు నీక్షించి ఖ
ద్యోతుం డుగ్రముగాఁగ బిట్టడరి ఖద్యోతంబుఁ బట్టం బ్రభా
తీతుండై చనునట్లు వానిపయి నుద్వృత్తిన్ వడిన్ దాఁటి వి
ఖ్యాతుం డంగదుఁ డాహవోద్ధతు మహాకాయు న్మహాకాయునిన్. 876

క. పట్టుకొని యిట్టునట్టు, న్మొట్టిపడఁగనీకఁ గాలమొట్టిపుడమిపై
బిట్టువిసరి కడురుధిరం, బుట్టిపడ మ్మొట్టిచంపె నుద్ధతిమెఱయన్. 877

మ. బలము ము గ్రుతుఁడు చంపుచందమున నప్పాపాత్ము నారూఢని
శ్చలుఁ డారీతి వధించి రథ్యముల నాశ్చర్యంబుగాఁ గూల్చి ది
క్కులు భేదిల్లెడు సింహనాద మసురక్షోభంబు గావింప ను
జ్జ్వలుఁడై తేరు టెక్కెమ్ హిమాలయము స్వేచ్ఛన్ డిగ్గుసింహాకృతిన్.

నుత్తమాశ్వంబుల కొల్కెడు కన్నీరులురుగణంబున శ్రమనొందకుండ
మొనసి ప్రత్యాసారములను రక్తాసారములు గల్గు మేఘముల్నిలువకుండ
భూకరించుచు నెదిరి వాపోవుచుండఁ, జెలఁగి వంచకములు భీతిఁ జెందకుండ
సైన్యమున నుబ్బుమీఱంగ సంచరించు, మృత్యువెవ్వారలును దన్ను నెఱుఁగకుండ.

క. అట్టిమహోత్పాతంబులు, పుట్టిన దానవులు వెఱపుఁబొందక చలముం
బట్టి పఱతెంచుటయుఁ గని వెట్టికపులు ససమరోష భీషణులగుచున్. 388

వ. వృక్షపాషాణపాణులై సమరసన్నాహసముత్సాహంబునం బొలిచి నిలిచి రట్టియెడ న
పూర్వసముద్రంబుల చందంబున నుభయబలంబులు నొండొంటిం దలపడి ఘోరంబు
గాఁ బోరం దొడంగుటయును. 389

క. పడువారలు మిగులం జే, డ్పడువారలు హితుల కడ్డపడువారలు ప్రా
ప్పడువారలు ససమునఁ దల, పడువారలునగుచు దురము భయదం బయ్యెన్.

సీ. తఱచుగా నెగసిన ధరణీపరాగంబు కడుచిత్రమగు మేలుకట్టు గాఁగఁ
గడువడి నుడుగక వెడలెడు కీలాల మతివాద్యమగు కలయంపి గాఁగఁ
గాళులు దెగిపడఁ గదల నేరక యున్న వార లెల్లను దలవరులు గాఁగఁ
బలుపురొక్కనిఁ జలపట్టి వధించుట తులువలశిక్షించు చెలువు గాఁగ
స్యందనంబులు ఫలమహీజములు గాఁగఁ, దగిన హయములు వినోదపాత్రములు గాఁగ
నొప్పుగాం చెసమిద్భాగము జ్వలత్ప్ర, భావిభాసితమగు సమిద్భాగ మనఁగ. 391

వ. అట్టి దారుణవ్యవసాయంబునఁ గింశుకసంగతం బగు దానవసేనాసస్యంబు రక్తజలా
భిషేకంబునఁ బెచ్చుపెరిఁగి వానరవాలవాతూలంబునం బడల్పడం జొచ్చెనంత. 392

ఉ. అంతకదండహస్తుఁడు ప్రహస్తుఁడు చాపము నెక్కువెట్టి కా
లాంతకరాళ నిగ్రహ విహార వినోదనిబద్ధచిత్తకా
లాంతకశూలసన్నిభమహాశరజాల పినద్ధదిఙ్ముఖా
త్యంతకుతూహలుండు ప్లవగావలి నుద్ధతిఁ జుట్టుముట్టినన్. 393

చ. పులిఁ గనఁ గొన్న లేళ్ళగమి పోల్కిఁ బ్లవంగము లార్తనాదులై
నలుగడఁ బాఱఁ జొచ్చిన వనాటశిఖామణి నీలుఁ డేఁచి యేఁ
గలుగఁ దలంక నేల యని క్రమ్మఱ సైన్యముఁ గ్రమ్మఱించి ని
శ్చలధృతి వానిరథ్యరథసారథులం బడ నేసె నంతటన్ 394

మ. బహుశాస్త్రాగ్నుల జంటమంటలు కడుం బర్వ న్విజృంభించి గుం
భహనుం డద్ధాడిం బెనఁగుటయు నప్పాపాత్ము నాఖీలద్రై

త్యహితుం దారుఁ డుదారుఁడై కలిసి శార్యన్మూర్తి సంధిల్ల భ
గ్నహనం జేసి వధించె నాతుణమ రక్షస్సేశి భీతిల్లఁగన్. 395

ఉ. తద్విజయంబుఁ గాంచి పరితాపము నొంది నరాంతకుండు మా
ద్యద్విరదాకృతిం బ్రబలి యద్రిచరావలి యార్తి నొందఁగా
నుద్విగ్నతావ్యాప్తి మెయినుండఁ గరంబుఁ జలంబుమీఱఁగా
నద్వినిదుండు సింహసుక్రియ న్నలిరేఁగి వధించె గోరులన్. 396

వ. తత్సమయంబున. 397

క. నాదసమున్నతుల మహా,నాదసమున్నతుల విధితనయదుర్ముఖులు
న్మాదహారిముఖులు గూల్చిరి, భూదేవికి బలియొసర్చు పోలికి గాఁగన్. 398

క. బలియురు వలఁపును నిజమఁ,త్రులు పొలియుటఁ జూచి శోకరోషసమగ్రా
కులచిత్తుఁ డాప్రహస్తుఁడు, కలనువలను జూచి మిగుల గర్వమెలర్పన్. 399

ఉ. అన్యధనుర్గ్లామము మహారథముం గొని వచ్చి వైర్యసీ
కిన్యధినాథు నీలుఁ బ్రతికృష్టమనస్కత నొవ్వనేసి రా
జన్యనిమీఁదికిం గడు వెసం జనఁజూచిన వాని నాఁగి కా
లిన్యశిలాహతిం బలువిడి న్రథవాజులఁ గూల్చెఁ గ్రమ్మఱన్. 400

క. రథము విరథుఁడు న్సారథి యొండొకరథము సత్వరంబునఁ గొనిరా
నధికమతి నధిష్ఠించి స,మధికాస్త్రము లేయఁ బ్రథన మక్కజమయ్యెన్. 401

వ. అట్టియెడఁ బ్రహస్తుఁడు. 402

క. ఆఁకలిగొనినపులియునఁగఁ, గేక లిడుచు నీల దీసఁ గెడసితనుచు న
మ్మూఁక లిరుదెసల నొదఁగఁగ, రేఁకలి విసరెన్ సమగ్రరోషుం డగుచున్. 403

క. అసమున వెస విసరిన య,య్యుసలమ పసఁబట్టి కొనియు మోఘము దీన
న్వసమంబు మని కసురుచు బర,వసమున నసమగతి విసరె వసుమతి యదరన్. 404

ఉ. వైచిన నష్టబాణముల వాఁ డది చూర్ణము చేసి డాయఁగాఁ
జూచి నగాటుఁడుం గదనసుస్థిరుఁడై గిరిఁ గేలబట్టి పె
ల్లేచినకిన్క నాతనిపయి న్నిగిడించిన విల్లు నమ్ములన్ 405
వైచి మహాద్భుతం బగురవంబున నేడ్చుచుఁ జచ్చెఁ జచ్చినన్.

క. బలిముఖులు సింహనాదం,బులు సేయుచు సంతసమునఁ బొదలి నిలిచిరా
కులమానసులై హతశే,షులు దోషాచరులు లంకఁ జొచ్చిరి భీతిన్. 406

వ. చొచ్చి మాతులమరణప్రకారం బెఱిఁగించుటయు రావణుం డదరిపడి ప్రహస్తుం
జేరొని విలాపంబు గావించి యెట్టకేలకు ధైర్యం బవలంబించి యంతర్గతంబున.

క. దనుజు లనుజహితబాంధవ, తనుజులతో నేగి మడిసెవరు వానరుల
శ్శనుజుల జయింపలేకే, మనఁజను విధికృతము లెందు మానక చెందున్. 408

ఉ. కావునఁ జింత నొందఁ బనిగా దిఁక నేన కడంగి యాప్లవం
గావలిఁ ద్రుంతు నంచు భుజగావకేళికి నుత్సహింపఁ ద
ద్భావ మెఱింగి యమ్మ్యొడను వచ్చె సువర్ణసుగాత్రి శారదాం
భోవిశదాబ్జనేత్ర మయపుత్రి చరన్మణిపుత్రికాగతిన్. 409

వ. పరిచారికాశతసహస్ర పరివృతయై మందోదరి మందమందయానంబునం జనుదెంచి.

క. అంతఃపురిఁ జింతాక్రాంతాంతఃకరణవృత్తి రావణాంఘ్ర్యమలసరో
జాంతఃకలితశిరయగుచు, నంతఃపుర మిట్టులనియె నతనికి నిభృతిన్. 411

తే. చెలఁగి మున్నిట్టినీట బాల్నిలిపినపుడ, కపులు దేవత లగుట నిక్కము తలంప
నట్టివారలఁ బనులకుఁ బెట్టినపుడ, దేవదేవుఁడు ఖరవైరి దివిజవైరి. 412

వ. కావున నమ్మహామహుతోడి విగ్రహం బెన్నగాని లగ్గు గాదని పలికి వెండియు 413

క. ఇంతకు మున్నుఁ బ్రహస్తుఁ డనంతభుజావిక్రముఁడు మహాకాయుఁడు కా
లాంతము నొంది రకంపనుఁ, డెంతటివాఁ డట్టివాఁడు హతుఁ డయ్యెఁ గదా. 414

క. కపులఁ బొలియింతు మని చని, కుపాచరులు కపులచేత సమసెదరు మహా
విపరీత మట్లు గావున, నపగత బుద్ధివయి చెడుదు వాగ్రహావృత్తిన్. 415

చ. మిగిలినవారిఁ జంపక యమేయ బలాఢ్యుఁ గృపావిభూషు స
త్త్వగుణగరిష్ఠు సర్వజనవందితు నాశ్రితవత్సలుం గళా
ధికతు విశేషమాన్యతతిరత్ను ముముక్షు జనానుకూలు రా
ముఁగనుము సీత నిచ్చి కులము స్థలము న్నిలుపం దలంచినన్. 416

శా. సీత న్వాకు శక్తకాఁ దన రుచి స్ఫీత న్వచర్పించి భూ
జాతం దెచ్చిన తప్పు సైఁపుము నమస్కారంబు నీ కంచు భూ
నేతం బ్రార్థన చేసి వానరులను న్మిత్రత్వముం జూపికన్
భ్రాతం జూచిన యట్లు చూచుఁ జనుమీ రాముం బ్రసేవింపఁగన్. 417

చ. అతిబలుఁ డెత్తి పైవిడిసినప్పుడు నధి యొకర్తు గాని యయు
ద్ధతిఁ దొడరం డలంతు వె నయానయవేది విభీషణుండు మా
న్యతముఁడు దీర్ఘగర్వ మతఁ డాలికి నిన్నుఁ దొలఁగి మానవ
ప్రతిముఁడ యౌని ధీరమతి రాఘవునిన్ శరణంబు వేఁడునే. 418

క. అను నప్పలుకులు వెడవెడ, విని మానవుఁ గొలిచి దిటవు వీడి బ్రదుకకం
టెను రామచేత సమరంబున గూలుట యొప్పనేయు నుదితానారున్. 419

క. మద్ధితకర యమ్మ ద్వా, కృద్ధతి వినకున్నఁ గీడు వాటిలు నైనన్
యుద్ధము వలదని యిట్లు వి, రుద్ధపుబుద్ధు లిపుడేల రోషము పెరుఁగన్. 420

క. జయ మొసఁగన్ రిపులఁ బరా, జయముం గావించు రాత్మగ్రహవశమున్
బ్రియ నీవాక్యములు మనః, ప్రియములు గా వెల్లభంగిఁ బృథులాజి యగున్. 421

క. అతివాద మేల పగవక, యతివా యంతఃపురమున కతికాయపుర
స్కృతవై చను మనుటయు మయ, సుత మందోదరియుఁ జనియె శోకముగదురన్.

వ. అంత రావణుండు. 423

క. లయకాలకరాళయమా, లయసదృశాంచద్ఘోరగ్రలపనము లలరన్
రయమహితపిశాచానన, హయములఁ బూంచిన రథంబు నధిరోహించెన్. 424

వ. అనేకవిధబాణబాణాసనవర్మకలితంబును జయధ్వజవిరాజితంబును గోటిద్వయఘంటాకోటిప్రకాశితంబును నగురథంబున. 425

శా. శంకాతంక మొకింతలేక యసురోత్సాహంబు మీఱన్ ధను
ష్టంకారంబు విహాయసంబున నిండఁ జంద్రహాసంబు వీ
రాంకంబుం డెందము వేడ్కనూని పటుశౌర్యస్ఫూర్తి రక్షఃకులా
లంకారుం డగు రావణుండు వెడలెన్ లంకోత్తరద్వారమున్. 426

వ. ఇవ్విధంబున యమకింకరసదృశనిశాచరధ్వజినీపరివృతుండై వెడలుటయుం గనుంగొని.

క. చాపకళానిపుణుఁ డసమ, చాపుఁడు ఘోరప్రతాపసంయుతుఁడు మహా
కోపారుణితాక్షుండై, యూపాక్షుఁడు వెడలె రణజయోన్నతి వెలయన్. 428

క. కుంభిఘటాపరివృతుఁడై, కుంభినిఁ గ్రక్కదల శౌర్యగుంభితుఁ డగుచున్
జంభాంతకభయదుఁ డగు ని, కుంభుఁడు కుంభీనసోగ్రకోపుఁడు వెడలెన్. 429

సీ. నరసురఖచరకిన్నరయక్షతతులకు నెత్తిపిడుగు శక్రజిత్తుఁ డొకఁడు
బూరుమరక్తసంపూరితోగ్రపిచండకుం డగు దేవాంతకుం డొకండు
నఖిలజంతుగ్రసనాసక్తహృదయభీకరుఁ డగుచు మహోదరుఁ డొకండు
బరిపంథిచిత్తనిర్బంధకృత్ప్రదరనికాయుఁ డౌ నయ్యతికాయుఁ డొకఁడు
మఱియుఁ ద్రిశిరాదిమతు లురుమత్తమతులు, వెడలి యొక్కట దనతోడ నడువ నదరి
దవహుతాశనుకైవడి దశముఖుండు, కవిసె వానరవాహినీకాననంబు. 430

క. దుశ్శకునములకు వెఱవక, దుశ్శీలుఁడు రావణుండు దొడిఁబడఁ గపుల
న్నిశ్శంక బిట్టు గవిసి ధ, నుశ్శిఖి నొకపెట్ట నగ్గునూచము సేసెన్. 431

క. ఈవిధమునఁ గపివాహిని, చేవసెడ మహారణంబు చేసెడువానిన్
రావణుఁడని విభీషణు, చేఁగని రాఘవుఁడు విండ్లు చేఁబూని వెసన్. 432

వ. సమరసన్నాహంబునం బొలిచి నిలిచి రంతక ముష్ట. 433

క. సుగ్రీవుఁడు కుముదగ్రస,మగ్రహదైత్య యుద్ధవిడి మహోగ్రాఘము న
త్యుగ్రగతి వైచుటయుఁ గని, సుగ్రీవుఁడు తుమురు సేసె కినుక నొలర్పన్. 434

క. పదిచండకాండములఁ దొమ్మిదిశితసాయకము లొక్క మేటిములుగును
న్నద్భుతవృత్తి వైవ నయ్యెరు,వదిశరములు వాలనిహతి ద్రెక్కలుసేయన్. 435

చ. రవిసుతుఁ డెన్నరం బుసశరంబు రయంబున దృష్టిముష్టి సౌ
ష్ఠవమున నాటనేసె విపర్యయ మొందిన యాప్లవంగపుం
గవుఁ గని రోషశోకములు గ్రమ్మఁగఁ దన్నెదిరించు వానర
ప్రవరుల లెక్కసేయక నృపాలకులం దొడరం దలంచుచున్. 436

చ. మలఁగని కోపవేగమున మారుతిపైఁ దొరఁగించు మూఁకలా
ములగతిఁ దూలనేసి యొకకోల ముఖంబునఁ బంక్తికంఠుఁ డు
జ్జ్వలగతి నాటనేయుటయు వానరుఁ డెంతయు నొప్పమీఱె శృం
గలలిత మేరుభూధరము కైవడి నట్లు దర్పి ధీరుఁడై. 437

క. కోల వెటికి వైచుటఁ గదుఁ, గీలాలం బాననమునఁ గీల్కొనుటయు వా
తూలసుతు సురోషాయత, ఫాలస్థుఁ డైవటుట్టిభంగిఁ దనరుచున్. 438

ఉ. రావణుఘోరమార్గణపరంపరకున్ వెనుకంజ వేయుక
ప్పావని వానితేరికి గుబాలున దాఁటి తదీయదీర్ఘమూ
ర్ధావళి సంచలింపఁ జరమాంగము నొవ్వఁగ వేసె నయ్యెడం
బావని వానరాసురులు సంతసమంగుచుఁ గుందుచుండఁగన్. 439

క. రక్షోధ్యక్షుఁడు ప్లవగాధ్యక్షు నిరీక్షించి కలుషితాత్ముఁ డగుచు నో
వృక్షచరభగద్గతి మాయాక్షయుని జూచి మరల నరుదెంచితివే జూ. 440

మ. అని సాటోపమనస్కుఁడై శమనదండాభీలచండాస్త్రమే
సిన సామీరియురంబు గాఁడ టను మూర్ఛిల్లెన్ని జాఘాతవే
దనకుం జావఁడు రావణుండనెక చింతన్ బ్రాలు చందంబునన్
హనుమంతుం దదిమాచి వానరులు హాహాకారముల్చేయఁగన్. 441

క. కనకాచలమొరగినగతి, హనుమంతుఁడు నొచ్చి యనువు డైపడుటయు నా
తనిపాటు గాంచి తాఁ గ్రోధనుఁడై నీలుఁడు దశవదను నెదిరించెన్. 442

ఉ. అల్లెదిరించి నీలుఁడు దశాస్యముఖంబులు వ్రయ్య దిట్టపుం
జెట్లు నిసర్చుచుం గవిసి చిక్కులువెట్ట నరాదుఁ డోలిసీ

వాల్గుడి గింతు నంచు భయదప్రదరంబుల నీలు మేను బెం
డూట్లొనరించి దేవతలు తొట్రుపడన్ శ్వసనార్భ నార్చినన్. 443

ఉ. అక్రమ మప్పులాకు ననలాంశభవుం డగు నీలుఁ డగ్నిభూ
రివిక్రముఁ డద్రులం దరుల వ్రేసి మడించిన భూరిసంగరో
పక్రముఁ డద్దశాస్యుఁడు కృపాపరిహీనమనస్కుఁ డంతఁ జ
క్రక్రకచోగ్రశూలపరిఘాప్రతతుల్ నిగిడించె నయ్యెడన్. 444

క. తనకన్న మున్న తెలివొందిన తపనజుఁ గూడి యరుగుదెంచి యనుప్రభం
జనసుతుఁడు రణక్షితిజ్ఞతఁ, జనఁ డడ్డము రావణునకు సంభ్రముఁ డగుమన్. 445

క. అంతటఁ దన నంతఁ బ్రహ, స్తాంతకుఁ డరదంబుఁ జేర నరుగ నతఁడు నీ
గంతు లిడిగింతు ననుచుం, బంతంబున నగ్గిచిలుకుఁ బైనిగిడించెన్. 446

ఉ. అత్యనలాస్త్ర మిర్వియును విహాయసమున్ నిజదీప్తి పర్వఁగా
జయ్యన వచ్చి నీలుఁ డదె చచ్చెను జచ్చె నటంచు వానరుల్
దయ్యెడఁ జుట్టుముట్టి కపికుంజరుఁ గుంజరవైరివిక్రమున్
డయ్య నొనర్చె శత్రులు వడంక నిశాచరు లుబ్బి యాడఁగన్. 447

క. రావణుఁడు శిఖివిశిఖమునఁ, బావని నీలుఁ గని కడువిచారించుచు దు
ర్భావమున నద్రిచరసే, నాఁపినం బస్త్రధార నడకెడు నెడలన్. 448

క. సౌమిత్రి ససంభ్రముఁడై, రామునితోఁ జూసు మిట్లు రావణుఁడు కపి
స్తోమము నలఁచెడు నీతని, తోమార్గ్గని వీని దుర్మదుం దలఁకింతున్. 449

వ. అని పలికి యన్నకు నమస్కరించి తదాజ్ఞాప్రకారంబున. 450

శా. సింహధ్వానధనూగ్రటంకృత ద్విషత్సేనాతి భీమంబుగా
సంహారప్రక్రియ నేగుదెంచి సమరారంభంబు మీఱన్ జగ
త్సంహారం బొనరించు రుద్రుఁ డనఁ బ్రత్యర్థిన్సమీకార్థియై
యుంహో దూషితసుంచు లక్ష్మణుఁడు సాహంకారఘోరంబుగన్. 451

క. మర్మవిభేదకములు ఘన, చర్మచ్ఛేదకము లైన వాలమ్ముల న
ద్దుర్మతిపైఁ దొరఁగించెఁ జతుర్ముఖముఖ్యాదులు నుతులు సేయంగన్. 452

వ. ఇట్లు తొరఁగించి యద్దురాత్ము నుద్దేశించి. 453

చ. కపటమున వన్నె జానకి నకల్మషఁ దెచ్చినయట్లు గాదు మ
ద్విపులశరాగ్నిసంజనితవేదన కోర్చుట యంచుఁ బైపయిం
గుపితమనస్కుఁడై విశిఖపుంఖశరంబులు నింప రాక్షసా
ధిపతి దశాననుండు జగతీధరనందను: గాంచి నవ్వుచున్. 454

క. అన్నపయిం గలమన్నన, నన్నయు విడనాడి కాయ లాకులుఁ దిని యి
ట్లున్న సహింపక నిను మీ, యన్న ననుం జెనకఁ బంపెనా చావంగన్. 455

క. అన్నం బలువిడిచిఁ దమ్ముని, దన్ని విభీషణుని వెడలఁ దఱిమితి శరణం
బన్న వధించితి సాధుల, నన్నెఱుఁగక యెదుర వచ్చినాఁడవు కుమతీ. 456

ఉ. కోఁతులఁ గొండముచ్చులను గూర్చి పయోధిఁ దరించినంతనే
పోతర మెత్తెనే చనక పోటరివై నిలు మంచు మించుకో
పాతిశయంబునన్ దశరథాత్మజు లక్ష్మణు సప్తమార్గణా
ఘాతునిఁ జేసి యార్చె దశకంఠుఁ డకుంఠితలీల నార్చుచున్. 457

గీ. పంక్తికంధరుశరములు పదిశరముల, నొవ్వనేసి సుమిత్రాతనూజుఁ డాతఁ
డెన్ని శరములు నిగిడించె నన్ని శరము, లుగ్రవడిఁ గేసి మరలించుచున్న వేళ. 458

ఉ. పావని ముఖ్యు లద్దనుజుపై నదరింపఁ దొలంగుఁ డంచు ధా
త్రీవరుఁ డెంతయు రణవిదగ్ధుఁడు పో రొనరించె నీసుమి
త్రావరపుత్రబాణహతి రావణుఁ డోపక కాందిశీకుఁడై
పోవక నిల్చె నే యనుచు బోరన దివ్యులు దన్ను మెచ్చఁగన్. 459

శా. యూపాక్షుండు మహోదరుండు నతికాయుం డానికుంభుండు సా
టోపుండైన నరాంతకుండు డడగఁ దోడ్తో వారి నెల్ల న్రణ
వ్యాపారుండగు లక్ష్మణుండు కఠినవ్యాపారఘోరుండు ర
క్తాపోస్నాతులఁ జేసి యార్చె విజయాహంకారదుర్వారుఁడై. 460

క. కోపమునఁ బంక్తికంధరు, చాపముఁ దునుమాడి యొండుచాపముఁ గొనఁ ద
చ్చాపమును దునిమి రథ్యవ్యాపార మడంపఁ దలఁచు నంతటిలోనన్. 461

క. శక్తి మిగుల నసురేంద్రుఁడు, శక్తి నెగువ మంట లాకసము నిండ నుర
స్సక్తమగుచు నురునిద్రా, సక్తిక్రియ మూర్ఛ వడియె సౌమిత్రి వడిన్. 462

వ. ఇట్లు మహాశక్తి ప్రయోగంబున సమ్మూర్ఛితుం డగు లక్ష్మణుం గనుంగొని యద్దు
రాత్ముండు రథావతరణంబు గావించి. 463

క. నెట్టుకొని నిజరథంబునఁ, బెట్టుకొని వనాటబలము బెదరంగఁ బురికిం
బట్టుకొనిపోవఁ దత్తను, విట్టటుఁ గదలింపలేక యెంతయు వెత్తిన్. 464

చ. ఇరువది చేతులం బెనచి యెత్తఁగఁ జాలక మేరుధన్వి కాఁ
పుర మగు కొండికొండ సరిపోవునె లక్ష్మణు దేహయష్టి క
చ్చెరు విది యంచు విస్మయముఁ జెందెడు రావణుఁ ద్రోచి తత్కృశే
ఖరముఁ గ్రహించి మారుతి కృపాలుసపాలికిఁ బోయె నంతటన్. 465

చ. అరుదుగ నష్టశక్తి సరయంబుగ రావణుఁ జేర లజ్జచే
నరదము గ్రమ్మఱంగ విబుధాహితుఁ డేర్తెఱి మీఱ నెక్కి వా
నరకరవాల పక్షచరణంబులు ఘోరరణంబులోన భీ
కరకరవాలపక్షహతి ఖండములై పడ నేయుచుండఁగన్. 466

చ. పొదలెడుకిన్కఁ జాపరవము న్నిగిడించుచుఁ గన్నదోయిఁ గెం
పొదవ లయాంతకాకృతి శరోగ్రగరుద్ధతి నూరఁబిచ్చకం
బొదువుఖగేంద్రుమాడ్కి నృపపుంగవుఁ డేర్తెఱి రాక్షసేశ్వరుం
బొదివిన సంతసించిరి కపుల్ముదమందిరి మింట నాకపుల్. 467

వ. ఆరఘుకులశిఖామణి నిజవిశిఖశిఖిశిఖాకలాపంబుల నీకరణిం బొదివి. 468

మ. మహిశల్యాపహరు న్సహింపక రణోన్మాదంబు మీఱ న్రమూ
ద్వహుఁ డష్టార్ధనిశాకరాస్త్ర నిహతిం దగ్ధాత్ర మార్తసం
పిహితంబు న్శిథిలం బొనర్చి యహితా భీలాట్టహాసంబుతో
విహరింపంగని దానవుం డను సమిద్విస్ఫూర్తి దీపింపఁగన్. 469

మ. పదివిండ్లెక్కిడి చాపటంకృతి నభోభాగంబు భేదింప ను
న్మదుఁ డుద్వృత్తుఁగ రాఘవేశ్వరు పయి న్మార్కొంట యత్యద్భుతా
స్పద మయ్యెన్ ఖచరాళి కప్పుడు నభశ్శపాత్రుండు రాము న్రణా
భ్యుదయంబుం జేరి నినీతి నిట్లనియె హార్షోత్కర్ష చిత్తాబ్జుఁ డై. 470

క. సరథుం డగు రావణు భూ, విరథుఁడవై మాఱుకొంట మేల్గాదు నరే
శ్వరవర కరుణామతివై, సరగున నెక్కుమిదె మద్భుజస్యందనమున్. 471

వ. అని మహానందంబున నం బలుకుటయు నమ్మహాబలనందనునందలి మన్ననంజేసి లాంగూలధ్వజవిరాజితంబును మనోవేగంబును మహోత్తుంగంబును గామగమనంబును నగు కపిరథం బధిష్ఠించి యుదయశిఖరి శిఖరస్ఫురితుండగు తరుణారుణ మయూఖుండునుం బోలె శిలీముఖమయూఖప్రసారంబున శత్రునేత్రకుముదంబులకుఁ గుముదం బావహింప దశముఖున కభిముఖుండై. 472

క. శరణార్థి నగుచు నించుక, శరణార్థివి గాక తొలఁగి చనకున్న నినున్
శరవణభవుఁడో యతఁడ, శరణునిఁ జేసి బిట్టు చంపుదు నాజిన్. 473

వ. అదియునుంగాక. 474

చ. అవికులవర్యు లెందు శరణార్థి వధించుట యుత్సహింప రీ
నవికలబుద్ధి సాధ్వి వసుధాత్మభవం గొని తెచ్చి యిచ్చి దా

నవకులమున్ హరింపకు మనం గరుణించెదఁ గాక బంటవై
బవరము సేయ నడ్డపడి భస్మము సేయక యూరకుందునే. 475

వ. అని పలికి తోడన. 476

క. సోలుగ విసరెడి విశిఖవ్యాలలు వరుణాస్త్రనిహతిఁ జల్లార్చి మహీ
పాలు నురంబున వనచరు, పాలంబున నొవ్వనేసి పంక్తిముఖుఁ డనుజా. 477

క. విను మాలిమీఁది యాసం, జనుదెంచితి కాక నీకు శౌర్యము గలదే
మనుజునొకనిశరణము చొత్తునె వెఱతురు నీకు దిక్పతులు మార్కొనఁగన్.

క. వనచరసమాశ్రితుండవు, మనుజుండవు వశమె నీకు మార్కొన మనుజా
దననాథుఁ బంక్తికంధరు, ననుచు వెసం గవియుటయు మహోగ్రహుఁ డగుచున్.

సీ. నాకవు ల్వొచ్చు దర్వీకరంబులభంగిఁ దూపులు వీఁపునఁ దూఱనేసి
కులమహీభృత్కూటకోటిపైఁ బిడుగులు పడుభంగిఁ దలల రోపములు నిగిడి
యటవిపై దావాగ్ని యంటుకొన్నవిధాన నవయవంబుల విశిఖాగ్నిఁ జొనిపి
ఘనవారిదమ్ముపై గాలివీచినమాడ్కి నరదంబు నాశుగాహతి విదిర్చి
వెఁడుపడిచిఁ బొలివోని విక్రమంబు, మెఱయ దశకంధరుఁడు పదికఱకుటమ్ము
లేయఁ గనలుచు నబ్బాహులేయసదృశుఁ, డాయతాంబకముల బాహులేయుటయును

ఉ. అక్కజ మందు దైత్యుఁ గని యక్కటికం బొకయింతలేక వి
ల్లుక్కలు చేసి తోడన యమోఘశిలీముఖవృష్టి ముంచి యే
దిక్కునఁ దానయై పటుగతి న్విహరించినఁ బంక్తికంఠుఁ డ
మ్మక్కర నరుండుగాఁ డిఁకఁ డహర్పతితేజుఁడు రాముఁ డారయన్. 481

చ. అని తలపోయు రావణుముఖాంబుజము ల్చిలుఁగ న్శిలీముఖ
ప్రణిహతి నొవ్వనేసి ప్రసభంబున వెండియుఁ జండకాండము
ల్నినిచినఁ గాలుఁజేయిఁ గదలింప సమర్థుఁడు గాక భీతుఁడై
మనము గలంగ వానరసమాజము నవ్వుచుఁ జూచుచుండఁగన్. 482

వ. సంగరపరాఙ్ముఖుండై. 483

క. రౌద్రోద్రేకనృపశరో, పద్రవమున కోర్వలేక ప్రాణాపేక్షన్
నిద్రావితత్రపుండు భయద్రుతుఁడై లంకఁ జొచ్చె నసురులు దలఁకన్. 484

ఉ. ప్రల్లద మేది యిట్లసురపాలుఁడు లంకకుఁ బాఱి మేదినీ
వల్లభమూర్తి వెన్దగిలి వచ్చినచందము దోఁప నెంతయుం
దల్లడ మందుచున్న వసుధావిబుధాహితుఁ గాంచి బాంధవుల్
చల్లని యిష్టవాక్యముల సాధ్వసముం దొలఁగించు నయ్యెడన్. 485

వ. సమరతలంబున. 488

గీ. దనుజశరకోటి తను నంత దాఁకకుండ, నాఁగి యమ్ములు శోణితం బానకుండ
నుచ్చి చనఁజేసి యసురుల నుక్కడంచెఁ, గడురయంబున నొక్కనిఁ గడవకుండ.

గీ. రాముఁ డరుణాంబుజముఖాభిరాముఁ డగుచుఁ, దక్కునిశాచరుల నెల్ల నుక్కడంచి
మీఱి యంతకుమును మూర్ఛఁ దేఱియున్న, యనుజుఁ బొడఁగాంచి కపిరథం బవతరించి.

వ. గజగవయగవాక్షగంధమాదననలనీలసుషేణపనసవినతతారకుముదవేగదర్శివృషభమైంద ద్వివిదసుగ్రీవాంగదపవనతనయకేసరిశతబలిదధిముఖప్రముఖవలీముఖపరివేష్టితుం డై సముల్లాసంబునం దేలుచుండె నంత నక్కడ లంకాపురంబున నెట్టకేలకు నొక్కింత భయంబు దక్కి దశముఖుండు దాపుల నవలోకించి. 489

క. హరికులిశము హరిచక్రము, హరువరశూలమును గ్రౌంచహరుశక్తియు నా
హరిభీకరతరదండము, సరిగా వీరామచంద్రుసాయకములకున్. 490

చ. ప్రథితయశుం డ్రఘూత్తము నృపాలశిఖామణి నోర్వలేక దై
ర్యధనుఁడ నయ్యు వైరినిచయంబులు నవ్వను సంతసింప వే
పథువు జనింప లంక కిటు పందవిధంబునఁ బాఱివచ్చితి
న్విధి విపరీతవృత్తిఁ బ్రభవించిన యాపద కింత యేటికిన్. 491

వ. అని పలికి విషాదవేదనాదోదూయమానమానసుండై యూరకుండి. 492

ఉ. నాయనుజన్ము నన్యరిపుప్రబలార్చికకాండజన్ము నా
గాయుతసత్త్వుఁ బర్వతగుహాసదృశోగ్రవిశాలవక్త్రు ర
క్తాయతచారునేత్రునిఁ బితామహదత్తవరప్రలబ్ధని
ద్రాయుతుఁ గుంభకర్ణుని నదప్రవిదారితకుంభికర్ణునిన్. 493

క. బోధింపుఁ డాతఁ డైన విరోధివరూథిని వధించి రూఢధృతిమును
ప్యాధములఁ గూల్చి లవణప,యోధిఁ గలిపి మరలివచ్చు నొకనిముసమునన్. 494

గీ. కాన నాతమ్ము సుఖసుప్తినూనియున్న, వాని మేల్కొల్పి యాహవవర్తనంబు
నిర్వహించి మదీయసాన్నిధ్యమునకుఁ, దోడికొనిరండు నా నరాదులు కదంగి. 495

క. ఘననిశ్వసనోచ్ఛ్వసనో,జ్జనితధ్వనిభయము నతినిశాచరమయము
న్మన జాడ్యశకలచయముం, జని కాంచిరి కుంభకర్ణశయనిలయమున్. 496

వ. కనుంగొని యతిప్రయత్నంబున. 497

క. చేరి ఘటకర్ణకర్ణ,ద్వారంబులు రెండు బిట్టు వ్రయ్యలు గాఁగన్
ఘోరహరికాదఘనశంఖారవము లొనర్చి నిద్రఁ గదలకయుండన్. 498

సీ. కృష్ణవర్ణనిశాతకీలలఁ గ్రాఁగిన తైలంబు కర్ణరంధ్రములఁ జొనిపి
ధారాకఠోరతురగసంహతులచే ముఖమున సందంద మొనసి మోది
మత్తదంతావళపుంజంబుఁ గొనితెచ్చి కడువడి నురమున నడవఁజేసి
పలువురు బలియురు పనివడి తెచ్చి గండాశ్మజాలంబు దేహమున విసరి
గదల నడిచియుఁ బొడిచియుఁ గఱచియు మఱి, యెన్నియే యత్నములొనరింప నిట్టునట్టు
పొరలి వెస నావులించుచుఁ బొంగ నీల్గి, యెట్టకేలకుఁ దెలివొంది యిట్టు లనియె.
గీ. దివిజరిపులార నన్నుఁ బ్రబోధింపనేమి, యవసరం బిప్డు వచ్చె దశాననుండు
రోషవిమనుండు బలవద్విరోధ మెదిరి, తెచ్చికొనియెనో తెల్పుఁడ దదియునుఁగాక;
క. కులభూషణుఁడు విభీషణుఁ, డలఘుగుణుఁడు కుశలియే కదా యతఁడున్నం
గలుగదు విపరీతస్ఫురణ, కులపాటిపుడేల మేలుకొలిపితిరి నను౯. 501
గీ. పెద్దనిదుర వేళ్ళు పెద్దవగం బిమ్ము, నెపల బలిమి నెన్నరేని దెలుప
వాఁడు పెద్దనిదుర వీడొందుఁ దనుదాన, లేచెనేని జగము నేఁచుననిరి. 502
వ. అట్లు గావున నా పాశ్చాత్యసుషుప్త్యవస్థుండ నగు నాకు యుద్ధంబున మరణంబు సిద్ధంబని పలికి. 503
సీ. ప్రకట నిద్రాభంగ కర్తృజనము లంగారధానికల ప్రకాశ మొంద
నలసత దోఁపంగ నావులించిన వక్త్ర మద్రిగహ్వరలీల ననుకరింప
నాఁకలిగొని వెన్ను నంటిన జఠరంబు బడబాగ్ని జలరాశి కీడుగాఁగ
దంతసందష్టనోష్ఠత భైరవాకార మగ్రభ్రూబు పెట్టిలెడునట్లు గాఁగ
నున్న కుంభకర్ణు నుజ్జ్వలానలకర్ణు, నగ్రభాగమునకు నరుగ వెఱచి
పార్శ్వముల వసించి ప్రణుతించి యల్లన, నిట్టు లనిరి దైత్యభృత్యవరులు. 504
క. ఓ యన్న మహాభాగ్యము, మీ యన్నకుఁ గల్గె నిన్ను మేల్కొలుపఁగ న
త్యాయతమతిఁ బుత్తెంచిన, నీ యున్నెడ కరుగుదెంచి నిపుణత మెఱయ౯. 505
క. నిను లేపితి మన్న వలన, వినఁ దగు కార్యంబులెల్ల విందు బుభుక్షా
వినివృత్తి గాఁగ మాచే, సినవంటకములను దృప్తిఁ జెందు మనవుతు౯. 506
క. శాల్యములు దీర్చి గంధసుమాల్యాద్రై శాకసూపసహితధవళియ
శ్శాల్యన్నకుధరములు దధికుల్యంబులతోడ భక్ష్యకోటులతోడ౯. 507
వ. పాతాళవివరంబునుం బోని నిజకంఠబిలంబునం దిగవైచి వెండియు నక్కుంభకర్ణుం డనేక మార్జారమాంసంబును నపరిమితకుక్కుటపలలంబును నిశేషమహిషామిషంబు నా బహువ్యాఘ్రతరసంబును నసంఖ్యాతసూకరక్రవ్యంబును నగణితమానవపిశితంబును

సధికగోధికాధాతువును సముధికమూషికపిండికయును నతిరిక్తవిహంగమకాళికయును
ఘనమగ్రజలచరపలలంబును రాశీకృతశష్పస్తంబును మెసవి. 508

క. శతఘటశోణితముల్ దశ, శతఘటమద్యమును బంచశతఘటమధువుల్
శతఘటగోఘృతము న్నవ, శతఘటతైలంబుఁ ద్రావి సమసుం డగుచున్. 509

మ. విపరీతాకృతి ఘోరహుంకృతిఁ గులాద్రివ్యగ్రసద్వక్షోన్నతిం
జపలప్రక్రియ రాజపద్ధతిని జేచ్ఛన్ భ్రాతృవీక్షాప్రలో
లుపబుద్ధిం జనుకుంభకర్ణు ఖలుశీలుం గాంచి నిశ్చేష్టమై
కపిసంఘంబు భయార్తిఁ జేరెను రఘుశ్రేష్ఠనాథుసామీప్యముల్. 510

వ. మహోద్భుతలంకాసముద్భాతభూతంబు చందంబున నరుగుచున్నం దదీయవికృతాకృతిం గాంచి విఱిగి పఱచు తరుచరుల నోడకుం డని ధనుర్ధరుండును సత్వాఢ్యుండు నగు పూర్వవంశభూషణుండు దోషాచరకులవిభూషణుండగు విభీషణుం గనుంగొని.

మ. తనఘోరాకృతిఁ గాంచి భూతమనుజుల్ ధైర్యంబు పోల్పడఁ జే
తనరాహిత్యులపోలె వానరవరుల్ త్రస్తాత్ములై యుండఁ గే
తనశస్త్రంబులు జానులగ్నములుగా దర్పంబునం బోవు నీ
తనిపే రెయ్యది నాకుఁ దెల్పు మరియుం దత్ప్రక్రియావేదివై. 512

వ. అనుటయు నమ్మహాత్మునకు వినీతాత్ముండు. 513

గీ. వీఁడు రావణు ననుజుండు వీనిపేరు, కుంభకర్ణుండు నిద్రగూరియుండు
సమధికబలుండు సమరప్రచండుఁ డాజి, సుస్థిరభుజుండు నాకగజాంకుశుండు.

క. నాగరకుల నెఱుఁగక ని, ద్రాగరిమను నాఱునెల లితఁడు వసరించున్
జాగరమొకదివసము నాఁ, డోగిరము భుజించు సుఖసమున్నతిఁ గాంచున్. 515

వ. మఱియు నద్దివసంబున దివిజులకు నజేయుండు నేఁడు ప్రజాగరణదినంబు గామి యెఱిఁగియు దశకంధరుండు భవదీయదివ్యాయుధశిథిలీకృతదేహుండై నవాఁడు గావునం గార్యాకార్యవినిశ్చయబుద్ధిహీనుండై ప్రబోధింపం బంచినం దెలివినొంది యగ్రజాలోకనాయత్తచిత్తుండును మత్తుండునై చనుచున్నవాఁ డెన్నండేని యన్యులచేత బలాత్కారంబున బోధితుం డగు నాఁడ మృత్యువుం జెందు నని బ్రహ్మవచనంబుగలదు గావున నితండు నీకశక్యసాధ్యుండు గాని దుర్విభేద్యుండు గాఁ డని పలికి వెండియు నక్కుంభకర్ణు జన్మబలపరాక్రమప్రకారంబులు వేఱువేఱ విన్నవించి పలికె నంత. 516

క. కపులవెఱపు దీఱఁగ నిక్కపుదైత్యుఁడు గాఁడు కాష్ఠకల్పితవివర
త్కపటాకృతి యని చాటం బనుపు మనవుడు మెచ్చి నృపుఁ డనుజ్ఞ యొసంగన్.

క. నీలుఁడు సమస్తసైన్యము, నాలోకించి కపులార యసురుఁడు గాఁ డు
ర్వేలమగు దారుయంత్రము, పౌలస్త్యాకృతిఁ బని గొల్పుఁ బతి యీప్రతిమన్.

చ. అనవుడు గ్రమ్మఱంగ విపినాటవమూలవహంబనీకసా
ధనమయి నిల్చె నట్లు కపథప్రవిలేఖనతుంగమస్తుఁడై
ఘనభుజవిక్రముండు ఘటకర్ణుఁడు దీవనఁబ్రాలు పుణ్యకా
మిను లురుసౌధకూటముల మీఁద వసించి పయిఁ జిమ్మఁగన్. 519

మ. చని కాంచె న్నవరత్నకీలితమనోజ్ఞస్తంభసంవాహముం
గనదభ్రంకషకేతుశాతవిచలద్గాంబుజవ్యూహమున్
ఘనవజ్రాగారము వైరిభీకరచమూమందీకృతోత్సాహమున్
దనుజవ్యూహముఁ బఙ్క్తికంధరమహోద్యత్సభాగేహమున్. 520

క. కని యాపాకాభిరూపా,క్షనికుంభాద్యనిమిషగ్రపుసంభృతగేహం
బని వారితుఁడై చేరం, జని యాగ్రజు చరణసరసిజములకు మ్రొక్కెన్. 521

క. మ్రొక్కిన నిలిపి సహోదరు, నక్కున గదియించి యద్దశాస్యుఁడు గడువెం
పెక్కిన రత్నపుగద్దియ, నక్కునకు నిడఁ బంచెఁ గుంభకర్ణునకుఁ దగన్. 522

వ. పనుచున బలియురగు పలువురు రక్కసులు పెక్కసంబునం గొనివచ్చి యిడిన సమున్నతంబగు పసిండిగద్దియ సుఖాసీనుండై హుంకృతుల నభోభాగం బదరించుచు నన్నం గనుంగొని. 523

ఉ. తెంపరులై నిలింపులకధీరత చేయఁదలంచిరో విరో
ధింపుము నష్టదిక్పతులు దేటిరొ సూర్యముఖగ్రహాళి వే
ధింపఁ దలంపు గల్గెనొ సుధీజనమేను సమీరనప్రబో
ధింపఁగ నేమి కారణము తెల్పుము నిద్దుర దీరకుండఁగన్. 524

చ. కలఁచుమునో పయోధి యుదకంబులు బొందడిగాఁగ మేదినిం
గలపుమునో నభంబు పెలుకంబడఁ గ్రోఁచి దిశేంద్రచంద్రుల
న్నిలుపుమునో నభోయసరణిం జనకుండఁగ నాకుఁ గార్యముం
దెలుపుము గాక నావుడు నతిప్రమదంబున బొంగి యిట్లనున్. 525

క. మనసోదరియగు శూర్పణఖ నిరపరాధఁ బట్టి ప్రసభంబున ఘో
రనిశాతశస్త్రహతి ముక్కును గర్ణయుగంబుఁ ద్రెవ్వఁగోసి నాథేచ్ఛన్. 526

వ. జనస్థానంబున నుత్తమత్రిశిరులం డొకండ ప్రియానుజప్రియాసహితుండై ప్రమ్మ
రుచున్నం గనుంగొని సహింపక. 528

చ. అనఘమతు ల్చతుర్దశసహస్రనిశాచరసైన్యయుక్తులై
ఘనఖరదూషణాదు లసమానబలు ల్చని పోరొనర్చి త
ద్ఘనశరవృష్టిఁ బ్రాఁగినఁ బడంపడి కంచకఁ జేయు గాలవే
దినగుచు వానిభార్యఁ గొనితెచ్చితి సీతఁ గజాతలోచనన్. 528

క. కటుకపటంబునఁ దశ్రుతి, దటుకునఁ దెమ్చటయు నతఁడుఁ దమ్మాయను ను
త్కటశోకవేగమున మర్కటులం గూర్చుకొని కదలిగడచెను నెడలన్. 529

క. అర్కకులుఁడు రాముఁడు శో ట్యర్కవిభుం డావిష్ణుఁ డనుచు మతిరూన
మ్మర్కటులు దివిజు లనుచుం, జేకొని వెలపించె నను విభీషణుఁడు గడున్. 530

క. ఏకమహీసుతరాముని, కీనని పలుకుటయుఁ గోప మెక్క నసురతీ
జానిశరణంబు వేడఁగఁ, దా నప్పుడు వెడలిచనియెఁ దనమంత్రులతోన్. 531

వ. తదనంతరంబున రాముం డనేకవనాచరనీకినీపరివృతుండై సేతుమార్గంబున లంకా
పురంబుపై విడిసి ప్రహస్తధూమ్రాక్షమహానాదమహాకాయాకంపనాదుల నరాదుల
ననేకుల సంహరించి మించి పరాక్రమించి యున్నవాఁ డది యటుండంగాక. 532

క. హనుమంతుం డిటుగా నొక్కవచరుఁ డవనిసుత వెదకవచ్చి బలియుండై
విను మింతకు మును విక్రమ్యసును నక్షయుఁ జంపి లంకగాలిచి పోయెన్. 533

ఆ. మఱియు నింద్రజిత్తు మహితోరగాస్త్రిలిఁ, జిక్కవడని రాజసింహులీఁడుఁ
గడఁగి యేనపోయి కాండిశీకుండనై, జరగిరచ్చితని నిజంబు కల్ల. 534

క. నీవు సహజబలశాలివి, గావున బోధింపరల సెఁ గయ్యమున ధరి
త్రీవరుఁ గూలిచి నాచే, వీరస వదయు మన నతఁడు ధృతిచలనుండై 535

గీ. కొంతతడవూరకుండి యకుంభకర్ణుఁ, డన్నఁ గన్గొని వింటె దశాస్య వింత
గాదె నరవానరులు వార్ధిగడచుటెల్ల, భంగిఁ దేఁపోయు దనము శుభంబు గాదు 536

మ. మునుముం దాటకసంహరించి భృగురాముం గెల్చి తోడ్తో విరా
ధునిఁ జక్కాడి ఖరాదులం జిదిమి మత్తుండైన మారీచునిం
దునుకల్సేసి బృహన్మదాంధునిఁ గబంధుంగూల్చి యేశాకుగ
మ్మున వాలిం బడనేసినట్టి రఘురాముం డేల మర్త్యుం డగున్. 537

క. సముఁడైనవానియెడ సా, మము దానం బధికునెడల మత్తునియెడ భే
దము హీనుఁడైనయెడ దండ మ్మెల్లు ఁబ్రయోగించ రణ బేమిటికిన్ 538

క. సింధురసైంధవరథభట,బంధువితతి తెగినఁ గాంచి పదపడి రిపుతో
సంధి యొనర్చిన నదిదు,స్సంధి యగుం గాన మొదల సామము వలయున్. 539

క. లోకంబునకుఁ ద్రివిష్టప,లోకమునకు మన మొనర్చు లోపంబులు ము
ల్లోకములకుహితుఁడగు నా,లోకేశుఁడు మున్న శేషలోకేశునకున్. 540

మ. వినయం బొప్పఁగ విన్నవించుటయు నవ్విష్ణుండు దైవాళి న
వ్వినయం బొప్పఁగ బ్రహ్మతో దశరథోర్వీనాథపుత్త్రుండనై
దనుజధ్వంసన మాచరింతునని యంతర్ధానముం జెంది యు
ర్వీసుతాకాంతుఁడు రాముఁడయ్యె బలవద్విద్వేష మింకేటికిన్. 541

క. మును విది యంతయు నారద,ముని విని వెం దద్వచన మమోఘము నాకుం
జనవు గలిగి తెలిపితి రా,జనసేయుము వలదు దుర్విచార మనవుడున్. 542

ఉ. పక్కన నవ్వె పెద్దయుని పాడి దలంపక నిండుఁగొల్వులో
బెక్కులుఁ బ్రేలినాఁడ వైరిబృందము సంతసమందఁ నట్టినీ
వెక్కడిసోదరుండ వివి యేటివినీతులు చాలుఁజాలు నీ
వెక్కడ సంగరాంగణ మదెక్కడ నిద్దుర పొమ్ము పొమ్ముకన్. 543

చ. వెనఁగొను భీతిచే మును విభీషణుఁ డెంతయు నొత్తిచెప్పె నా
తని దొకచిన్నపెట్టె విదితంబుగ నీదొకపెద్దపెట్టె యా
తనిక్రియ నన్నుదాటినకతంబున బింక మెఱుంగకట్టి వీ
రునినిను లేపునాదొక విరుద్ధపుపెట్టెగదా తలంపఁగన్. 544

క. రాముఁడు వలమురిదాల్పు వ,లీముఖు లవ్వేల్పులైన లిబ్బపడఁతి సీ
తా మానినియైనను నగు, సామంబేనొల్ల నెట్లు సంగ్రామమగున్. 545

వ. అది యట్లుండనిమ్ము నిద్రాసక్తులు నంగనాసక్తులు భోజనాసక్తులును సంగ్రామం
బున కర్హులుగా రీవధికనిద్రాసక్తుండవు భోజనప్రియుండవు భయభ్రాంతుండవు
గావున నీసహాయం బేనొల్ల నెల్లభంగి సమరంబున విరోధుల వధింపక తక్కనే
యని పలికి మొగంబు గంటువెట్టుకొని యూరకున్న యన్నం గనుంగొని కుంభకర్ణుం
డు తనమనంబున. 546

క. దుర్ణయుఁ డితఁడు వినీతివి,నిర్ణయవాక్యములు వినఁగ నేర్చునె యనుచున్
ఘూర్ణితలోచనుఁ డగు ఘట,కర్ణుం డిట్లయ్యె నన్నకర్ణము లలరన్. 547

చ. తెగనిసుషుప్తిచేఁ బలికితిం గలహాం బశుభం బటంచుఁ ద
ప్పగొనకు మిప్డు లేచితి నృపుల్గపు లెంతటివారు వైరులం

దిగిచి తృణంబులోనఁ బగ దీఱ గ్రసించెద మేనఁ బ్రాణముం
డఁగ వసుధాతనూజ వరనాథున కీయఁగ నీయకొందుమే. 548

క. బాణకృపాణపటుతను, త్రాణంబులు వలదు బాహుదర్పమున రిపు
ప్రాణములఁ గొందు మూర్ధ్నాఘ్రాణం బొనరించి కుంభకర్ణు ననుపుమా. 549

వ. అనుటయు సంతసించి. 550

క. వాలి నడిచి కపుల రవిజు, నేలించిన భంగి నిన్ను నేలించెద దై
త్యాలి రిపుఁ దునిమి యనుచుం, బ్రేలునఁట నృపుండు మన విభీషణునొద్దన్. 551

వ. అదియునుంగాక. 552

క. నిద్రితుఁడవు నీవధికభ, యద్రుతుఁడను నేను నగుట నహితబలం బ
త్యుద్రేకము నూపెను న, య్యద్రిచరావలి వధింప నరుగు మనవుడున్. 553

సీ. శరశరాసనకవచస్యందనాదిరణోపకరణముల సజ్జగించి
యపజయం బెఱుఁగించు నమితతూర్యధ్వనులకు శకునములకు వెఱవక
శూలంబుఁ జేదాల్చి శూలికైవడిఁ బొల్చి పురజను లొప్పనఁ బొగడుచుండఁ
గతిపయభయదరక్షస్సైన్యయుక్తుఁడై తనదునిద్రాభంగమును విరించి
తనయువాక్యములను దలపోసి మరణంబు, సిద్ధ మగు టెఱింగి చింతలేని
మానసంబుతోడ మానవేంద్రునిచేతఁ, జావుఁ గోరి వెడలె సమరమునకు. 554

క. వడిఁ బుర మిర్వెడలి వెలు, వడి పనివడి కలహమునకు వచ్చెడువాఁ డె
క్కఁడితండని కపులచ్చెరు, వడి చూచుచు నుండి కొంతవడికిం దమలోన్. 555

ఉ. నీలుఁడు చెప్పినట్లు రజనీచరరూపకకాష్ఠపుత్రిగాఁ
బోలును గట్టిబొమ్మఁగని పోఁడిమి దూలఁగ నేల రామభూ
పాలుఁడు దీనిఁ గూల్చు నని పల్కుచు నుల్కుచుఁ జూచుచుండ నా
భీలుఁడు కుంభకర్ణుఁడు విభీషణపూర్వజుఁ డాత్మయోధులన్. 556

క. తలకడచి దావదహనము, చలిచీమల నేర్చుపగిది సర్వకపులఁ గొం
దలమందఁ గుంభకర్ణుఁడు, లలిఁ ద్రిమ్మఁగఁదొడంగెఁ బ్రవిపులముఖుం డగుచున్. 557

వ. భీషణాటోపంబునం గనిమసంగి వనచరులం దిగిచి మహోర్వ్యగుహాకుహరసదృశం
బగు నిజబంధురకంధరకుహరంబునం జాఱ విడుచుచున్నం గనుంగొని. 558

చ. పనివడి వానరుల్పనసపంటికిఁ జీమలు చుట్టినట్లుగా
ముసుకొని గంధభద్రగజము న్వడి నీఁగలు మూఁగులాగునం
బెనఁగొన నబ్బలిష్ఠుఁడు విభృన్నిభమూర్తి విదిర్చి వెండియుం
గొనకొని బొక్కఁజొచ్చె రఘుపుంగవు లంతయుఁ గాంచి పొక్కఁగన్. 559

క. అద్రిచరావలి తనపైఁ, నుద్రేకము మీఱ వైచు నుర్వీరుహఘో
రాద్రిప్రకరములు పృథు,చ్ఛిద్రము లొనరించి దనుజసింహుఁడు మఱియున్. 560

సీ. పలువుర బలియుఁడై పట్టి యువ్వెత్తుగ దిగమ్రింగి వక్త్రంబు దెఱచి యార్చు
మఱియును వేలొకమాఱు వేవుర ముద్దగావించి మేనునఁ గలయ నలఁదు
నొకమాఱు నూర్వుర నొగి శూలమున గ్రుచ్చి కావిక్రొన్నెత్తురు ద్రాఁగ్రేఁచు
నింకొకసారి యనేకుల నేకులకైవడి నూఁకంబుగా విసర్చు
నిర్వ్యథంబున దానవుఁడేచి విలయసమయసమవర్తిసమవృత్తిసముదమూర్తి
సమయఁ జేయుచు సమరవసుమతి విడిచి, పాఱె వనాటు లసుర లేపారి మూఁక. 561

చ. సమరము సేయఁ జాలక వెసం బఱవెత్తెడు సేఁగఁ గాంచి రో
షమహితుఁ డంగదుండు రభసంబున నడ్డముపోయి శౌర్యవా
క్యములు వచించి వానరులఁ గ్రమ్మఱ వాజికి నూలుకొల్ప నొ
క్కమొగి ద్రుమంబులన్ దనుజుకాయము గప్పిరి దాన నెంతయున్. 562

క. లింగము మాలూరదళా,లిం గప్పిన కైవడిం జలింపక యతఁడో
లిం గముల కొఱకి మ్రింగఁదొ,డఁగిన ద్విపిరుండు గడు బెడంగగు లీలన్. 563

ఉ. రక్కసుపెన్నురంబు కుధరాధరకూటము వైచి యార్వఁగా
నక్కరి నాత్మఁ దుక్కుమెఱుఁ గున్నిజదేహహతిం బగిల్చి యా
చక్కటి వానరోత్తములఁ జక్కడఁపం గని మారుతాత్మజుం
డొక్కమహోర్వ్య నద్ధనాజు డొక్క చియంగఁగ వైచె వైచినన్. 564

క. తద్ధతి కించుకసోలి దు,రుద్ధతి నకుంభకర్ణుఁ డుద్దవిడి సమి
త్పద్ధతిచెడి మూర్ఛిల్లి బ,లోద్ధతు హనుమంతు నేసె నురుశూలమునన్. 565

సీ. ఆలంబుమాని వాతూలబాలుఁడు నేల వ్రాలిన నీలుఁ డుద్వేలుఁ డగుచుఁ
బాహాత్త్వ నిలు నిలు పాఱెపోకు మటంచుఁ బాషాణపటలంబుఁ బఱపఁజేయ
నది పిండిగాఁ జేసి యతఁ డున్నెడ గవాక్షనలవృషభాదు లనలసదృశులు
తన్నెదిరింప నందఱ ఘోరహలంకారమునఁ బాఱఁగఁ జేసి వనచరాలి
బిట్టు చుట్టుముట్టి పీనుంగుపెంటగా, నిందుమున్నఁ జూచి విహ్వలించి
యాత్మసేన నిట్టు లలయించు నే యిద్ధ,గాత్రుఁ డనుచు వాని కడ్డ మేగి. 566

క. వాలిసహోదరుఁ డురుతర,శైలంబున వైవ దానిఁ జక్కాడి వడిన్
శూలము విసరుడు నదివా,తూలసుతుఁడు మూర్ఛదేఱి తునుకలు సేయున్. 567

క. శూలంబుఁ గేలఁ దాల్పని,శూలిక్రియం బేర్చి రాక్షసుఁడు తపవజు ను
త్తాలాద్రికూటమున మూ,ర్ఛాలసుఁ గావించెఁ గపిబలాంబుధి గలఁగన్. 568

వ. ఇట్లు లంకామలయాచలకూటపాటనంబున సమ్మూర్ఛితుం గావించి యక్కపికుంజరుని పట్టిం బట్టుకొని భుజంబునం బెట్టుకొని. 569

క. లంకాభిముఖుండై చను, లంకానాథానుజుం దలంకక శౌర్యా
లంకారుఁడు హనుమంతుఁడు, హుంకారముతో నెదుర్ప నూహించి మదిన్. 570

క. ఇతఁ డీతఁడు విక్రమఘనుఁ డే,తమనో తనదాన తెలిసి యరుదెంచు నరా
ధను మోసపుచ్చి యీతం, డనితరభేద్యుఁ డని తలఁచునంతటిలోనన్. 571

ఉ. అన్నరుఁ బాపువేడ్క హరిదశ్వసుతుం బృథుగాఢమూర్ఛితుం
గ్రన్ననఁ గొంచుఁ బోవు ఘటకర్ణునిఁ గన్గొని పౌరభామ ల
త్యున్నతసౌధభాగములనుండి సుమంబులు పైవిదిర్చి రా
పన్నత వానరుల్ వివిధభంగుల నేడిచి రార్తవాదులై. 572

గీ. అంతఁ గుంభకర్ణు నంసభాగంబునఁ, బుష్పమాలికయును బోలియున్న
రవిసుతుండు తేటి రక్కసుచే నిట్లు, కట్టువడితిఁ దప్పెఁ గార్య మనుచు. 573

క. లోసంతాపము నొందుచు, నాసమయంబున విభీషణాగ్రజు చెవులున్
నాసికయును మొదటికిఁ దెగఁ, దీసెన్ ఖరనఖరదంతతీవ్రత మెఱయన్. 574

క. ఆకుంభజేతయు వెలయఁగ, ముక్కుం జెవులును గ్రుంచి ముదితాత్ముండై
దిక్కుంజరములు గ్రుంగఁగ, నక్కుంజహితాత్మజన్ముఁ డవనికి నెగసెన్. 575

చ. పృథివికి ఖాతకుంభమహిభృచ్ఛిఖరాగ్రవిహార పింగద
కృథుకము దాఁటు మాడ్కి నసువాత్పుటభేదకోటి నెంతయుం
బృథుగతిఁ జెంగలించి ప్లవగేశ్వరుఁడు కీశు లభిష్టుతింప భూ
మిధవుల రామచంద్రుల సమీపముఁ జేరెఁ గరంబు మెచ్చఁగన్. 576

ఉ. అంతటఁ గుంభకర్ణుఁ డవురా విపరీతపు వానరంబు ము
క్కంతయు రక్కెఁ బోయె నిఁక నన్నుఁ గనంగొనఁ బోవఁజాల నా
గొంతుక ద్రోవి నమ్మకసలిద్రోఁతని వైచెదనంచు శోణితా
క్రాంతశరీరుఁ డాతుణమ క్రమ్మఱియె న్రణమాచరింపఁగన్. 577

చ. మిగిలినవానరాలి దిగమ్రింగఁ దలంచెడు కుంభకర్ణుని
న్మిగిలి నరాదు లుద్భట సమిద్రవసితాత్ములు పోనొర్ప రాఁ
దగిలినకిక్కు మర్కటనితానము దారొక్కని తద్బలంబులం
దగిలి నటించె నద్భుతవిధంబున నెత్తుట నీఁదులాడుచున్. 578

క. తనసైన్యము దైన్యముఁ గనుఁ,గొని రోషావేశుఁ డగుచుఁ గుంభశ్రవణుం
డనివారితుఁడై మర్కటు,లను గారించుటలు చూచి లక్ష్మణుఁ డలుకన్. 579

శా. జ్యానాదస్తనితంబు నిష్ఠురధనుష్టంకారనిర్ఘాత ము
గ్రానేకాంబకవృష్టి మర్కటమహోద్యచ్చాతకామోదము
ర్వీనాథానుజధూమయోని ఘనమూర్తిం గుంభకర్ణాద్రిర
క్తానూనోత్సవము ముంచె దానవహృదబ్జామోదహీనంబుగన్. 580

చ. ప్రకటబలుండు రాముఁడును బాణపరంపరఁ బెల్లు ముంప మ
త్తకరికి నీళ్ళు సూపిన విధంబున నున్మదలీల శాత్రవ
ప్రకరము నైజసైన్య మనుపాడి దొఱంగి కరంబు సాఁచి యం
దికొని గ్రసింపఁ జొచ్చె నవధీరణఁ గ్రోఁతుల దైత్యజాతులన్. 581

వ. అక్కైకసీనందనుండు రామలక్ష్మణభయంకరాస్త్రవహ్నిజ్వాలాపిహితుండును వి
నాశితస్వసైన్యుండును విదారితనాసికాకర్ణకోటరుండును నిరాయుధుండును నిరవధి
కాయోధనశ్రముండును నయ్యును జలింపని ధైర్యంబున. 582

క. కరి తుంగమదువు సొచ్చిన, కరణి న్మందరము జలధిఁ గలఁచుపగిది ని
ర్జరముఖుఁ డరణ్యమేర్చు ప్రకరణంబున గలఁచెఁ గుంభకర్ణుఁడు కపులన్. 583

క. కట్టలుక నిట్టలంచుచుఁ, గట్టిడి యగునట్టి కుంభకర్ణుఁడు గనియెం
గట్టెదుర విభీషణుఁ దోఁ, బుట్టువు నంచద్గదావిభూషితు దుఃఖిన్. 584

చ. కనుఁగొని తండ్రి కుందకు వగం దనుజాన్వయ మంతరింప నుం
డ నిలుపువాఁడ వీవ నరనాథు దయు న్మము నెల్లఁ బాసి పో
తి వని మనంబులోఁ దలఁపఁ దీరదు దుర్జనులైన బంధుల
న్మనుమును రోసి నిత్యసుఖముం జిరకీర్తియుఁ జెందఁ జెల్లదే. 585

క. నీకఱపులు వినని యప్రియకరుఁ డగు దశముఖుండు చెడుట నిజము సు
శ్లోకుండ వీవిధంబున, శోకింపఁగ నేల తొలఁగి చూడుము నన్నున్. 586

వ. అని పలికి తనకు నమస్కరించి యధోముఖుండును నిరంతరబాష్పసలిలధారాపరిపూ
రితలోచనుండు నై యూరకున్న విభీషణు ననునయించి యతనిం దలమిగిలి. 587

క. చని వానరు లడ్డము సొచ్చిన వారల నింత పరకు సేయక రాముం
గని యిదె వచ్చితిఁ గలహంబునకు న్రా రమ్ము తొలఁగి పోవకు మనుచున్. 588

చ. పొగరున నిన్నెదిర్చి పరిపోయుట జన్మఫలంబు పోరిలోఁ
దెగితిన యేని వెండియును దేజము నొంద జనించి నీ మొదం
బగఁ గొని గెల్తు నందు నినుఁ బట్టి జయింపఁగఁ జాలనేని పొం
దుగ నినుఁ జేరి బంటు నగుదు న్వినుమిట్లు ప్రతిజ్ఞ పట్టితిన్. 589

క. ఏను మనుజమాత్రుండను, గాననికాఁబోలు నింత గర్వించెదు నీ
తోనెవని పోరవచ్చిన, యేను దనుజమాత్రుఁడనె రహిం దలపోయన్. 590

క. సర్గస్థితివిలయములు నిసర్గముగాఁ గలుగు నింద్రజాలుఁడవు గడు
న్నిర్గుణుఁడ వనుచు డాయుధ, మగ్గుణసాంద్రణ విభుఁడు దనుజపతితోడన్. 59

క. నీకంఠము దునిమి మహో,గ్రదేకుండగు రావణు స్వాధించెద నిఁక ము
హ్వాకలఁబోయినఁ జెల్లదు, మీకని దశరథసుతుఁడు సమీకోన్ముఖుఁడై. 592

సీ. ఘటకర్ణ సముదీర్ణ కర్ణకోటరములు పటుపత్రులకు మన్కిపట్టుచేసి
పాపర్త రనునేత్రకూపము ల్కిక్కిరి బడముగా శరపూరితములుచేసి
రాక్షసముఖగహ్వరంబు నానాజిహ్మగములకు వాసయోగ్యంబుచేసి
దశకంధరసహోదరుశరీరకాంతార మతులబాణకదంబమయము చేసి
కైకసీపుత్రు హస్తశాఖలను ఖగని,వాసములుచేసి మతి దుర్వ్యాసవారి
ఘోరవత్కీకవాటంబుఁ గ్రూరసార, సంబులరఁ దావుచేసి గోసంబు మిగుల.

క. వాసిగలుగు వాలిం బడ, నేసిన యస్త్రమును దానికెక్కువ యగుబా
ణాసారంబున ముంచుచు, నాసురపతి నొచ్చిచూచు మహోగ్రహుఁ డగుచున్. 594

క. గొదకొని వైరిబల బుల, కదనంబున వైచికొనుచు వారనికినుకన్
గదగొని కదనంబునయుం, గదిసెం గాలాంతకప్రకారము గాఁగన్. 595

వ. కదిసి భయంకరసింహనాదంబు గావించుటయు సహింపక. 596

క. హస్తిసహస్రబలుఁడు కృత,హస్తుఁడు వాయవ్యశరనిహతి దనుజుఁ బ్రహ
ద్ధస్త్రము ద్రుంచుటయుఁ బరిప్రస్తంబై పడియె గదయు జగ్గతితముగన్. 597

చ. గదయును బాహుదండమును ఖండములై పడ నొండుకేల ను
గ్రుఁడయి సాలముం జెటికి మానవనాయకు ప్రేయఁబూనుడు
న్నిదురనిభేంద్రసాయకముఁ బెద్దయు వేడుక నారిఁ గూర్చి నిం
డఁదిగిచి తత్కరంబును బడ న్వడిసేసె నమోఘువేగుఁడై. 598

క. శరయుగమున ఘటకర్ణుని, కరయుగముం గూల్పఁ జెల్లుగానవియుసమి
ద్ధరణిఁ బడి చదివె నసురో,త్కరముం గపిబలము నద్భుతస్థితిదోఁపన్. 599

క. శాఖారహితమహోన్నత,శాఖిప్రక్రియ దశాస్యసహజుఁడు దురా
శాఖిలమానసుఁ డగుచువి,శాఖనిభుం గవిసె రామచంద్రు న్మిగఁగన్. 600

క. పదహతులన్ ధరణి వియ,త్పదమున్ హుంకృతులఁ గ్రక్కదల బద్దలుగా
నొదిరించి యిట్లు గిరియుడుం, గదిసి శాదుఁడు గమధికబలోద్ధతుఁడై. 601

క. ఏనొకరుండన వైరులఁ, బూని వధించెదనటంచుఁ బోయి రిపులచేఁ
దాన మృతుఁ డయ్యెఁ బురుషుఁడా, దానొకఁడు దలంప నొకఁడు దైవము దలఁచున్.

వ. అని బహుప్రకారంబులం బరిదేవనంబు గావించి తమ్మునిం జేరంగని. 613

క. హా యను మేరుతులితదే, హా యను శక్రజితగిరిగుహా యను దగునా
హా యను రిపువనహవ్యవ, హా యను సుమనోమదాపహా యను మతియున్. 614

మ. అనుజా నిన్నుఁ ద్రివిష్టపస్థులును డాయన్లేరు నీపట్టిచో
మనుజాధీశ్వరమార్గణాగ్నిశిఖలన్ మ్రందం గనుంగొంటి నే
నని జాలిం బడి రావణాసురుఁడు ధైర్యాయత్తచిత్తంబునం
దనుజాళిం గని యిట్లు వల్కెఁ బటుచింతాక్రోధఘూర్ణాత్ముఁడై. 615

చ. గతజలసేతుబంధనము గాదె మృతుండగు వానిఁ గూర్చి శో
కితమతులౌట మీ రరిగి ఖేచరకోటి దలంక నష్టది
క్పతులు వడంక హస్తిహయపద్గరథధ్వజినీసమేతులై
హితమతులార రాఘవమహీశులఁ గీటులఁ జంపి రం డనన్. 616

క. అంతకసన్నిభు లగుచు న, రాంతకదేవాంతకులు మహాపార్శ్వాగు
ల్వాంతకశమనంబులకు న, భ్యంతర మింతయును లేని యాత్మలతోడన్. 617

సీ. కాటుకకొండలు కదలి యేతెంచెడుభంగినొప్పెడు మదేభనికరంబుఁ
బూర్వవాయువుల నుప్పొంగు సముద్రంబు తెరగలఁ బోలు సైంధవచయంబు
సంవర్తసమయాగ్రజాకాల కాళికాక్రమము గాంచెడు శతాంగవ్రజంబు
సమవర్తికింకరసదృశఘోరస్వరూపప్రదీపితవీరభటచయంబు
నాహవపటిమ మెఱయుచుఁ దోడఁ జరుగుదేర, సమరభేరీరవంబులు చదలునిండఁ
గదలి యుద్ధాశకంతు లుత్కంఠులగుచుఁ, దాఁకి రహితబలంబులు తల్లడిల్ల. 618

క. తాఁకిన నంతకమున్న, స్వామీకోన్ముఖు లగుచునున్న మిహిరసుతాదుల్
డీకొని ప్లవంగపృతనా, నీకముఁ బురికొల్ప నురము నిష్ఠుర మయ్యెన్. 619

క. ద్రుమచరులు తరుశిలావ, ర్షము దనుజుల మీఁదఁ గురియ రాక్షసులుం ద
ద్ద్రుమచరులమీఁద శరవ, ర్షము గురియించి రతిలోకసాహసవృత్తిన్. 620

చ. అపుడు నరాంతకుండు సరయంబు హయంబు మరల్చి సాధ్వస
వ్యపగతవృత్తి వానరచయంబు గలంగఁ దొలంగఁ ద్రుంగ శ
క్తిపటిమ శక్తివైవ వినుతించుచు దైత్యులు సందడించి ర
ట్లపరిమితప్రతాపనిధియై దనుజాధముఁ డాక్రమించుచున్. 621

క. కని వానియేపు సైఁపని, హనుమంతుని కడ్డ మరిగి యంగదుఁ డురుసా
లనిహతి శిరంబు విప్రులా, శ్మనిహతి గాయంబు గూలి చదియఁగ నేసెన్. 622

చ. అటులఁ నిహీనశాంతకు నరాంతకు నంతకు చెంత కంపుచుం
గుటిలమనస్కులై రిపులు గూడినతోడన వాయుసూనుఁడుం
జటులరయంబునం బరమసాహసులం బృథుఘోరయుద్ధులం
గటుల నిశాటులం జదిపె బాహుబలంబునఁ జలబు మీఱఁగన్. 623

వ. మరుత్పుత్రమరుత్ప్రేరితంబును వాలజ్వాలాజాలంబును రోమధూమావృతంబు నగు
నంగదదావానలంబు విరోధిసేనాకాననంబు దహింపం దొరకొనుటయు సహింపక. 624

క. అశనినిభుఁడు దేవాంతకుఁ, డుశనాంతేవాసిపతి మహోదరుఁ డసుహృ
త్పిశితాశి మహాపార్శ్వుఁడు, ద్రిశిరుండును గదిసి యాజిదీపితు లగుచున్. 625

శా. సుగ్రీవాంగదజాంబవత్ప్రముఖు లక్షుద్రప్రభావాఢ్యు ల
త్యుగ్రగ్రావమహీరుహావలి సమీరోద్రేకముం జూప దా
శగ్రీవాగ్రజు లాత్మ మెచ్చఁ ధనుష్టంకారము ల్చేసి తీ
వ్రాగ్రామోఘశరౌఘము ల్వఱపి బాహాదర్పము ల్చూపిరన్. 626

క. అంగదు మునుమున ముసుఁగీ, తిం గూరిన దైత్యబలము దేటికిఁ బులకాం
బొంగుచుఁ దలపడుటయు నురు, సంగరము బలద్వయికి నసమగతి నయ్యెన్. 627

క. తలఁప విపరీత మగుఁ గదా, తలము గనుంగొనఁగ నద్భుతస్థితి నయ్యెం
దలఁపడు నెడయును స్వేఱను, తెంపను నెడయుం గడంగి తలపడు నెడయున్. 628

వ. అట్టిక్రందుకయ్యంబునందుఁ గబంధపాఠీనబహుళంబులును విపులాస్థిమార్గసైకతప్రదే
శంబులును మాంసకర్దమంబులును వాలశైవాలంబులును గరవాలవ్యాళవ్యాళంబులు
ను గపాలపుండరీకషండంబులును నగుచు రక్తనదీప్రవాహంబులు వెడలి యనేకముఖం
బుల సాగరసంగమంబు లగుచుండె నట్టియెడ. 629

ఉ. ఆనన వెట్టి వాఱఁ బ్లవగావలి మీఱి మరుత్తనూజపం
చానన ముగ్రభంగి నఖరావలి శాత్రవకుంభికుంభము
ల్మానక క్రక్కదలించుచుఁ బలాదనకాననవృత్తి యున్న దై
త్యామగుణంబు గాఁగ విబుధాంతకుఁడుం ద్రిశిరుండుఁ బావనిన్. 630

క. శరములు ముంచునెడ మహో, దరుఁడు మహాపార్శ్వుఁడును మదంబునఁ దోడై
యఱిముఁడు నీలవృషభులా, హరివరుసకుఁ దోడుపడ మహాహవ మయ్యెన్. 631

గీ. త్రిశిరదేవాంతకులఁ గులాద్రిప్రతిముల, నప్రతిహతప్రతాపుల ననిలసుతుఁడు
పిండి గావించె గండాశ్మ పిండిఁ జేసి, యుగమనోహారతరరథయుగముతోన. 632

క. దరమింతయు లేక మహో,దరునిఁ బ్రహస్తాంతకుఁడు ముదంబునఁ గూల్చెం
దరుచరులు మెచ్చికొనఁ ద,త్కరియును ఘీంకారపూర్వకం బసు వ్రాలెన్. 633

క. ఆదర మింతయుఁ లేక మ,హోదరుసోదరు నధించి యొప్పెను నీలు
న్నేనిఁ గూల్తు ననిరణా,హ్లాది మహాపార్శ్వుఁ డట్టహాసముతోడన్. 635

ఉ. నీలుఁ డయి స్వతాగ మహనీయమహాచారులు తల్లడిల్ల నా
భీలతఁ బోరనిచ్చి శరభీకరవృత్తి వహింపఁ గాంచి య
న్నీలుని వెన్కఁ ద్రోచి యవనీరుహముం బెకలించి యెంతయుం
జాలిక లేనికిన్క వృషభుం డరిభిద్వృషభుండు ద్రేసినన్. 636

గీ. బిట్టు మూర్ఛఁ జెంది పెద్దతడవుకతఁ, దేరిమీఁద మూర్ఛ దేరియున్న
యవసరంబు గాంచి యమ్మహాపార్శ్వుని, వాతనెత్తురుగల తాఁత వైచె. 637

వ. పవనతనయవృషభులచేతం ద్రిశిరదేవాంతకమహోదరమహాపార్శ్వులు గూలుటయుం
గనుంగొని కపిబలంబు లుప్పొంగి దనుజబలంబులం గలంపం దొడంగుటయు. 638

క. తుండంబులు దెగిపడు వే,దండంబులుఁ బడెడు బాహుదండంబులుఁ గో
దండంబులుఁ దొరిగెడు హా,హా,ఖండంబులు నగుచుఁ గ్రందుకయ్యం బయ్యెన్.

ఉ. చిట్టలుగాఁగ నాప్లవగసింహులతోడ నెదిర్చి పోరి తోఁ
బుట్టువు లేవురుం బొలిసిపోయిన సుగ్గతశోకవేగుఁడై
కట్టలుక న్రథంబు నతికాయుఁడు వే మరలించి క్రోఁతులం
బుట్టలుగట్టలం జెదరి పోవఁగ నేసె మహాస్త్రసంపదన్. €40

క. ఇవ్వని నవ్వనచారులఁ, గ్రొవ్వాఁడికరంబు లేసి క్రొవ్వెలయు మహా
న్నవ్వుమఁ జివ్వకఁ గదియుచు, నవ్వుల నవ్వీరు రాము తమ్ముఁడు గనియెన్.

క. కని సరభసంబు మీఱం, జనుదెంచి తొలంగు మిఁక నిశాచరకులపాం
సన రిత్త చావు నమునూ,ర్కొనవు న్నాని దశాస్యకొడుకు దిట్టగియెన్. 642

చ. ఇతఁ డతికాయుఁ డీతనిపయిం జనుదెంచితి పిన్నవాఁట న
ప్రతిహతబాహువిక్రముఁడు పంక్తిగళాత్మజనాఖ్యుఁడన్
ప్రతియుఁ డనల్పుఁ డబ్బుల దురంబున మార్కొనఁ డెందు విక్రమో
న్నతు భవదగ్రజన్ముఁ గదనప్రియుఁ రాము జయింపఁ జూచెదన్. 643

క. అలంబుల తెలుఁ గెలుఁగని, బాలుండవు తొలఁగు మనుచుఁ బటుగతి విశిఖ
జ్వాలలు నిగుడింప మహీ,పాలానుజుఁడు నుగ్గొల్చెఁ బ్రతివిశిఖమునన్. 644

వ. మరలించి యాద్ధాన్యమాలినీపుత్రునకు సుమిత్రాపుత్రుం డిట్లనియె 645

తుం డగు రావణుం డప్పుడిక్కాలుం బరికించి యభినవనయనపుండరీకంబు లెఱ్ఱవడ దశాననంబు లెత్తి దుఃఖవశానిరుషణంబుగా నిట్టులనియె. 658

క. అమితబలాఢ్యు లతికా,యమహాపార్శ్వత్రిశిరనరాంతకులును ఘో
రమహోదరవిబుధాంతకు,లు మరణ మందిరి దైవలోపమునఁ గటా. 659

క. ఏకముఖరావణుండు సు,ఖాకరశక్రాకిహీ ఘటకర్ణుఁ డతం
డేఁ రణి నీల్గెఁ బ్లవగా,నీక మలర ధాన్యమాలినీసుతుఁ డరిచేన్. 660

క. సుతుఁడు వసుటు విని హృదయము, శతఖండములగుట లేమిఁ జర్చింప నయః
కృతి మని తలఁచెద దురమునఁ, నతఁడు వడిఁ బడిసె దానవావలి యెల్లన్. 661

వ. అని పుత్రశోకవ్యాకులచిత్తుం డగు కైకసీపుత్రుఁ గని మందోదరీపుత్రుం డిట్లనియె.

చ. వగ కిటు మయ్య పంక్తిరథవైరుల నెల్లఁ ద్రవీయదివ్యబా
ణగళితకంఠులై పృథురణక్షితిఁ గూలఁగఁ జేసి సంతసం
బుగఁ జనుదెమ్ము నీవనుచుఁ బొమ్మని వే సెలవిచ్చి పంపినం
బగ యడఁగింతు రాఘవులఁ బట్టి హరింతు గ్రసింతుఁ గోఁతులన్. 663

క. అని మ్రొక్కి సుతుఁడు మోదం,బున సెలవొసఁగుమనుచు శుభభూమిఁ గ్రాలన్
ఘనమగు పూజఁ దనిపి తజ్జనిత రథాశ్వకవచశరధిశరుఁడై 664

క. చతురంగతురంగధ్వ,జతాంగఘనవదకప్రచారముకవిసన్
క్షితిఁ గ్రక్కదలఁగఁ గ్రేంకృతి,క్షితికి విజయలీల నింద్రజిత్తుఁడు వెడలెన్. 665

వ. వెడలి తూర్యఘోషంబులు శంఖారవంబులు సింహనాదంబులు ధనుష్టంకారంబులుఁ గరిబృంహితంబులు హయహేషారవంబులు సుభటక్రందనంబులు రథనేమివిరావంబులు నింగి నగిలించుచుండ శరాసారఘోషంబుగాఁ గవిసి విజృంభించుటయును. 666

చ. జయమునఁ బొంగుచున్న హరిసైన్యము దైన్యములేక రావణ
ప్రియతనయు నసహింపక విభిన్నగగండశిలాశిలాళి దు
ర్జయగతి వైచి యార్చుటయు రాక్షసరాజతనూభవుండు న
త్యయసమయాష్టమూర్తి నయనాగ్నిసదృక్శరకోటి నించుచున్. 667

ఉ. వెండియుఁ జండకాండముల వేసిన నొడక చండభానుపు
త్త్రుండు మరుత్సుతుండు ద్వివిదుండు నలుండు గజుండు జాంబవం
తుండును వాలినందనుఁడుఁ దోడ్పడి భూరుహకోటి నింద్రజి
త్తుని మునుంగఁ జేసిరి విధూతవిరోధిచమూసమూహులై. 668

క. స్పర్ధ మిగుల నతిలోకధ,నుర్ధరుఁ డప్పంక్తిముఖతనూభవుఁ డమహా
తస్పర్ధివిజయర్ధి యపుడం,బర్ధి వహించె స్వహారథసమేతుండై. 669

వ. ఆయ్యనేకవిధరణవిధానంబు శాంబరీపిధానంబై. 670

క. నడుఁ బిసుగులజడి వడుక్రైవడి సురవడి బాణకోటి కడుఁ బ్రిదుఁ గపిఁజే
ద్పడి పడియెఁ బ్లవగబలమొక, యడుగిడఁగా వసువులేని యట్టులు గాఁగన్. 671

సీ. కరినాత్ముఁ డొంమాటు గవానాటులు దలకఁ బటుగతిఁ బాషాణపటలి యుర్వి
దుర్మార్గుఁ డొకమాఱు గ్రుమ్మవాలు లకుకో దఁ బనివడి ముద్గఁ గంపలును విసరి
తరసాదుఁ డొకసారి తరుచారగణముమీఁద సరిగుఁ ద రక్తవర్ణంబు గురిసి
గతధర్ముఁ డొకవేళఁ గపిజాలముపయిఁక బలువిడిఁ జిల్లకోలలు నిగిచ్చి
కొఱవి గిరగిరఁ ద్రిప్పినతెఱఁగు గాఁగ, ఘోరలయకాలఝంఝూపమారమట్ల
నైజమాయావినిర్మగ్నవగవరాలి, కొందుఁజూచినఁ దానౌచు యేఁపురేఁగి. 672

తే. ఒక్కదెసనార్చుఁ బేర్చు వేఱొక్కయెడల, నొక్కచోఁ బొడునాడు నింకొక్కచోట
నొక్కచోఁ దోఁచు వైచు నింకొక్కదిశను, బ్రహుశరావలి యత్తఁ డయ్యింద్రజిత్తు.

వ. ఇట్లు మాయాతమోవిలీనుండై యాసురకులీనుండు పేర్చి నంజేయునది నేరక యెల్లవానరులుం దమతనువైచిన గండోపలంబులు విఫలంబులగుటకు నచ్చెరువందువారును గాలుఁ జేయి తునిసినం బడి పొరలువారును గపిప్రళయంబు గాఁబోలు ననువారును గర్తంబుల డాఁగువారును మ్రుక్కరివాయుభటనికరకబంధంబులం దూఁగువారును రాఘవులం జీరువారును నమ్ముల లెమ్ములం గిటినదూఁగాసుచు నెక్కుడుచలంబున బేరువాఁడి రక్కసులం దలపడి పోరాడువారునై మిగులు మగ్నంగనుంగొని. 674

ఉ. ఆహవకేళిక్రిఁ దశరథాత్మజనూజులు మీఱలేమి సం
దేహముఁ బొందుచున్నయెడ దివ్యశరాగ్నికి వైరికోటిఁ బూ
ర్ణాహుతి సేల్పుచుం దనుజాధముఁ డేడ్తెఱ గాఢశక్తి స
మ్మోహనబాణ మేసె మృతిఁబొందుగతిం గపులుర్విఁ గూలఁగన్. 675

గీ. ఇట్లు కూల్చి లంక కేగి తండ్రికి జయ, మెఱుఁగఁజేయ నాతఁ డెల్లవారిఁ
గలయఁ జూచి పుత్త్రుఁ గౌఁగిటఁ గదియించి, యమితహర్షమున్నఁ దమ్యెనంత.

చ. చావఁ శత్రుకోటియెడ సందియ మించుకలేక యున్నచోఁ
బావని ద్రోణభూధరవిభాసి విభావితపాద్యమైన సం
జీవనఁ జేసి వానరుల సేనయుదాంగిఁ గ్రమ్మఱంగ యా
హ్వానికిం దలంకక ప్రమాణ మొనర్చిర గండుమీఱఁగన్. 677

వ. దివ్యాస్త్రబంధబాధితుండుగాని పవనసందనుండు దనుజమాయామోహితుండు గాని
విభీషణుండు సహోయుండ్తుగా నిద్రముక తెలివి నొందియున్న జాంబవంతునుపద్లే

శంబున ననేకయోజనదూరస్థితంబగు ద్రోణపర్వతంబు నసహాయశూరుండై సముద్ర
మార్గంబునం బెఱికి తెచ్చి ప్లవగసైన్యంబు సముద్ధరించి రామచంద్రు నలరించి
తత్పాదేశంబున నద్దివ్యౌషధధరంబు యథాస్థానసంస్థాపితంబు గావించి వచ్చె నివ్వి
ధంబున. 678

క. సమ్మోహనశాస్త్రంబక, సమ్మూర్ఛితమగు వనాటుసైన్యము సంగ్రా
మమ్మునను గ్రమ్మికొలిపెం, గ్రమ్మఱ బలగర్వసమధికస్ఫురణమునన్. 679

వ. ఆసమయంబున. 680

క. ననుక్రమింపని తఁడు తేజస్స్ఫూర్తి రయమున ననుమఁ బవనపుత్రుని జూడ
న్మనమున సిగ్గువోదమి యేఁగి కైవశి నరుఁ డస్తగిరికిం జేరెన్. 681

క. పంకజహితుఁ డరుగుడు సా, యంకాలపుసాంధ్యరాగ మతిశయ మయ్యెన్
లంకాపురమంతయు ధూమా, ంకునిచే నిల్లుకాలు నని తెల్పఁగతిన్. 682

క. సంజీవినీమహౌషధ, సంజీవితమగు ప్లవంగసైన్యము గెలువం
గుంజరములు చనుదెంచు గతిం జీకఁటు లడరె నెల్లదిశలు మునుంగన్. 683

ఉ. వానరులంత రామనరవల్లభు నానతినొంది ఘోరలం
కానగరంబుఁ గాల్పసమకట్టి మహోల్ముకపాణులై యమ
ర్షానలవంతి నంతఁ దమ కగ్గలమై పెనుపొం దనందఱు
న్వేసలుదిక్కులం దగులఁబెట్టిరి వహ్నిశిఖాకలాపముల్. 684

వ. అర్ధరాత్రసమయంబున. 685

క. దట్టించి లంక నవలము, ముట్టించి ప్లవంగవంశముఖ్యులు భయముం
బుట్టించి సంత్రీకంపనుఁ, దిట్టించిరి సీత నేల తెచ్చెనటంచున్. 686

క. పొగ మిగుల నెల్లదిక్కుల, బుగబుగమను శిఖలు వెలుఁగఁ బోరిఁబోరి భయం
బుఁగ నొకమంటుగ జనము ...ఁగూడని మేని వేల్పువరతరప్రబలుడున్. 687

క. సీతాశోకాగ్నిపరి, స్ఫీతమగు చులంకఁ జుట్టఁబెట్టె నఁగ ఖ
ద్యోతనసమదయసముదయ, మాతతి నయ్యెవన మస్మదుకజమైనన్. 688

సీ. వడిగవుల్క్రాని శిఖావళులు మీఱమి వాలవిపులవ్యజనముల విసరువారుఁ
దమరేక్కయాడు సౌధవితతి కాలి కూలఁగ నొండుకడలకు నెగయువారుఁ
గన్నులఁ బొగ చుట్టి కదలనేరకయున్న వారిఁ గన్గొని క్రేళ్ళు వాఱువారుఁ
దమ్మెదిరించి యుద్ధ మొనర్చువారలఁ బట్టి మంటలలోనఁ బెట్టువారు
నింటివారలు బైటికి నేగుదేర, కుండగొండ్లములను బిగఁగొట్టువారుఁ
గొఱవులందంద త్రిప్పుచుఁ గొఱలువారు, నైరి కపినాథు లుత్సాహ మతిశయిల్ల. 689

శా. ఉగ్రుండయి చూచి కంపనుపయిన్ హుంకారమేపార భా
స్వద్గ్రావంబు నిగిడ్చి తన్నిహతి మూర్ఛం దన్ని కొంచున్న సం
చద్గ్రైవేయకచారుకంధర మిలాచక్రంబుపైఁ దూల ను
ద్యద్గ్రావంబున వైచె దానవుఁడు హాహాకారముల్సేయఁగన్. 710

వ. శిలాపాతంబున మూర్ఛితుండై పర్వతాఘాతంబున. 711

క. కంపనుఁడు పడినఁ గ్రోధనుఁ, డంపడఁ డిదభ్రంబునిండ నంగదుఁ గడిమిం
జంపుదునని రోసమున నిలింపులు గుంపులయి దివినిలిచి భయమందన్. 712

క. మూఁడుశరంబులురంబునఁ, గాఁడించి యిషుద్వయము ముఖంబున నేయు
న్వాఁడిశరంబుల నతనికిఁ, దోఁడుపడి ప్రజంఘుఁ డంగదుం దలఁకించెన్. 713

ఉ. మూఁడుఁ బనాలునాలు పదిమూఁడిరుమూఁడుఁ బదేను నేడు నీ
రేడనిశాతబాణముల నేసి మదించిన నంగదుండు దూఁ
గాడియు నీడఁబోవక మహోగ్రహవృత్తి నగంబు వైచి చ
క్కడై ప్రజఘుస్సగంగ గంపను మూర్ధము గ్రేణిసేయఁగన్ 714

వ. అదిగని క్రోధనుండు జంభాంతకపౌత్రుండగు ప్రజంఘాంతకుం దలపడియె, యూపాక్షశోణితాక్షులు మైందద్వివిదులను గుంభనికుంభులు సుగ్రీవపవనతనయులను మకరాక్షుండు పుండరీకాక్షుండగు లక్ష్మణాగ్రజుం దలపడుటయుఁ దక్కినరక్కసులు నయ్యాయి వనచరులం దాఁకిన 715

క. కుంభములు పగిలి శోణిత, గుంభితగాత్రములఁ గాలికొండలభంగిన్
గంభీరవేదిపటునుద, కుంభిసుటులుగూలెఁ బ్రధనకుంభినిఁ దఱచై 716

గీ. అంతమీఱి కంపనాంతకుం డంగదుఁ, డహితమార్గణంబు లన్నిఁ దెది
తోఁక మెడకుఁ జుట్టి దుమ్ములునఁగంగఁ, జెండివిసరఁ గ్రోధనుండు గూలె. 717

క. ద్వివిదుండు శోణితాక్షుఁడు, వివిధశరములేయ వాని విరియించి విరో
ధివరూథిని తలఁకఁగనై, చెవనాటాగ్రేసరుండు శిలఁ దలనగులన్. 718

సీ. క్రుద్ధుఁడై యుద్ధసన్నద్ధుఁడై శోణితాక్షునితోడి యాతఁ డిషునికరంబు
నాటింప వాని ఖండంబులు గాఁ జేసి సాలంబుచే వనచరవిభుండు
వెండియు మైందుపై భిందిపాలమ్ములుఁ బరశుముద్గరములుఁ బఱపియార్వ
ద్వివిదుని సహాయుఁ డుద్వృత్తి నశ్వత్థకంబ ల్వటమహీరుహములు వైచి యేచి
వానిఁ బెనఁచిపట్టి వక్షంబుఁ బిడికిట, బిట్టుఁ బొడిచి కాలమెట్టి విడువ
శోణితము ప్రవిసఁ బ్రాణంబు విడిచెయూ, పాక్షుఁ డక్షిగతుల యతులబల. 719

క. తరుచరకట్టోద్ధీశ్వరు, లరిభీమబలు నఖశిలీముఖాయుధులు పర
స్వరవిజయార్థులు పోరిరి, కర మంభోజాప్తకుంభకర్ణతనూజుల్. 720

క. ఒండొరులమీఁదు వేయుచుఁ, గొండెక్రియఁ గండు మిగిలి ఘోరాహవ ము
ద్దండులయి యాచరించుచు, నండ మహాశ్చర్య ముభయయోధులకయ్యెన్. 721

ఉ. అజ్జికిమొదం దలంబునఁ బ్రభాకరన దనుఁ డత్యాకర్ణము
న్నెట్టఁ బట్టి యేయు ఘననీరవహంబు గదఁ బిండి చేసి యా
పట్టునఁ గుంభకర్ణజుఁ డపారశిలీముఖపఙ్క్తి నింపఁ బె
న్నట్టుఁ జెకల్చి మస్తకముఁ గట్టులకుం బగులంగ నేయుడున్. 722

గీ కుంభకర్ణుఁబోని కుంభునిఁ గుంభిని, జంభు నన్న పాకశాసనుండు
వోలెఁ గూల్చె నమ్ము బోరన సుగ్రీవుఁ, బొగడి రెల్లకపులు భూమిపులును. 723

ఉ. అంత నికుంభుఁ డంతకుక్రియ న్హనుమంతు నెదిర్చి మోమున
క్రాంతము గాఁగ మార్గణచయంబు రయంబున రొప్పి వెండియుం
గుంతపరశ్వధ ప్రముద్గర ఘనకోటులు నించుచు నగ్ని బిందు లా
వంతయు లెక్కసేయని కులాద్రిక్రియం గపినాథుఁ డుబ్బుచున్. 724

క. పవన జవుఁడు నవ్వుచు దు, ర్వ్యవసరి ప్రభుజాంతరంబు సాలంబున వి
ట్టు విదారింప నికుంభుఁడు, పవనహతిం గూలు తరువు భంగిం గూలెన్. 725

గీ. కృష్ణవర్త్మునిఁ గవియు మక్షికము భంగి, నప్రశు ఖరనందనుఁడు మకరాక్షుఁ డేది
యతులసునిశితనారాచవితతి. బఱపె, రాముమీఁద విరోధివిరాముమీఁద 726

వ పఱపి దుర్మదంబున. 727

చ. ఇపు డికఁ నెందుఁ బోయె దనశ్వాస చిక్కితి వస్మదీయచం
డపటుశరాగ్నికడ్డము వడ న్నర లోపరు మర్త్యులెంత నా
నృపుఁడు గుణంబు మీఁటి రజనీచరు గుండెలు మున్న నీరొన
ర్చి పిపప వాని కిట్లని వచించె లయోగ్రరఘునాథు వాగ్భటిన్. 728

శా. తాతం జంపిన యిన్నినాళులకుఁ గ్రోధస్ఫూర్తి నేతెంచి దు
ర్నీతుల్ ప్రేలితి బంటు పోదికఁ భయార్తిం బోయి నీతాతయు
త్తాతం జొచ్చినఁ జావు దప్పునె వృథాదర్పంబు లిట్లేటికి
న్నాతోఁ బోరఁగ వచ్చితంచు నిసరెన్ నానాప్రచండాస్త్రముల్. 729

క. విసరుఁడు వాశముఁ డాశర, విసరంబుల కోర్చుటధిక విస్మయము దివౌ
కసులకుఁ గాపించె నపుడు, కసరు మిగుల ఖరసుతుండు కామ్మకశక్తిన్. 730

చ. పది నిశితాశుగంబులు నృపాలశిఖామణి నేయ రాముఁడుం
బదిశరము ల్నిగిడ్చి పరబాణముల న్విదళింప వెండియుం
గదఁ గొని రక్కసుండు పరగం జనుదెంచిన నించుకేనియుం
బ్రిదులఁగనీక శక్తిఁ గడపె న్మకరాక్షుని శోణితాక్షుఁడన్. 781

వ. మకరాక్షుం గూల్చుటయుం దక్కినరక్కసులు. 782

క. తలమగఁ బెరిఁగెను భీతి, న్వెతిగి పురమున చొచ్చి దనుజవిభుఁ గన్గొని యుం
దలుదొర లీల్గుట యాతని, కెఱిఁగించిన నల్కపడి విహీనస్వయుఁడై. 783

వ. అగ్రభాగవర్తి యగు నగ్రనందనుం గనుంగొని. 784

చ. తనయ మహేంద్రుఁ గెల్చి విదితంబుగ నొందినవాఁడ విూవు ఇంద్రజి
ద్ఘనతర నామధేయము జగంబున నీవ మగండ వట్టి నీ
వనయముఁ బేర్చి శత్రునివహంబుల నోర్చి కరంబుఁ దండ్రి నె
మ్మనమునఁ బుట్టినట్టి యగమాన్పవు నీకిది వీరధర్మమే. 785

క. విస్ఫారంబు లజాండ ప్రస్ఫోటన మాచరింప రిపుల వారింపం
బ్రస్ఫురితధనుర్ధర జ్యాస్ఫాలన మాచరించి యరుగు మనవుడున్. 786

ఉ. తామసవృత్తి దోఁపఁ దనతండ్రి వచించిన నింద్రజిత్తు సం
గ్రామమొనర్పవేడ్క బలగర్వితుఁ డెంతయు నేకతంబునన్
హోమ మొనర్చి యం దుదయ మొందిన కృత్తి సహాయమొప్పఁగా
నామున దాడివెట్టెఁ జతురంగసమేతముగా నుదగ్రతన్. 787

వ. ఉత్తరద్వారంబున దండు వెడలి శర్కరాసహితంబులై దారుణంబుగా నెమర్కొ
ను మారుతంబులను శివారుతంబులకుఁ దలంకక నడచి వనచరబలంబుం గనుంగొని
నిజబలంబునకుఁ జేయివీచుటయును. 788

క. పూనికఁ దనుశరకోటుల, నూనముగా విసరికొనుచు యుద్ధము సేయన్
వానరతతు లెన్నేనా, శానవము లరక్తవర్షకలితము లయ్యెన్. 789

క. అంతట సధికాగ్రహుఁడై, యంతకనిభుఁ డింద్రజిత్తుఁ డద్భుతగతితో
నంతర్ధానుండై నభ, మంతయుఁ దాన యయి మిగుల నార్పులు సెలఁగన్. 740

చ. వితతగుణధ్వనిస్తనిత వీరఘనుం డిటు మిన్నుఁ బ్రాఁకి ఘో
రతిమిర మావహించి సమరస్థల మంబకవృష్టి ధూతస
మ్మతరుధిరప్రవాహమున మానకముంపఁ దరింపలేక దు
స్థితిఁ దముకూర్పు వృచ్చుటయుఁ దీరక వానరు లార్తనాదులై. 741

క. ఘల్లనఁడి చూచుచుండ ర, ణోల్లాసము మెఱయ నతఁడు నస్త్రాస్త్రములం
జెల్లాచెదరై పోవఁగ, నెల్లయెడలఁ దాన యై కపీంద్రుల నేయన్. 742

చ. దనుజుల కుబ్బు మీఱఁగ శతక్రతుజిత్ప్రథితాంబకంబుల
న్మునిఁగిన సేనఁ గాంచి రఘుముఖ్యుఁ డధిజ్యశరాసనుండు దమో
ఘనిశితసాయకాఘములు కంబు గంగించి విరోధిబాణఖం
డన మొనరించె భండనమునం బికతాళుల రూపుమాపుచున్. 743

గీ. రఘుకులశిఖామణి భయంకర ప్రచండ, దనుజశరకోటి కపికోటిఁ దాఁకకుండ
నునుశరంబుల మరలించుచుండె నింతె, కాని దానవుఁ డున్నెడఁ గానఁడయ్యె. 744

మ. దనుజుం డున్నెడ గానకున్నెడఁ బయోదస్ఫూర్తి నాకాశమె
ల్లను నీరంధ్రము గాఁగఁ జెంతయు రణోల్లాసంబు మీఱన్ దశా
ననపుత్రాగ్రణి వెండియుం బెరిఁగి నానాఘోరఘోరాస్త్రసం
తతి నిగుడ్ప రఘునాయకుండు కనలం గ జాయు రంజిల్లఁగన్. 745

చ. గుమిపడి సుప్రయోగవిశిఖుం డితఁ డంచు సురల్ నుతింప దెం
దములు కనొందఁ దద్దశరథక్షితిభృత్తనయాగ్రజుండు శా
ర్ఙ్గ మినుమడింప భీకరమహాస్త్రము వాంగిరసప్రశస్తము
న్మెఱయ నారిఁ గూర్చి రిపుఁ గూర్చి కడుం దెగలాగి యేయుఁడున్. 746

క. దిగ్ధ మొనరించె నధికవి, దగ్ధముగా నక్కడం బడహానము పేర్మిన్
స్నిగ్ధాగారణసాంద్రశరా, ప్యగ్గారాపిహితమూర్తిఁ గెన్నంటిశ్రుతిన్. 747

క. కృత్తికపు డివ్యధనుఁ బున, మిత్తినిక శాంబరీకమిశ్ర మడఁగుడన్
మత్తుఁ డగు నింద్రజిత్తుండు, చిత్త మెఱియఁ దోఁచెఁ గపుల చిత్తములలరన్. 748

క. మఱుముపకారపటాలము, మఱునాదేశము కరాముని మహీకాంతుం డాం
గిరసాస్త్ర మేసి కృత్తి, బరిమార్చన నంత బహులు పడియు వెఱవమిన్. 749

చ. తదనంతర మెందు సప్రతిహతంబయి వర్తిలుచుండ వాలినం
దనరవిపుత్రమారుతసుతద్వివిముఖాత్మభవాత్మభూకుమా
రనలసుషేణముఖ్యులు ధరాధరభూమిరుహోత్కరాలము
ల్సరగున నింపఁ బింఛిగ రజంబుగఁ జూర్ణముగాఁగఁ జేయుచున్. 750

క. ఉన్ముఖులు గాక యాహవ, మన్ముఖ్యుల నేచఁ దెంచి మాయాప్రౌఢిం
గన్మొఱఁగి యింద్రజిత్తుండ, సన్మన్యుఁడు తొలఁగి చనియె సమరంబునకున్. 751

వ. చని కుహానోపాయుండై. 752

ఉ. పాతకవృత్తితోడ ననపాయత హోమము సల్ప శాంబరీ
సీతనమర్చి సంగరము చెంతకు వే కొనివచ్చి వానర
వ్రాతము చూచుచుండఁ దల వ్రక్కలు సేసె నిశాతహేతి దుః
ఖాతిరయంబున న్రఘువరాయని యేడ్చుచు నేల వ్రాలఁగన్. 753

క. మాయాసీతం గపటో,పాయంబున నిట్లు చంపి ప్లవగబలము లా
హా యని వగ నొందఁగ నస,హాయుఁ డయి నికుంభిలకు రయంబున నరిగెన్. 754

వ. అరిగి స్థండిలాసీనుండై. 755

క. రిపువంశభయంకరము, స్స్వపక్షశుభద మగు నాభిచారికహోమం
బపరిమితక్రోధహృదయుఁ, డుపక్రమించి యతఁ డత్యభీలోత్సాహమునన్ 756

వ. మధురమధురసమదిరాసవ సర్షప విశేషాస్పృగ్మాంసంబులకలనను దధ్యాజ్య
తైలాద్యాహుతిబహుళంబు వలనను దేవముఖు సుముఖుం గావించుచుండునంతఁ గల
హాముఖంబున. 757

ఉ. క్ష్మాసుత నిశ్చయంబుగ నిశాచరశాతకృపాణిధారచే
తా సుత నొందె నింకఁ గలహం బొనరింపఁగ నేటి కంచుఁ దా
రాసుతముఖ్యు లున్నయెడ రాఘవులం గని విన్నవించె ఘో
రాసుగకృత్య మంతఁ బవనాత్మజుఁ డాత్మవిచార మందుచున్. 758

క. అశ్రుకలితాననయుఁ డై,న్యాశ్రయహృదయుఁ డనునై ధరాత్మభవ విశే
షశ్రమమున నేడ్వ నసం,శ్రితుఁ డదయుఁ డయి చంపి పడవైచె ననన్. 759

క. విని వినిపాతమతులై యి,ట్లని రని పని దీఱెఁ గటకటా విధిచెయిదిం
దనతను వఖిలనుతసతీ, జనజనకజ త్రుంగెనే నిశాచరుచేతన్. 760

గీ. అనుచు వటిరయు నద్ధరాత్మజఁ దలపోసి, వనరి వనరి యొకట వసుధఁ గూరగి
రధికవాతవిపతితాశ్వకర్ణ కయుఁగ, భంగి గాఁగఁ బ్లవగబలము లెడల. 761

వ. మృతులచందమున మూర్ఛితులయి మహీతలంబునం బడి రంత గొంతవడికిఁ దెలిసి
రామచంద్రుండు ప్రేమాతిరేకంబునం బ్రేయసిం జేర్కొని. 762

చ. విధిఁ బతిఁబాసి శోకమున వేఁగియు నెన్నఁటికైన భర్తృస
న్నిధిఁ బడయంగఁ గాంతునొకొ నేనని ప్రాణముఁ జిక్కఁబట్టి వా
ర్నిధి నసురాధివాసమున నింద్యచరిత్రవు గాకయున్న దో
వ ధవుఁడు నిన్వధించెనొ కుజాత ప్రభాత కజాతలోచనా. 763

క. నను మాయలేడిఁ గొనితె, మ్మని పనిచిన నాఁటఁ గోలె నతివ భవద్ద
ర్శనమెన్నఁ డగునొకో నా, కని తలఁచెద నత్తలంపు వ్యర్థంబయ్యెన్. 764

వ. చావు నీకోడిద లోకం బగుంగాక యన్యథాత్వం బగునే యని నిజచరణసమీపస్థ
బునం బలవించుచున్న సుమిత్రానందనుం గనుంగొనుచు దుఃఖాతిరేకంబున వడలు
చుండ నఖిలవానరులు బాష్పాకులలోచనులై చిత్రరూపంబులం జిత్రరూపంబులై
చేష్టలు దక్కియుండిరంత నేతెంచి. 765

ఉ. నీతివిదూరచిత్తుఁడు విభీషణుఁ డెంతయు భక్తిపర్యుఁడై
ఖేలుల మోడ్చి యిట్లని వచించె మహీధవ ధూతధారుణీ
జాతకుఁ జావు గల్గుట మృషాస్థితి దుఃఖము దక్కి మాఖలుం
డీతెఱఁ గాచరించెఁ గపటేమ్ముఁడు నెమ్మది వ్రేఁకఁ బెట్టఁగన్. 766

వ. అంతి నా కాని నిశ్చయంబుగ జానకి వధింపుటలేదని నమ్మింపలికి కెంచినుం నసుర
కులవిభూషణుఁడగు విభీషణుం డిట్లనియె. 767

క. ఉద్ధామభయద మగునే, తద్ధోమము పూర్ణమగుడుఁ దజ్జనితమహో
యుద్ధోపకరణధరుఁడై, సిద్ధ మతం డనికి వెడలి చెఁకినయేనిన్. 768

ఉ. చెప్పెడిదేమి బ్రహ్మకు నజేయుఁ డు వాని నెదిర్చి చంపఁగా
నిప్పుడ లక్ష్మణుంబనుపు మీ వన రాముఁడు సంతసించి నీ
వప్పని నిర్వహింపు మనఁజా యన భక్తి నమస్కరించి వెం
జొప్పెను దీవన ల్వడసి యుగ్రధనుశ్శరచాపహస్తుఁడై. 769

క. పవనజపవితిరస్కరణము, పవనజగధ మదయశిఖరి భాసుపగిది నె
క్కి విభీషణుండు ముంగల, గవిభీషణగ్నత్తి వెడలెఁ గలహంబునకున్. 770

క. కనకాచలనిభతనులం, జనపద్వరసద్ప్రకర శకరీయులు గా
ననిచిద జీమూతతులిత, ఘనదేహులు కీశభల్లుకవరాధీశుల్. 771

ఉ. తారమహాద్రిఁ బాదములఁ దన్ని పగుల్పఁగ నోపువాఁడు దు
ర్వారశరాదంబునం బలసి రాఘవవంశవరేణ్యుఁ డెంతయున్
దూరము పోయి దైత్యపరిదుష్టవిహారిమున న్నికుంభిలా
ద్వారముఁ జేరి శాత్రవభినాశనచిత్తుని శక్రజిత్తునిన్. 772

ఉ. కని రిపుహోమకర్మము నిఘాతము సేయఁదలంచి వానిని
ల్పిఁ చతురంగసైన్యములు పీనుఁగుపెంటలుగాఁగ నుజ్జ్వల
త్పునికిరసాయశాలి నృపనూనుఁడు దా నిగిడించెఁ గ్రవ్యభు
గ్వదహద్భ్రశ్వభూజణదశనతుమధన్వగుణాద్భుతాస్ఫటిక్. 773

ఉ. అంతకుమున్న వానరబలాంబుధి వాలతరంగకోటితో
వైతయుఁ బొంగి దానవబలోద్ధహరేణువు బిట్టు ముంచి బ

గీ. పరుని జేరి బంధువాళింబునకు నోడి, గట్టి దయయు నీతి గట్టిపెట్టి
వాఁడ వట్టి నీవు వారు నెక్కడిపిన, తండ్రి వనుడు నతఁడు తత్క్షణంబ. 787

సీ. నవ్విభీషణవృత్తి నవ్విభీషణుఁ డిట్లు పల్కు దురాత్మ నీ బాంధవంబు
చాలు వానికి నోర్వఁజాలక బలవద్విరోధంబు గలదని రూఢభంగి
నీకు నీతండ్రికి నేనెంత యుక్తి చెప్పిన నీడుఁగొల్వఁ బ్రియములేక
యభియాతిరీతి నాకభిఘాతి యొనరించినందున మిమ్ముఁ బాయంగవలసె
నదియుఁగాక దుష్టమైనబంధుశ్రేణి విసర్జనీయమ్ము సజ్జనులకు
నాఁటిమాటలాడ నేటికి నేఁటికి, మృత్యువశుఁడ వైతి నృపతిహేతి 788

చ. అనవుఁడుఁ గోప మెక్కి నరలాలలహాటమునన్ జ్వలించువా
రని వెసఁ జాప మెక్కిడి జయానకముల్ మ్రోయఁగఁ గ్రవ్యభు
గ్జనుఁడు త్రోఁకద్రొక్కిన భుజంగమపుంగవు చంద మొందినన్
దనుజులు పోక నిక్కి ప్రమదంబున మార్కొని రన్యసైన్యముల్. 789

క. మార్కొనుటయుఁ గపిబలము నెదుర్కొన నమ్మొనలు రెండు దుర ఘోరించెం
జేర్కొని నెత్తురు పుడమిం, జేర్కొను భూమిచరఖచర భీతము గాఁగన్. 790

వ. తత్సమయంబున విభిన్నరథాంగంబును విశీర్ణపుండరీకంబును వినష్టహరిప్రతాపంబును
విజృంభమాణరాక్షససంచారఘోరంబును విస్పష్టమానసర్వనక్షత్రప్రకాశంబును నై
సంధ్యాసమయంబునుం బోలె. 791

గీ. వరమరుత్సుతభుజపీఠి మరి దహార్క్య, శిఖా విస్ఫురితంబగు సింహ మనఁగఁ
బొల్చు సౌమిత్రి శరవృష్టిఁ బొదివెఁ బంక్తి, కంధరసుతుండు కంధరక్రమము గాఁగ. 792

గీ. పొదివి చిక్కి లెందుఁ బోయెదు నిలుమని, చులుకమాటలాడి కలకుటమ్ము
లాలునాలు వైవ నగ్నిబాణంబులఁ, ద్రుంచె వాని నృపసుతుండు కనలి. 793

ఉ. త్రుంచి దురాత్మ నీశిరముఁ ద్రుంచెదఁ బ్రేలకు మంచు దైత్యుల
క్షించి ప్రమత్తశత్రువినికృత్తవరంబు శరంబు వింట సం
ధించి బలంబునం దిగిచి తెంపున వానిమహోదరంబు భే
దించిన మృత్యుసంగతుఁగతి న్మహి నాతఁడు వ్రాలెఁ జెచ్చెరన్. 794

క. తెలిసి నరాంతకుఁడు ఫలియై, యలిసి నృపభంబు పోవుభంగిఁ జనుటయుం
దలిసి నరేంద్రుఁడు వానిం, బలిసిన రక్కసులు బెగడుపడి పఱవఁగన్. 795

శా. ఇంద్రాంతాకనతుఁడు రఘుప్రవరుఁడు దోర్వీర్యంబు నిండారఁ జం
డక్రోధంబున వైరిభీకరధనుష్టంకార మేపార గా

గీ. గంధవహునికుమారు తత్క్షణంబు వాఁడు, నైరు నారాచముల నేసి యార్చుటయును
సుచురలంపటుఁ డహితురథ్యముల నేలఁ, గూలఁగా నేసె మెఱుఁగారు కోలఁ జేసి

వ. లక్ష్మణుండు తోడన వాని కోదండంబుఁ దుండెంబులు గావించుటయు నింద్రజిత్తు.

మ. విరథుండు న్వినికృత్తచాపుఁడును నిర్భిన్నాంతరంగుండునై
సురసంఘంబులు పిచ్చలింపఁగ మహేష్వాసుండు ల్మించె భా
స్వత్కోదండమ మొకంతు పుచ్చుకొని తచ్చాపంబు ఖండించిన
న్వరయం బోరఁగ నొండు విల్లుగొనినం జక్కాడె నద్ధన్వమున్. 810

ఆ. విండు లెన్ని యెక్కువెట్టిన విఱుమవు, నన్నిఁ గూల్చి దైత్యుఁ డుక్కుదక్కి
యధికదుఃఖమగ్నుఁ డై యిట్లని తలంచె, హృదయమునఁ బ్రమత్తుఁ డింద్రజిత్తు. 811

తే. శంబసదృశంబు లప్పత్కలంబములు గ,లంబముల పోలె నాటవు లక్ష్మణునకు
శంబసదృశంబు లగుచుఁ దదంబకములు, తనువు నొప్పించు నెంతయుఁ దనువులయ్యె.

ఉ. ఇంద్రు జయించి తద్విభవ మెల్ల హరించి విరించిచేత ము
న్నింద్రజి దాహ్వయంబు జగ మెల్ల నెఱుంగఁగ గాంచినట్టి దై
త్యేంద్రునకు న్నరేంద్రుని జయించుట దుర్లభ మయ్యెఁ బ్రీతివ
ద్యేంద్రుని బ్రోచు వేలుకనుపేంద్రుఁడు మానవమూర్తి యయ్యెనో. 813

క. అని తగచి మతియుఁ దన యే,సిన శక్తి ప్రముఖములు నశించిన లజ్జా
వనతాననుఁడై లక్ష్మణు, నని బాహాబాహిఁ బెనఁగ నాలోచించెన్. 814

క. ఈరీతిఁ దలఁచి దనుజుఁడు, కోఱలు గిఱికొన మహోగ్రుని కైవడి వి
స్తారామర్షంబునఁ బ్రతి, వీరు నెదుర్చుటయు నతఁ డవిరళాగ్రహుఁడై. 815

చ. అసదుగ శక్రదత్తమగు నస్త్రము వారి నమర్చి పేర్చి సు
స్థిరభుజశక్తి లక్ష్మణుఁడు శీఘ్రగతిం బరఁగింప గుండల
స్ఫురితము దైత్యమూర్ధము వసుధఁ బ్రదెల్లె మహోరుగాహతో
ద్ధురమదదుర్విభృచ్ఛిఖరితో యమునమ్మహి సంచలింపఁగన్. 816

క. తలఁకుడుగ నింద్రజిత్తుని, తల కుండలకర్ణశోభితం బగుచు మహీ
తలముఁ దిగఁద్రుంగ నమ్మెయిఁ, దలవడి సంగరపుల కతిముదంబు బోరించెన్. 817

వ. తత్సమయంబున. 818

శా. శాపారంబులు నిర్మలోదకములై కన్పట్టె లోకంబు శో
భాపారంబయి తెల్విఁ దాల్చె దిశలు న్భాసిల్లె నెంతేనియు
న్బాపారంబ్రథఫలీకృతాగ్రకసుగంధస్ఫారమందార సూ
నాపారంబులు పెల్లుగ్గెఁ సురవేశ్యాలాస్యముల్మీఱఁగన్. 819

క. సురదుందుభిరవములు వా, నరుల జయజయధ్వనులు వినంబడ ధరణీ
వరుఁ డబ్ధి నీఁది పారము, చేరుపుఁ గైకొన్నవాని విధమున నలరెన్. 820

వ. మహానందంబున నిజయోధవీరపరివృతుండై కుంభిలాద్వారంబు వెడలి వచ్చు నవస
రంబున. 821

సీ. మలయధరాధరోజ్జ్వలహారిచందనపృథ్వీరుహాళితోఁ బెనఁగులాడి
గంభీరతరవిశాలాంభోనిధితరంగశీకరంబులతోడఁ జెలిమిచేసి
మల్లికాజాతిచంపకకురవకసుమోపవనంబులను బూలబంతులాడి
భార్గవాశ్రమమునిపకస్వాంతకాసారసారాంబుజాతముల నుయ్యాలలూఁగి
నందనంబున మందయానంబు నేర్చి, చైత్రరథమునఁ జైత్రుతో సరసమాడి
నట్టిమరుదనురయము హర్షమావహించె, భాసితులకు మరుత్సుమిత్రాసుతులకు. 822

వ. పిదప నమ్మహావీరుం డగులక్ష్మణకుమారుండు విజయవార్తాశ్రవణకుతూహలాయత్త
చిత్తుండగు రామచంద్రునకు ననతిదూరంబునం గపిధ్వజావతీర్ణుండై. 823

క. రూఢధృతి నేగి వినయో, ద్గాఢత నగ్రజుని చరణతోయజముల కా
రూఢప్రౌఢిమ మ్రొక్కెడు, గాఢాదరతత్పరమునఁ గౌఁగిటఁ జేర్చెన్. 824

క. స్నేహ మిగురొత్తఁగా సు, ప్రగూహనసౌఖ్యంబు నొంది కొనియాడె మహో
త్సాహుఁడు దానవవీరు ఘ, నాహవమునఁ జంపినాఁడ వనుచు నృపతీశున్. 825

క. దేవాసురవరు లొక్కటి, యై వచ్చినఁ జిక్కఁ డమ్మహామాయికుని
న్నీవు వధించిన నస్మ, ద్భావం బానందపూర్ణమగ్నం బయ్యెన్. 826

వ. అని వెండియు ననేక మధురవచనముల నగ్గించుచు దారుణవిపక్షబాణక్షతశతం బగు
సహోదరుదేహంబు నిమురుచు నిట్లనియె. 827

క. నీ వింద్రజిత్తుఁ గూల్చితి, కావున నే నెల్లభంగి ఖండింతు దశ
గ్రీవుని దురమున మత్సు, గ్రీవాదులు చూచి మిగులఁ గీర్తింపంగన్. 828

వ. అని తదనంతరంబున. 829

ఉ. సన్నుతు లొప్ప మారుతిఁ బ్రశంస యొనర్చి విభీషణుం గడు
న్మన్ననమాటలం దనిపి మర్కటకోటి బహూకరించి తై
రోన్నతి రావణుం దునుమ నున్న యెడం దదనీక మెంతయుం
జెన్నువహించెఁ బున్నమ నిశిన్ శశిఁ గన్నపయోధిలోయమై. 830

క. అట దశముఖుండు భయదో, త్కటసంగరమున సుతుండు గడతేఱుట వి
త్తుటఁ దేఱుట కెంహావిముఖభటులవలనఁ దెలిసి వికళభావుం డగుచున్. 831

క. శరదంబుదములకైవడి, నరదంబులు మిన్ను ముట్టి యరుగఁగ నడిచెన్
ద్విరదంబులు మహీధ్రములుగ, శరదంబులభంగి మదరసస్రావములై. 853

క. సురరిపుతురగఖురాహత, ధరారజఃపాతమున గదా గంగాభ
స్వర్గాత్తస్వర్గజలజము, లురుపంకజములుఁ బరాగయుతములు నయ్యెన్. 854

వ. బహుళప్రదీప్తంబుగావున వనరాశిచందంబున సారస్యాదనంబుగావున వనరాశికైవడి భయంకరాంతరంబైన యమ్మూలబల కలాపకపటలంబు నిబిడంబై శరాసారంబున ముంచుటయుఁ బెచ్చుపెరిఁగి యవ్వనచరసేనాసస్యంబును దలమీటి కవిసె 855

క. వ్యూహములు రెండు సమితో, త్సాహమునఁ దలాతలిం గచాకచి బాహా
బాహి నఖానఖి సమ్యగ్దాహవ మొనరించె ఖచరు లచ్చెరుపడఁగన్. 856

చ. అమృతనిమిత్తపూర్వంబు ధాయగసంఘముల ట్లు దండవి
క్రమమున దైత్యభూరుహ సగప్రకరంబులు పోరొనర్చినం
గ్రమమున నేలవాలె రుధిరం బది సంకులకాననాంతర
స్థమగు ప్రశోణగైరికవిశాలరసాలితప్రవాహమై 857

క. పలువురు బలియుఁ లొక్కనిపై, గలయుక మార్కొని పెనఁగు ట్టి మొదలు న
ప్పలువురు బలియుం డొక్కఁడుఁ గ, నలి మార్కొని చలమునం బెనంగెడు నెడలన్.

సీ. పాషాణములు పిండిభంగి రాలెడుచోట్లుఁ బాషాణములఁ దలల్వ్రయలుచోట్లు
విచ్చుకత్తులు వట్టి విఱిచెడునెడలును విచ్చుకత్తుల కొదలిమ్చు నెడలు
భూరుహంబులు చూర్ణములుగఁ జేయుపట్లును భూరుహంబుల మృతిఁ బొందుపట్లు
బాణజాలంబులఁ బాఱద్రోలెడునిక్క లమితబాణంబులఁ నడఁగునిక్క
లేనుఁగుల గుద్దులఁ బడనేయుతావు, లేనుఁగుల గుద్దులచేత నీల్గుతావు
లోకలు తలములు వొరగింప నున్నతలము, లమ్యొ కపివరదైత్యసైన్యములును.

వ. అయ్యుభయవాహినీయోధనాథు లాయోధనమున లోహటింపక రౌహారిసాహారిం బెనంగులాడునప్పుడు కేలువడినం బెఱకేలఁ బరాక్రమించువారును దలలువడినను లక్ష్యంబులం బడనేయువారును జిక్కువడియు నుక్కడక్కనివారును బ్రేవులు ప్రేలాడినం బేరువాఁడిం బోరాడువారును బ్రాణంబులు విడిచియుఁ గృపాణంబులు విడువనివారును రుధిరంబునం దడిసియుఁ జలింపనివారును జచ్చియు ముఖంబులఁ గ్రోధంబు డింపనివారును విచ్చియుం బెచ్చు పెరిఁగి కమ్చుకొనువారును గాలుసేతు లుడునిసియుఁ గఱచి నప్పళించువారును బడియుఁ బోరుపోరు మనువారును సహాయులు మన్నింగొనినను గొన్ననివారును నై రయ్యవసరమ్మునం. 860

క. తుల్యశకలసైకతము లై, శల్యతటంబులుఁ గబంధశవమీనంబుల్
కల్యాణాబ్జము లస్త్రకుల్యాశతములును సమరకుంభిని వెడలెన్. 861

గీ. ఘోరవిజయశంఖభేరీరవంబుల, హుంకృతులును జాపటంకృతులును
జిత్తధనుదకరణి సింహనాదంబులు, సంగరంబు ఘోరభంగి యయ్యె. 862

క. అసురశరాగ్నిప్రసరోద్ధతసమీరోద్రేక మగుచుఁ దఱిమికొని వనా
కసవన్యా వాహము సేయుచునుండెను రాఘవుఁడు మహోగ్రుం డగుచున్. 863

క కనదభ్రేక్షణములఁ గోకనదేక్షణము లొనరించి కపు లలరఁగ న
జ్జనకులనాథుఁడు పలభోజనకులనాశన మొనర్చు సంరంభమునన్. 864

క. ప్రత్యాలీఢస్థుఁడు శతధృత్యాండస్ఫోటనరణధిక్కారితరం
కృత్యనుపమచాపధరుఁడు, ధృత్యతిరిక్తుఁ డయి యొసఁగె దీవ్రాంబకముల్. 865

వ. ఎడపడకయు నద్దివ్యశరంబుల ననేకఘోరసాయకంబులు భూనభోంతరాళంబు నిర
వకాశంబుగా నుద్భవించి. 866

సీ. కఠినదానవకాలఖండంబులను జేర్చి పొడవైన యెముకలు పొంతఁ జేసి
మేదురమాంసమేదము లరగించి కమనీయతరభటాంగములు దఱిగి
తరఁగధావనములు చిక్కులు గావించి సాంద్రశోణితరక్తజలముఁ దేర్చి
యుత్తమమోదుల చిత్తంబు లుడికించి కంఖాణఘోణాప్రకరము గాల్చి
ప్రకటఘోరకపాలపాత్రికలు గూర్చి, సేనకట్టింపులు చేసె భూతావళులకు
రణమహానసమున దశరథమహీశతనయుశరములు చిత్రసూదజనులట్లు 867

సీ. మానవాధీశ్వరమార్గణానలము లేచి యమకపిరోధికంఠములు వెదకు
భూమీశ్వరునిశరంబులు మట్టుమీఱుచుఁ గట్టిడిదనుజాల కొట్టుచుండుఁ
బార్థివాధ్యక్షునిపత్రులు పాఱులై రాక్షసశ్రుతికోటరములు దూఱు
క్ష్మానాయకశిలీముఖంబు చలి రేఁగి పలలభోజనముఖాబ్జముల గ్రోలు
క్షత్రియాధీశ్వరునాశుగములు మీఱి, ఖలనిశాచరకరివాంగములు స్పృశించు
నద్భుతావహము లగుచు నారరామచంద్రుసాయకజాలము లన్వర్థకములు. 868

క. వచ్చినవారల నంటఁగ, నచ్చనె యారామబాణవర్గ మసురులన్
గ్రుచ్చికొని యెడల నుండక, యుచ్చి వనిన్ రక్తముంటకుండఁగ వేగన్. 869

క గుదుసుకదు పంట శరములు, దొసఁగుట తె వాపుటయును దోఁపదసులపైఁ
బడుటయును దనుజు లవనిం, బడుటయుఁ దోఁచు నొక్కభంగిన యొప్పున్.

వ. వెండియు రామచంద్రుండు. 871

సీ. పసుగుర నూర్వర బాణరజ్జువులచే గుదిఁగ్రుచ్చు నొకవేళఁ గోపి యగుచు
మంత్రించి పడఁద్రోయుమాడ్కి నేనుంగులఁ బడఁజేయు నొకవేళ భటుఁ డగుచు
ఘోరకదంబము ల్పుంఖానుపుంఖము ల్విగిడించు నొకవేళ నిపుణుఁ డగుచు
దానవోపాకృతతతి మార్గణాగ్ని కాహుతి సేయు నొకవేళ నుగ్రుఁ డగుచు
దనుజకక్షకవాటపాటన మొనర్చు, ధారుణీనాథుఁ డొకవేళఁ గ్రూరుఁ డగుచుఁ
దాళఫలముల పోలికిఁ దలలు రాల్చు, భూదయితుఁ డొకవేళ సన్నుతుఁ డగుచు. 872

ప్రగ్వీణ శ్యానమై కీశసైన్యంబు రేకెత్త సంగ్రామభూమీధరాగ్రస్థమై శస్త్రాస్త్ర
క్షామితప్రౌఢి దైత్యాటవి నగ్నించె శ్రీ,రామరాజన్యధారాధరం బీక్రియన్. 873

వ. అర్ధమర్త్యావతారంగతుండు దోర్గర్వీణపాండిత్యంబుఁ జూపుటయుం జతురంగం
బగు నమూల్యలబలంబు శల్యసంకీర్ణ కంటకక్షితిజాతం బగు దుర్గమారణ్యంబుచందంబు వోలె
నందుఁ గపాలంబులు పిష్టాలంబు లగువారును ప్రభ్రష్టకంబులు ప్రభ్రష్టకంబు లగు
వారును గంఠంబులు కుంఠితంబు లగువారును ఖండంబు లగు వేదండతుండంబులును
జీర్ణంబులు నగువక్షోజీర్ణంబులును విరూపంబు లగు రూపంబులును రదంబు లగుధ్వ
జంబులును భూతంబు లగుభూతంబులును గల్గి పుండరీకపుండరీకంబును శిలీముఖ
శిలీముఖంబును రథాంగరథాంగంబును బరాగపరాగంబును భంగభంగంబును రక్తో
త్పలరక్తోత్పలంబును వాలశైవాలంబు నగుసంగరసరోవరంబు రౌద్రబీభత్సాద్భుత
భయానకంబులకుఁ దానకం బై యొప్పె. 874

క. చాయకరకుంభకుదర,క్తోద్ఘుసృణమూలబలపయోజవదన తాఁ
జేరం జాలదు రాము,న్నారపురుషనాయకు ప్రజోవతి యగుటన్. 875

తే. లపనములు పిండి యైన విలపను లగుట, చరణములు సంచులై నయి చనుట లగుట
హస్తములు తెగిపడిన విహస్తు లగుట, నద్భుతాకార మయ్యె నయ్యాహవంబు 876

క. మూలబలమహాసైన్యం,బూలము రామాశుగప్రమూల మని మహీ
పాలు నెదిరించె రక్షః,పాలుఁ దలఁకమిఁ గని పైన్యపాలుర మెచ్చన్. 877

మ. నిజకాంతిపరిహాసచంద్రికావికాసుఁ బగు చంద్రహాసభయుఁ బట్టహాసభాసుఁ డై రామ
చంద్రుపై రాక్షసుం డురవడిఁ జుటయుం దనుజభటపరివృతుం డై. 878

క. ఎత్తిచని వివిధాత్మో,న్మత్తులును సుపార్శ్వుఁడును వనచరబలమున్
మొత్తుగఁ దలఁపడి పోరెను, నత్తటి భండనము గడు భయంకర మయ్యెన్. 879

క. శ్రేష్ఠులప్రోవులు పొడవగు, దీవులుగా నెమ్ములిసుకతిన్నెలుగా బా
ణావలి తరగలుగా ర,క్తావిలకీలాలసంగరాంబుధి మెఱసెన్. 880

క. ఆతఁడనుగ వచ్చి విరూపాక్షోన్మత్తుల మహోపాయత్తుల యయు
ద్ధక్షోణికి బలిగాఁ దద్వక్షంబులు భానుసుతుఁడు వ్రక్కలు సేసెన్. 881

తోవకము. అంగదుఁ డంతట నంగము పొంగఁ, దుంగరసాలము తూర్ణము గాఁగన్
బ్రుంగఁగ దానవపుంగవు నేయ, న్భంగము నొంది సుపార్శ్వుఁడు వ్రాలెన్. 882

వ. నిజపార్శ్వవర్తులును మత్తులు నగు సుపార్శ్వవిరూపాక్షోన్మత్తుల మృతిఁ గోపాటం
గముం గొని రోషాతిరేకంబున. 883

క. దశకంధరుండు కార్ముక,దశకంధరుఁ డగుచుఁ గీశతతి నెంతయు దు
ర్దశ నొందింతు ననుచు నిజ,దశనంబులు గీటుచును రథంబు మెఱయఁగన్. 884

గీ. వాన గురిసిన కైవడి వడిగ నిసుము, చల్లినట్టులు విస్ఫులింగాలచాలు భంగిఁ
దెఱపిలేకుండఁ దొరఁగించె దివ్యబాణ,పటలి నొక్కట విపినాటభటులమీఁద 885

వ. సంవర్తసమయసమవర్తిం బోలె విజృంభించి. 886

మహాస్రగ్ధర. పదిచండాస్త్రంబులు న్మృత్యుదిననిశితరోచంబులు న్నాల్గుఘాత
ప్రదరంబుల్ వైచి సౌరిం బవనతనయునిం బాకభిత్పుత్రు నొంప
న్మదులై యమ్మువ్వురుం దక్కుటము లదర న్మూర్ఛ నొంప నాము
న్హృదయుం డాజ్యాహుతిం బేర్చినహుతవహుఁడో యూతఁ డుంచుం దలంకన్.

లలితపదము. వెఱఁగి దివౌకసభీమము గాఁగం, దరువరవంశవితానము నెల్లన్
శరబహుళాగ్నిజ్వాలల పేర్మిం, దరికొని కాల్చు మహాతాశనమూర్తిన్. 888

వ. దశకంఠుం గనుంగొని రాముండు సయిరింపక. 889

లయవిభాతి.

రభసత నెదిర్చి భుజగభ గదముఁ గార్ముకముఁ బ్రభ మిగులఁ దాల్చి వరవిభుఁ డభయవృత్తిన్
సుభగుభయసన్నుతము నభమవియ నన్మద దిగిభములు లాగి మూర్ఛనగఁ బుభుతతికి నెం తే
విభవమెసఁగం ద్రిదివసభ వొగడ మీటుచును శుభభరితదృష్టిఁ బ్లవగభటతతివార్ష
ప్రభవ మగు మండ రవినిభశరముల న్విసరెఁ గుభృదధికుమీఁద నెగుచుఖిదుగమట్లున్.

కవిరాజవిరాజితము.

తనపయి నిట్లు మితం బగుబాణవితానము వైచినఁ దా నలుకన్
దనుజవిభుండు సుదాత్తశరంబులఁ దక్షణమాత్రన దాశరథిం
జొనిపిన నిర్వురుఁ జూడఁగ నొప్పిరి శోణితగాత్రు లశోకయుగం
బనయము పుష్పితమై నటియించె నటంచుఁ దలంపఁగ నట్టిమెడన్. 891

స్రగ్ధర. రౌద్రాస్త్రం బుగ్రలీల న్రఘువరునిపయి న్రావణుం డేయఁ గ్రోధో
న్నిద్రుం డారాముఁడుం దగ్నిశిఖకతి నాగ్నేయ మహాసాయకం బ

త్యుద్రేకస్ఫూర్తిమై నేయుఁడు శరయుగళం బుద్ధతిం బోరి తూల
న్ద్రుద్వంద్వంబు నా యిర్వురు నిజవిజయార్థు ల్మహాఘోరవృత్తిన్. 892

మణిమయూఖము.

కాంచియు నిశాచరులు వృత్రచరవర్యు, ల్మిండితము మెచ్చ రజనీచరవరుండుం
జండకిరణాన్వయుఁడు శాతశరకోటిన్, దండిమ లిప్పగిదిఁ దార్కొని పెనంగన్.

క్రౌంచపదము.

దిక్కులఁ జీఁకటులెక్కొన యార్చెన్, దినకరరుచి యణఁగెఁ గనకచ్చాం
జుక్కలు ధాత్రిం బెక్కులు రాలెన్, స్సోగలు మనములను సొలసిరి భీతిన్
నిక్కక కంధు ల్మిక్కిలి యుంకెన్, గ్నిగమనితతి యవని నొరిగిపడియెన్
నిక్కము గాఁగ న్మొక్కలు రాలెన్, న్నిబిడతరగిరివినికరములందున్. 894

తరళ. అపుడు రావణుఁ డార్చిపేర్చి శితాస్త్రపంచక మొక్కటన్
నృపతిసింహుని వ్రేయ నప్పుమహానీయకార్ముకుఁ డెంతయుం
గుపితుఁడై పలలాదువక్షము ఘోరదివ్యశరాహతి
న్నిపుణుఁడై పగిలింప మూర్ఛమునింగె వానరు లార్వఁగన్. 895

శుద్ధవిరాట్టి. అంత న్మూర్ఛితు నద్దశాననుం, జెంతం జేరక చిత్రరూపులై
భ్రాంతిం జెంది యుపాయహీనతఁ, జింతం బొంది కృశించి రాశరుల్. 896

మత్తకోకిల. తేరిమీఁదన మూర్ఛదేఱి యధిజ్యకార్ముకుఁడై సమి
ద్ఘోరవృత్తి నృపు న్వధింపఁగఁ గోరివచ్చు దశాస్యుఁ గం
ఠీరవంబు గజంబు డీకొనుతీరి మార్కొనియె న్మహా
వీరవర్యుఁడు లక్ష్మణుండు వివృద్ధవిక్రమసంపదన్. 897

క. అన్నకుఁ గప్పై యి, ట్లన్నరభోజను నెదిర్చి యాతనిధను వు
ల్మన్న విఱిగించి సిడము, న్మిన్నం నొగసి యున్న దాని మేదినిఁ గూల్చెన్. 898

ఉ. అట్టియెడన్ గదాకలితహస్తయుగుండు విభీషణుండు తోఁ
బుట్టువు రథ్యసారథులఁ బొంక మడంగఁగ మోఁది యార్చినం
దొట్టిన చింత నట్టు విరథుండు సహాస్తశరాసనుండునై
కట్టలుక న్విభీషణునిఁ గాంచి బొమ ల్ముడి పెట్టి యిట్లనెన్. 899

ఉ. బుద్ధులు చెప్పర ద్దనిఁ బోయి నరాధము నాశ్రయించి ద
ర్పోద్ధతిఁ దిద్ధితంబుగ మహోత్కటు నన్నెదిరించి బంటువై
యుద్ధము సేయవచ్చితి మహోగ్రమృగేంద్రము సారమేయ మే
పద్ధతి మార్కొనంగల దుపాయ మెఱుంగ సహోదరా. 900

క. సురదుందుభిరవములు వానరుల జయజయధ్వనులు వినంబడ ధరణీ
వరుఁ డబ్ధి నీఁది పారము, పెంపునఁ గైకొన్నవాని విధమున నలరెన్. 820

వ. మహానందంబున నిజయోధవీరపరివృతుండై కుంభిలాద్వారంబు వెడలి వచ్చు నవసరంబున. 821

సీ. మలయధరాధరోజ్జ్వలహారిచందనపృథ్వీరుహములతోఁ బెనఁగులాడి
గంభీరతరవిశాలాంభోధితరంగశీకరంబులతోడఁ జెలిమిచేసి
మల్లికాజాతిచంపకకురవకకుసుమోపవనంబులను బూలబంతులాడి
భాస్వత్ప్రభనునీకకస్వరకాత్రస్వాంబుజాతముల నుయ్యాలలూఁగి
నందనంబున మందయానంబు నేర్చి, చైత్రరథమునఁ జైత్రుతో సరసమాడి
నట్టిమరుదంకురము హర్షమావహించె, భాసితులకు మరుత్సుమిత్రాసుతులకు. 822

వ. పిదప నమ్మహావీరుం డగులక్ష్మణకుమారుండు విజయవార్తాశ్రవణకుతూహలాయత్తచిత్తుండగు రామచంద్రుఁ గనతిదూరంబునఁ గపిరథావతీర్ణుండై. 823

క. రూఢధృతి నేగి వినయారూఢత నగ్రజుని చరణతోయజముల కా
రూఢప్రాభవు మ్రొక్కుడు, గాఢాదరతత్పరమునఁ గౌఁగిటఁ జేర్చెన్. 824

క. స్నేహ మిగురొత్తఁగా నుపగూహనసౌఖ్యంబు నొంది కొనియాడె మహా
సాహసు దానవవీరు ఘనాహవమునఁ జంపినాఁడ వనుచు నృపతిసుతున్. 825

క. దేవాసురవరు లోకములకు, గైవచ్చినఁ జిక్కఁ డమ్మహామాయికుని
నీవు వధించిన నస్మద్భావం బానందపూర్ణమగ్నం బయ్యెన్. 826

వ. అని వెండియు ననేక మధురవచనముల నగ్గించుచు దారుణవిపక్షబాణక్షతశతం బగు సహోదరుదేహంబు నిమురుచు నిట్లనియె. 827

క. నీ వింద్రజిత్తుఁ గూల్చితి, కావున నే నెల్లభంగి ఖండింతు దశ
గ్రీవుని దురమున మనసుగ్రీవాదులు మెచ్చి మిగులఁ గీర్తింపంగన్. 828

వ. అని తదనంతరంబున. 829

ఉ. సన్నుతి లొప్ప మారుతిఁ బ్రశంస యొనర్చి విభీషణుం గడు
సన్నుతమాటలం దనిపి మర్కటకోటి బహూకరించి తై
రోన్నతి రావణుం దునుమ నున్న యెడం దదనీక మెంతయుం
జెన్నువహించెఁ బున్నమ నిసిన్ శశిఁ గన్నపయోధిలోయనై. 830

క. అట దశముఖుండు భయదోత్కటసంగరమున సుతుం గడతేఁటుట యె
త్తుటఁ దేఁటుట కెవ్వానిమఖ,భటులవలనఁ దెలిసి వికళభావుం డగుచున్. 831

వనధిమథనవేళాసముద్భూతఘుమఘుమాయితధ్వానంబుల ననుకరింపుచు దశ
ముఖుండు రోషారుణముఖుండై. 842

క. సీత వధించెద నీసతి, చేతం గాదే మదీయసేనాబంధు
జ్ఞాతు లడఁగుటని మహా,వాతము దీపంబు నార్పఁగ వచ్చిన కరణిన్. 843

క. అలి వెడద న్నన్నడిఁ, యాలింపక వాలు వెఱికి యలుకఁ బుడమిన్ ద్రో
యాలి యనుఁగుఁ గూఁతుంగ, య్యాలి వధించెద నటంచు నసురపతి చనన్. 844

చ. అప్పుడు సుపార్శ్వుఁ డుద్ధతు రయంబునఁ బోయి దశాస్య మానినిం
గృపణ వధింపఁ బూనుమటి చికీ డగుఁ గోఁతులకోడి గోతిని
ట్లుపరిమితాగ్రహంబున మహాసిరి వ్రేసిన నవ్వె రట్లు స
త్కృప యొకయింతయు న్వలవదే మది రాక్షసవంశవర్ధనా. 845

క. సామి యిలు నవ్వఁ దగణి మన, సామినకుం జొనిపి పొడుతునని ఱటు సమమున
వ్యాప్తి దగురీతి నెంతయు, సామి గని మూలముసలిఁ జంపుట గాదే. 846

వ. అని యవసరోచితవాక్యోపన్యాసంబున జనకతనయావధోద్యోగంబు నివారించు
టుండు. 847

శా. శోకక్రోధసహాయతాస్యుఁడగు దశాస్యుండాహవాపేక్షన
స్తోకక్షిప్రతురంగయోగ్యము ననుస్తోమప్రదీప్తంబు ను
ట్టాకోటిగ్వనకల్పితంబు నగు మందస్యందనారూఢుఁడై
కాకోలూకముఖోగ్రపక్షిపతనాకంపధ్వజస్తంభుఁడై. 848

క. మత్తులకు వీరూపాక్షో, న్మత్తులు మహాస్తిహస్తిఘటుసమన్వితులై యను
ద్వృత్తి నకువ ణజయుసం,ప్తతి మెఱయఁ బార్శ్వ యువ సుపార్శ్వుఁడు దనరన్.

వ. రక్తగంధమాల్యాంబరాభరణభూషితుండై విజయభేరీనినాదంబులు సెలఁగ రెడ
వమాఱు యుద్ధంబునకు వెడలుటయు. 850

సీ. మనుజాస్థిమాంసరక్తపిత్తముల్ దినఁగోరికమీఱు నిసువు వియలవారు
శోణితపానప్రశోణఘూర్ణాక్షులు మితిలేని యుత్కటమూర్తులవారు
క్రవ్యనిషేవణోగ్రముఖులు కోలఁతి వెట్టు గాని గండ గొడ్డ ద్లవారు
జవనంబల దభక్షణవివశాత్ములు దరిలేని యస్త్రశస్త్రములవారు
తెక్కలేక ట్టి చేతిబల్లెములవారు, సమితిసంఖ్యాప్రవృత్తమలగుడములవారు
వెడలి రాహవమునకు ననీకినివారు, ఉలి బొగరుమీఱు మూలబలంబువారు. 851

క. వెడలి నడచుసరభసమునఁ, గడలి వితానంబు ద్రిమి గి రగము వలుగడ
ల్గవలుకొని ప్రతిబలంబులు, బడలుపడ న్మెఱసె నిజసైన్యదనముల్. 852

క. శరదంబుదములకైవడి, నరసింబులు మిన్ను ముట్టి యురుగతి నడిచెన్
ద్విరదంబులు మహిఁ దడుపుచు, శరదంబులభంగి మదరసస్రావములై. 853

క. సురరిపుతురగఖురాహతి, ధరారజఃపాతమున గదా గంగాభ
స్స్వర్గాత్రస్వరజలజము, లురుపంకజములుఁ బరాగయుతములు నయ్యెన్. 854

వ. బహుబాహుప్రదీప్తంబుగావున వనరాశిచందంబున సారస్యందనంబుగావున వనరాశికైవడి భయంకరాంతరంబైన యమ్మూలబలబలాహకపటలంబు నిబిడంబై శరాసారంబున ముంచుటయుఁ బెచ్చుపెరిఁగి యవ్వానరసేనాసస్యంబును దలమీఱి కవిసె. 855

క. వ్యూహములురెండు సమితో,త్సాహమునఁ దలాతలిం గచాకచి బాహా
బాహి నఖానఖి సన్నద్ధాహవ మొనరించె ఖచరు లచ్చెరుపడఁగన్. 856

చ. అమృతనిమిత్తపూర్వబుధాసురసంఘములట్లు చండవి
క్రమమున దైత్యభూరుహచరప్రకరంబులు పోరొనర్చినం
గ్రమమున నేలవాలె రుధిరంబది సంకులకాననాంతర
స్థమగు ప్రశోణగైరికవిశాలశిలాస్ఖలితప్రవాహమై 857

క. పలువురు బలియురు లొకనిపై, నలుక మార్కొని పెనఁగుట్టి యెడలును న
ప్పలువురు బలియురు నొకఁడుఁ గ, నలి మార్కొని చలముఁ బెనఁగడు నెడలున్.

సీ. పాషాణములు పిండిభంగి రాలెడుచోట్లుఁ బాషాణములఁ దలల్వగులుచోట్లు
విచ్చుకత్తులు పట్టి విఱిచెడునెడలును విచ్చుకత్తుల కొడలిచ్చునెడలు
భూరుహంబులు మార్గణములఁ జేయుపట్లును భూరుహంబుల మృతిఁ బొందుపట్లు
బాణజాలంబులఁ బాఱఁద్రోలెడునిక్కలమితబాణంబుల నడఁగునిక్క
లేమఁగుల గుత్తుకలఁ బడనేయుతావు, లేమఁగులు గుత్తుకలచేత నీల్గుతావు
లోరలు తలములు నోరగింప నున్నతలము, లయ్యె రవచరదైత్యప్లవద్వయమునఁ.

వ. ఇట్లుభయవాహినీయోధనాథు లాయోధనమున లోహటింపక యోహాహరిసాహరిం బెనంగులాడునప్పుడు కేలువడినం బెఱకేలఁ బరాక్రమించువారును దలలువడినను లక్ష్యంబులం బడనేయువారును జిక్కువడియును నుక్కుదక్కనివారును బ్రేవులు వ్రేలాడినం జేవవాఁడిం బోరాడువారును బ్రాణంబులు విడిచియుం గృపాణంబులు విడువనివారును రుధిరంబునం దడిసియుఁ జలింపనివారును జచ్చియు ముఖంబులఁ గ్రోధంబు డింపనివారును విచ్చియుం బెచ్చుపెరిఁగి కమ్ముకొనువారును గాలుసేతులు దునిసియుఁ గఱవ నప్పళించువారును బడియునుం బోరుపాపు మనువారును సహాయులు మన్నిగొనినను వెన్నీనివారును నై రయ్యవసరమ్మున. 860

సీ. పమగుర నూర్వర బాణరజ్జువులచే గుఱ్ఱుముచ్చ నొకవేళఁ గోపి యగుచు
మంత్రించి పడఁద్రోయుమాడ్కి నేనుంగులఁ బడసేయు నొకవేళ ధన్యుఁ డగుచు
భూరికదంబము లప్పుంఖానుపుంఖముల్ నిగిడించు నొకవేళ నిపుణుఁ డగుచు
దానవోపాకృతతతి మార్గణాగ్ని కాహుతిసేయు నొకవేళ నుగ్రుఁ డగుచు
దనుజతతిఃకవాటపాటన మొనర్చు, ధారుణీనాథుఁ డొకవేళఁ గ్రూరుఁ డగుచుఁ
దాళఫలముల పోలికిఁ దలలు రాల్చు, భూదయితుఁ డొకవేళ సనాథుఁ డగుచు. 872

ప్రస్ఫీత శౌర్యమై కీశసైన్యంబు రేకెత్త సంగ్రామభూమిపై ధారాగ్రస్తమై శస్త్రశ
స్త్రామితప్రౌఢి దైత్యాటవి నమ్మంచె శ్రీరామరాజన్యధారాధరం బీక్షింపఁగన్. 873

వ. అద్వయవిద్యాపారంగతుండు దోర్గర్వీణపాండిత్యంబుఁ జూపుటయుం జతురంగం
బగు పద్మాలబలంబు శల్యసంకీర్ణ కంటకక్షితిజాతం బగు దుర్గమారణ్యంబునుం బోలె
నందుఁ గపాలంబులు పిఘాలంబు లగువారును ప్రభ్రష్టకంబులు ప్రభ్రష్టకంబు లగు
వారును గతంబులు ఘటితంబు లగువారును ఖండంబు లగు వేదండతుండంబులును
జీర్ణంబులు నగుచర్మాంగంబులును విరూపంబు లగు రూపంబులును రదంబు లగుధ్వ
జంబులును భూతంబు లగుభూతంబులును గల్గి పుండరీకపుండరీకంబును శిలీముఖ
శిలీముఖంబును రథాంగరథాంగంబును బరాగపరాగంబును భంగభంగంబును రక్తో
త్పలరక్తోత్పలంబును వాలశైవాలంబు నగుసంగరసరోవరంబు రౌద్రబీభత్సాద్భుత
భయానకంబులకుఁ దావలం బై యొప్పె. 874

క. ఛాయకరికుంభకుంభవరక్తోత్సఘుసృణమూలబలపయోజవనతాఁ
జేరంజాలదు రామున్నారపురుషనాయకు ప్రజోపతి యనుటన్. 875

తే. లపనములు పిండి యైన విలపనము లగుట, చరణములు నతులయిన విచరణము లగుట
హస్తములు దెగిపడిన విహస్తు లగుట, నద్భుతాకార మయ్యె నయ్యాహవంబు 876

క. మూలబలమహోద్యన్మూలము రామాశుగ్రప్రయూల మని మహీ
పాలు రెదరించె రక్షఃపాలుఁ దలఁకమిఱి సైన్యపాలుర మెచ్చన్. 877

వ. నిజకాంతిపరిహాసచంద్రికావికాసుఁ బగుచంద్రహాసభయుదట్టహాసభాసురుఁ డై రామ
చంద్రుపై రావణుండు దురవడించుటయుం దనుజభటపరివృతుండై. 878

క. ఎత్తిచని విరుపాక్షోద్వృత్తులును సుపార్శ్వుఁడును వనచరబలము ను
న్మత్తుగఁ దలపడిపోరెను, సత్తఱి భండనము గడు భయంకర మయ్యెన్. 879

క. ప్రేతములప్రోవులు పాడవగు, దీవులుగా నెమ్ము లిసుకతిన్నెలుగా బా
ణావలి తరగలుగా రక్తావిలకీలాలసంగరాంబుధి మెఱసెన్. 880

క. ఆతఱినరుగన వచ్చి విరూపాక్షోన్మత్తుల మహోదరామాత్యుల యు
ద్ధక్షోణికి బలిగాఁ దచ్ఛక్షుంబులు భానుసుతుఁడు ప్రక్కలు సేసెన్. 881

తోటకము. అంగదుఁ డంతట నంగము పొంగఁ, దుంగరసాలము తూర్ణము గాఁగన్
ప్రుంగఁగ దానవపుంగవు నేయ, న్భంగము నొంది సుపార్శ్వుఁడు వ్రాలెన్. 882

వ. నిజపార్శ్వచరులును మిత్రులు నగు సుపార్శ్వవిరూపాక్షోన్మత్తుల మృతిగాంచుటం
గనుంగొని రోషాతిరేకంబున. 883

క. దశకంధరుండు కార్ముకదశకంధరుఁ డగుచుఁ గీశతతి నెంతయు దు
ర్దశనొందింతు ననుచు నిజదశనంబులు గీఁటుచును రథంబు మెఱయఁగన్. 884

గీ. వాన గురిసినకైవడి వడిగ నిసుము, చల్లినట్టులు విస్ఫులింగములభంగిఁ
దెఱపిలేకుండఁ దొరగించె దివ్యబాణపటలి నొక్కట విపినాటుభటులమీఁద 885

వ. సంవర్తసమయసముద్వర్తింబోలె విజృంభించి. 886

మహాస్రగ్ధర. పదిచండాస్త్రంబులు న్మప్పదిశనిశితరోపంబులు న్నాల్గుశాత
ప్రదరంబుల్ వైచి శౌరిం బవనతనయునిం బాకభిత్పుత్రు నొంప
న్మదమత్తై యున్మవ్వురుం దమ్ముకుటములదర న్మావులు న్గుంప నాము
గ్రహృదయుం డాజ్యాహుతిం బేర్చినహుతవహుఁడో యాతఁ డుంచుం దలంకన్.

లలితపదము. పెరిఁగి దివాంసభీమము గాఁగం, దరువరవంశవితానము సెల్లన్
శరచయశిఖాగ్నిజ్వాలల పేర్మిం, దరికొని కాల్చె హుతాశనమూర్తిన్. 888

వ. దశకంఠుం గనుంగొని రాముండు సమీరింపక. 889

లయవిభాతి.

రభసత నెదిర్చి భుజగభయదముఁ గార్ముకముఁ బ్రభ మిగులఁ దాల్చి నరవిభుఁ డభయవృత్తిన్
గుభగుభయసన్నుతము నభమువిరియ న్నమర దిగిభములొగి మూర్ఛగొన బుభుతతికి నెంతే
విభవమెసఁగం ద్రిదివసభ వొగడ మీటుచును శుభభరితదృష్టిఁ బ్లవగభటతతిపార్ష్ణి
ప్రభవ మగుమండ రవినిభశరముల న్విసరెఁ గుభృదధిపుమీఁద నెగు చాఛిదుగముల్లున్.

కవిరాజవిరాజితము.

తనపయి నిట్లమితం బగుబాణవితానము వైచినఁ దా నలుకన్
దనుజవిభుండు నుదాత్తశరంబులఁ దత్క్షణమాత్రన దాశరథిం
జొనిపిన నిర్వ్యథుఁ డాడఁగ నొప్పిరి శోణితగాత్రుఁ డశోకయుగం
బనయము బుష్పితమై నటియించె నటంచుఁ దలంపఁగ నట్టియెడన్. 891

స్రగ్ధర. రౌద్రాస్త్రం బుగ్రలీల న్రఘువరునిపయి న్బ్రావణుం డేయఁ గ్రోధో
ద్విద్రుం డారాముఁడుం దన్నిశిచరపతి నాగ్నేయ మహాసాయకం బ

త్యుగ్రదేకస్ఫూర్తిమై నేయుఁడు శరయుగళం బుద్ధతిం బోరి కూల
ద్రోద్రిద్వంద్వంబు నాఁ గిరస్సులు నిజవిజయార్థ ల్మహాఘోరవృత్తిన్. 892

వనమయూరము.

కొండియు నిశాచరులు వృత్తిచరవర్యు, లొక్కఁడితయు మెచ్చ రజనీచరవరుండుం
జండకిరణాన్వయుఁడు శాతశరకోటిన్, దండిమగ లిప్పగిదిఁ దార్కొని పెనంగన్.

క్రౌంచపదము.

దిక్కులఁ జీఁక ట్లెక్కిన యయ్యెన్, దినకరరుచి యలుతగఁ గనబచ్చెం
జుక్కలు ధాత్రిం బెక్కులు రాలె, న్నృగలు వనములను సొలసిరి భీతిన్
నిక్కక కంధు ల్మిక్కిలి యుంకె, న్నిగమవినుతి యవని సౌరిగిపడియెన్
నిక్కము గాఁగ న్మక్కలు రాలె, న్నిబిడతరగిరివినికరములందున్. 894

తరళ. అపుడు రావణుఁ డార్చిపేర్చి శితాస్త్రపంచక మొక్కటన్
నృపతిసింహుని వ్రేయ నమ్మహనీయకార్ముకుఁ డంతయుం
గుపితుఁడై పలలాదునక్షము ఘోరదివ్యశరాహతి
న్నిపుణుఁడై పగిలింప మూర్ఛమునింగె వానరు లార్వఁగన్. 8:6

శుద్ధవిరాటి. అంత న్మూర్ఛితు నద్దశాననుం, జెంతం జేరక చిత్రరూపులై
భ్రాంతిం జెంది యుపాయహీనతఁ, జింతం బొంది కృశించి రాశరుల్. 896

మత్తకోకిల. తేరిమీఁద మూర్ఛ దేలి యధిజ్యకార్ముకుఁడై సమి
ద్ఘోరవృత్తి ప్రపు న్వహించఁగఁ గోరివచ్చు దశాస్యుఁ గం
ఠీరవంబు గజంబు డీకొను రీతి మార్కొనియె న్మహా
వీరవర్యుఁడు లక్ష్మణుండు వివృద్ధవిక్రమసంపదన్. 897

క. అన్నకుఁ గన్నాకై యి, ట్లున్నరభోజను నెదిర్చి యాతనిధనువు
లున్నన్ని విఱిగించి పిడము, న్మిన్నను నొరసి యున్న దాని మేదినిఁ గూల్చెన్. 8:8

ఉ. అట్టియెడన్ గదాకలితహస్తయుగుండు విభీషణుండు తోఁ
బుట్టువు రథ్యసారథులఁ బొంక మడంగఁగ మోఁది యార్చినం
దొట్టిన చింత నట్లు విరథుండు సహస్తశరాసనుండు నై
కట్టలుక న్విభీషణునిఁ గాంచి బొమ ల్ముడి వెట్టి యిట్లనన్. 899

ఉ. బుద్ధులు చెప్పన ద్దనికిఁ బోయి నరాధము నాశ్రయించి ద
ర్పోద్ధతిఁ దద్ధితంబుగ మదోత్కటు న న్నెదిరించి బంటవై
యుద్ధము సేయవచ్చితి మహోగ్రమృగేంద్రము సారమేయ మే
పద్ధతి మార్కొనంగల దుపాయ మెఱుంగ వహో సహోదరా, 900

ఖాండలసుఖ్యులుం దెలిపి గానని మూర్ఛ మునింగి రింద్రజి
త్ఖండనుఁ డీల్గెనం చెటులు గాంతును వారము దుఃఖవార్ధికిన్. 922

ఉ. ఏటికిఁ జీమలడ్డముగ నేగి భయంపడునట్లు నీధను
ష్కోటికి నగ్గమై వెలి పురారికిఁ దానవకోటి […]
న్నేటికి మీఱె నీవు ధరణిం బడఁగా నవి చింగనొ…ము నిం
కేటికిఁ బ్రాణ మేటికి మహీసుత నాకని మాటిమాటికిన్. 923

వ. అనేకవిధవిలాపంబుల వగచుచు ధూళిధూసరితంబగు సహోదరుశరీరంబు నిము
రుచుఁ గౌఁగిటం జేర్చికొని మానవమాత్రుండునుం బోలె నిశ్చేష్టితుండై కొంతతడ
వూరకుండి దీనాననం బెగయించి. 924

క. మిగులఁ దవకంబె వగలం, బొగులు కపిబలంబులెల్ల బొదిగని కరుణా
బుగ వారికిట్లనియెఁ బెల్లుగ నొదవెడు గద్గదిక నెలుఁగు రాలుపడన్. 925

ఉ. కానసవృత్తికంటె జనకక్షితినాథతనూజ రాక్షసా
ధీనత నొందినం గలుగు దీనతకంటె సహోదరుం డ్రపా
ణానకుఁ బాసినం గను ఘనవ్యథకంటె సుమిత్ర పుత్రశో
కానల మైనఁ జూచుట భయంబగుఁగాన మృతుండ నయ్యెదన్. 926

క. అనుటయు బాష్పాంబులో, చనులక్ష్మణవదులు రామచంద్రుని దీనశో
కనిమగ్నమానసుం గన్గొని దుఃఖించిరి రణంబు ఘోరము గాఁగన్. 927

గీ. అధికశోకమగ్నులై హనుమన్ముఖ్యు, లున్నయెడ సుషేణుఁ డుచితభంగి
డాయఁబోయి మూర్ఛపోయిన లక్ష్మణు, నంగకంబులెల్ల నరసి చూచి. 928

క. హృదయము బెదరకుట, ధాతువు లదరుట వదనము కాంతమై యుండుట నె
మ్మది నరసి చూచి రాముని, గదిసి సుషేణుండు నిర్భయగతి నిట్లనియెన్. 929

మ. అవనీభారధురంధర ప్రవర ధైర్యస్థైర్యచిత్తాబ్జ నీ
వవివేకింబలెఁ జింతనొందకుము మూర్ఛాయత్తుఁడై లక్ష్మణుం
డవశత్వంబున బ్రాలెఁ గాక మృతదేహం బిట్లు నిద్రావికా
రవపుఃప్రక్రియ నొప్పునే యితఁడు సప్రాణుండు నిక్కంబుగన్. 930

వ. అని నమ్మం బలికి. 931

ఉత్సా. జీవశతసహస్రశేముషీవిశేషలక్ష్మణుజ్
జీవయుక్తుఁగాఁ దలంపు చిత్తమం దితండు ని
ర్జీవుఁడేని దేహ మిట్లు చెన్నుమీఱ దింకసం
జీవనీమహౌషధంబుచేతఁ దెల్వి నొందెడున్. 932

ఉ. నీవు కృతప్రతిజ్ఞుఁడవు నీతలపోసినదాని కంతరా
యారలి యెన్నఁడుం గలుగ దర్కకులాగ్రణి పద్మినీ ఘనో
ద్భావితుఁ డయ్యినం డుదయపర్వత మెక్కఁగ గాకమున్న సం
జీవనిఁ జేసి లక్ష్మణు సజీవుని జేయుట చాల మేలగున్. 933

క. అని హనుమంతు న్విపులభుజబలి నక్షశిక్షణశిక్షితాంతు స్వామిప్రియకా
ర్యనిరూఢబుద్ధిమంతు న్ఘనపవనధైర్యహిమవంతు నతిబలవంతున్. 934

ఉ. శ్రీరమణీవిభూధరశరీరుని ధీరుని గీశసైనికా
ధారుని నిర్వికారుని సదాగతిముద్దుకుమారునిం గడుం
గూరిమితోడఁ గన్గొని కనత్ప్రియదాసవచందనాఖ్యమా
నోదయశంబు గైకొనఁగ దిట్టఁడ వచ్చెదు రమ్ము చెచ్చెరన్. 935

వ. అని ససంభ్రమంబును సప్రేమంబును సస్నేహంబును సగౌరవంబును సబహు
మానంబునుగాఁ జేరఁబిలిచి కార్యగతానిరూపణంబుగా నిట్లనియె. 936

గీ. ద్రోణధాత్రీధరము కడుదూరమందు, గలుగుసంధానసౌవర్ణ్యకరణులును వి
శల్యసంజీవకరణులు సవసులనఁగ, రాత్రు లయ్యోషధీనికరము వెలుఁగు 937

వ. సర్వసేనామూర్ఛాసమయంబున జాంబవంతుం డెఱింగించినచందంబున దూరంబును
మార్గంబును లక్షణంబున నీ వెఱుంగుదువు. 938

సీ. ఈవల నావల కిన మాఱు మున్నూఱు దాఁటనోపుదు పయోదధికడంక
నమితవేగంబగు నర్కుని తెరగుఱ్ఱంబులతోడఁ బాఱంగ నేర్తు
భూనభోవలయంబు పూర్ణంబుగా మేనుఁ బెరిఁగింపఁ గడు నేర్తు బిగువుగాను
బాలలీలాప్రౌఢి భానుబింబము సైనఁ బట్టి చూడఁగ నేర్తు ఫలముభంగిఁ
దెత్తు వేసిమలోఁగ ప్రవృత్తిసైన, నట్టి నీకెన్ని యంతరాయములు గల్గె
నేని వారించి సంజీవనీనగంబు, నిమిషమాత్రంబులోనఁ దేనేర్తు వనఘ. 939

గీ. అనుచు మోదమంది యతఁ డమ్మహౌషధీవిశేష మారసి తేఁదలంచినఁ దదీయ
ముఖవికాసము గాంచి రాముఁడు ప్రహర్షమగ్నుఁడై యిట్లనియె హనుమంతుతోడ.

శా. చంద్రద్రోణధరాధరాగ్రవిలసత్సంజీవనిస్వాంబరీ
సాంద్రద్రోహాలవిపన్న మేపుఱుక కీశశ్రేణి యోగ్గింపఁ బ
క్షీంద్రుం డయ్యమృతంబు జయ్యుఁ డగుచున్ హేలాగతిం దెచ్చిన
ట్లింద్రారాతుల గెల్చితెచ్చి యిపు డిమ్మిక్కి దాన మాతమ్మునిన్. 940

క. భూపదితిము లాఁగగనుచు,నోవేగము లాఁగగనుపనోధవ యెట్లు
న్నీ వెసరఁ జాలునసదగ, దేవరవున్నైనఁ దీర్పు మిక్కార్యంబున్. 941

క. అనుటయు మేరువుగతి మే,నునిగిడ్చి నరేశ్వరుం గనుంగొని సంజీ
వని దెచ్చెద నరుణోదయ,మునకు న్మనుగాఁగ వగల మునుఁగకు మింకన్. 942

వ. అని యనుజ్ఞ వడసి. 943

క. ఆక్షణమునఁ గపులక్షీ,క్షణులై విజయలక్షణంబులఁ బొగడం
బక్షీంద్రుపగిది నిజవా,లక్షేప మొనర్చి దాఁటె లవణపయోధిన్. 944

వ. దాఁటి యెగసి మిన్నునట్టి యుత్తరాభిముఖుండై. 945

క. ప్రకటలవణాంబునిధిఁ బ్రి,చ్చుగుంటువిధంబు గాఁగఁ జూపట్టి నగ
ప్రకరంబులు దనకుం దోఁ,తిక దవలైకనఁబడఁగ నతిత్వరితగతిన్. 946

సీ. బహుదూర మాద్రోణపర్వతం బేక్రియఁ జనువాఁడనో యనుసంశయంబు
యతురత ప్రథయంబు మార్గం బొక్కరుండ నెట్లొకొ యనుగుండెదిగులు
నాలస్యమునఁ బట్టె యంతరాయంబులు తోఁచునో యనెడునాలోచనంబు
నమ్మహౌషధుల రయంబున నెవ్విధిఁ గనుఁగొందునో నిసి నన తలఁపు
నించుకయు లేక నిజరయాహీనరణము, బ్రహ్మలోకంబువారికి భయముగూర్పఁ
బూతసంజీవినీసమానీతబుద్ధి, నరుగు పవమానసుతుని లోకైకనుతుని. 947

క. పోరిఁబోరి సుర లగ్గించుచు, విరులు గురిసి రమరదుందుభిధ్వానంబు
ల్గరము మెఱసె శైన్యనమా, కరుఁడై సుతు నెఱుకొనియెఁ గరువలికరుణన్. 948

వ. అంత నయ్యాంజనేయుఁ డనిరంకుశద్వీపంబు కుశద్వీపంబు గడచి యెడనెడ వినోదంబు
లగు నదీనదంబులను హిమానీపిహితచ్ఛదంబులై పాలసముద్రంబునుం బోని యభిన
వంబు లగు వనంబులను విశేషంబు లగుఘోషంబులను మహోత్తుంగంబు లగుమహీ
ధరశృంగంబులను గతమునిజనతాశ్రమంబు లగు నాశ్రమంబులను జూచుచు నేక
నిశ్చయంబునం జనునవసరంబున. 949

గీ. పంక్తికంధరుండు పనిచి కంధర, పంక్తి వానికృతకబహుళమైన
కానఁగూర్చి యందుఁ గాలనేమి జపంబు, సలిపె నిక్కపుంజటిలునిభంగి. 950

సీ. మకరందరసతుందదమధుకరనికరఝుంకారశుభకరత్మ్యగుహాంబు
సహకారకిసలభక్షణపృథుక్షణప్రతిక్షణకుహూకారపికవ్రజంబు
లంబబింబారుణలసనావిలంబభాషాకవనీయశౌకాకరంబు
సమబాలతృణకబళసంధిస్థలచంక్రమణకుమనోహారహరిణపృథుకంబు
గాఁగఁ నొనర్చి యచ్చోటఁ గపటవేష,ధారియై దనుజాధమాధముఁడు కాల
నేమి తప మొనరించెడు నెలవు గాంచి, యంతరంగంబునం బవనాత్మజుండు. 951

క. మును సంజీవనిఁ దేఁబో, యినతతి నిర్వాణముఁ గాన నే మార్గమున
ప్పినవాఁడనో యిమ్మునికతముఁ దెలియుమనను దాని బ్రమొక్కి నీతిన్. 952

క. ఇక్ష్వాకుకులంబున భీమ, ప్రత్యక్షముఁ దహితవంశపవనాంకురఘూ
రక్ష్వేళధారి లయాసము, ముక్ష్వేళగళుండు రాముఁ డసురవరులకున్ 953

క. అతనితమ్ముఁడు లక్ష్మణుఁ, డాతతమూర్ఛానశాత్ముఁ డగుటయుఁ దెలుపన్
దూత నగుట సంజీవని, దేతెమ్మని పనప వచ్చితి న్మునినాథా. 954

వ. అని తదీయ సమయప్రకారంబు సవిస్తరంబుగా నెఱింగించి వెండియు. 955

క. వచ్చితి మార్గము దప్పితి, నిచ్చట నినుగంటిఁ ద్రోవ యెఱింగించి దయం
బుచ్చు మదిగాక కొలఁకుఁ, డిచ్చేరుదమన్నఁ జెప్పవే దగఁగొంటిన్. 956

చ. అనుటయు సంతసించి దనుజాధముఁ డంతయు దివ్యదృష్టిచేఁ
గనుఁగొను వానిపోలికి మొగంబు కయించుక యెత్తి మూచి పా
వనిఁ గని సర్వముం దెలియవచ్చెను మామక దివ్యబోధచే
నినభ తేజ లబ్ధశరధీశుతనూజుల కింక మేలగున్. 957

గీ. వాయ పితృవాజ్ఞ చెల్లింప వచ్చినారు, వచ్చి ఘోరాటవిఁ జరింపఁ జొచ్చినారు
తాటకాత్మజపంక్తికంధరులు ఖలులు, హెచ్చి వారి నదట మోసపుచ్చినారు 958

వ. వంచించి సీతాపహరణంబు గావించుటయు వనచరసహాయులై సేతుమార్గంబున లం
కాపురంబుపై విడిసి. 959

క. ఉద్ధితవిస్ఫారంబు హ, రిద్ధ స్థిరశుతిస్ఫుటబధిరీభూతగతిన్
యుద్ధ మొనరించి పిదప స, మిద్ధత్వుఁడై లక్ష్మణుండు మృతునివడ వునన్. 960

ఉ. రావణుశక్తిఁ గూల సుకరంబుగ నాతనిఁ దెల్పువేడ్క సం
జీవనిఁ దేర నీవిటకుఁ జెచ్చెర వచ్చి తెఱుంగుదుం దదీ
యావసరంబు లేదు విమలౌషధరాజము లేనొసంగుదుం
ద్రావుము నీరు నీ వతిముదంబున నిర్మలాకరంబునన్. 961

వ. అని పలికి తదీయాంతరంబున మకరంబు మెలంగుట దా నెఱుంగుం గావున 962

క. అకలంకమున కామాయికుఁడు కరాంగుళిఁ జూపె నటు మదవుకొక్కండు
న్మకరాకరతుల్యమును హీ, మకరాతపఫేన ముగ్రమకరాకరమున్. 963

క. చూపుడు రంభాకారం, భాషణసక్రమకతీక్ష్ణభాగం బగున
వ్వాపిఁ గనుంగొని యద్భుత, తాపోశనబుద్ధి డిగ్గి తన్వొసడిగ్గెన్. 964

క. కడఁగి కొలనఁ గాల్సేతులు, గడిగికొనఁ దలంచి మించి కరువలికొమరుం
డడుగిడుఁ డిగ జాపమ్మతి, నడిగెడుగతి మకరి యతని యడుగుం బట్టెన్. 965

క. చండకిరణసంకాశుఁడు, చండక్రోధుఁడు తపోవిచారుఁడు గాండి
ల్యుం డను పేరిటి మునినాథుం డొకతఱి వన్యఁగని పృథుసుమకరశాఖిన్. 991

గీ. మనము గలఁగ ధాన్యమాలినీప్రముఖపుష్ప, మాలినీ తపంబు మాలి నీకుఁ
జిక్కువడితి నింకఁ జిక్కులు గట్టుక, తీయవిల్తుబారి కీడుకుమని. 992

వ. చిడిముడిపాటునం దమకించిన యద్ధగణీదేవత సత్తమునకు సత్త్రసంబున సంప్రా
గల్భంబును సవినయంబునుం దేటపడునట్టి హితవచనోపన్యాసంబునం జిత్తంబు
మెత్తఁబడమి యెఱింగి. 993

క. ఏను రజస్వల నన్నన్, భూనుతగుణ యెవ్వధుఁ బోఁగనెను స్నానం
బైనఁ జనుదెంతుఁగ, వయ్యును, నానట్టులు చేయుమని యనఘుఁ డతఁ డనఁగన్. 994

సీ. ఏగాన మిది రాహృదయశోకహృదయంబు గఱఁచి విమానంబు గలుఁగఁ జేసె
నేగాన మద్భుతం బెసఁగ రాల్గరఁగి చిట్టిమ్రాఁకుల వన లుబ్బట్టఁజేయు
నేగానము భవాబ్ధి నీఁద నూహించు మౌనీంద్రులకైన మోహింపఁజేయు
గంధర్వకామినీగణముల నేగాన మించుకేనియుఁ దలపోయ నీదు
దట్టిసంగీతమోకసమయమున గంధమాదనంబునఁ దగుతాళమానముగను
విస్తరింపఁగ నచటికి వేడ్కవచ్చె, రావణుండు త్రిలోకవిద్రావణుండు. 995

క. వచ్చి నను మెచ్చి కలదని, యచ్చపడం దెలుప వినక యనిలహతలతా
వచ్చలిత నన్నుఁ గైకొని, యచ్చపలుఁడు దేలియాడె నభిమతగతులన్. 996

క. అతనికతన నాకదుపుగ, నతిబలుఁ డతికాయుఁ డనెడునతఁడు వొడమినన్
సుతుఁగొని యప్పటితుఁ డసురపతి పనియెన్ వైజయోధపరివృతుఁ డగుచున్. 997

గీ. అంత నాలకనాఁడు నీరాడి వలిప, తెలిమడుగుఁ దెలిపూఁతయుఁ దెలియలరులు
నలర నేనున్న గాఁడిల్యుఁ డనియెడి జడదారి చనుదెంచె నలపువక్కదారి యనఁగ.

వ. వచ్చి నిజతపోమహానుభావంబున నాదుండగం బెఱింగికొనినవాఁడు గావున నపరిమిత
క్రోధదుర్నిరీక్షుండై. 998

క. ఇంతుల పాపమునకుఁ గుదు, లింతుల యన్యోన్యప్రవచన లింతుల కత ల
య్యంతు లోకనిశం గూర్తురె, యింతుల నమ్మంగఁ దగునె సుమేధసునకున్. 999

వ. అని నన్నుం గనుంగొని. 1000

మ. మతి వస్యాంచన చేసి రావణు నకున్మాన్య స్మరక్రీడఁ దే
ల్చితి వీ విశ్వపరాధహేతువున గాసిం బొంది నక్రంబు నా
కృతి దుఃఖస్థితి ఘోరమూర్తి వగుచుం గ్రీడింపఁ బొమ్మంచు శా
పితఁ జేసె న్ననుఁ గీశవంశకలశాబ్ధిప్రోజ్జ్వలేందూదయా. 1001

వ. తదనంతరంబున. 1002

క. మదమునఁ దెలియకనిన్ను, స్మదధీన ప్రావణుఁడు సుమశరక్రీడం
గదియుటకు సుతహితయుతుఁడై, యొనుఁగుచు సంఘాతమరణ మొందు నరులచేన్.

వ. అని యివ్విధంబున. 1005

క. వాఁడు కోపించుచుఁ బటు, శాప మొసఁగిపోఁ దలంచు సమయంబునఁ జిం
తాపరతఁ బ్రనగుచు, తాపసిపదములను భక్తితాత్పర్యమునన్. 1006

చ. కరములఁ బట్టి సన్నుతిగాఁగ శపించెదె యెందుఁ గామితు
ల్గర మఱి నీత లిట్లగుటఁ గాదె బుధుండ ప్రతిపదస్మృని
పరిసరవర్తి గాక యనపాయతపోమహిమానుభావ సు
స్థిరమతి నిత్యసౌఖ్యమును జెంది సుఖించుమ యుండు మెప్పుడున్. 1007

వ. యతివరా శాంతుండవు గమ్ము తపఃఫలధంసంబగు నన్యాంగనాసంగ మసంగుండ
వయ్యును దానిఁజేయు మహాక్రోధంబున కేలశరగతిం బొందెద వని ప్రార్థించుటయు.

క అవనీసురవరుహృదయము, నవనీతము పల్కు దారుణవిదోజమహా
స్త్రోదగ్రము గావున, నిన్నవలోకించి కరుణారసార్ద్రిత్వయుండై. 1009

క. వ్యర్థ మగునె మద్వాక్యము, సార్థ మగుంగాక ఘోరశాపప్రతిమో
క్షార్థిని వినురాఘవకా, రార్థి త్రిలోక హితకారి యనిలజుఁ డిటులన్. 1010

క. వచ్చు మొనసి నీయుదరము, వచ్చు నతనికతనఁ బాపరాశిఁ దొలఁగి పో
వచ్చు దివంబున కనిసె, వచ్చుపడ నొసఁగి చనియె నదినిజమత్యున్. 1011

వ. మహాత్మా భవదీయచరణారవిందదర్శనస్పర్శనంబులు శాపమోక్షంబు గావించుట
యింతయే. 1012

మ. కపివంశోత్తమ కాలనేమి యను రక్షశ్శ్రేష్ఠుఁ డీరీతి ని
శ్చపువకానింబలెఁ ద్వత్ప్రయాత్నతరు విఘ్నప్రక్రియాలోలుఁడై
తపస్విమిచ్చోటు మృషాస్థితిం బ్రకటటాస్థం జేయు వీనిం బరం
తప ఖండింపుము పొమ్ము కన్గొనుము చంద్రద్రోణశైలాంతమున్. 1018

క. కృతకార్యసిద్ధుఁడవు ని,మ్కృతి కాభీష్టుతుఁడ వగుము కీర్త్యుత్తమ దు
ష్కృతమునకు నన్ను బహిష్కృతఁ జేసితి వాత్మ సంతసించితి ననుచున్. 1014

క. తన యుపకృతిఁ గావించి, దనుజుం దనతోడ సురపథమునకుఁ గొనిపో
మనమునఁ దలంచిరో వానిని జంపక ధాన్యమాలిని పనుచు టరయక. 1015

వ. పనిచి యద్దురాత్ము శాపట్యంబును మహాత్మధీర ధురపంథానసంధానకరణ్యా
ద్యుపథసంధానక్రమంబును సవిస్తరంబుగా నెఱిగించి యమ్మహాత్ములు వల

గొని యదృచ్ఛాప్రహార శిల యగుచు నద్ధాన్యమాలిని యంతర్ధానంబు నొందుటయుం
బరమాద్భుతక్రోధసంభరితహృదయుం డగుచు నాంజనేయుండు కల్మషక్రియా
నిత్యు దైత్యుం గనుంగొనుటయు నెఱుంగమి భావించుచు నతం డతనితో నిట్లనియె.

క. తడసితివి మిగుల నెత్తుటఁ, దడిసితి విది యేమి మంత్రతంత్రౌషధము
ల్బడసెదవే గురుదక్షిణఁ, బడసెదవే రమ్ము నాఁగఁ బావని కినుకన్. 1017

క. గురుదక్షిణ యొసఁగెద నని, గురుదక్షిణభుజము సాఁచి గ్రుద్దిన నతఁడున్
గురువక్షము నెమరఁగ నిడ, గురుఁ దక్షిణమునఁ జలంబు గొని పోయెనెడన్. 1018

ఉ. ఒక్కసమున్నతిం గను వింత శకుంతము రూప మూని యు
మ్మొక్కలి రక్కసుండు కపిమూర్ధము శాతనఖాళిఁ జీరినన్
ముక్కుపగిల్చి ఱెక్కలను ముక్కలు చేసిన దంబునిండఁ బే
రుక్కున నక్కపీంద్రుఁడు మహోద్ధతుఁ డార్చెఁ గాలనేమి యుండెన్. 1019

క. సింహప్రక్రియ నానఁగ, సింహంబున కడ్డ మేగి స్థిరధృతి ననుహ్వా
త్సంహారణకరణఖరనఖసంహతుల నొంపఁ బవనసంభవుఁడు వడిన్. 1020

ఉ. పాటవ మొప్ప వాలమునఁ బట్టి యదీయ సటాచ్ఛటా సము
త్పాటన మాచరించి వెస దంష్ట్రలు డుల్చిన దుష్టచిత్తుఁ డ
త్తాటక మన్నఁ దప్పటివిధంబు దొఱంగి దినేంద్రసూనుఁడై
గాటపువైరి మొప్ప సముఖంబునకుం జనుదెంచి యిట్లనున్. 1021

క. అశ్రముఁడై బాహుబలపరిశ్రముఁ డగు లక్ష్మణుం డరిప్రకరముపై
న్నాశ్రయముగఁ గడఁ దేజె నృపధాశ్రమ పోనేల యామధరుధరమునకున్. 1022

క. సౌమిత్రి మూర్ఛ దెలిసెను, సామీరిం దోడి తెమ్ము చయ్యన ననుడున్
రామాజ్ఞ వచ్చి యయ్యా, రామంబునఁ గంటి మఱలి రమ్మనవినన్. 1023

ఉ. ఇంచుక సంశయించి మొగమెత్తి కడుం బరికించి పోల నూ
హించి దినేంద్రసూనుఁ డిటు లేమిటికిం జనుదెంచు వీఁడెన
న్వంచన చేసి యాకరణి వానరమూర్తి వహించె వీని ఖం
డించెద నంచు నెంతయుఁ గడిందిమగంటిమి యుల్లసిల్లఁగన్. 1024

క. తేలెమ్ము దురాత్మ యనుచుఁ, గోలెమ్ము విటిగడునట్లు గ్రుద్దినఁ దతఁ డీ
కీలెమ్మయిఁ దెలిసె ననుచుఁ, గోలె వ్మ్రన నోరు దెఱచికొని వివశగతిన్. 1025

క. పడియును దనుబాధముఁడు గీ, ద్వాశి శతశృంగుఁ డయి వేగ వానరపతిపైఁ
బడినఖరాయుధములఁ గడువడి నొప్పించుటయుఁ గొంతవడి కదయుండై. 1026

గీ. ఆర్చి నిజదీర్ఘవాలవల్లార్చి కన్నుఁ,గవను సప్తార్చికణములు గ్రమ్మ జేఱఁ
బేర్చి గిరిఁ జుట్టి పృథుగతిఁ బెంచి బలిమి, బెఱికి దంతావళము తూఁడు పెఱికినట్లు.

వ. భైరవాట్టహాసుండై చటచ్చటాశబ్దపూర్వకంబుగా మహామహీభృత్పృథుత్పాటనం బాచరించి యావ్వటుశిఖామణి శిఖామణిం బోలె నిజమూర్ధంబున వహించుటయు సహింపక. 1040

క. గర్వితులు ద్రోణనామక,పర్వతము గాచియున్న పల్లిను లసమా
ఖర్వమతు లసంఖ్యులు గం,ధర్వులు పోరు దుని తత్పథం బాఁగి గ్రుడవ. 1041

క. మము నేమతించి భూమీ,ధ్రము నుగ్రవ్యాపధీయుత కుఁ గొనిపోవక
భ్రమఁగాలెనె కీశకులా,ధమ నిలు నిలు మనుచుఁ గడు సవల్పులు పెంగన్. 1042

క. అని ముసల విసర మెసఁగఁ, న్విపరి ముసరి కసరికొనుచు విసువక పెసఁబెం
బసభూసఁగి కవిమసఁగ నసృచుసమసమవిస్ఫురబలుఁడు మసల కపముసన్ 1043

ఉ. అనుపమశక్తియుక్తిఁ బరమాత్మజుఁ దప్పుడు మత్తనాగమో
యనఁ బటువాలతుండమున వియచ్చరసంచయావృతస్సరోజముల్
చినుఁగఁగఁ ద్రిప్పి దంతములఁ జీల్చి నఖంబులఁ జీఱి పాదతా
డనముల ముష్టిఘట్టనములం బరివోవఁగ మోఁది వైచియున్. 1044

గీ. ధరణిభృద్భాగము కృష్ణగర్భయుతము దీర్ఘ,వాటకీలాకరాళంబు వాయుపుత్ర
దళ మదంతరు రోమజాతముఁ జేర్చి, కాల్చె నీరసగంధర్వ కాననంబు 1045

గీ. చిత్రసేనాదిగంధర్వసేన పటుకృ,పాణములతోన విడిచెను బ్రాణవాంఛ
హనుమకరవాలజర్జరితాంగ మగుచు, ద్రోణములతోన విడిచెను ద్రోణవాంఛ. 1046

క. గురుబుద్ధిప్రియు నాకపి,హారణు సుపర్వగతు రిపుబలాంతకు జిష్ణున్
హరి గిరిభేదిం గల్పక,విరసుమములఁ గప్పి రతిముదంబున విబుధుల్. 1047

వ. లబ్ధవిజయుండై మహాముదంబున మిన్ను ముట్టి మరుత్కుమారుండు మనోవేగంబున.

ఉ. తామస మింతలేక జలదంబు విధంబున సత్వధంబునన్
భూమిధరంబు వేడ్కఁ గొనిపోయెను నాథ యదత్రియూను శ్రీ 1048
రాముఁడు లక్ష్మణుండు పునస్థగులై పరిప్లుతాంగులై
దీమస మేని పంకపటఘుటఁ గాఁ గలఁ గాంచి భీకులై. 1049

క. భాస్వద్గోత్రుండు భవతుఁడు, భాస్వద్గోత్రుఁడు భవతుఁడు బంధుపహితుడై
దుస్స్వప్నదోషపటావ్ర్యాప్త ప్రతిఁ దలఁచి ప్రముత్కమసరమువన్. 1050

క. కర మద్భుతాకరముగా, గిరిఁగొని సంతసము మిగుల గిఱికొనఁగా నం
బరవీథిం బఱతెంచె శ్రేష్ఠు, గురుబలునిం గాంచి దుఃఖమున మనుబుద్ధిన్. 1051

ఉ. అక్కట రామలక్ష్మణుల కాపదవొందెనొ భూమిజాత కే
చిక్కు ఘటిల్లెనో మిగులఁ జెట్టకలంగనుఁగొంటి వానరుం
డొక్కఁడు గట్టుఁ బట్టి పుడమిలోఁ దక వే కొనిపోవఁజొచ్చెను
న్నిక్కము ఘోరరూపరజనీచరభూతము గాఁగ నోపెనుక్. 1052

క. పసవాలుగుబ్బఁబులుఁ, దుదిమిట్టగ వచ్చె నిపుడు దుర్నయనం బి
ట్లాదవునె రాముని కేయూపస వచ్చెనో యనుచు వగచి పదపడి కినుకన్. 1053

శా. శైకాఘ్రుండు భూమిభృద్వరధరున్ శ్యాకరుచ్ఛాయం గాంచి ఘో
రాకారం బిది కాల్తునంచు ద్విడభేద్య్రగ్రాగసారావ ము
స్తోకత్రిప్రత చేయఁ జూచుడుఁ బరిత్యక్తంబు లయ్యెన్ దిశ
దూకంబు ల్గలఁగెం బయోనిధులు గట్టుల్ మ్రొగ్గ నుల్కల్ వడెన్. 1054

వ. ఆయవసరంబున. 1055

ఉ. అంబరవాణి యోదశశతాంగతనూభవ చూడు వీఁడు నీ
కుం బెలివాఁడు గాఁడు కపికుంజరుఁ డారఘురాము దూత వీ
నిం బరిమార్పఁ జూచుటవునే విడురోషమటంచుఁ దెల్పన
య్యంబరరత్నవంశ్యుఁడు భయాద్భుతసంభ్రమసమ్మదాత్ముఁడై. 1056

క. రోషముతో హ్రావయుపరి,తాపముతో నహితహ్రదయ హారణరణక్ర
చ్చాపముతోఁ దోనయాలఘు,కోపము విడనాడి యారఘుప్రభుఁ డంతన్. 1057

ఉ. పాయక రామమూర్తికి శుభప్రతిపాదకదేవతార్చల్
చేయుచునుండె నట్లు కపిసింహుఁడు వే చని కాంచెఁ దుఃఖభం
గాయతదోఃప్రగాఢపరిఘాత్యుపగూహనలబ్ధశావ్హావి
ప్రాయికలోహితాంబుజపరాగలసద్ఘుసృణప్రవాళమున్. 1058

క. వనచరకులానుకూలము, వననిధికూలమ్ముఁ గాంచి వనచరుఁడు భవాం
బునిధి దరించుపగిది నం, బునిధి న్వేస సంక్రమించి పోచెను వెసలన్. 1059

క. హనుమంతుఁ గూల్చి క్రోణము, శఃధిని వైపెంచి రా నవార్యదుష్ఫణన్
దనుజవిభుఁడు దశకంఠుఁడు, పనిచె న్మతిమంతు మాల్యవంతు న్మంతున్. 1060

వ. పనుచుటయు నయ్యామినీచరవరుండు. 1061

క. పొసఁగినపస నలువదికో, ట్లసమబలాఢ్యు లసురులు సహాయులుగా స
త్తసమృద్ధి నేగి యాఁగ, న్వేస ద్రోణముఁ గొంచుఁ బోవువీరశ్రేష్ఠున్. 1062

క. ఇట్లాఁగి ద్రోణ మెట్టెఁ, బోట్లాడక విడిచి బ్రదికిపొమ్మను వెసలన్
తెల్లావనఁ బితాళన,కో ట్లాతనిఁ జుట్టుముట్టి కో యని తాఁకన్. 1063

చ. పవనకుమారుఁడు మూర్ధధృతపర్వతుఁ డందఱ కన్నిరూపులై
జవ మెసఁగం బదాహతుల జర్జరితాంగులఁ జేసి కొందఱం
బ్రవిమలదంతకుంతనఖరక్షురికాతతిఁ జేసి కొందఱన్
రవినిభుఁ డుగ్రదృష్టిశిఖకరంబులఁ గొందఱ బిట్టు చంపుచున్. 1064

క. రంహఃప్రక్రియ నసుహృత్సంహతి సంహారణలసదశనిక్రైవడి వీ
తాంహుఁడు వాలముఁ ద్రిప్పుచు, సింహధ్వని చేసె దిశలు చెవుడుపడంగన్. 1065

వ. భైరవారావుం డై యసురజీవితకాలక్షేపంబుగా వాలక్షేపంబు గావించి. 1066

క. గాలి వసుడాసుపసువుం, దూలించినభంగి నగ్గి దూదితునుకలం
గాలిచినపోల్కి సోఁకుల, గాలిసుతుఁడు ద్రేసె వేడ్కఁ గ్రాలెను మదితోన్. 1067

గీ. ఇట్లు లోకనిసై నిట్టట్టు పోనీక, చంపి జలధిలోనఁ జల్లు టరయ
వనచరుండు గాన వనచరంబులకెల్ల, నెరలు వెట్టె ననఁగ నెసఁగె నంత. 1068

మ. అరివిద్రావితుఁడు మాల్యవంతుఁడు మహాహంకారఘోరాకృతి
స్ఫురితుం డై గగనాధ్వ నప్పవనసంభూతుం దలంకింప స
త్వరుఁ డై యుద్ధము వోయి పోరు మనుచు న్వాతూలబాలుం డను
ద్ధురసత్వాతిశయంబు మీఱఁ గవిసెన్ దోర్దర్ప మేపారఁగన్. 1069

చ. మొదలఁ బదద్వయిన్ దనుజమూర్ధము దన్నిన మాల్యవంతుఁడుం
గదలక మాల్యవంత మనఁగా నచలస్థితి నిల్చియుంట గాం
చఁదగ మహీధ్రభృత్పవనసంభవు నొక్కట నెత్తిఁ బెట్టె దు
ర్మదుఁ డగుపంక్తికంధరు సమక్షముఁ జేర్పఁ దలంచెనో యనన్. 1070

క. తదనంతరమున భయద, ప్రదరద్రుఘణాసి ముసలపరశుగదా దు
ర్మదశక్తిప్రముఖంబులఁ, బొదివెఁ బయోధరము ధరముఁ బొదివినమాడ్కిన్. 1071

చ. పొదివిన నింతకేని వెఱఁ బొందని డెందముతోడ నాగముం
గదిసిన పింగదృష్టి యనఁగాఁ బవనప్రియనందనుండు త
ద్వదనబిలంబునన్ రుధిరధారలు గ్రమ్మఁగ బిట్టురంబు వె
ట్టిదముగఁ దన్ని దౌడలు కడిందిబలంబున నూడఁదీసెనున్. 1072

వ. తొల్లి గరుడవాహనుండును జక్రధరుండును నగు విష్ణువుతోడం గడంగి పెనంగి రో
హాటింపని యమ్మాల్యవంతుండు వివిధమాయాజాలంబులు ప్రయోగించి విఫలం
బగుటకుఁ జింతించుచు నుగ్రశక్తి విసరి యదియునుం బొల్లువోయిన నిశ్చేష్టుఁగొంచి
యుండెఁ బవనసందనుండు నద్దురాత్ము నిజవాలపాశంబున గట్టి గిరగిరం ద్రిప్పివైచిన

క. త్రచ్చునెదిరించు దనుజులఁ, దెచ్చును సంజీవనీ లతికలిప్పుడు నీ
కిచ్చునోర్మిదము మరల, న్వచ్చు న్మహీనాథలక్ష్మణప్రాణంబుల్. 1085

క. మనమార న్మనమారుతి, వినుమానికమునను ముంచి విసమావచ్చు
న్మనుమానవపతి లక్ష్మణుఁ, డనుమానము మాను మాత్మ ననుమాత్రంబున్. 1086

క. అంబరమణి సంశ్రితులరు, నంబరమణి కొలఁతుగాని యాతనిఁబడనే
యం బరికింతుమె డింపుచ,లం బెమురుఁగ బహుపు కపిబలము మారుతిఁ జన్. 1087

ఉ. సందియమేల యొక్కనిమిషంబునకుం జనుదెంచు నప్పుడు
న్నందనుఁ డౌషధంబులు ఘనంబుగఁ జేకొని వాపుఁను న్మహా
నందము నొంది రామనరనాథుఁడు కీశుల భల్లుకేశులం
గ్రందుగ వానరేంద్రుఁనెడు గన్నియమించె ననేకకోటులన్. 1088

వ. అయ్యంతరక్షణంబున. 1089

సీ. ద్రోణధాత్రీధరద్రుమసంచలనపక్షిసంచయములాచార లాజములు గాఁగ
విపులకర్కశఘోరరిపుభయంకరదీర్ఘ తరవాలయష్టి కైదండ గాఁగ
సదమలమణివిభాచ్ఛాదిసంజీవనీ శ్రేణీధరము వెలిగొడుగు గాఁగ
దగ నెమరొక్కనవచ్చి తనచుట్టు నడిచెడి తరుచరపతులు కింకరులు గాఁగ
నిజరయప్రజనితమహోగ్రద్రభూరి, పవనసంచారములు బరాబరులు గాఁగ
ప్రకటసంజీవనీధరరాశిఁ గొనుచు, క్షిప్రగతి మీఱ వచ్చెఁ గపిప్రభుండు. 1090

వ. వచ్చి యమ్మహామహీధరంబును యథోచితస్థానస్థితంబుగా డించి. 1091

క. తివిరి కపులభినుతింపఁగఁ, బవనసుతుఁడు మోడ్పుఁగేలు ఫాలతలమునం
దవిలిచి సరభసగతి రాఘవునింగని యిట్టు లనియెఁ గడు ముద మొదవన్. 1092

ఉ. విఘ్నము లెన్నియేని ప్రభవించినఁ ద్వద్దయవాని మామకో
పఘ్నముఁ జేసినీక యొకభంగిగ మందులు దెచ్చినాఁడ శ
త్రుఘ్నవనాకసావలికిఁ దుష్టి కడున్ జనియించ నింక శ
త్రుఘ్నుని తోడఁబుట్టువునఁ దూర్ణము తెల్పెద మేలగా నిలన్. 1093

మ. అనినం బెన్నిధిగన్నపేదక్రియ నయ్యర్కాన్వయాధ్యక్షుఁ డా
హనుమంతున్ బిగియారఁ గౌఁగిటికి డీయం బొంగి మిన్నందె నా
ఘనుఁడా వేళ సుషేణుఁ డోషధులఁ జక్కం డాచి తానిచ్చెఁ దె
చ్చిన సౌమిత్రి ససంజ్ఞుఁడై తెలిసె నక్షీణప్రభాపూర్ణతన్. 1094

క. పృథునిద్రితుఁడు మేల్కను,విధమునఁ దెలివిగని రామవిభులసదంఘ్రి
గ్రథితశిరస్కుఁ డగుడుఘ్నా,మ్యధినాథుఁడు కౌతుకమున నాలింగనమున్. 1095

వ. కావించె నయ్యవనీపతిం గనుంగొని వనచరులు నపరిమితపరితోషులైరంత హనుమంతుంగని యనుగ్రహాతిశయంబున లక్ష్మణాగ్రజుం డిట్లనియె. 1096

గీ. తొల్లి ఖగనాథుఁ డమరులఁ ద్రుళ్ళడంచి, తల్లి వినతను గుణవతీమతల్లి సంత
తమ్ము ముదమొంద నయ్యమృతమ్ముఁ దెచ్చె, కరణిఁ దెచ్చితి సంజీవకరణి వత్స.

చ. వనచరవర్య నీవబలవంతుఁడవు న్మగవాఁడ వెల్లచోఁ
గనఁగొనిరమ్ము సీత ననఁ గాలిచివచ్చితి పంక్తికంఠుపు
త్తన మిపు డౌషధంబులు ముదంబునఁ దెమ్మనఁ గొండఁ దెచ్చి తె
ట్లు నతి యొనర్ప నేరుతు పటుప్రవరా నిను నీగుణంబులన్. 1097

కం. మారుతి యేగతి నీఁగుదు, నీఋణ మస్మత్కులంబు నిలిపితివి సమి
ద్ఘోరస్థలి మూర్ఛకడిఁ, యీరాజకుమారు నెత్తి యెంతయుఁ గరుణన్. 1098

వ. రెండవలోకేశుండవై లక్ష్మణప్రాణంబులు సృజియించితివన్న యని కొనియాడుచుండె, నప్పు డమరు లమృతరసాస్వాదంబునం బరితృప్తి నొందిన ద్రోణసానుమత్సానుప్రదేశంబుల ఫలరసమధురమధురసానుభవంబునం బ్లవంగపుంగవులునుం బ్రమోదమగ్నమానసులైరి. 1099

కం. చిత్రసుపుత్రసుమిత్రాపుత్రాదులు నిజరయంబుఁ బొడఁగని పొగడన్
ధాత్రీపతియానతి నా, ధాత్రీధర ముంచివచ్చెఁ దగ నెప్పటిచోన్. 1100

వ. జంఘాలుండగు నమ్మరున్నందనుండు స్థూలజంఘులగు స్థూలజంఘాదు లనేకులు పాదివినం జిక్కవడక యొక్కమొగిఁ జిక్కవటిచి యుక్కడంచి యమ్మహౌషధీమహీధరంబు నాస్థానస్థాపితంబు గావించి వచ్చినంతట. 1101

కం. తన కంతేవాసి మిగులఁ, దనయంతేవాసి ద్రోణధాత్రీధరముం
గొనితెచ్చి వైచివచ్చుటు, విని కనుఁగొన వచ్చెనన రవి యుదయమయ్యెన్. 1102

గీ. ఇట్లు భానూదయంబైన నెల్లకపులు, నుల్లసంబున రాఘవయుక్తు లగుచుఁ
గయ్యమునకు నాయత్తులై కాలు ద్రవ్వ, చుఁటు చారులచేతను వింటఁజేసి 1103

వ. విషాదవేదనాయత్తుండును బశ్చాత్తప్తుండు ననగు దశకంఠుండు. 1104

కం. విక్రాంతత్వము డిగి వైరిక్రమము దోఁచి విగతరాక్షసుఁడై ని
ర్వ్యాజ న్విచకితశత్రున్, శక్రుం గని యిట్టు లనియె శోకితుఁ డగుచున్. 1105

చ. గురువర రామతోడఁ బగఁగొంటి సహోదరుఁ గుంభకర్ణు సు
స్థిరబలశౌర్యభూర్ణు బలజిజ్జితు నాత్మసుతుం బ్రహస్తు భీ
కరతరహస్తు సైనికనికాయపతిం గడతేర్చికొంటి నీ
తెరఁ దుదకైవడిం గడపితి న్వన తోఁటకోభూతి చెల్లునే. 1106

క. అతికాయమహాకాయా,ద్యతిలోకపరాక్రములు లయుంబందిరి నా
గతి నీక యుండ నేనే, గతి నహితులఁ గూల్చి హితులఁ గతి నంపింతున్. 1107

క. శుంభనిశుంభసదృక్షులు, కుంభనికుంభు లనిలోనఁ గూలి రహితదో
స్తంభనిగృహీతు లగుచున్, దంభముగా దెట్లు వారిఁ దఱుమఁగ నన్నున్. 1108

క. హితసుతసోదరబంధుస, హితు ల్హితులచేత దితిజు లీల్గిరి పోరో
హిత యిష్టు నీకుఁ బ్రసమీ,హిత మిది యని తెలుపు మార్య భృగుకులవర్యా. 1109

క. పత్తనముం గాలిచి రప్పిత్తయుచే ఘోరగతిఁ గపిప్రకరము లా
పత్తున మిత్తిం జిక్కఁగ, నిత్తఱిఁ జే పట్టకున్న నెవ్విధిఁ బోదున్. 1110

వ. అని నరవానరగ్రహణంబును నిజపరాజయంబునుం జెప్పి. 1111

క. ప్రస్విధవము విప్రక్రతు,భుగ్వనితాకృతము సుంతపోలుపఱుపఁడన్
దిగ్విజయము త్వదనుగ్రహ,దృగ్విశదత గాదె మున్న తేజము నొందెన్. 1112

ఉ. కావున భూమిసుత్పరని కాయసమాశ్రితు లన్న రాధము
ల్లావు దొఱంగి సిగ్గఱి చలంబు మహీసుతతోన డించి నా
పోవుచుఁ బోవుట్లు భృగుపుంగవ యెట్టు లనుగ్రహించెదో
నావుడుఁ బంక్తికంఠువదనంబులు గన్గొని కావ్యుఁ డింతయున్. 1113

క. బోధించి బుద్ధి చెప్పినఁ, గ్రోధించినయట్టి సురవిరోధిం బ్రదనో
వ్యాధినిరోధిం బంక్తిశిరోధింగని నవ్వుచున్ గురుం డిట్లనియెన్. 1114

క. దిక్ప్రభులు దలంకఁగ హుత,భుక్ప్రియమగు హోమకర్మము నొకఁడు మాంసా
సృక్ప్రకటిత మొనరిచి యస,కృత్ప్రబలుండ వౌదు వింక దివిజులకైనన్. 1115

ఉ. తూర్ణముగాఁగ వేలిమి యదూషితమై విధివంతమై కృశం
పూర్ణము నొంద నం దసురపుంగవ వర్మశరాయుధాపని
స్తీర్ణరథంబు పుట్టు నది చేకొని వైరుల వాడి నెట్టినం
జీర్ణపలాశము ల్పవనుచేతఁ బలెంగడ నోహటింపరే. 1116

క. నరు లెంతటివా రీవా,నరు లెంతటివారు లీల నమచని వైశ్వా
నరుఁ బూజింపు గుహాలఁ గి,న్నరులు పొగలు మిగులఁ బొగుల నరతరసాసీ. 1117

క. నిఘ్నకృతిగాక వేల్మిక, విఘ్నం బగునేని రిపుల వేఁచెదు నను మ
న్విఘ్నము గల్గిన శమనో,పఘ్నముఁ దరఁ బోదు విది నిబద్ధి తెలియుమా. 1118

వ. అని తన్మంత్రంబును దదాహుతిప్రమాణంబును దత్పశుప్రకారంబును దన్నిధానంబు
ను దద్విధానంబును యథోచితంబుగా నెఱింగించి సమధిగతకాలచక్రుం డగు
శుక్రుం డర్ఘాసనంబు నొందుటయు 11

క. పడిఁ జేరి యాహవంబున, గడిఁ జేటిన వారి నూరి కావలివారిం
గడతేటిచి ప్లవగులు బడి, బడిఁ దేరుల నద్రిసన్నిభముల నిభములన్. 1129
గీ. విఱిచి ప్రోవులు వెట్టుచు విసరికొనుచుఁ, గోప మొదవంగ ఘోట్టాణకోట్లఁ జదిపి
యంగడులు రచ్చకొట్టము లవనిఁ గలిపి, లంక సకలంక నిట్లు కలంచి యాడి. 1130
క. వెండియు వెండియుఁ బైఁబడి యుండఁగ నుండకను నిశిథినీచరవిలస
ద్భాండాగారము లసహ్య, త్కాండాగారములు నీఱుగావించి వడిన్ 1131
వ. గృహారామసీమాయనోహరప్రదేశంబులు, గలఁచి యయ్యుస్థలంబులఁ ద్రిమ్మరి
యొంటను దారుణ రావణహోమస్థానంబు గనుంగొన నేరక తొట్రుపడుచున్నంత.
క. రావణుఁ డీయెడ వేలిమి, గావించెడు ననుచు పరమ కడుగొనముల వెం
దీవి విభీషణు పట్టుపు, దేవి యుపాంశుగతిఁ దమకుఁ దెల్పె ననుటయున్. 1132
క. బిలముఖమునఁ గీశులు బిల, బిలఁ జని యొకచోటు నైలబిలగహ్వరమున్
జ్వలనసమర్పణధృతచరు, కలితకరు న్వంశతికరు ఘుటికపరికరున్. 1133
క. కని జెట్టి జీమలు చుట్టిన భంగిం బ్లవగు లురవడిం గవిసి చలం
బున నెన్నియేని బాధలు, పొనరిచినఁ జలింప కసురపుంగవుఁడు ధృతిన్. 1134
శా. నిర్విఘ్నంబుగ హోమకార్య మనుసంధింప న్మహాక్రోధు ల
య్యుర్వీశాత్మజనాథయోధులు ఘనస్థోమాకృతస్థాలికా
దర్వీస్రగ్ఘృతస్రుక్స్రువసమిద్గర్భపాత్రాదికా
పూర్వప్రాకటహోమవస్తుతతిఁ బోకార్చి వెల్లార్చినన్. 1135
క. వదలని మౌనంబున దశవదనుఁడు నిష్ఠ మెయి హవ్యవాహుఁ గృశానుం
బదిలుఁడయి పూజసేయుచుఁ, గదలక యుంట గని రోషకలితాత్మకులై. 1136
క. కనకాద్రి నినుపపమ్మెటు, లనఁ గొట్టినమాడ్కిఁ గడుఁ జలంబునఁ గపుల
ద్దనుజాధము దృఢదేహము, ఘనముష్టిప్రహతి నొంచి కదలక యున్నన్. 1137
వ. హోమవిఘ్నమునకై యడిచియుం బొడిచియుం గఱచియు నద్దనుజాధము నందించు
కయు సంచలనంబు గానక కాననచరులు నివ్వెఱఁగంది కుంది రయ్యెడ
క. శుద్ధాంతఃకరణఁ దగుమ, శుద్ధాంతము సొచ్చి వాలిసూనుఁడు నయుసం
బృద్ధాసుర వృద్ధచయుఁ, శుద్ధాంతముఁ బంక్తికంఠు శుద్ధాంతంబున్. 1138
తే. చేరి తత్సుందరీపరిచారికాస, హస్రమస్రప్రపూర్ణ నేత్రాంత మగుచు
నోడుఁగ మందోదరిక బఱి నొడిసిపట్టె, భయదయమపాశసదృశోగ్రవాలుఁడగుచు
వ. మందారకుసుమదామసంబంధం బగు మందోదరీచికురబంధంబు వాలుకరంబునం
బట్టి రక్షోరాజ్యలక్ష్మిం దిగిచినచందంబున మణిమయసింహాసనంబు డిగం బడఁ

ద్రోచి బొమ్మవిందుసంకోచంబు కంఠహారముక్తాఫలములుక్తంబై నేలరాల భద్ర
దంతావళంబు మృణాళనాళంబునుంబోలె నీడ్చికొని పోయి దశకంఠు సముఖం
బునం బెట్టి నిర్దయుండై. 1142

క. అజ్జదెలిసి దశముఖ నీ, పజ్జకుఁ గులకాంతఁ దెచ్చి పఱచుచునుండన్
లజ్జించి వెనఁగఁజూడక, యొజ్జల బుద్ధి విని దనునె హోమము సేయన్. 1139

శా. ఫుల్లాంభోజముఖీవివీన సుమచాపున్ ఘోరచాపుం గృపా
కల్లోలివ్యధిబాధు రాఘవు నరుంగా వాత్మనూహించి సం
పల్లాభంబులు పొందెదెల్లు కపటోపాయంబుఁ జింతించి ము
న్మల్లోకంబులమాత సీతఁ గడునుగ్రోహంబునం దెత్తురే. 1140

వ. అని కఠినోక్తులాడుచు వదనిం బడఁద్రోసిన సమ్మతతనయ. 1141

క. వలఁ గట్టువడిన పులుఁ గన, నిలుగు మిగుల దైవమునిషేధించుచుఁ దా
వలిగట్టుఁ గదలక రిపు, నలుగకయున్న ధవుఁగాంచి యడలుచునినియెన్. 1142

క. పతి డాగురించి సీతా, పతి దెచ్చితి చోరవృత్తిఁ జచ్చింప భవ
త్సతి మందోదరి దీనతఁ, బతిసన్నిధిన కపిచేత భంగముగుడిచెన్. 1143

ఉ. వాలికుమారుఁ డాలి బలవంతకుగాఁ దలకట్టి యీడ్వ దే
వాలిఁ దలంకఁ జేయుద్రవిణాధ్యుఁ డితం డని పెంపునొందఁగాఁ
జాలివనాఁడవయ్యె మునిచాతున నూరక చూడఁగాదు నీ
వేలిమి బూదిగాను బడవేయుము మత్పరితాపకారకున్. 1144

క. అని పదరి యింద్రజిత్తుఁ, దనమదిలోఁ దలఁచి పుత్రుఁడా నీవున్న
న్నను దేటి చూడఁగా వచ్చునె మర్కటఘటునికనుచు శోకించునెడన్. 1145

వ. పరిత్యక్తనిజహోమకర్మకలాపుండై 1146

ఉ. ఆయతరోషలోహితదశాననుఁ డైన దశాననుండు గా
త్రేయక ముగ్రభంగిగమకించుచుఁ గేల నమర్చి యుద్ధగన్
ద్రేయుడు నంగదుండు పిరిపిడిన తాలిమి వీడె. నాసురి
స్నాయు దసర్ఘసత్రస్రగనుబంధముఁ దత్సతికేశబంధమున్. 1147

క. భీమము విచకితఖేచర, భూమము సంపిహిత ఘన నభోవలయ మహా
ధూమము నిజసంకల్పిత, హోమము విఘ్నంబగుడు మహోగ్రుం డగుచున్. 1148

క. హుమ్మని డాపిదశముఖుఁడు, సమ్మూర్ఛితునంగదు న్నిశారింపఁ బ్రము
త్తమ్మొనరింపనెత్తిఁగి త్వరిత, తమ్మునెనెనసాచి మారుతసుతుఁ డనల్పున్. 1149

ఉ. ఈకరణిం గడంగిన కపీంద్రుఁ జిరంబుగఁ జూచి దానవుం
డాఁకలి గొన్న మృత్యువుక్రియం బదికుత్తుక లెత్తి వానితో
నాకుల మెల్ల నీఱుగ నొనర్చితి వక్షయపుత్త్రుఁ జంపి నీ
వేకతి నుండ వెల్లకపివీరులలోన మదం బడంచెదన్. 1150

వ. అని మిట్టిపడి యవ్వాలిపట్టిం దొట్టి చెట్టుమునికిపట్టు దిట్ట తిట్టులం గట్టిసెలకట్టి యలం గొట్టి నజ్జెట్టులున్ దట్టుగఁ జలపట్టి చుట్టుముట్టి మెట్టుల మెట్టియు నెట్టన మొట్టియు బెట్టుఁ దిట్టియు నిప్పట్టున నెట్టపుట్టం గుట్టు మట్టు వెట్టె 1151

క. పగతు న్నిస్త్రాధైర్యాపగతుం గావించి ప్లవగభల్లుకముఖ్యుల్
విగళితమూర్ఛాకళకులు, దగు వాలిసుతుండు తమకు నగ్రేసరుఁడై. 1152

గీ. కడఁగ నడుమ నున్న కావలివారల, దఱిమి తాయువగులఁ దన్ని చొచ్చి
నట్టి బిలముఖమున నందఱు వడివడి, స్వామి రామధరణివిభునిఁ గాంచి. 1153

వ. తాము పోయివచ్చిన కార్యం బెఱిగించి తదీయసంభావనాతిశయంబునం బ్రమోదం బునొందిరి. అధికత్రపావనతవదనయై నిజాంతఃపురంబు సొచ్చి

క. దరిగడచిన సిబ్బితి సుం, దరి గంధగజేంద్రయానతగుచానఁ గృశో
దరి కమలనేత్ర మందో, దరి కన్గొని శోకగద్గదస్వరయగుచున్. 1154

ఉ. మన్ననఁ గల్పితాప్తులఁ గుమారులఁ బ్రేయసిభంగిపాటు నీ
కన్నులనిండఁ జూచి గతగర్వత నొందితి మున్న శత్రుద
ర్పోన్నతిఁ గాంచితిక్షయము నొందితి వేటిచలంబు శౌర్యసం
పన్నరశేంద్రు రాముఁ గని భక్తి మహీసుత నిచ్చి మ్రొక్కకన్. 1155

క. నినుఁ బ్రాణయుక్తుఁగా వాఁ, రని కృపరక్షణ మొనర్చి రక్షోరాజ్యం
బున నీతమ్ము విభీషణుల, దనరఁ బ్రతిష్ఠించి చనఁ గృతక్రియుఁ డగుచున్. 1156

ఆ. వె. సీతఁ దెచ్చి తప్పు చేసితిఁ గరుణింపు, మనుచు రామభద్రు నంఘ్రియుగముఁ
బట్టుమింకఁ జలము పట్టఁగ నేటికి, వినుము నాదుపలుకు దనుజనాథ. 1157

క. మానవు గద చలము రిపు, న్మానవుఁగఁ దలంచుట యనుమానవుఁ బాటు
న్మానమున కనువుగదు నను, మానము నూన మగు ననుపమానవిచారా. 1158

వ. అనిన నిజవల్లభకు దనుజవల్లభుఁ డు. 1159

క. కాయంబులు బహుళసుఖని, కాయంబులు వివిధధననికాయంబు లభి
ప్రాయంబులు ప్రాయంబులు, ప్రాయంబులు సతి తృణాంకురప్రాయంబుల్. 1160

వ. కావున. 1161

క. ఆశల జయించుటుడిగి దు,రాశలన జయించి జనకజాత్మాధీశున్
బాణార్వాప్రతినిధి నద్దాశరథిం దొడరి పోరఁ దగు నాకెట్లున్. 1162

క. తరణీతచ్ఛరధారా,పరిధారాప్రకటితాత్మ పంకుఁడనై సు
స్థిరపుణ్యలోకసంప్రా,ప్తి రహింపం దలంపుచేసితి న్మదిలోనన్. 1163

వ. అని కృతనిశ్చయుండై. 1164

క. మఱితచెయివట్టి మెల్లన, మది తల్లడము డుగునట్టి మాటలు పొసఁగిం
చిదశాస్యుఁ డెట్టకేలకుఁ, దదనజ్ఞాతుఁడయి కదల తాత్పర్యమునన్. 1165

సీ. బ్రహ్మాండభాండంబు పగిలి బీఁటలువాఱ ద్రుతగతి విజయదుందుభులు మొరయఁ
గల్పాంతబహుళప్రకారఘోరాకార యములువాఖడ్గరోమాదు లరుగ
జలములపై నోడ చలన మందెడుగతిఁ జతురంగబలగతి జగతిగదలఁ
బటుహరిద్ధరికర్ణపుటభేదన సమర్థ కలితశంఖారవంబులు సెలంగ
శంబశతకోటి సదృశంబు శాతఘోర,చంద్రహాసంబుచే నిజాంసంబు దనర
రథమధిష్ఠించె లోక విద్రావణుండు, రావణుండు మదాహతైరావణుండు. 1166

సీ. సలలితకళ్యాణశరపరిపూర్ణమై షాణ్మాతురోద్భవస్థానమనఁగ
ఘనరాహుముఖకేతు కలితాంబరం బయి మహనీయతారకామార్గ మనఁగ
నధికసారాత్తబాణాసనకలితమై కఠినకాంతారభాగం బనంగ
వరసువర్ణసహస్రహరిపరిస్ఫురితమై నవచండభానుమండల మనంగ
నగణితమణిప్రభాధగద్ధగిత మగుచు, సదమలోత్తుంగరోహణాచలమనఁగ
నొప్పునగదంబు రక్తగంధోత్తరీయ,మాల్యదైగంధ మెసఁగ సమ్మోదిక్కెనెక్కె. 1167

చ. అనుపమశక్తి షోడశరథాంగపరిస్ఫుట నేమి ఘట్టన
ధ్వనియును ఘంటికాపృథురవంబును నొక్కట విస్తరిల్లఁ బె
ల్చన నరదంబుఁ జిత్రగతులం దనసారథి కాలకేతుఁ డో
య్యనఁ గడపం దదశ్వహృదయంబున కెంతయు నాత్మ మెచ్చుచున్. 1168

క. శకునాపసవ్యగతిదు,శ్శకునంబని యాత్మ వద్ధశశిరుఁడొకయిం
చుకయేని సంశయము నొందక వడిలో వెడలి యోధతతిపురికొనఁగన్. 1169

వ. అనర్గళవీరస్వర్గాపవర్గమార్గ నర్గనర్గులరై పెనఁగుఁడని చేయివీచి. 1170

క. రామునిఁ జంపెదఁ జచ్చెద, రామునిచే నింతెకాని రణరంగమునన్
దీమసమేది చలం బతి,యే మఱిడి పురంబుఁ జొత్తునే యెబ్భంగిన్. 1171

వ. అని బరవసంబుగావించె. 1172

క. నిర్ఘాతపాతవిప్రలఘు నిర్ఘోషము నిక్కటిల్ల నాయుశరంబుల్
దుర్ఘటవేగం బొప్పఁగ, దీర్ఘభుజాబలుఁడు రామదేవుఁడు వైచెన్. 1252

సీ. పార్థివుం డేచి సర్పముఖాంబకం బేయ గరుడాస్త్రనిహతి రాక్షసుఁ డడంచు
నాగ్నేయసాయక మసురేంద్రుఁ డేసిన వరుణాస్త్రనిహతి భూవరుఁ డడంచు
సర్వాసహాభర్త పర్వతాస్త్ర మేయ వజ్రబాణహతి రావణుఁ డడంచుఁ
దివిరి దశాస్యుండు తిమిరాస్త్ర మేసిన భాస్కరాస్త్రహతి భూపతి యడంచు
సింధురశరంబు మానవసింహుఁ డేయ, సింహశరమున దానవసింహుఁ డడఁచు
నివ్విధంబున వడి నితరేతరాస్త్రఖండన మొనర్చుచుండిరి భండనమున. 1253

క. కంధరపృషత్కమున దశకంధరుఁడు నిగుడ్ప నృపతికంఠీరవుఁడున్
గంధవహాశుగమున పరగం దునిమెం గూల్ప నలిగి గంధాంధుం డై. 1255

క. శూలధరుఁ డోయితం డన, శూలము రాఘవుని యురముఁ జూచి విసరుడున్
భూలోక మెల్ల వహ్నిజ్వాలాజాలములఁ గప్పి వచ్చెదు నెడలన్. 1256

గీ. పిచ్చలించుచు ఖచరులు విచ్చి చనిరి, యచ్చెరువు నొంది కపులు హాహారవంబు
లిచ్చి రసురలు రక్షణ మెచ్చుకొనిరి, వచ్చెఁబో దీన శ్రీరామచంద్రుఁ డనుచు.

తోటకవృత్తము. మాతలి మెచ్చ సమానమతిన్, రీతి నరేంద్రవరేణ్యుఁడు కీశ
ప్రీతికరంబుగఁ బిడి యొనర్చె, న్నాతిదివస్పతి సంచితశక్తిన్. 1258

క. ఈలీల నద్రిచరవరు, లాలోకింపఁగ భీకరాలోకుం డై
శూలము సురలోకహృదయ, శూలము బ్రజలోకపటుకనూలముఁ గూల్చెన్. 1259

మత్తకోకిల. శక్తిచే నిజశూలశక్తి కృశత్వ మొందిన నా మహో
ద్వృత్తుఁ డద్దశకంధరుండు మహోగ్రసాయకముం జయా
సక్తి నద్దతిఁ బూన్చి తన్నృపచంద్రు తేరిసిడంబు సం
సక్తవానరసంచయంబు విషాద మందఁగఁ గూల్చినన్. 2601

క. సాధ్వసముగ నిజదివ్య రథధ్వజము దశాననప్రదరభీకరధూ
మధ్వజమునఁ బడినఁ బ్లవగ, ధ్వజనీనాథుఁ డడలి కనుఁగొన నలుకన్. 1261

క. రఘునాథుఁడు విశ్వామిత్రుఁ డొసఁగినట్టిసాయకములలో
పామద్రాపతిదత్త శరమోఘశరంబు లేయ నసురేశ్వరుఁన్. 1261

గీ. సకలఖేచరులు తన సన్నయము నిండఁగ రవము కలపశము నుఁగడ ఫునిండె
భూనభోంతరమంతయు స్ఫురణ నిండఁ, జేసె రక్షణుఁ డాడంబరొద్భృష్ఠుఁడై. 1262

శా. మారీచాధము దుస్సహోద్యమున భస్మన్మూర్తివై యున్న య
న్నారీరత్నము దొంగిలించితివి కానం గాన నస్మద్ధనుః
స్ఫారామోఘశిలీముఖప్రహతులం ఖండంబు లౌచుండు నో
రోరీ రావణ మర్కటాంధ యిఁక మాయోపాయముల్ సెల్లునే. 1272

క. నారీమణి సీత మఱి,న్నారీమణిపూత నిచ్చినం దనుజులు మ
న్నారిప్రబదికె దేఱు,న్నారీవేళ నటుగాక నను మాఱొడ్డఁగన్. 1273

వ. అని కఱకుగ్రొరకలనఱుసులం బోని యుఱుకుఁబలుకు లమ్మొఱకు నెఱకులు గాఁడ
నాడి యంతనిలువక. 1874

మ. ఉదితధ్వానదనుర్ధరుండు ప్రథనోద్యోగుండు కామత్థుఁ డై
ర్వ్యాదిభీమప్రవగంబు లేమఱుట యు నిష్ఫ్యోకుం దశగ్రీవుఁ డి
ర్వ్యాదిభీమాస్త్రములేసి యొక్కొ మొగిఁ బైపై నుగ్రప్రాస ము
ద్గదశక్తి ద్రుఘణాయుధుంబఱప కుంభద్వేష్యసంరంభుఁడై 1215

గీ. శిఖిశిఖాముఖ మగ్రవిశిఖ మసురశిఖామణి యురంబు గాఁడ నాఁగ రాముఁడేయ
విగతధర్ముఁ డశాంతుఁడు నగుచుఁ జావు,వోనిసూక్ష్మ మునింగె దశాననుండు. 1276

ఉ. చచ్చె దశాననుం డని విషాదము నొందిరి రాక్షసాధముల్
ముచ్చటలాడుచున్ ఖచరముఖ్యులు సమ్మదము దిరెల్లభూ
భృచ్ఛరులిచ్చ మెచ్చుచు నభిస్తుతి చేసిరి రామువిక్రమం
బచ్చెరువావె సద్భట రథాంగశతాంగముఁ గాలకేతుఁడున్. 1277

క. కొంతవడికి దశముఖుఁ డొక్కింత తెలిసి యొల్లసిల్లి లీక్షించి సమి
ద్భ్రాంతి నరదంబు ద్రిప్పితి, సుంత కడిమిలేక యనుచు సూతుఁ గినియుచున్. 1278

వ. తదీయప్రతివచనరచనానుకూలుండై. 1279

క. ముఖము లెగయించి కంఠహో,న్ముఖుఁడై దశముఖుఁడు దేవముఖభయదశిలీ
ముఖుఁడై నిజసారథి కభిముఖుఁడై మనరథము వనప్రముఖరాంతకుపై. 1280

వ. అని పలికి యతం డట్లు చేయ. 1281

గీ. మలయు కీలాలధారలు మదము గాఁగఁ, గరధనుఃకరవిశిఖశిఖరనికరము
కరము దనరా దైత్యకుంజరము పేర్చి, తీవ్రగతిఁ నృపతి పింగదృష్టి దాఁకె. 1282

ఉ. నిక్కుపుఁబంటువోలె రజనీచరయోధులు నవ్వఁ గొంచపున్
ద్రుక్కుడిమూఁక సేర్చి కడు మోదము నొందెను నీవు నీవపే
రుక్కుగలాని రావణు మదోద్ధతు మాఱ్కొని వంటయిల్లు మ
త్తెక్కి శకంబు చొచ్చుగతి నెల్లిద మైతివి మానవాధమా. 1283

క. కాయలు నాకులుఁ గూడుగ, మేయుచును జరించునట్టి మేటివి నీకుం
గాయలు నాకులుఁ గూడుగ, మేయుచును జరించి కొమ్మమెకములు బంటుల్.
తే. తాటకాదులఁ గూల్చి వనాటపతుల,చేఁ బనుల్గొని వార్నిధి శిలలు నిలిపి
మచ్చరించెదు నీవొకమాయికుఁడవు, గాని నిక్కపుమగఁడవే నరేంద్ర 1285
క. మానాభిమానములు నవ,మానంబును నీకు లేవు మానిసి వోలెం
బూని విహరించెదవు గుణ,హీనుండవు నిన్నెఱుంగనే సత్త్వనిధీ. 1286
చ. చలమున నన్నె దుర్ఘటపుఁ జాలక సంద్రముఁ జొచ్చితేనియుం
బలమున మోచి తేనియును బద్దులుగా మహి వ్రక్కలించి యు
మ్ములఁ బకళించి తేనియును బ్రోడనుఁ బడ్లిగిలించి తేనియుం
దెలియక పాఱువాఁడవయి తేనియుఁ జంపక పోవనిత్తునే. 1287
క. అని కార్ముకదళకగుణ,ధ్వనిగర్జాయుతుఁడు నాయుధతటిద్వృతుఁడౌ
ఘనుఁ డసురుఁడు శరధారల, మునిఁగించె రామశైలముఁ గపులు వడఁకన్. 1288
క. క్ష్వేడాభిముండై ప్రక్ష్వేడన విసరములు విసరి వేఁడియు నిషువుల్
తోడన రోదసి నిండఁగ, వాఁడి మిగుల వైమనస్యవసరనుఁడుక్. 1289
మ. క్షతనిర్యద్రుధిరప్రవర్షుఁ డురుమేఘశ్యాముఁ డారాముఁ డు
ష్ణతకోదండమహేంద్రచాప మమర న్నక్తంచరాధీశప
ర్వతరాజంబు జగద్భయంకర శుభాస్వత్సాయకైరమ్మదా
కృతమం జేసె శుభాకారస్తనిత మర్త్వభాగభీమంబుగన్. 290
క. ఉగ్రాంశు నిశాచరవ,శగ్రామణు లగ్రబలులు సంగ్రామవహో
దగ్రులు భూనాయకపు,త్రిగ్రీవులు పోరు టధిక కీర్తి మయ్యెన్. 1290
క. అస్థిశకలముల నతిరుణ,పస్థానంబులను మాంసభక్షణవణభూ
తస్థిరనర్తనములఁ గల,హాస్థిర భయదవ్యవస్థితావస్థమై. 1291
వ. జగద్భయంకరంబు గానించె నప్పుడు. 1292
క. ప్రౌఢివెలయఁగఁ దా నవ,గాఢశరాళులు పంక్తికంఠు పయి జయా
రూఢి నిగిడించి ప్రత్యాలీఢాంఘ్రియుఁ డగుచు మాతలిప్రేరితుఁడై. 1292
క. పదిశిరములు వెడిసి నవ్యాదిశరములు వైచి భూమిపడుఁ డిలఁ గూల్చెం
బదిశిరములు రావణు నిర్వ్యాదిశరములు కొక్కెట్టు వానికిన్ గన్. 1293
గీ. దల్లు పడఁగని యొక్కటి తొట్ల మొలచి, యున్నశిరము లూచి యుగ్రవృత్తి
వెండి పడఁగని మొలచిన వేఁడి గూల్చి, వెండి మొలచిన నురవడి వెండి గూల్చి.

క. పదపడి యొదవినవానిం, బదిలుండై కూల్చి యిట్లు బహువారంబుల్
పొదలిరఁ గూల్చుచుఁ జిత్రా,స్పదహృదయాంబుజుఁ డధిజ్యచాపుఁడు కడఁకన్.

క. త్రెంచుం గరశిరములు వెల,తెంచుం గ్రమ్మఱఁగ నవి వధించు న్మతి యే
తెంచు నవి ద్రుంచు వెసఁ బి,తెంచు ద్రుణమున రణం బతిస్ఫుటభంగిన్. 1296

క. శ్వరతోరణము మిగుల వి,స్ఫురితోరస్కుఁడు కదంబములు నిగిడింపం
గరతోరణ శిరతోరణ, శరతోరణపంక్తి నాకసము దివి నిండెన్. 1297

క. పుడమిఁ బడి పొరలుతలలుం, బుడమిం బడుతలలుఁ బుడమిఁ బొందనితలల
ప్పుడు తెగినతలలుఁ దెగుతల, లుడుగక వెడలు తలలయ్యె నుగ్రరణమునన్. 1298

క. లలి నెన్నిమార్లు దునిమిన, మొలతుము నీవేటి కష్టముం బొందెదవం
చెలఁగవ్వ నవ్వఁగతి లా,లలఁ గ్రక్కెడు పంక్తిలపతులపనము లొప్పెన్. 1299

గీ. భరితవిపులచతుర్దిశాపరిసరములు, భయదవేతాళఖేలనపరికరములుఁ
బరమశోణీకృతోదయసాగరశిరములు, శరముఁ దవరారె దశశిరు కరశిరములు.

గీ. కృష్ణవర్త్మని బాయని కీలలనఁగ, శరధి మునుఁగక వెడలెడు తరఁగలనఁగ
భానుబింబంబుఁ దొఱఁగని భానులనఁగఁ, దఱుఁగ వంబకములు నృపు తరకసమున.

గీ. సంగరసరోవరము రామసామజపతి, ఘననిరంకుశవృత్తిఁ గలఁగుచుండఁ
గామ లూడిన నెత్తమ్మి గము లనంగ, నప్పొలసుఁదిండి మొగములు నొప్పె నచట

శా. భూభృచ్ఛాతశిలీముఖాగ్రయుగపద్భగ్నోజ్జ్వలన్ముద్రికా
శోభాభాసురదీర్ఘబాహుపరిఘాస్తోమంబునం దత్సమి
ద్భూభాగంబు మణిప్రభావిభవవిస్ఫూర్జన్మహాభోగసా
నాభోగాన్వితభోగిసంకులలసన్నాగేంద్రలోకశ్రీయున్. 1303

వ. ఒప్పె నయ్యమోఘశిలీముఖకదంబకాండరాశికిం దిప్పలుకుప్పలై మహోన్నతపర్వత
గండోపలతాళఫలోపమానంబులైన శిరంబులుం గనుంగొని తదీయాసన్నవృద్ధిఁ గరం
బు నివ్వెఱఁగంది కందిన డెందంబున. 1304

క. వరశక్తియు పైతామహ్యావరశక్తియు గాక పంక్తివదనువదనముల్
కరములు నూఱియు నూటని,శరణిం బ్రభవించు నొక్కొ యితని నిరతమున్. 1305

క. అని శరములు విదిలించుచు, వినివారితమతి నని శరములు విడిచి పకత
జ్జననాథుఁ డున్నఁ జేరం,జనుదెంచి వినీతిభరితసన్మతి యగుచున్. 1306

గీ. ఇద్దనుజనాథుఁ గుండలాకృతి రహించి, యమృత మున్నది వీనియశోద్ధి దాని
నవురఁజేయక రావణు పొరఁడగక, వెలుఁగఁకరులపనంబులు మొలచుచున్న.

గ్రహనాయకుఁ దక్రగతిఁ బొంది మిన్నందె ధరణి యంతయును సుస్థిరతఁ బొలిచె
గొలఁకులు కమలానుకూలతఁ గొమరారెఁ గడుఁ గిన్నరులకు రాగములు బలిసెఁ
దిశలు విశదంబులై యొప్పె దేవదుందుభిధ్వనులు నప్సరోవరప్రభుల తాండ
వంబులును జెల్లె నారదుఁ డంబరమున, నాఁడె రావణు పతనము నాత్మఁ బొంగి.

క. మందారకుసుమయోగా,నందసురభి యగుచు మలయసహితం బగుచు
న్మందానిల మయ్యాశ్రిత,మందారుని సమ్ముఖమున మలసె శిశిరతన్. 1825

క. సౌరియు సౌమిత్రియు సా,మీరియును విభీషణుండు మృదువచనములం
జేరి కపినికరయుతులై, భోరన వినుతించి కావ్యములు వికసిల్లన్. 1826

క. కంథరములఁ దునుమాడిన, గంధవహాత్మజార్కిఁ బంక్తికంధరుని లస
త్కంధరములు చిదిమి మహా,గంధవహుం డగుచు నృపతి కడు నొప్పారెన్. 1827

గీ. అంధకార మడంచిన యర్కుఁ డనఁగ, నంధకాసురుఁ దునిమిన యభవుఁ డనఁగ
దాంధు రావణుఁ బరిమార్చి యప్పు డొప్పె, సాంద్రవిక్రముఁ డగు రామచంద్రవిభుఁడు.

చ. భృశబలులం జనాయకవిభీషణముఖ్యులు హోతృకృత్యముల్
విశదముగా నొనర్ప రణవేదిక నంబకవహ్ని విద్విష
త్పశువిసరం బసృక్ప్రఘృతస్ఫురణం దగ వేల్చి చట్టిత
ద్దశరథసూతి యాజ్యవభృథం బదిసల్లె మహాముదంబుధిన్. 1829

వ. అంత నమ్మహీనాయకాగ్రేసరుండు. 1830

గీ. సంతసమునఁ జెలికుని వ్యాసంగుచేతి, కొప్పగించిన మదనునిరొప్పు గాంచె
నెక్కుడుముదంబుతోడ విల్లెక్కుడించి, లక్ష్మణునిచేత నిడి కృతలక్షణుండు. 1831

ఉ. రాఘవఘోరకేసరి శరస్ఫుటదీర్ఘవిశాలభీకరా
మోఘనఖావళిం బ్రలయముం గను రావణభద్రదంతి వీ
తాఘుఁడు తత్సహోదరుఁ డహంకృతిదూరుఁడు మాన్యసజ్జన
శ్లాఘి విభీషణుం డురువిషాదమునం జని కాంచి దీనుఁడై. 1832

క. పుట్టినవాఁటంగోలెను, దిట్టతనము గట్టి పట్టి దివిజాధిపునన్
బిట్టులుకఁబెట్టు నీవుం, గట్టా కట్టాగవలసెఁ గట్టిఁడివగుటన్. 1833

క. ఘటకర్ణుఁడు సోదరుఁ డఁట, కుటిలు నిపుణుఁ డింద్రజిత్తు కొడుకఁట తాను
త్కటబలుఁడు రావణుండఁట, యిటు కటకట పుడమిఁ గూలునే విధిచెయిదిన్.

క. బలవద్విరోధ మేటికి, కల దని నిక్కత్తి చెప్పి వారింపఁగ లే
నిలఘుత్వబుద్ధినగు నా,కు లభింపదె బంధుమరణఘోరార్తిఁ బడన్. 1835

గీ. మయతనూజాత యింద్రజిన్మాత శక్ర, వైరివధూమణి కుంభకర్ణ వైరివధునిక
దేవకంటకు కట్టపుదేవి యనఁగ, యశమ్ము భరమేమి బలకంఠమైనవిధికి. 1344

క. అని పతిఁ దూఱి వెక్కి వెక్కి యేడ్చుచు, దనుజవిభుం దలఁచి పనివి తద్వల్లభకో
కనిమగ్నయగుచు నటుఁ గనుఁగొని మొన్ని జపుత్రమిత్రకోటి శవంబుల్. 1245

వ. కని సహింపని దుఃఖాతిరేకంబున. 1346

సీ. పరిపంథికాండాగ్ని పరిపీత మృత్యు నే యయ్యనేఁ డింద్రజిదంబురాశి
విద్వేషత్వచు శోషవృష్టిన యా యెవ్వారె నేల ఘటకర్ణాలబు
అరికుమారకశక్తి హతిఁ జేసి మాయమ్మ మాయమ్మ గునె యతికాయశిఖరి
యభిరామతఘోరాకు గావాతిఁ జెల్లఁబో చెల్లఁ గోలుఁ బ్రహస్తసితఘనంబు
దన్యక్షోపదవానలదగ్ధమయ్యె, కటకటా నిశాటభాగ్యాటవీప్ర
దేశమని ధీమభూతని వేళ మగఁ గనుంగొనఁగ లేక మూర్ఛ మునుంగటయును.

క. వనచరులు దెలుపఁ దెలివొంది, దనయట్టి విభీషణుం గా దీర్ఘోక్తుల న
వ్వనితకడఁ జేరి తేర్చెను, ననయానునయనయాసవినయాలాపములన్. 1348

వ. తదనంతరంబున. 1349

సీ. అస్రప్రవాహినులనోలాడు భూతములు నెమ్ములు చవిమాచెడు భూతములును
బిట్టల నాఁద్రెను బిల్చు భూతములుఁ బ్రేవులు గబళించెడు భూతములును
మెదడు ద్రోచ్చి తిని మదమెక్కు భూతము లొప్పబ్బలు వెట్టెడు భూతములను
పీనుఁగులను ద్రొక్కి పీఁకు భూతంబులుఁ బొగడఁ ద్రేఁచెడు భూతములును
అడుభూతములును బాడు భూతంబులు, నాఁడు భూతములును బాడుభూత
ములుఁ జెలంగుభూతములు నవ్వుభూతము, లతిమభూతసంచయము నగలిగి. 1350

వ. భూతభయంకరంబు గాకుండియు భూతభయంకరంబై కీలాలపరిషిక్తంబు గాకుం
డియుఁ గీలాలపరిషిక్తంబై హారికలీముఖచక్రపుండరీకబహులఘనరసాకరంబు
గాకుండియు హారికలీముఖచక్రపుండరీక ఘనరసాకరంబై కబంధప్రసారితంబు గా
కుండియుఁ గబంధప్రసారితంబై యొప్పు సమరావనికలను నెట్టకేలకు వెలువరించి. 1351

చ. ధృతి మృతబంధుకోటికి విధిం దగు సాధనయుక్తి వహ్నిసం
గతి పొసఁగించి యెల్లక కకిల్బిషతం బరలోకసత్క్రియా
దృతి నెగడొందె యొప్పిన సుధీనుతు శావ్యదశాస్యు వానర
ప్రతతియుతు న్విభీషణుని రాముఁడు గన్గొని సాదరంబుగన్. 1352

వ. సౌమిత్రిం జూచి. 1353

క. రాక్షసుచేఁ బాలితమగు, దీవికి నీ విభీషణుం బ్రతిష్ఠింపుము రా
జైవెలయఁ గాలనీరం, ధ్రావధిగిరిజాధిపార్కతారకముగాఁగన్. 1354

వ. అని సత్యసంధుండును గరుణాసింధుండును దీనజనబంధుండును బ్రతిజ్ఞాబంధురుండును
నగు రామభద్రుం డానతిచ్చుటయు మహాప్రసాదంబని సువర్ణ స్వర్ణ మహార్ఘ వార్ణఃపరి
పూర్ణభద్రకలశహస్తులగు వనచరప్రశస్తులసహాయంబున సమిత్వైభవాస్పదం బగులం
కాపురంబుఁ బ్రవేశించి యుచితసముయజ్ఞుండై. 1355

క. పుణ్యసతులు సేసలిడఁగఁ, బుణ్యమతులు సన్నుతింపఁ బుణ్యదినమునం
బుణ్యజనసమ్మతమ్ముగఁ, బుణ్యశ్రాసీనుఁ జేసి పుణ్యవిధి దగన్. 1356

క. లంకాపుటభేదన మకలంక ధృతి విభీషణునకు లక్ష్మణుఁడు గుణా
లంకారుఁ డించుకేని కలంకగొనక యాభిషేకలక్ష్మిం గూర్చెన్. 1357

క. పరమామహితు విభీషణు, పరమామహితు న్నిఖిలనిశాటపదవికిం
గరుణారససేవనభాసురతరపట్టాభిషేకశోభితుఁ జేయన్. 1358

చ. అమరులలోన నింద్రుఁడు హిమాద్రికులాద్రులలోనఁ దారకా
సముదయమండలంబున నిశాపతి భూరుహకోటిఁ గల్పక
క్రమమున నవ్విభీషణుఁడు రాక్షసరాజికిఁ దా నధీశుఁడై
యమరవిరోధివర్గలసదంతరము న్వెలిఁగించె నెంతయున్. 1359

క. ఈచందంబున సకల నిశాచరరాజ్యాభిషేకసామ్రాజ్యయుతుం
జూచి విభీషణుఁ బొగడిరి, భూచరభూమిసహచరనభోరాత్రి చరుల్. 1360

వ. అంతంత నిఖిలరాక్షసరాజ్యలక్ష్మీవిరాజమానుండై మండోదరీప్రభృత్యంతఃపురకాం
తాసందోహంబానందించు వర్తనంబునఁ బ్రసిద్ధుండై. 1361

క. పదిమోములయ్య తమ్ముఁడు, పదితేరుల జిమ్ముకొడుకు పజ్జనుఁ జనితాఁ
బదివేల్జడే లొసరింపఁడవివి జేజేలు ఊరి పయి విరివానల్. 1362

తే. పురిని రచ్చరలాడిరి మొగసె దేవ, దుందుభులు మింట నతికమూచ్ఛకచరిత్రుఁ
డతి పవిత్రుఁడు మిత్రవంశాబ్ధిసుముద, మిత్రుఁ డాతని మిత్రతమీఱఁ జూచి 1363

వ. అభినందించెఁ దదనంతరంబున. 1364

చ. సరసబహూకృతి న్నెలవొసంగిన మాతలి తేరుగొంచు వి
స్ఫురితగతిన్ దిశల్వెలుఁగ సూర్యకులేశ్వర బాహుసాహస
స్థిరధృతి విక్రమాదులు నుతించుచు నప్రతిలీల దేవతా
వరులకు నుబ్బమీఱఁ ద్రిదివంబున కేగె నవంతరంబునన్. 1365

సీ. వరవిరోగాతపభరకృశలై ఘనోదయము గోరెడులతాతన్వి యనఁగ
నినకరస్పర్శనాపేక్షమై దోషాచరనిబద్ధయైనపద్మిని యనంగ

గతిఁ బలాశ్యగ్రఁ కలుఁతితయై మాధవాకాంక్షిత శ్రీకలకంఠి యనఁగ
నాత్మవివక్షితాహారయై రాజావతంసు నెంచుసతీమతల్లి యనఁగ
రాఘురఁ తాపాదగ్ర బామోఘబద్ధ, బుద్ధి సద్ధరణీజ జగద్ధితుఁడు మ
రుద్ధితనుతుఁడు వినయావనుద్ధుఁ డగుచు, సల్లసల్లన మిగులఁ బ్రియమునఁ జేరి. 1866

చ. కనుఁగొని కేలుమోడ్చి జనకక్షితినాథతనూజ కుబ్బు దోఁ
పనిధృతి వాయునందనుఁ డపాస్త భయుండగు నాంజనేయుఁ డి
ట్లనియెను బూర్ణ మాహిమకరాంకు పరిస్ఫుట యోగఘూర్ణమా
ననిబిడవార్ధి భంగచయ సవ్య పరస్పర ఘట్టనార్భటికి. 1867

తే. అమ్మ వినవమ్మ చాల మేలమ్మనీకు, జాలమేలమ్మ రాముఁడు గనుఁ గనుఁ నేయు
సమయ మాసన్న మయ్యె నసత్యమాడఁ, జాలమేలమ్ము నన్నుఁ గాంచి జలజనయన.

ఉ. సేతువు గట్టి రక్కసులఁ జీల్చి విభీషణు నెల్ల వానర
ప్రీతిగ లంక నిల్పి విపరీత భవ ర్వరహోభిభూత చి
త్తాతురుఁడైన రాఘవుఁ డహర్పతి తేజుఁడు దాఁ దిలోకవి
ఖ్యాతజయోక్తి నీకుఁ దెలియ న్వినిపింపు మటన్న వచ్చితిన్. 1869

చ. మనమున నూఱడిల్లు మనుమానము దక్కుము నాఁ దదీయవా
క్యనికర వారియోగ జనకక్షితినాథ కుమారికా నిదా
ఘనిహత చారుచారు లతికాక్లమథం బడఁగన్మరంద బిం
ద్వనుపమ సమ్మదాశ్రు నివహంబులు జాలె సుమాంబకద్వయిన్. 18.0

క. పూని యిటు పతిసించిన, యానిని జనకమహీభృత్కుమారి కుమారుం
బోనిహారికుమారునిదను, నూనిన మదిఁ గాంచి యిట్లను దెలిని మెయిన్ 1871

క. ఏకతమ యివ్వనమునన, నేకతమ శ్రమలఁ గుంది యిట్లు డిదు ము
న్నీకతమునఁ బ్రాణంబుల, పోకఁ దమకేఁ గాక యుంచిపి బ్రచ్చితి నన్నా 1872

వ. భవదీయ దయావలోకనంబున నాపత్పయోనిధి మునుంగక వెడలితి నన్నా యని మహానందంబు నొందుచు న్నతనికరంబున నన్నాయు మా చూడామణి వాక్యరత్నంబు లను మెఱుఁగు నెట్టిన చందంబున విభీషణ ప్రేరితంబగు దానవ పుణ్యాంగనానివహంబు పరమాపురస్కృతం జనకనందనం గదిసి.

సీ. ఘనవేణి కురులకుఁ గమ్మనూనియురాచి యంబుధారాపూరితం బొనర్చి
మృదువాణి మేనున మేలిసొమ్ములు బెట్టి శరదిందుధవళాంశుకము గూర్చి
గగనావలగ్న ముఖమునఁ దిలకముంచి తారకాహ్వార్కీఁ బెన్నార్కఁ జేసి
లలి లతాతన్వికన్నులఁ గాటుకపొనర్చి సుమనోమనోహారస్ఫురణ నొసంగి

గంధగజయాన మేనున గంధ మలఁది, పద్మశామిత మృదులీలఁ బాదుకొల్పి
యశ్వారోహానేక విమానాధిరోహఁ, జేసి రాముని సన్నిధి సేసిరపుడు.

క. తిదయుక జేజేపూజడిఁ, దడియుచు నరమాపతియు సదాగతిసుతుఁడున్
జడియక యుంగలసందడి, జడియుచు రా సీతఁ దెచ్చి సమ్మతి నిలుపన్. 1874

క. ప్రీత స్ఫీతమృగివి, స్ఫీత దృగజ్జాత రాతుసీసుముపేతన్
భూతలసంభూతం బరి, పూతం గని సురలు ముదముఁ బొందిరి మిగులన్. 1875

ఉ. మాన్యచరిత్ర కజ్జనకమానవనాయకపుత్రి కప్డురా
జన్యనిఁ జూచు వేడ్క మహిజానికి జానకిఁ జూచు వేడ్కసా
మాన్యము గాక యుల్లముల మల్లడి సేయఁగ దద్వయాకరా
న్యోన్యముఖావలోకన మహాముద మొక్కట నెల్లెఁ బెల్లుగన్. 1876

క. చిరకాలవిరహదుర్భర, తరచింతానిష్ఠు భూసుతా దాశరథుల్
గరుపారెడు మేనుల నొం, డొరులం జూచికొని పొంగి రుల్లములఁ గడున్.

క, నిధిసన్నిధి యగు నధనుల, విధమున జలరాశి నీఁది వెడలిన భంగిం
బృథివీతనయా రాములు, మిథస్సవిధులగుచుఁ గరము మెఱసిన యంతన్. 1878

క. పావనిముఖ్యులు లక్ష్మణ, దేవునితోఁ గూడి యపునధికహర్షమునం
బావనిఁ బుణ్యసతీసం, భావినిఁ గని నెమ్మనములఁ బ్రబలిరి మిగులన్. 1879

సీ. బ్రహ్మాదిదేవతాపటలంబు సనుదెంచి సుమనోభిరాము రక్షోవిరాము
జితపరశ్వధరాము వితతసద్గుణ పికారాము సాత్మారాము రాముఁ బొగడి
విపులశుచిప్రవేశపరమశుచిరుచిరరుచి మహీకన్యఁ బ్రస్తుతించి
సారకల్పకసుమాసారపూర్వకముగా నప్పతివ్రతఁ బతికొప్పగించి
యతని మతి వొంగ నప్పుడా యతులరణవ్య, తులఁ బ్లవంగపతుల నమృతలలితప్ర
వృష్టిఁ బ్రదికించి వెండియు వివిధగతులఁ, బొగడిరి నరేంద్రు రవివంశ పూర్ణచంద్రు

రగడ. జయజయపూమనుసంతతితతిభూషణ, జయజయరావణ జలజైరావణ
సుజనవిధాయక సుఖసంధాయక, సృజి వికృత్రవ వేదవికృత్రవ
సురసనిబంధన సాగరబంధన, భరితాంగలాంగద బాహుబలాంగద
అరిచయమారక యాజిశమారక, సురగిరిమహోవన సూరిమహోవన
శుకసముదర్తన శోకనివర్తన, సకలపదూషణ సాధితదూషణ
శ్వసన సుదారక సంశయదారక, యసదనినోదన హర్షవినోదన
జనకసుతావర శక్రహితావర, వినుతమహాబల విపుల మహాబల
కులరఘువంధీవర కర్మేందీవర, కలితసులోచన కారుణ్యలోచన

పృథుభవతారక హితబృందారక, ప్రథననిశాచర పద్మనిశాచర
సమిత విభీషణ శాస్త్రికభీషణ, విమల యశోధన విద్యాశోధన
వపుజిత నారద వందితనారద, విపులనిరూపక విశ్వసురూపక
నతశశిశేఖర నరపతిశేఖర, శ్రితవరదాంకిత సిద్ధపదాంకిత
భయహారివారణ ప్రథనావారణ, భయదకళీముఖ భక్తకళీముఖ
నిహతకిరోరుహ నేత్రకరోరుహ, బహునుతబాడబ భవవనబాడబ
స్మయఖగనాశన మదపవనాశన నయగుణవర్ధన నరభుగ్వర్ధన
మునిపరిపాలక గీర్మఖవిఫాలన, యానఘనికేతన యహిరిపుకేతన
నళవతురాగమ భక్తవరాగమ, భృశబలవిక్రమ భీమ త్రివిక్రమ
వలిమఖరంజన వరద నిరంజన, సలలితతారక సన్నుతతారక
కైశికకంధర కంబుకకంధర, వీశసువాహన విబుధావాహన
అనయకదంబక హానకదంబక, కనకకృతాంబర కాంతివృతాంబర
పాలితగోగణ పావనగోగణ, కాలనిరూపణ కార్యారోపణ
సకలసభాజన సమ్మదభాజన, ప్రకటనమజ్జన పంకనిమజ్జన
తమ వీరుల కెఱుఁగము నీకంటెను, మముఁ బ్రోచిన ధర్మము నీకంటెను
దీనులకొఱకె త్రితి వవతారము, మానుగ నీ నామము భవతారము
చెదరక నిన్ను భజించెడువారికిఁ, గదలఁగ నేటికి గంగావారికి
కృతకృత్యుఁడవై కీర్తి వహించితి, నతిశయమీ శ్రమ మంత సహించితి
నీవగువారము నీదేభారము, ఏదియు నేరమి కొంచక నేరము. 1881

సర్వతఃప్రాససీసము.

విస్తులదురిత నిరస్త సదాభయహస్త విశామ్య ద్విహస్త విపుల
విస్తీర్ణసంసార దుస్తరాంభోనిధి విస్తారక బుధేష్ట వస్తుదాయి
ప్రస్తుతమజన సమస్త మునీశ్వర ప్రస్తుత విద్విషాపాస్తగంధ
శస్త్రప్రదశర యశస్తోమ తీక్ష్ణగభస్తి వంశాబ్ధిప్రశస్తసోమ
విస్తరామ్నాయ సువిహార నాస్తికహార, హాస్తిరిపుకోటి శౌర్యవిధ్వస్త చాక్య
త్రస్తలోకోద్ధరణ ఘనోపాస్తికరణ, స్వస్తిపదరామ భక్తవిన్యస్తకామ. 1882

ముక్తపదగ్రస్తకందము.

స్మరసుందర దరసంహార, హారవందిత దితిసుహారిహారివిభవభా
సురసురభూజిత జితఖర, ఖరశరశరకీర్తినికర కరధృతపద్మా. 1883

ఖడ్గబంధోత్సాహవృత్తము. రామనామ సోమధామ రాజరాజపూజకా
కామితార్థ దాయకా సుఖైక సద్విధాయకా
కామినీ సితాబ్జసాయకా మనోజ్ఞనాయకా
కామశోక మోహలోభ ఖండనాదికారకా. 1884

చక్రబంధ శార్దూలము.

జన్యాలక్షితరాక్షసోత్కర దయాసామగ్ర్యశౌర్యక్రమా
మన్యూనస్వజ్జన మత్తపామరవిరామా ధ్వస్తశోకక్రియా
యశ్యాయాపహా నాగభాస్వరశయానా వంద్య భూభ్రమా
మాన్య శ్రీజనకామ నిర్భయద రామా శ్రీదయాద్యుత్తమా. 1885

పాదాదిపాదాంత ముక్తపదగ్రస్త సింహావలోకన ద్విప్రాస నిరోష్ఠ్యకందము.

శరధీడిత కీశరథీ శరధీహితకీర్తి నీరత చలితాశరధీ
శరధీద్ధరథేశరధీ, శరధీరార్తిఘ్నతనుసూన చయదాశరథీ. 1886

గోమూత్రికాబంధకందము.

సరసీజాక్ష రమాభా, సురసీతాకామ దాసశోకవిరామా
సురపూజా వరశోభా, భరపూతారామవాసపైకపరామా. 1887

క. అని మిషశేష విధంబున, నినుతు లిట్లభినుతించి కొందఱకును ద
జ్జననాథుఁడు సెలవొసఁగిన, జని పొంది రభీష్టలీల స్వస్థానంబుల్. 1888

వ. అత్యవసర బున దశస్యందనుఁడును నందన సందర్శన సంస్పర్శన సంభాషణ సంభా
వనంబుల నమందానందకందళిత హృదయారవిందుండై 1889

క. మీ కొఱగొడ్డము లాడిన, నాకొఱ గాములు సహించి నాకొఱకు మదిన్
శ్రీకొఱకు లెక్కసేయని, మీకోరుకులు సమానులే సమిద్ధ్యములారా. 1890

ఉ. అని పదివేలచందముల నాత్మజులం దడవాడి కోవలిం
గనుఁగొని రాముఁ జూచి జనకక్షితినాథతనూజ సాధ్వసా
ఖ్యనివాతి కాత్మనొర్చి యనఘస్థితి లోకము కెక్కఁ జేసె నే
మని పలుకంగ వచ్చు నని యాడి కడుం గొనియాడి వేడుకన్. 1891

క. తనయుఁ దగుభంగి మ్రొక్కిన, తనయుల దీవించి దశరథవిభుఁడు మనుప
చ్చిన సురవిమానరాజ, మ్మునఁ గ్రమ్మఱఁ జనియె దివిజముఖ్య సహితుఁడై. 1892

చ. హరిపదబంధురంబుఁ గపలానుగుణంబు బరుణప్రభాఢ్యముం
గరుడ సహస్రముఖ వేగ మనఘుం బతిరిక్త విశాలకిన్నరా

వ. తదనంతరంబున వసుంధరానందనానుందగపదారవిందంబులకు మ్రొక్కి యశోక్కయు లిద్దఱొక్కడుగుణంబు లగ్గించి మిక్కిలి దీవనలు వడసి సమస్తంబు కుశలంబ యని యడుగుచు. 1416

క. ఆతఁ డతఁడైన విధమునఁ, గౌతూహల ముప్పతిల్ల గాఢస్నేహా
పేతమతిఁ గౌఁగిలించిరి, ఖ్యాతిసుమిత్రాసుతుండుఁ గైకాసుతుఁడుక్. 1417

తే. అచట శత్రుఘ్నుచే రాఘవాగమనము, విని వసిష్ఠుండు ముదమంది విన్నుముట్టి
దశరథాంగనలును దోఁడ దగినరూన, పంక్తితోఁ జనుదేఱఁగఁ బయలుదేఱి 1418

క. పరమోత్సవం బయోధ్యా, పురమునఁ గావింపఁ బంచి భూరిద్యుతిని
స్ఫురితాంబరభూషణుఁడు, దము భరద్వాజనియమిధన్యాశ్రమముక్. 1419

ఉ. చేరి వనాటరాత్రిచరసేవితు నాతఁడు భ్రాతృయుక్తు ధా
త్రీరమణీసుతాయుతుని శ్రీరఘురాముమునీంద్ర వందుగఁగ
న్నారఁగఁ జూచి జన్మము కృతార్థత నొందె నటంచుఁ దన్నమ
స్కారము లర్ఘ్యపాద్యములుఁ గైకొని కైకొని యాదరంబునక్. 14^0

వ. ఆశీర్వదించి యభినందించి. 1421

క. దశకంఠుని బాధల దుర్గశఁ గంతగతాసులైన ప్రజల దివిజుల
న్విశదగతిఁ బ్రోచు మతియును,జశరీరం బూనినట్టి శార్ఙ్గి సుమ్మా 1422

త్రిమూర్త్యాత్మక స్తవకందకము. శివవిప్రవినుత యమృతభవభయ మోచన శశిప్రభాకర రాజీ
వవిలోచన దేవముఖవి, భవభాషానాథవంద్య భవ్యవిధానా. 1423

వ. అని యనేక విధంబుల నతని వినివాసకథాసేతువిధానుగకథావిక ప్రయోజనం
బు లుగ్గడించి సౌమిత్రి యుచితవర్తనంబుఁ గీర్తించి జానకి యుత్తమగుణంబులెత్తి
పొగడి యానందించుటయు. 1424

క. అంతటమున్న సుమిత్రా, సంతత్యవరజనితుండు శత్రుఘ్నుఁడు ఫా
లాంతాంజలి పుటుఁడసకృ,త్సంతోష యుతుండు రామచంద్రుపనములక్. 1425

క. తననయనచకోరంబులు, దనివోవఁగ నూఁదియున్న తమ్ముని శత్రు
ఘ్నుని నప్పుడు గాఢాలింగన మొనరిఁచె న్నిరంబుఁ గడుమూర్కొనుచుక్. 1426

క. దీవించుచుఁ దమ్ముని సం,భావించుచు నివ్విధమునఁ బరిరంభణసౌ
ఖ్యావహామున మేను మఱచి, భూవిభుఁ డసకృత్ప్రమోదమున మునుఁగుటయుక్. 

వ. లక్ష్మణానుజుండునుంబోలిరియుండె నంత రాముండు వనజపమేతుండై. 14:8

క. మొగిచిన చేతుల ఫాల, మ్మొగిఁ జేరిచి నిభృతినారఘూత్తమమణిపే
ముగురమ్మలఁ జోలిన యా,ముగురమ్మల పాదపద్మములకున్ మ్రొక్కెక్. 1429

మ్రొక్కినరామలక్ష్మణుల మోముల మోములుచేర్చి చేర్చి యా
యక్కలు నక్కుమారకుల యక్కుల నక్కులుమోపి మోపి చ
న్మక్కువలర్థబిందువులు మోముల నమ్మదబాష్పపూరముల్
గ్రక్కుచుఁ బారవశ్యమును గాంచి మునింగిరి సమ్మదాంబుధిన్. 1430

క. బుడుతలు తమకు న్మ్రొక్కులఁ, బుడుకుచు మ్రొక్కు శిరములు మూర్కొని మేనుల్
పుడుకుచు మువ్వగ్నులు న్పప్పుడు గాల్చిరి చింతలనెను ప్రుదుకలనెల్లన్. 1431

వ. వెండియు నపరిమితానంద భరితలగుచుఁ గుమారుల ముహుర్ముహుర్నమస్కారంబు లకుం బునఃపునరాశీర్వచనంబు లొసంగుచుఁ దదీయవనవాసాదిక్లేశంబు లుగ్గడించి కన్నీరు నించుచుం బ్రత్యేకము శిరఃప్రశ్నంబు సేయుచు 1432

తే. కటకట కటిక గ్రొగ్గిట్టి తుటుముతోడ, నొడల వ్రేలెడు నిడుద కుంజడలతోడ
మురువు దఱిగిన మెట్టుఁదామరలతోడ, వచ్చి కన్నులఁ బడినార వత్సలార. 1433

వ. అని యిట్టి ప్రేముడి పలుకులం బాలకులం బొదివికొనియుండె నట్టి యెడ సీత యత్తలకు మ్రొక్కుటయు. 1433

ఉ. గ్రుచ్చి కవుంగిలించుకొని కోడలి దీవనలిచ్చి మచ్చిక
ల్పెచ్చు పెరుంగ నా పెగుణబృందము లెంతయు నచ్చి మెచ్చి వా
ఫుచ్చి పతివ్రతామణిరొ భూసుత పుట్టిన యిల్లు వేడ్కమైఁ
జొచ్చిన యిల్లుఁ గీర్తులకుఁ జొన్పితి ని న్వినుతింప నేర్తుమే. 1434

క. దాసీనివహం బెల్లను, దాసీనివహంబు గాఁగఁ దలఁచి సుఖములం
బాసి మది విసువవైతి సెబాసీక నినుఁ బోలునట్టి పతివ్రతలు గలరే. 1436

క. శాంగదు గతి నలవాణియు, మంగళదేవతయు సర్వమంగళయును గా
శంగనలు నీకుఁ బురుడే, మంగళదేవతవు సర్వమంగళవాణీ. 1437

సీ. క్షాళికసంవ్యాప్త కాళికపరిపూర్ణ వనములు క్రీడోపవనము లనుచుఁ
బటుపలాశపలాశ భయద కంటకలతా భవనము లేకాలీభవనము లనుచు
వ్యాళసంవేష్టిత వ్యాళమహాద్రిగుహలు విలాసాంతర్గృహంబు లనుచుఁ
గ్రవ్యాదవంచక క్రవ్యాద సంకలి తాశ్రమలం చతుష్కృతకాశ్రమలనుచుఁ
గఠినకాంతారధూసరాగాధఘోర, రీకదంబంబు దీర్ఘికానేక మనుచుఁ
దలఁచి యెదఁదాల్మి నెలకొల్పి ధవుని పిఱుఁద, విపినములఁ దిరిగి వచ్చితివి గదమ్మ.

క. నినుఁ గోడలనని మన్నించిన శతమున మాకులము ప్రసిద్ధి వహించెన్
నినుఁ బుత్రిగాఁగ మహిఁ బడసిన జనకుని భాగ్యమహిమ చెప్పఁ దరమే. 1439

వ. అని సీతం బొగడి కన్నులం గప్పికొని పురుషార్థ చతుష్టయంబుం బోని పుత్రచతుష్టయంబుం గని ప్రమదం బావహింపం దమమనంబుల. 1440

క. వసురాశిఁ గనిన చక్రము, లసకృద్వసురాశిఁ గనిన యధనులుఁ గడుసం
తసమందు రీతిఁ బుత్రుల, వసునిభులం గాంచి యుత్సవము నొందు నెసఁగన్. 1441

వ. భరతుండును భృత్యామాత్య పురోహితాది సముచితపరివార బంధుసమేతంబుగా యథాక్రమంబున భరద్వాజ సందర్శనంబు నడిపి పవనతనయాదుల సాహసోపకార ప్రకారంబు లగ్గడించె నప్పుడు. 1442

క. భామ మెఱయ రాఘవుఁ డాజానుభుజుండు రాముఁ డుల్లసము మీఱ మహీ
జానుజులతో భరద్వాజానుమతిం బడసి కపిచయం బగ్గి పక్. 1443

సీ. కువలయానందమై గురుశైత్యకరమయి నవనూత్న చంద్రమండల మనంగ
నమితచంద్రామోద మైసర్వభూతిరయై పరమేశ్వరుని జటాభాగమనఁగ
నవిరళ నీలమై భువ ప్రశస్తమై [illegible] రుచిర ప్రావృట్ఘనముచమనంగ
గఁధాతుమయమయి కలితావదాతమై మేరుశైలాగ్రప్రకారమనఁగ
భూరిసార ప్రవాళ విస్తార మగుచుఁ, బ్రకట హరిపూర్ణతరువనరాశి యనఁగ
రూఢి దనరారు పుష్పకారూఢుఁ డగుచు, రాముఁడు సమస్తజగదభిరాముఁ డగుచు.

క. వినుత హరికోటి రయమునఁ, జని నందిగ్రామము న్విశాలయశగపా
వనదిగ్గ్రామము నెదురం గని భూమివిభుండు పుష్పకముఁ దగ డిగి చెలఁగన్. 1445

క. వసుధామకులమణి యభిన, వసుధామయవాజ్ఞితతుఁడు భరతుఁడు భక్తి
న్వసుధా రాజ్యభరముతో, నొసఁగిన పాదుకలు దొడి శుభోజ్జ్వలభంగిన్. 1446

వ. నందిగ్రామంబున కపూర్వవిలాసం బావహింప భరతావాసంబునకుం జని. 1447

సీ. కోటిబాంధవవృక్షశోరంబులకు మందహాసచంద్రిక నుల్లాప మొసఁగి
సమ్మునీశ్వరసాధుసహాకారబృందంబు విపులదయామృతవృష్టిఁ దనిపి
వలిమొగుద్వజినీకువలయమందముఁ గటాక్షాంశు రోగంబున నలరఁ జేసి
పౌరజానపదస్త్రీసస్యము వాక్సుధాంబు పూరమున దైన్యంబు వాపి
పరగ భరతాదిసోదర సమ్మతాంబు, రాశి నిజరాక మెప్పొంగఁ జేసి రాము 1448
చంద్రభూజాని భూలోకచంద్రుఁ బోని, కాంతి నొప్పారె నఖిలారకతిమిఁ దెప్పుచు.

వ. అఖండాఖండల వైభవాధికుండై సమస్త బంధుపరివారంబుఁ బరివేష్టింప సుఖాసీనుండై యిష్టగోష్ఠి సంతుష్టాంతరంగుం డగు రాముండు నిజపాదుకామూల భరతము హీపాలకృతవిశాలమహీపాలనసౌష్ఠవం బభివర్ణించు పౌరజానపదులలోకనంబు నం గుతూహలుండై. 1449

క. బహుమానపూర్వకముగా, గుహునిం బోఁబనిచి యారఘుప్రభుఁడు మహా
మహుఁ డప్పుడు సోదరత్రయ, సహితుండై పటుజటావిసరము దీర్చెన్. 1450

చ. ఇటులు జటోత్కటంబు బహుళయించి పృథుస్తనయిత్నుమండలో
ద్భట పటలంబుఁ ద్రోఁచిన సుధానిధిచందము నొంది సద్భటా
ర్భటులు లలియంగ నంత రఘుభర్త ముహూర్తము నిశ్చయించె వి
స్ఫుట పటుశోభనంబులను జొన్పడు దాని నయోధ్య కేఁగఁగన్. 1451

క. కడుకొని నిన్నఁ దలఁచిన యప్పుడు వత్తువుగాని కదలి పొమ్మని పూజ
ల్గను నొనరించి కుబేరుని, కడ కనిచె న్నృపుఁడు పుష్పకము సాదరుఁడై. 1452

వ. తదనంతరంబున.

శా. స్వాయుద్భక్తితరు ల్సహోదరవరు ల్పార్శ్వంబులం గొల్వఁ బ్రా
దూయుం గొల్చ మహోత్తమాంగుఁడు మరుత్పుత్రుండు మున్నేగ దై
తేయస్వామి విభీషణుండు గనుభక్తిం జేరి రా నప్డు యా
త్రాయత్తంబగు చిత్తవృత్తి రఘువంశ్యస్వామి యుత్సాహియై

క. కుండల దీప్తిక్షాళిత, గండస్థలుఁ డగుచు రథముఁ గైకొని యొప్పెం
జండకిరణుండు పొడుపుం, గొండ పయిన్వెలుఁగు గతి రఘుప్రభుం డంతన్. 1854

శా. చక్రానంద సహస్రభానురుచిరోచ్చస్యందనారూఢిప
చ్చక్రాళి న్వెలయింపఁ జేయుచు మనోజ్ఞప్రక్రియాలోలుఁడై
శక్రాద్యష్టదిగీశభావితయశోజాలప్రతీతుండునై
శక్రాశ్మప్రహసత్తనుండు వెడలె స్సాకేతవీథ్యగ్రమై. 1455

వ. తదవసరంబునం గౌసల్యయు సపత్నీద్వయసహితంబుగాఁ బుణ్యవనితావినీకదంబవల
యితంబగు జనకనందన కర్ణీరథంబు ననుసరించి సముచిత యానంబున వెడలె నంత.

మ. హితవృత్తిం జని రాఘవుండు గనియెన్ హేమప్రభాజాలని
ర్జిత పక్షద్వయచక్రవాక మిథునాక్షేపప్రచారంబుఁ బా
దుతరంగోద్ధతవాతకంపితమహీరుట్శాఖికాడోలికా
స్థితకీరంబు లసన్మనోజ్ఞ సరయూతీరంబు దూరంబునన్. 1457

క. కని తత్సమీపమునకుం, జనునప్పుడు కుముదకమలసౌరభము వెసం
గొనిన మలయానిలమున, మ్మనిఁగిన రామునకు లక్ష్మణుం డిట్లనియెన్. 1458

సీ. కలిత రక్తోత్పల కలికా విశేషహారతి దీపకలికా ప్రతతులతోడ
నధిక వాః కేళీసమాయాత భద్రేభపటుకుంభ భద్రకుంభములతోడ

నరుణసురపీయుషా సరోవిహారమునుఁ, రమ్యములకునొప్పు సుమపరాగమ్ములగుచుఁ
బలురథములకు రత్నకంబళములగుచు, నరుణగతి మించెఁ దరుణారుణాతపములు.

చ. అహిమకరోరుభాస్వదుదయమ్మునకు న్సముగాఁగ వేడుక
న్సహసహజన్ముఁ డన్నృపతిచంద్రుఁడు రాముఁడు వందిమాగధ
ప్రహితనుతుల్సెలంగఁగఁ బ్రభాతమునం దగ మేలుకాంచెఁ బూ
ర్ణహిమకరాననాంబుజుఁడు యందొఱకందొవలుత్సహింపఁగన్. 1478

వ. మేలుకని కృతకాల్యకరణీయుండును ధృతదివ్యాంబరవిభూషణుండును నతసామంత మహీపాలకుండును వృతబంధుసహోదరామాత్యుండును ధృతమహీదేవతానివహుండును సంతిపౌరజానపదకవిప్రవరప్రకరుండును స్మితసుందరాధర ముఖాంభోజుండును మితచతురమధుర వాక్సమాజుండును మహాతేజుండునగు రామరాజుం గనుంగొని సమన్విత వామదేవాది మహామునిశ్రేష్ఠుండగు వసిష్ఠుం డెల్లవారల యుల్లంబులఁ బల్లవింప నల్లన నిట్లనియె. 1479

ఉ. చేరువ యచ్చి యారుతను శిష్యులఁగూడి మునీంద్రులెల్లనుం
జేరి రయోధ్యజానపదసేవిత యచ్చ్య వరాభిషేకసం
భారములెల్లఁ జొప్పడె సమస్త మహీవలయాధిరాజ్య మిం
పారఁగ రామమూర్తికి సమర్పణసేయుట చాలమేటికిన్. 1480

క. నుతపుణ్యనదీజలములఁ, జతురంభోధ్యుదకములును శైలచరులు స
మ్మతిఁ దెచ్చి రఖిల జనమాన్యతమై పట్టాభిషేకనిలయం బమరెన్. 1481

వ. అని పలికి కౌసల్యాగర్భసంభూతభూత ప్రభూతవర్తనం బుగ్గడించి. 1482

క. పదునాలుగువత్సరంబులుఁ, బదునాల్గు యుగంబులయ్యె భరతున కతఁడు
మ్మదమందె ధరాభారముఁ, గదలిచి రాముతలఁ బెట్టఁగా చితిననుమన్. 1483

క. కావున రాఘవు నఖిల మహీవలయముఁ బేర్మియీ అనేలు విభునిగాఁ
గావింతము యభిషేకమహావిభవం బను మదుర్భరానందమునన్. 1484

వ. సమస్తజనానందకరం బగునమ్మహావార్త దశరథాంగలకెఱింగించి తదనుమతంబు వడసి జేజేతాజయజయధ్వానంబులతోన భూదేవతాశీర్వాదంబులును దివ్యదుందుభిరవంబులతోనఁ దూర్యాంతరంబులును గల్పకప్రసూనాసారంబుతోన పుణ్యాంగనారాజుశాంతంబులును గంధర్వాప్సరోలాస్యంబులతోన వేశ్యాలాస్యంబులును నొక్కట నిగతింప న్నలవం జాలియుప్పె నప్పు డరుంధతీవల్లభుండు వితప్రభాభాసురంబును ముక్తాఫలవితానంబునునై శ్రీశార్ఙ్గధరయానంబైన సభామండపాభ్యంత

రంబున నత్తుంగంబై పూర్వశైలసదృశంబగు భద్రాసనంబున రోహిణీపతిసముండగు
హిమకరుఁబట్టి జానకీసనాథు రామమహీనాథు సుఖాసీనుం జేసె నంత 1485

క. నవరత్నమయాలంకరణవిశేషము పేర్మిరోహణమహీధ్రము నా
నవనివిభుఁ డొప్పె నప్పుడు వసిష్ఠాదులుగడఁగి కడునొయ్యనమునన్ 1486

మ. ఉపమాతీత యశోధురంధరు గుణాఢ్యు న్సర్వ సర్వంసహా
ధిపతిత్వంబు వహింపు మీ వనుచుఁ బ్రీతిన్భర్మపట్టంబు స్వ
త్యుపదిష్టస్థితి మానవేశ్వరలలాటోపాంతముం గూర్చి ర
చ్చపలఁగప్పుం బెనుమబ్బు తీవమెఱపు న్సంధించుచందంబునన్. 1487

చ. కలిత మనోజ్ఞపల్లవవికాసిత పుణ్యనదీజలోజ్జ్వల
త్కలశము లొప్ప సత్యకరకంజములన్ ధరియించి వారిచం
ద్రముఖులు తద్దయుం గసముఁ జిల్కుము మాపయినంచుఁ దెల్ప న
చ్చెలువున రామచంద్రు నభిషేక మొనర్చిరశేషభూతికిన్. 1488

వ. మఱియుం దగువారెల్ల రాఘవుం బుణ్యతీర్థజలంబుల విధ్యుక్తక్రమంబున నభిషే
కించిరి. 1489

కుముదబాంధవుఁ బోలెఁ గువలయానందుఁడై యమృతధారాపూరితాత్ముఁ డగుచుఁ
గనకాచలముఁ బోలె ఘనపావకటకుఁడై విబుధనదీజలవిమలుఁ డగుచు
నష్టమూర్తినిఁ బోలె నార్యానుకూలుఁడై సంగతగంగోత్తమాంగుఁడగుచు
నీలాంబుదముఁ బోలె శాలివిలాసుఁడై విహితాంబుపూర సంవిహితుఁ డగుచు
గల్పకముఁబోలె మధురసకలితపాణి, పల్లవుండయి యభినవఫలదుఁ డగుచు
సీతతోఁగూడి పట్టాభిషేకశోభనము వహించెడు వేళ రామమహీవిభుఁడు. 1490

క. పాటించి రామమూర్తికి, హాటకకలశోదకంబు లభిషేకింపన్
మేటి జలధారలొప్పెం, గాటుకకొండపయి నజకవచముమాడ్కిన్. 1491

వ. ఈరీతి నఖిలభూతధాత్రీవలయాభిషేక సామ్రాజ్యసంశోభితుండై గురుబ్రాహ్మణ
మాతృదేవతావందనంబు లాచరించి సమస్తజనంబుల నభిమతప్రదానంబులం దనిపి సం
తుష్టుండై. 1491

క. ఆవిభుఁడు దనకుఁ గావలెఁగా వేలుపు లంపినట్టి కనకాంబరభూ
షావిసరము నాదృతి సుగ్రీవాదుల కొసఁగి సత్కరించుచు మఱియున్. 1493

వ. అభీష్టగన్ధప్రియవచనంబుల నలనీలాంగదజాంబవద్విభీషణాదులం దనిపి వచ్చుచుం
బోవుచుండురుగాక యని వారివారి నివాసంబుల కనుచుచుం బొమ్మని పోవునట్లు

సేవాసంగి వీడ్కొల్పి జనకనందన నందనస్నేహంబున మన్నించు మహాబల దనుం
దమ్ములం గలిపికొని తనయొద్దన యునిచికొని. 1494

కం. మందారములల్లికొనిన, సుందీవరులంగ పుల్పనుం బెనగొను మిం
చుం గోరయు జనక మహీభృన్నందనం గూడి మహీ యాజనందనుఁ డేలెన్. 1495

కం. వలసినయప్పుడు వానలు, గలుగంగ మగణములు సట్లుకా రుక్ క్షామా
నలబాధలుం దస్కరజాగుల పేరులు వెలుఁగకుండఁ బ్రోచెఁ బ్రజలన్. 1496

కం. ఆ సూర్యాపతి హితుఁడౌ, యయ్యనసూయాణముగ నాజ్ఞనలరిచి మహిలో
న, సూయాసువ్యాదయుఁ డీయనసూయా సజ్జ ప్రియుం బోవరుచు న్నన్. 1497

వ. సమస్తజనహృదయానంద జనకంబుగా ననేక సహస్రవర్షంబులు మహీపాలనసుఖం
బనుభవించుచుండె నిమ్మహాకావ్యంబు దురితాపహంబును జయావహంబును
నగు నని చెప్పి వాల్మీకిమహర్షి మహామహుం డయ్యె మహాప్రభూ వేంకటేశ్వరా
యవధరించి రక్షింపుము. * 1498

గద్యము.

ఇది శ్రీసూర్యనారాయణపదాబ్జధ్యానపరాయణ భూసురవైష్ణవిన రామశాస్త్రి
తనయ పండితసేవాసముచ్చయ శ్రోత్రపల్లి లక్ష్మణ ప్రణీతంబైన
దాశరథివిలాసం బను మహాప్రబంధంబునందు
సర్వంబును షష్ఠాశ్వాసము.
సంపూర్ణము.



* కవి యాశ్వాసాంతపద్యములు రచింపలేదు.

# అముద్రితాంధ్రగ్రంథ సర్వస్వము.



| | | | | |
|---|---|---|---|---|
| 1 | జాహ్నవీమాహాత్మ్యము. (ఏరుఁగు లక్ష్మణకవి) | 0 | 10 | 0 |
| 2 | సీమంతినీకళ్యాణము. (పెనుమళ్ళ సోమన్నకవి) | 0 | 10 | 0 |
| 3 | విజయనందనవిలాసము. (మంగళగిరి ఆనందకవి) | 0 | 10 | 0 |
| 4 | వాల్మీకిచరిత్రము. (రఘునాథభూపాలుఁడు) | 0 | 8 | 0 |
| 5 | రంగనాథరామాయణము. (కాచభూపతి విఠ్ఠలరాజు) | 1 | 0 | 0 |
| 6 | శ్రీరంగమాహాత్మ్యము. (కట్టా వరదరాజేంద్రకవి) | 1 | 0 | 0 |
| 7 | సారంగధరచరిత్రము. (కూచిమంచి తిమ్మకవి) | 0 | 12 | 0 |
| 8 | భార్గవపురాణము. (కాండూరి వేంకటదాసు) | 1 | 4 | 0 |
| 9 | నారాయణాచలమాహాత్మ్యము(ఇల్లమరాజురంగధామకవి) | 0 | 12 | 0 |
| 10 | శ్రీలక్ష్మీనారాయణపరిణయము. (శివపల్లి సర్వోత్తమకవి) | 0 | 12 | 0 |
| 11 | నలచరిత్రము. (రఘునాథభూపాలుఁడు) | 1 | 0 | 0 |
| 12 | సర్వకామదాపరిణయము. (శిష్టు కృష్ణమూర్తికవి) | 0 | 10 | 0 |
| 13 | సీతాపరిణయము. (వాసిరెడ్డి సుబ్రహ్మణ్యకవి) | 1 | 0 | 0 |
| 14 | మిత్రవిందాపరిణయము. (శ్రీరాజా రావు జనార్దనరంగారాయణింగారు, బొబ్బిలి.) | 0 | 4 | 0 |
| 15 | నానార్థనిఘంటు | 0 | 4 | 0 |
| 16 | నీలాపనిందానివారణము. (మాడభూషి నృసింహసూరి) | 0 | 4 | 0 |
| 17 | బలరామక్షేత్రమాహాత్మ్యము. (మండపాక కామకవిగారు) | 0 | 8 | 0 |
| 18 | సుధీరంజనము అను ధ్రువోపాఖ్యానము. (ఓగిరాల జగన్నాథకవి) | 0 | 4 | 0 |

# శ్రీ రామలాస గ్రంథమాల

## నవలలు.

| | | |
|---|---|---|
| 1 | ప్రభాతము | 1-0 |
| 2 | వినోదిని 1 వ భా. | 0-12 |
| 3 | వినోదిని 2 వ భా. | 0-12 |
| 4 | ప్రేమలత | 0-8 |
| 5 | పరుసవేది | 0-8 |
| 6 | మయసభ | 0-10 |
| 7 | అపూర్వప్రతిభ | 0-10 |
| 8 | చాందసులాన | 0-10 |
| 9 | చినరంగరావు | 0-6 |
| 10 | హర్ష చరిత్రము 1 భా | 0-8 |
| 11 | పాణిగ్రహణము | 0-1 |
| 12 | సహృదయ | 0-4 |
| 13 | తాతాజీవితము | 1-0 |
| 14 | దోమాడయుద్ధము | 0-12 |
| 15 | కమలావతి | 0-10 |
| 16 | స్నేహలత | 0-14 |
| 17 | రసపుత్రజీవనసంధ్య | 0-14 |
| 18 | కాంచనమాల | 0-3 |
| 19 | సీత | 0-10 |
| 20 | మధురమంజరి | 0-14 |
| 21 | దమయంతి | 0-8 |

## ఇతరగ్రంథములు.

| | | |
|---|---|---|
| 22 | స్త్రీనీతిపద్యరత్నావళి | 0-[illegible] |
| 23 | రాయలరాజనీతి | 0-4 |
| 24 | ఐరోపామహాసంగ్రామము | 0-2 |
| 25 | ఓటరులకర్తవ్యము | 0-2 |
| 26 | విద్యావంతుని ధర్మములు | 0-2 |
| 27 | హితవాది (విమర్శనము) | 0-1 |
| 28 | గోషా | 0-8 |
| 29 | సంగీతవ్యాసములు | 0-4 |
| 30 | భగవద్గీతామృతబిందువు | 0-4 |
| 31 | చమత్కారరత్నావళి | 0-4 |
| 32 | బద్దినీతులు | 0-4 |
| 33 | కీ॥ శే॥ కావ్యనిధి శ్రీ చెలికాని లచ్చారాయజీవితచరిత్రము | 1-0 |
| 34 | కుచేలుఁడు | 0-2 |
| 35 | ప్రేమమయిరాధ | 0-4 |
| 36 | రుధిరస్రవంతినాటకము | 0-4 |
| 37 | శ్రీరాముని జీవితచరిత్రము. | 1-8 |
| 38 | మల్లెమొగ్గ | 0-1 |
| 39 | రోహిణి | 0-2 |
| 40 | పాణిగ్రహణము | 0-1 |
| 41 | వెలమలుక్షత్రియులా? | 0-2 |
| 42 | కురంగము | 0-1 |

వలయువారు!— శ్రీరామవిలాసగ్రంథమాల,
చిత్రాడ, పిఠాపురము,
తూర్పుగోదావరిజిల్లా.